# తెలుగులో ఋతుకావ్యాలు

(ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి Ph. D. పట్టంపొందిన సిద్ధాంత గ్రంథం)

డా॥ సి. వి. జయవీర్రాజు
M. A. Ph, D.

చెన్నమాధవ ప్రచురణలు
I. B. పక్కన, పెద్దపల్లి.
కరీంనగర్ జిల్లా - 500 172.

TELUGU LO RITU KAVYALU

Ph, D, Thesis by Dr. C. V. JAIVEER RAJU


మొదటి ముద్రణ : 1989, ఆగస్టు

ప్రతులు : 1500

ముద్రణ : ఆదిత్య ప్రింటర్స్, తెనాలి.

వెల : జనప్రతి రూ. **50**/-

మేలుప్రతి రూ. **60**/-

ప్రతులకు :

శ్రీమతి గంగాభవాని

B. A (L) T. P. T.

చెన్నమాధవ ప్రచురణలు

ఇం నెం. 2-1-55

అతిథిగృహం ప్రక్కన

పెద్దపల్లి

కరీంనగర్ జిల్లా - 505 172.

తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ వారి

ఆర్థిక సహాయంతో ప్రచురితం

# అంకితం

కని పెంచి సవరించిన కన్న తల్లిదండ్రులు

కీ॥ శే. శ్రీమతి నర్సమాంబ, శ్రీ సి. ఓ వేంకటరాజు గారలకు

మరియు

పరిశోధనలో మార్గదర్శకులై

విద్యాసంపత్తిని చేకూర్చిన గురువరేణ్యులు

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి

భక్తిశ్రద్ధలతో అంకితం.



జననీ జనకులు

కీ॥ శే॥ సి· డి. వేంకటరాజు, నర్సమాంబ



డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి సన్మానం చేయుచున్న
రచయిత శ్రీ సి. వి. జయవీర్రాజు

# విషయసూచిక

# ప్రేరణ

ప్రకృతి సౌందర్యము తిలకించి, తనివిచెందని వారుండరు. ఇది అనంతమైన కాలమున కంగములనబడు ఋతువుల నానారూప విలసితములతో ఒప్పారుచుండును. వసంతంలో ప్రకృతి పులకించును. గ్రీష్మంలో ప్రకాశించును. వర్షంలో హర్షించును. శరత్తులో వెలుగులను విరజిమ్మును. హేమంతంలో కుంచించుకొనిపోయి శిశిరంలో రాలిపోవును ఇది ఒక సంవత్సర కాలస్వరూపం. తిరిగి కాలచక్రంలో ఋతుభ్రమణంవల్ల పునరావృత్తమగుచుండును. ఋతుకర్త సూర్యుడు ప్రకృతియందు నిబిడీకృతమైయున్న జీవజాలమంతయు ఋతుచక్రమున అనేక సుఖదుఃఖాదుల ననుభవించును. ముఖ్యంగా మానవులు, పశుపక్ష్యాదులు, తరులతాదులు, ఆయా ఋతువులలో పొందు విలాస విలాసములను ఋతు సమగ్ర స్వరూపమున వివరించి దాని కనుకూలముగా నడచి, పొందవలసిన ప్రయోజనములను ఎత్తి చూపవలయునని నేనాకాంక్షితిని. దీనికితోడు కవికుల గురువు కాళిదాసు 'ఋతు సంహారము'న తన ప్రేయసికి వర్ణించి చెప్పిన ప్రకృతి సౌందర్యము రామాయణమున వాల్మీకి సృష్టించిన ఋతు ప్రకృతి నా మనస్సున చెఱగని ముద్రలు వేసినవి. కవి సామ్రాట్ విశ్వనాథవారి 'తెలుగు ఋతువులు' మన తెలుగునాట ప్రజా జీవనమును ప్రతిబింబింప జేసినది. డా॥ సి. నారాయణ రెడ్డిగారు ఋతు వర్ణనలను ఒక వత్సరకాలమును స్వీయ జీవిత ఘటనా సూత్రములతో కూర్చి ఋతు చక్రమునకు జీవిత చక్రమును అన్వయింపజేసినారు. శేషేంద్ర శర్మగారు ఋతు ప్రకృతి ధర్మముతోపాటు శ్రామిక జీవులపై బడు ఋతువుల దౌర్జన్య సౌజన్యములను తన కావ్యమున సమన్వయింపజేసినారు. పైడిపాటి 'ఋతు ప్రబంధము'న తెలుగు దేశమందలి పండుగ పబ్బములను, ఆచార వ్యవహారములను వివరించినారు. అద్దేపల్లి 'ఋతువిలాసం' ఋతు షట్కమున మానవ జీవితమందలి వివిధావస్థల నారోపించినారు. ఇట్లు అనేక విషయములు కావ్యములందు వర్ణింపబడుటచేత నేను మానవులపై బడు ఋతు ధర్మములను పరిశీలించి చర్చించవలయునని ఆకాంక్షించితిని. నా ఈ ఆకాంక్ష తుదిరూపమే యీ 'తెలుగులో ఋతుకావ్యాల' సిద్ధాంత గ్రంథం.

నేను పరిశోధన కుపక్రమించుటకు ప్రేరణ కల్పించినవారు అష్టావధాని డా॥ అందె వేంకటరాజంగారు. పుస్తకాలనందించి, ప్రోత్సహించిన కవిమిత్రులు శ్రీ శ్రీగాదె శంకరయ్యగారు. నాలో నిబిడీకృతమైయున్న పరిశోధనాత్మక భావాలను ఉత్తేజపరచి ముందుకు నడిపించిన సహృదయులు, ఆచార్యులు డా॥ ఎమ్. కులశేఖరరావుగారు, ఆత్మబంధువు ఆచార్య బిరుదురాజు రామరాజు గారు, యువభారత రథసారథి, బహుభాషాకోవిదుడు సరస కోమలహృదయుడు సాహిత్యధ్రువతారగా వెలసిన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు పర్యవేక్షణలో ఉస్మానియా విశ్వవిద్యాలయం హైదరాబాదువారు నాకు ఋతుకావ్యాలపై పరిశోధనచేసే అవకాశం కల్పించింది. వీరందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనముల నర్పించుకొనుచున్నాను.

నా ఈ కృషిలో ఎందరో కవిమిత్రులు, సహృదయ బాంధవులు, గ్రంథాలయ అధికారులు, తోటి అధ్యాపకులు, విద్యార్థులు ఎందరో — ఇంకెందరో వారందరికీ నా అభివందనములు.

ఈ సిద్ధాంత గ్రంథ పరీక్షకులుగా వ్యవహరించిన డా॥ శలాకరఘునాథ శర్మ, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం అనంతపురం తెలుగుశాఖ రీడర్ గారికి, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతి, తెలుగుశాఖ రీడర్ డా॥ మలయవాసినిగారికి నా నమోవాకములందజేస్తున్నాను.

నేను డాక్టరేట్ పట్టంపొందిన సందర్భంగా సన్మానించిన ప్రభుత్వ జూనియర్ కళాశాల పెద్దపల్లి అధ్యాపకులకు, విద్యార్థులకు, పలుసంస్థలకు, నిర్మల్ మిత్రమండలికి, ఉగాది పర్వదినాన సన్మానించిన కరీంనగర్ ఇంటర్మీడియట్ స్పాట్ వాల్యుయేషన్ తెలుగు క్యాంప్‌వారికి, పెద్దపల్లి వివేకానంద విద్యాపీఠం శాఖవారికి, కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథ ప్రచురణకై ఆర్థికంగా 'ఉత్తమ గ్రంథ ప్రచురణ' క్రింద సహాయాన్నందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి, వివేకానంద విద్యాపీఠం పెద్దపల్లివారికి, తదితరులకు నా ప్రత్యేక ధన్యవాదములు తెలియజేస్తున్నాను.

అందంగా అచ్చొత్తించిన తెనాలి ఆదిత్యా ముద్రణాలయం అధిపతి శ్రీ శ్రీకూర్మనాథ్ గారి ప్రోత్సాహం మరవరానిది. వారికి నేనెంతో కృతజ్ఞున్ని.

అభినందనల నందజేసి గ్రంథ సమగ్ర స్వరూపానికి తోడ్పడిన తెలుగు విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి. నారాయణ రెడ్డి గారికి, మరియు కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసర్ డా॥ ఆచార్య పేర్వారం జగన్నాథంగారికి మరియు ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు ప్రొఫెసర్ డా॥ ఆచార్య ఎమ్. కులశేఖర్‌రావు గారికి, నా ప్రత్యేక కృతజ్ఞతాంజలులు సమర్పించుకుంటున్నాను.

ఈ కృతి స్వీకర్తలు మజ్జననీజనకులు కీ. శే. నర్సమాంబ, సి.వి. వెంకటరాజు గారలకు, నా సిద్ధాంత గ్రంథ పర్యవేక్షకులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి భక్తిపూర్వక శ్రద్ధాంజలుల ఘటిస్తున్నాను.

ఈ కృషికి ప్రత్యక్షంగా పరోక్షంగా ప్రేరణ కల్పించినవారందరికీ నా ధన్యవాదములు సమర్పించుకుంటున్నాను. ఈ నా కృషి కొంతవరకైనా ఉపకరిస్తే నా జన్మ ధన్యతగాంచినట్లేనని భావిస్తున్నాను. సహృదయులు మన్నింతురు గాక—

మీ వాడు

డా॥ సి. వి. జయవీర్రాజు

ఎం. ఏ. పిహెచ్. డి.

ఆంధ్రోపన్యాసకులు

హన్మకొండ

5 - 9 - 89.

గ్రామ్స్ 'వెల్ వర్స్'

ఫోన్స్ : కార్యాలయం 236911
234815
గృహం : 63063

# తెలుగు విశ్వవిద్యాలయం

ఆచార్య సి. నారాయణ రెడ్డి
యం.ఎ పి.హెచ్.డి., డి.లిట్
ఉపాధ్యక్షులు

కళాభవనం
సైఫాబాదు
హైదరాబాదు-500 004

లేఖ నెం. తెవివి/ఉపా/250/89.
తేది : 28-8-89.

ఋతువు కాలక్రమాణ సూచి. భారతీయ పరిస్థితుల ప్రకారం దాని వ్యవధి రెండు నెలలు.

నిజానికి కాలం అఖండం. తన సౌకర్యంకోసం మనిషి కాలాన్ని సంవత్సరాలనీ, ఋతువులనీ, నెలలనీ, వారాలనీ, దినాలనీ, క్షణాలనీ, వింగడించుకున్నాడు. ఆయా కాలఖండాల ప్రకారం నిత్యనైత్తిక జీవికను నిర్వహిస్తున్నాడు.

భారతీయ సాహిత్యాల్లో ఋతువర్ణనకు విశిష్ట స్థానముంది. సంస్కృత భాషలో వాల్మీకి ఋతుదర్శనం వాగతీతం. కాళిదాసు సరేసరి.

ఆ ప్రభావాలతో తెలుగులో వెలువడ్డ ఋతుకావ్యాలను సమీక్షించాడు డా॥ జయవీర్రాజు. ప్రాచీనకవులకు భిన్నంగా మౌలిక ప్రజ్ఞ చూపిన ఆధునికుల వర్ణనలనుకూడా ఇతడు ఎత్తిచూపాడు.

తెలుగు కావ్యాల్లోని ఋతువర్ణనల తీరుతెన్నులను తెలుసుకోవడానికి ఉపకరించే ఈ గ్రంథాన్ని రాసిన డా॥ జయవీర్రాజుకు నా అభినందన.

—డా॥ సి. నారాయణ రెడ్డి

డా॥ ఎం. కులశేఖరరావు
ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

డా॥ సి. వి. జయపీర్రాజు రచించిన "తెలుగులో ఋతుకావ్యాలు" అనే గ్రంథాన్ని ఆసక్తితో చదివినాను. సహజమైన పల్లెవాతావరణంలో పుట్టి పెరిగి సరళ స్వభావంతోను, అలరారుతూ ఉన్న శ్రీ రాజు గారు మంచి అధ్యాపకుడు కూడా. ఈ గ్రంథాన్ని రచించి ఆయన పరిశీలనా విశ్లేషణ అనే వాటిలో తనకు గల శక్తిని నిరూపించు కొన్నారు.

ప్రకృతిలో సూర్య చంద్రోదయ అస్తమయాలు ఎంత సహజమైనవో ఋతువుల రాకపోకలు కూడా అంత నైసర్గికము, సుందరమునైనవి. విశేష మేమంటే మానవునకీ ఋతువుల పరివర్తనానికి అవినాభావ సంబంధం ఏర్పడి ఉంది. మనుష్యుని జీవితంలో బాల కౌమార యౌవన వార్థక్యాలు ఒకసారి మాత్రమే ఆవృత్తి చెందుతాయి కానీ కాలపురుషుని జీవితంలో ప్రతి సంవత్సరానికి ఆరు ఋతువులు మారిపోతూ ఉంటాయి. ఈ మార్పు మనుషుని జీవితంలో, ప్రవర్తనలో, ఆహార విహారాల్లో, మానసిక స్థితిగతుల్లో ఎంతగానో ప్రభావం చూపించడం కొంత ఆలోచనా శక్తి ఉన్నవారికి అవగతం కాకపోదు.

ఆది కావ్యమైన రామాయణం వెలువడిన నాటినుండి ఆధునిక కావ్యాలు రచితమౌతున్న ఈ కాలం దాకా ఏదో విధంగా ఋతువులు ఆ కావ్యాలలో చోటు చేసుకుంటూనే ఉన్నాయి. వాల్మీకి మహర్షి రసానుగుణంగా మనదేశంలోని ఆరు ఋతువులను తన కావ్యంలో వర్ణించి ఆ కావ్యానికి వన్నె కూర్చినాడు. ఇక కాళిదాసు సరేసరి. ఆయన ఋతు చక్రం కేవలం ఋతు భ్రమణం మీదనే ఆధార పడింది. బహుశః ఈ కవి, రాజులు, రాణులు, విహరించే స్థలాల్లో వాసం చేసినప్పుడు, రచించడం చేత కాబోలు ఆయన ఋతు చక్రంలో పద్మాలు శెఫాలికలు, చంపకాలు, హిమాంబువులు, చామరాలు, లతా కుటీరాలు, సుంద,

కోలాహలాలు, మాత్రమే చేరినాయి. భారత దేశంలో అనేకంగా ఉండిన సామాన్య ప్రజలను కాళిదాసు విస్మరించినాడా! అనిపిస్తుంది. ఇక మన తెలుగు కావ్యాలలో ఋతువర్ణన లేని ప్రబంధం లేదు. రస ప్రసాదానికి ప్రబంధ కవులు

ఎంతటి ప్రాధాన్యం ఇచ్చినారో ఋతు భ్రమణానికి అంతటి ప్రాధాన్యాన్ని ప్రదర్శించినారు. రాయలు సాహితీ సమరాంగణ సార్వభౌములైనప్పటికీ ప్రజల లోకి ప్రవేశించి, వారు అనుభవించే పిల్ల తెమ్మెరలతోఁ బాటు జడివానల్లో వారు పడే కష్టాలను మనరు చవి చూపించినారు. ప్రబంధకర్తలు ప్రభువులతోఁ బాటు ప్రజలను కూడా చూచిఅనేక ఋతువులలో వారనుభవించే కష్ట సుఖాలను తమ కావ్యాలలో చేర్చినారనే చెప్పవలె.

ఇక ఇటీవలి కాలంలో నవ్య సంప్రదాయవాదుల్లో అగ్రగణ్యుడైన విశ్వనాథ మొదలుకొని నారాయణ రెడ్డి వరకు ఋతు సంభ్రమానికి చలించనివారు లేరు. విశేషమేమంటే ఆధునికులలో చాలామంది ఋతువుల సౌందర్యాన్ని చూడగానే పారవశ్యం చెందడం మాట అటుంచి పరిశీలనా దక్షతలో పరిసరాలను పరికించి తమ భావాలను కవితామయం చేసినవారే ఆధునికుల్లోని ఈ యదార్థ చిత్రణమే వారి శక్తిగా పరిగణింపబడుతున్నది.

డా॥ రాజుగారు తెలుగులో ఋతుకావ్యాలలో చాలా ముఖ్యమైన వాటి నన్నింటినీ పరిశీలించినారు, చక్కని విశ్లేషణ గావించినారు. ఉదాహరణలతో పాటు తమ నిర్ణయాలను సముచితమైన ఆధారాలతో బలపరచి ఆధునిక సాహిత్య పరిశోధనకు తగిన మార్గాన్ని ఎన్నుకున్నారు ఫలితంగా చక్కని సిద్ధాంత గ్రంథం రూపుదిద్దుకొంది. డా॥ జయవీర్రాజు గారి ఈ అనుశీలనలో ఈ పరిశోధనాకృషిలో నాకు ఆప్తమిత్రులు, మాన్యులు ఆచార్య ఇరివెంటి కృష్ణమూర్తి గారి సహాయ సహకారాలు ఆయన ఆలోచనా విధానం పరిపూర్ణంగా ఉన్నాయని నాకు తెలుసు. ఇంత మంచి గ్రంథం వెనువడుతున్నప్పుడు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు ప్రత్యక్షంగా చూడగలిగియుంటే ఈ గ్రంథం స్వరూప స్వభావాలు సార్థకమయ్యేవి. ఈ సందర్భంగా శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ, ఆ విద్వద్వతంసుని పర్యవేక్షణలో ఈ సిద్ధాంత గ్రంథం వెలువరించిన డా॥ సి. వి. జయవీరరాజుగారిని అభినందిస్తున్నాను.

విజ్ఞానపురి,
విద్యానగరం,
హైదరాబాదు.

ఎం. కులశేఖరరావు
31 - 8 - 1989.

Prof. PERVARAM JAGANNADHAM
Head Department of Telugu
Kakatiya University
Vidyaranyapuri
WARANGAL–500 009.

Phone: Res 8392
1/705/5-1-C, Mithilanogar
Balasamudram; Hanamkonda
WARANGAL–506 001.

# ఋతు వైభవం

కాలం అనాద్యంతమైంది. అది నిత్యం ప్రవహించే జీవనదివంటిది. ప్రకృతి పరిణామాలన్నింటికీ అది కారణమవుతున్నది. ప్రకృతిలోని వస్తు స్వరూప స్వభావాల్ని అది నిర్ణయిస్తున్నది. అవసరమైనప్పుడు మారుస్తున్నది. కాలం ప్రపంచంలోని సమస్త జీవకోటికి ప్రాణం ప్రసాదిస్తున్నది, అవసరం తీరగానే హరిస్తున్నదికూడ. అందుకే దాన్ని మనం "కాలపురుషుడు" గా గౌరవిస్తున్నాం. నిత్యం ఆరాధిస్తున్నాం. అందుకే శ్రీ కృష్ణ పరమాత్ముడు తానే కాలమని గీతలో చెప్పుకున్నాడు. శ్రీ మద్రామాయణ మహాభారతేతిహాసాలను తన బ్రహ్మాండంలో దాచిపెట్టింది కాలం. ఇటీవల జరిగిన రెండు ప్రపంచ సంగ్రామాల చేదు అనుభవాల్ని చవి చూపిందికూడ కాలమే. ఈ కాలానికి అవధులు లేవు. హద్దులు, సరిహద్దులు కానీ లేవు. దాని శక్తికి పరిమితులు లేవు. కాలం మనం చెప్పినట్లుగా వినదు. దాని శాసనాన్ని మనమే శిరసావహించాలి. ఎన్నో సామ్రాజ్యాల్ని భస్మీపటలం చేసింది కాలం. భస్మరాసుల్ని భవ్య హర్మ్యాలుగా నిలిపిందీకాలమే, అందుకే కాలమే భగవత్ స్వరూపం కాలమే దైవం.

అయినాకాలం ఎప్పుడూ ఒకే విధంగా ఉండదు. జీవరాశిపై దాని ప్రభావం ఎప్పుడూ ఒకే రకంగా ప్రసరించదు సూర్య చంద్రులు దాన్ని దివారాత్రాలనే పడుగుపేకలతో నేస్తుంటారు. ఈ సూర్యచంద్రులు ఒకే ఇరుసుకుండే రెండు కొసలవంటివాళ్ళు. వాటి ప్రభావం ప్రకృతిపై ఉంటుంది. తత్ఫలితంగా సృష్టిలో ఎన్నో పరిణామాలు సంభవిస్తుంటాయి, మార్పులు కలుగుతుంటాయి. దీని ఆధారంగా లౌకిక వ్యవహారాలకోసం మనిషి కాలాన్ని దినములుగా, వారములుగా, మాసాలుగా, ఋతువులుగా, సంవత్సరాలుగా విభజించి పేర్లు పెట్టుకున్నాడు.

సంవత్సరానికి ఋతువులు ఆరు. ఇవి ఆరు విధాలుగా ప్రకృతిలో ప్రకాశిస్తుంటవి. సమస్త మానవకోటి మనుగడకు ఉపకరిస్తుంటవి ప్రాణులకు కావలసిన ఆహారపానీయాదుల ఉద్భవానికి సహకరిస్తుంటవి. ఇదొక చక్రం వంటిది. ఇది చక్కగా చలించినంతకాలం ప్రాణికోటికి హాని కలుగదు. ప్రకృతి విలయనాట్యం చేయదు విపత్తులు సంభవించవు. కాలానికి మరొక చక్రంకూడా ఉన్నది. అది ధర్మచక్రం. పురాణాలు అభివర్ణించిన సుదర్శన చక్రం. ఇదే అనుకుంటాను. ఋతుచక్రం గతి తప్పితే కాలపురుషుడు ధర్మచక్రాన్ని అంటే సుదర్శన చక్రాన్ని ప్రయోగిస్తాడు. ఈ ఋతుచక్రం సక్రమంగా తిరుగేందుకే ఆర్ష వాఙ్మయం యజ్ఞ యాగాదుల్ని ప్రోత్సహించింది. కాగా లౌకిక వాఙ్మయం అంటే భారతీయ సాహిత్యం ఋతు వర్ణనలతో కాలపురుషుణ్ణి ఆరాధించింది. కాళిదాసాది మహాకవులు సంస్కృతంలో స్వతంత్ర కావ్యాల్నే విరచించి, కాల పురుషుణ్ణి సమారాధించినారు. అట్లాగే తెలుగు కవులుకూడ తమ వంతుపని తాము నిర్వహించి కృతకృత్యులైనారు.

తెలుగులో ప్రాచీనకవులు ఋతువులపరంగా స్వతంత్రకావ్యాలు అంతగా రచింపకపోయినా సందర్భం వచ్చినప్పుడల్లా తమ తమ పురాణేతిహాసకావ్యాల్లో ఋతువుల్ని వర్ణించినారు. ఋతు ధర్మాన్ని కీర్తించినారు. మరికొందరు ఆధునికులు స్వతంత్ర కావ్యాలే రచించి సృష్టి తత్వాన్ని కొనియాడినారు. వాటి వైభవాన్ని చిత్రించినారు. ఇక మూడో తెగకు చెందిన కవులు సంస్కృత కావ్యాలకు అనువాదాను చేసి తృప్తి పడినారు. ఈ అన్నింటి గురించిన పరామర్శ తెలుగులో "ఋతుకావ్యాలు" అనే ఈ సిద్ధాంతగ్రంథంలో ప్రదర్శింపబడింది పరిశోధకుడు డా॥ సి. వి. జయవీర్రాజు ఈయన ఉద్యోగావసరంకోసం ఏదో చేసి పడేయాలన్న దృష్టితో దీన్ని చేపట్టలేదు. ఆయనకు పల్లెటూరి వాతావరణంపై మక్కువ ఉన్నది. ఆయా ఋతువులలోని ప్రకృతి రహస్యాల్ని వెలికి తీయాలన్న తపన ఉన్నది. ఒక్కొక్క ఋతువులో ప్రజాజీవితం సాగుతున్న విధానాన్ని పరిశీలించాలన్న ఆతురత ఉన్నది. ఋతుధర్మం భూమికగా భారతీయ జన జీవన మార్గంలో కలిగే మార్పు చేర్పుల్ని పరిణామాల్ని విశ్లేషించి చూడాలన్న వేదన కనిపిస్తున్నది. ఈ అన్నింటి అంతర్వేదన ఫలితమే ఈ సిద్ధాంత గ్రంథం.

డా॥ జయప్రీరాజును స్వర్గీయ ఆచార్య ఇరివెంటి కృష్ణమూర్తి పర్యవేక్షకులుగా లభించడం ఒక విధంగా అదృష్టమనే చెప్పాలి. ఐతే ఈ సిద్ధాంత గ్రంథం వెలువడేనాటికి ఆయన ఈ లోకాన్ని వదలివెళ్ళడం మరొక విధంగా దురదృష్టకరం. ఆయన సౌమ్యమూర్తి - సరస సంభాషణా చతురుడు. ఎదుటి వారి మనస్సుకు నొప్పి కలిగించకుండా ఎంతసేపైనా హాస్యరసభరితంగా మాట్లాడి మెప్పించగలగిన రసరమ్య మూర్తి ఆచార్య కృష్ణమూర్తి. అంతే కాదు. ప్రాచీన ఆధునిక సాహిత్యాల్ని అధ్యయనం చేసిన పండితుడు. ఈరోజు ఆయన ఉంటే తన అభ్యర్థి సాధించిన ఈ సత్ఫలితాల్ని చూసి ఎంతగా మురిసి పోయేవాడో! ఆయన లేని లోటును ఎవ్వరూ తీర్చలేరు ఆయన నాకు అన్న ఎంటి వాడు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉన్న రోజుల్లోను వారు ఐదారు సంవత్సరాలు ఆయనతో కలిసి పనిచేసే భాగ్యం నాకు కల్గింది. ఆయన దానికి కార్యదర్శిగా ఉన్నప్పుడు నేను సంయుక్త కార్యదర్శిగా ఉన్నాను పల్లెత్తు మాటతో ఎన్నడూ ఎవరినీ నొప్పించలేదు. ఎవరేది సూచించినా నమ్రతతో ఆహ్వానించేవారు. అందరి సలహాల్ని సాదరంతో స్వీకరించి పెద్దల సలహాతో చేయవలసింది అమలు చేసేవాడు. అటువంటి దేశికోత్తముడైన ఆచార్య ఇరివెంటి కృష్ణమూర్తికిన్నీ ఈ సిద్ధాంతగ్రంథాన్ని డా॥ జయప్రీరాజు అంకితం చేయడం ఎంతో సముచితంగా ఉన్నది గురుతరమైన గురుభక్తిని చాటు తున్నది.

డా॥ జయప్రీరాజు గురువుగారికి తగ్గ శిష్యుడు విజ్ఞానాన్వేషణపరుడు. వినయశీలి. సులభారంతో క్రిందికి వంగే మహావృక్షంలా నమ్రతను ప్రకటిస్తుంటాడు. మధురవచో విన్యాసంతో ఎదుటవారిని ఆకట్టుకుంటాడు. నిత్య చైతన్యమూర్తి. ఎప్పుడూ ఏదో కార్యక్రమం చేపట్టాలన్న ఆతురత ఆయనలో కనిపిస్తుంటుంది. నాకు చిరకాల మిత్రుడు. నన్ను ఆయన అమితంగా అభిమానించడం అది నా భాగ్యం. ఈ సిద్ధాంత గ్రంథానికి నా అభిప్రాయం అనవసరమే అయినా మిత్రుని కోరికను కాదనలేకపోయినాను. ఆచార్య ఇరివెంటి కృష్ణమూర్తిగారి గురించి ఒకటి రెండు మాటలు రాసే అవకాశం లభించింది కదా ! అని సాహసించినాను. డా॥ జయప్రీరాజు ఈ సిద్ధాంత గ్రంథంలో పూర్వాంధ్ర కవులు, ఆధునికాంధ్ర కవులు ఋతువుల్ని వర్ణించిన తీరుతెన్నుల్ని

చక్కగా వింగడించి విమర్శనాత్మకంగా విశదీకరించినాడు. ఆ యా కవుల పోకడల్ని గుర్తించి ఋతుధర్మాల్ని శాస్త్రీయంగా సమన్వయపరచినాడు. దీనిక తోడు విద్వద్వరేణ్యుడైన ఒక పర్యవేక్షకుని అండ ఆయనకుండనే ఉన్నది, ఋతువర్ణనలతో కాలపురుషుడి కీర్తించిన కవివరేణ్యుల కావ్యాల్ని అనుశీలించి ధన్యజీవి అయినాడు డా॥ సి. వి. జయవీర్రాజు. ఆయనకు నా అభినందనలు, కాల స్వరూపుడైన ఆ భగవానుడు ఆయనకు ఉజ్వల భవిష్యత్తు ప్రసాదించుగాక

శుభమ్ భూయాత్

— పేర్వారం జగన్నాథం



# ప్రస్తావన

నేను పల్లెటూరిలో పుట్టిపెరిగిన వాడిని. పల్లెలు నేటికిని నిసర్గసౌందర్యమునకు మనికిపట్టులు. నేటికాలపు కృత్రిమ నాగరిక జీవనము ఈ పల్లెల వాతావరణమును అంతగా ప్రభావితము చేయలేకపోయినది. పచ్చ పచ్చని చెట్లు చేమలు, గలగలపారు సెలయేళ్ళు, ఎత్తయిన కొండ నెత్తములు, పక్షుల మధుర కూజితములు, అచ్చమైన చల్లని గాలులు నా బ్రతుకునే మలచినవి. నా భాషనే మలచినవి. ఆ యా ఋతువులలో ప్రకృతిలో కలుగుచున్న మార్పులు నాకు బ్రతుకు లోతులను నేర్పినవి. నా పల్లెప్రజలు ఆ యా ఋతువులలో ప్రవర్తించిన తీరుతెన్నులు నన్నాకర్షించినవి. ఈ సహజ సౌందర్యమును కాపాడుకొనవలెనని ప్రభుత్వపరముగను, ప్రజాపరముగను, నేడు జరుగుచున్న కృషి నా మనస్సునకు ఎంతేని తృప్తిని కలిగించుచున్నది. ఋతువులనుగూర్చి, ఋతువులలో పశుపక్ష్యాదుల ప్రవర్తనను గూర్చి, లతాగుల్మాదుల తీరుతెన్నులగూర్చి, మానవుల జీవితవృత్తము, మనస్తత్వములగూర్చి, ప్రకృతిలో కలుగు పలుమార్పులగూర్చి అయా ఋతువులు చిమ్ముచున్న అందాలనుగూర్చి, ప్రాచీనాంధ్రకవులు వెలయించిన కావ్యములపట్ల నాకు ప్రత్యేకమైన ఆసక్తి చిన్ననాటి నుండియే కలుగుచు వచ్చినవి. ఆధునిక కాలమునందుకూడ సమకాలిక జీవిత వృత్తములో పెనవేసికొనిపోయిన కావ్యములలోని ఋతువర్ణనములు నా హృదయ ఫలకముపై చెరగని ముద్రలువేసి, విశేషాంశములను తెలిసికొనవలయునను కుతూహలమును పెంపొందింపజేసినవి.

ప్రసక్తాను ప్రసక్తముగా తెలుగు కావ్యములలో చోటుచేసికొనిన ఋతువర్ణనము మాటవేరు. ప్రత్యేకించి ఋతువర్ణనమునే వస్తువుగా స్వీకరించి కావ్యరచన చేయుటవేరు. ఋతువర్ణనమును కావ్యవస్తువుగా నెన్నుకొని, ప్రాచీన

ఋతువర్ణనా సంప్రదాయమును విడవడి, ఆత్మీయానుభూతితో, సమకాలిక సమస్యాస్ఫూర్తితో వ్రాసిన ఋతువర్ణన కావ్యములు ఆధునిక కాలమున అనేకములు వెలువడినవి. వానిని పరిశీలించి, ఋతువర్ణన నెపముతో ఆధునిక మహాకవులు ప్రదర్శించిన ప్రతిభను, వైజ్ఞానిక పరిశీలనా సామర్థ్యమును, ఆత్మానుభూతిని ఉగ్గడింపవలెనని నే నాకాంక్షితిని. నా ఆకాంక్ష పరిశోధనా వ్యాసంగమునకు దారి తీసినది. "తెలుగులో ఋతుకావ్యాలు" అను అంశముపై పరిశోధించుటకు నాకు ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు 1982లో అనుమతిని ప్రసాదించిరి. నాటి ఆంధ్రశాఖాధ్యక్షులు ఆచార్య బిరుదురాజు రామరాజుగారు ఆశీఃపురస్సరముగా తమ అంగీకృతిని తెలిపియుండిరి. పర్యవేక్షకులుగా డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు వ్యవహరించి నన్ను ప్రోత్సహించిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయము వారికిని, ఆచార్య బి. రామరాజు గారికిని, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికిని, కృతజ్ఞతా పూర్వకములైన అభివందనములను సమర్పించుకొనుచున్నాను.

ఋతువర్ణనమే వస్తువుగానున్న ఆధునిక కావ్యములనే నేను పరిశీలించితిని. ముద్రితములైనవానినే గ్రహించితిని. నాకు లభ్యమైనంతవరకు ఈ ఋతుకావ్యములను సేకరించగలిగితిని. నా పరిశోధన పరిధిలోనికి రానివి, నాకు తెలియని ఋతువర్ణన ప్రధాన కావ్యములుండవచ్చును. నేను చూచినదే సర్వమని నేననుకొనుటలేదు. తెలుగు కావ్యములు పుట్టినప్పటి నుండియే ఋతువర్ణనముల తీరుతెన్నులుగూడ స్పృశించినాను. ఈ నా ప్రయత్నమునకు విద్వల్లోకము హర్షించినచో ధన్యుడనే, .... .... ....



# ప్రవేశిక

విశ్వము అనంతము. కాలము అనంతము. ఎల్లలెఱుగని విశ్వమునందు మన ఈ భూగోళము ఏపాటిదో? ఏ సూర్యుని నుండి విడవడిన అగ్నికణమో ఇది? ఎప్పుడు చల్లబడెనో? ఈ భూగోళమున పంచభూతములెట్లేర్పడెనో? జీవసంతతులెట్లుద్భవించెనో, శాస్త్రజ్ఞులు ఊహించి సాధ్యమైనంత తర్కబద్ధముగా, సమంజసముగా తెలుపుకొనుటకు యత్నించియుండిరి. మానవుడు పుట్టి, వికాసదశలతో ఎదిగి, ఈ ప్రకృతిని అవగతము చేసికొని దీనిని ఆరాధించుటకును, అదుపులో పెట్టుటకును, ఉద్యమించినపుడే ఈ ప్రకృతిలోని సౌందర్యము బహిర్గతమయ్యెను. మానవుడు రాకపూర్వమే, శంపాలతలు మిఱుమిట్లు గొలిపెను వానలు కురిసెను, ఎండలు కాసెను, వెన్నెలలు పండెను, నెమళ్ళు ఆడెను. కోకిలలు పాడెను, సెలయేళ్ళు పరవళ్ళు త్రొక్కెను. జలనిధులు ఘూర్ణిల్లెను, వన్యమృగములు ఘీంకరించెను, కాని వీనినెవరు గుర్తించగలిగిరి? ఈ సౌందర్యముల నెవరు అనుభవించిరి? వీనిని చూచినది మనిషి. వీనిని తనివితీర అనుభవించినది మనిషి. ప్రకృతి గీచిన గీట్లను చెఱపి, తన ముద్రలువేసి మానవుడు తనదైన ప్రకృతిని సృజియించుకొనెను. దానికి ఎల్లలు ఏర్పరచెను. అనంతమైన కాలమునకు పరిధులేర్పరచుకొని, తన అనుభవములను వానికి కూర్చెను. కాలమును యుగములుగా, వత్సరములుగా, అయనములుగా, ఋతువులుగా, మాసములుగా, దినములుగా, నిమేషములుగా తీర్చుకొనెను. దిక్కులే లేని సృష్టికి, నాలుగని, ఎనిమిదియని, పదియని దిక్కులను సృజియించెను, ఇది అంతయు అతని అనుభవము.

ప్రకృతికిని, అతనికినిగల సంబంధము వలన అతనికి కలిగిన అనుభూతులకు వివిధములయిన విభజనములు చేసెను, ఇట్లతడు చేసికొనిన విభజనములలో కాలవిభజనము మహత్తరమైనది, శక్తిమంతమైనది. అనుభవైకవేద్యమైనది. శాస్త్ర సమ్మతమైనది, దైనందిన జీవితమునకు అనుగుణమైనది కాల విభజనమునందు 'ఋతుషట్కము నేర్పరచుకొనుట' అనగా వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువులను ఏర్పరచుకొనుట, జీవితానుభవమునకు సంబంధించిన అంశములు, జీవితానుభవమునకును, కవిత్వమునకును, అవినా

భావ సంబంధమున్నది కనుక ఋతువర్ణనములను గూర్చి విశేషించి, ఋతువర్ణనమే ప్రధానవస్తువుగా గ్రహించి, రచితములైన కావ్యములనుగూర్చి పరిశీలింప వలసియున్నది.

ప్రాయికముగా తెలుగులో ప్రాచీనకావ్యముల నుండి నేటివరకు ఋతువర్ణనము సంప్రదాయ సిద్ధమైన పరిజ్ఞాన పరిధిలోనే సాగినది. ఖగోళమందును, భూగోళమందును, ప్రకృతియందును, ప్రజాబాహుళ్యమందును, ఋతువులకు సంబంధించిన అనంతములైన విశ్వాసములు, అనుభవములు, ఆచార వ్యవహారములు ప్రచారమునందున్నవి. వాని మూలమును తెలిసికొనగలిగినప్పుడే ఋతు వర్ణనములోని సామంజస్యమును సముచితముగ పరిశీలించుటకు వీలగును. కనుక కొంచెము దీర్ఘమే అయినను, సంప్రదాయ సిద్ధమైన వైజ్ఞానికమైన పరిశేషములను ఇక్కడ పొందుపరచుట అప్రస్తుతము కాదను ప్రత్యయముతో నేను సేకరించిన కొన్ని అంశములను ఇట్లు పొందుపరచుచున్నాను.

## ఋతు శబ్ద విచారము

'ఋతు' శబ్దమునకు

"ఇయర్తీతి ఋతుః ఋగతౌ"[1]

అని వివరింపబడుటచేత 'పోవునది' అను అర్థము స్ఫురించుచున్నది.

'ఇయర్తి' అనగా 'గతించునది'

'ఋతు' కాలప్రమాణముగ కూడ సూచింపబడుచున్నది.

ద్వౌ ద్వౌ మాఘాది మాసౌ స్యాదృతుః[2]

మాఘమాసము మొదలుకొని రెండేసి మాసములకొక "ఋతువు" గా పరిగణింపబడుచున్నది.

"ఋతు" శబ్దమునకు 'కాలవిశేష' మనికూడ తెలుపబడినది.

"ఋ + తుః - కిచ్చ - కృత్ప్రత్యయాంతము"[3]

---

1 అమరకోశము పుట 96

2 అమరకోశము పుట 196

3 ధాతు రత్నాకరము ప్రథమభాగము

ఋ = గతౌ ప్రాపణేచ

అను వ్యుత్పత్తినిబట్టి 'ఋ' అనే ధాతువునకు 'పొందుట', 'కదలుట' అను అర్థములు గోచరించును.
సిద్ధాంత కౌముదిలో

"ఋ + అర్తేశ్చతుః" — ఋతుః

ఉణాది సూత్రమునందు.

"అర్తేస్తుః స్యాత్"[1]

అనగా 'ఋ' కారమునకు 'తు' ప్రత్యయముచేరి ఋతుశబ్ద మేర్పడు చున్నది. ఈ వివరణముల ననుసరించి "ఋగతౌ" అను ధాతువునకు "అర్తేశ్చతుః" అనే ఉణాది సూత్రమువలన 'తు' అను ప్రత్యయముచేరి "ఋతు" శబ్ద మేర్పడినదనుట స్పష్టము.

"అర్తేః - తుః - స్యాత్ - - అర్తేశ్చతుః"[2]

The time of the year when something specified taken place is popular, permitted at its best etc. The harvest season, the hunter season etc.

ప్రత్యేకముగా ఆయా ప్రదేశములందు పేర్కొనదగు కాలపరిమాణమునే ఋతువుగా పాశ్చాత్యులు గ్రహించిరని చెప్పవచ్చును.

'ఋతు' శబ్దము ప్రత్యేకింపబడిన కాలమును సూచించుచున్నది.

"కాలమాత్రే ఋతుధా శబ్దే", "ఋతవ్య శబ్దే"[3]

కాలమునకు సంబంధించిన శబ్దమనియు.

"ఋతుః సుదర్శన కాలః"[4]

---

1 సిద్ధాంత కౌముది పుట 1072 సూత్రము 1-72

2 Collins Dictionary

3 తారనాథ వాచస్పత్యమ్ పుట 1443

4 తారనాథ వాచస్పత్యమ్ పుట 1443

ఋతువు మంచిని దర్శించు కాలముగా పేర్కొనబడినది.

"కాలాత్మనా ఋతుశబ్దేన లక్ష్యతే" - ఇతి ఋతుః[1]

ఋతువు అనుభవైకవేద్యము. కాలము దృశ్యముకాదు.

"ప్రధాన పురుషక్షోభకం యత్ కాలాఖ్యం రూపం
తదృతు శబ్దేన లక్ష్యతే"[2]

ఋతు శబ్దము కాలముయొక్క అంతమున ప్రధానపురుషుని క్షోభకము నందు సూచింపబడుచున్నది.

"ఋతురస్య ప్రాప్తిః అన్"

ప్రాప్తించునది ఋతువు.

"ఋతు దేవతాఖ్యాయత్"[4]

ఋతుపు దేవత, ఋతు శబ్ద విచారమును బట్టి, విరాట్ పురుషుడే కాల స్వరూపుడు. ఆ కాలపురుషుని అంగములనదగినవే యీ ఋతువులు, ఋతు, కాల. శబ్దములు సమానార్థకములు కాకపోయినను, ఈ రెంటికినిగల సంబంధము విడదీయరానిది. ఒకే విధమైన మనస్సంస్కారముతో ఋతుకాలముల స్వరూప స్వభావములను గూర్చి పరిశీలింపవలసిన అగత్యమేర్పడుచున్నది. దైనందిన జీవితముతో ఈ రెండింటికి నడుమనున్న సూక్ష్మభేదము అంతగా పాటింప బడదు. వర్షఋతువు వర్షాకాలము అయినపుడు, ఋతు కాలములకు అభేదమే సూచితమగుచున్నది కనుక కాలమును గూర్చికూడ ఇంచుక పరిశీలించెదను.

"కల్యతే సంఖ్యాయతే అనేన కాలః"[5]

"కల సంఖ్యానే" దేనిచేత లెక్కపెట్టబడునో అది కాలము.

---

1 తారనాథ వాచస్పత్యమ్ పుట 1443

2 తారనాథ వాచస్పత్యమ్ పుట 1443

3 తారనాథ వాచస్పత్యమ్ పుట 1443

4 తారనాథ వాచస్పత్యమ్ పుట 1443

5 అమరకోశము పుట 87

"కాలయతి ప్రేరయతీతివా కాలః" "కలకిలక్షేపే"[1]

ప్రేరేపింపజేయునది కాలము.

"కాలయతి ఘనయితి కాలః" "కలకిలక్షేపే"[2]

మనస్సును ప్రేరేపించునదికాలము. అనగా కాలప్రభావముచేతనే మనస్సునుండి భావములు పుట్టుచున్నవి.

"దిశ్యతే సుఖదుఃఖాదిక మనేనేతిదిషః – దిశ అతిసర్జనే"[3]

దీనిచేత సుఖదుఃఖాదులు కలుగుచున్నవి.

"దిశంతివ్యాప్రియం కేత్ర దిష్టః"[4]

కాలము మానవ జీవితమును ప్రభావితమొనర్చు తత్త్వ విశేషము. ప్రకృతికిని జీవునకును గలుగు సంబంధమును నిర్ణయించునది కాలము. చేతనా చేతనములను సంయోగమొనర్చు కాలమును తెలిసికొని సర్వేశ్వరుడు వీనిని కలుపుచుండును. విడదీయుచుండును. జీవుని అంతఃకరణమున నిద్రాణమైయున్న భావ పరంపర ఉద్బుద్ధమగుచుండును. ప్రసుప్తమగుచుండును. అట్టి భావోన్మేష నిమేషములను చేతనాచేతమగు ప్రకృతిలోని మార్పులకు కాలము దోహదమొనర్చుచుండును. ఒకప్పుడు మనస్సు వికసించును. మరొకప్పుడు విషణ్ణమగును. అది ప్రకృతి ధర్మము.

కాలమునకు అంగములే ఋతువులు. నిఘంటువులలో "ఋతు" శబ్దమునకు సూర్యుడనియు, ప్రత్యేక కాలధర్మమును నిర్ణయించు సమయముగను వివరణమున్నది.

---

1 అమరకోశము పుటలు 87, 822

2 అమరకోశము పుటలు 87, 822

3 అమరకోశము ప్రథమకాండము – కాలవర్గము

4 అమరకోశము ప్రథమకాండము – కాలవర్గము

# ఋతువులు ఎట్లేర్పడుచున్నవి

'సూర్యుడు కాలస్వరూపుడు. త్రిలోకేశుడు"[1]

అట్టి సూర్యభ్రమణము వలననే కాలప్రవాహము గమించుచున్నది. సూర్యుడు కాలచక్ర ప్రవర్తకుడు. కావున అతని రథ పరిభ్రమణ మహిమచే కాలములు మారుచున్నవి. ఈ విషయమును శ్రుతి స్మృతి పురాణశాస్త్ర విజ్ఞాన వాఙ్మయములో ప్రశస్తముగ పేర్కొనినవి. అష్టాదశ పురాణములలో ప్రాచీన మైన వాయు పురాణమునందు సూర్యరథమును.

"అతః సూర్య రథస్యాథ సన్నివేశం నిబోధత
తథైవ బాహ్యతః సూర్యభ్రమతే మండలానితుః"[2]

సువర్ణకాంతి జ్యోతిర్మయమై, పంచకోణములు త్రినాభులు కలిగి అంధకార విదీర్ణ సమర్ధములగు షట్చక్రతులతో ఒకే అంచుగల రథమునెక్కి రవి స్వభావమయుడై తిరుగుచుండును.

"స్వర్ణ తేజముతో బ్రహ్మ ఈ రథమును పరమగతి అసంగతము
యోగమహితముగ ఛందాశ్వములతో సృజియించెను"[3]

అశ్వరూపధారుడగు శుక్రగ్రహము ఏ వైపునకు ఉండునో ఆ దిశయందే సూర్యరథము ప్రకాశించును. ఈ రథముతో సాయంకాలము రాత్రులందు పశ్చిమదిశలో సూర్యుడు ఆకాశమున గమించును. సూర్య రథమునకు ప్రత్యంగములు సంవత్సరాత్మక కాలచక్రావయవములే యథాక్రమ కల్పితములు. సూర్య నాభి ఏకచక్రమై అహోరూపముగ నుతింపబడును. ఇవియే చంద్ర మాసములో షడృతువులుగ లెక్కింపబడుచున్నవి.

---

1 శ్రీలింగపురాణము - పూర్వభాగము - సూర్యరశ్మిమహిమ

2 వాయు పురాణము 54 - 75 శ్లోకములు

3 "ఆదిత్యోవా సర్వమాతవః" .... .... ........

ఈ విధముగా 18, 000 మండల సంచారములు సల్పుచు సూర్యుడు ధ్రువునివలన వదలబడిన రశ్మలచే బహిర్మండలమగు దక్షిణాయణమున అవరోధ మార్గమున చలించును.

కాలస్వరూపుడగు సూర్యుని భ్రమణము వలన ఋతువులు జనించుచున్నవి"[1]

శబరుడు జైమినీ సూత్రములను వ్యాఖ్యానించుచు ఋతు భేదములు సూర్యభ్రమణమువలన కలుగుచున్నవనెను. రాశిచక్రపుటిరుసు కొంచెము వంగియున్న కారణమున ఋతువు లేర్పడుచున్నవి. అన్ని ప్రదేశములందును ఋతు గమనక్రమము ఓకే రీతిగానుండదు. కొన్నిప్రదేశములలో నెల్లప్పుడును వసంతమే యుండునని హెర్షల్ మహాశయుడు అభిప్రాయపడెను.

# వేద పురాణేతిహాసములలో ఋతుప్రసక్తి

వేదములు బ్రహ్మజ్ఞాన స్వరూపములు, అపౌరుషేయములు, శాసనరూప విలసితములు. అట్టి చతుర్వేదములందు సైతము ఋతువులు ప్రాముఖ్యము వహించియున్నవి.

ప్రకృతివర్ణనలో ఋతువర్ణన చాల ముఖ్యమైనది. చతుర్వేదములలో ఋగ్వేదము మొదటిది. ఆ ఋగ్వేదములో అగ్నివర్ణన ప్రథమమైనట్లు, ఋతువులలో వసంతము ప్రథమమైనది. కావుననే, ఋగ్వేదములో

"ఋతురాజో వసంతః" అనుటలో వసంతఋతువు ఋతువులలో శ్రేష్ఠమైనదిగా చెప్పబడినది.

ఋతు ప్రాధాన్యముగూర్చి ఋగ్వేదమునందు

యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత
వసంతో అస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మ శరద్ధవిః[2]

---

1 "ఆదిత్యోవా సర్వభూతనః"........

2 ఋగ్వేదము 10 మ, సూ. 90

పురుషుడు హవిస్సుతో దేవతలు యజ్ఞము చేసినప్పుడు వసంతర్తువు నేయియు, గ్రీష్మర్తువు సమిధయు, శరదృతువు హవిస్సును, అయినవని వర్ణింప బడినవి.

ఋతువుల రామణీయకతను సామవేదమున

"వసంత గ్రీష్మ వర్ష శరద్దేమంతములు రమణీయములు"[1]

అని పేర్కొనబడుటచే, అవి ప్రకృతి పులకరింపులలో, పలకరింపులలో ఋతువులకెంత స్థానమున్నదో, అవి ఎంత అందమైనవో పై వాక్యమున వివరింపబడినవి.

నారాయణోపనిషత్తు మొదటి ప్రపాఠకమును 'అరుణకేతుక' మందురు. ఇందు సూర్యునిగూర్చియు, సంవత్సర స్వరూపమునుగూర్చియు. వర్ణింపబడినది. ఇందు సంవత్సర గర్భితములైన వసంతాది ఋతువుల స్వభావవర్ణన అతి సహజముగా, రమ్యముగా వర్ణింపబడినది, అదియే అనంతర కవులు చేసిన ఋతు వర్ణనలకు మార్గదర్శకమైనది.

ఋతువులనుగూర్చి తెలియజేయుచు "ఋతుప్రశంస అరుణము" లో ఋతుకాల నిర్ణయము చేసిన తీరిట్లున్నది.

"ముప్పది ముహూర్తము లొక దినము లేక ఒక అహోరాత్రము. అట్టివి అరువది అహోరాత్రములు ఒక ఋతువు"

అరువది దినములనగా రెండు మాసములకాలము దీనిని బట్టి సంవత్సరమునకు ఆరు ఋతువులనుట స్పష్టము.

వసంత గ్రీష్మ వర్ష శరత్ హేమంత శిశిరములను ఆరుఋతువులు ఒక దానివెంటనొకటి క్రమముగ ప్రవర్తిల్లును. ఋతువులకు ప్రభువు సంవత్సరము సంవత్సర స్వరూపుడగు కాలపురుషుని ఆజ్ఞను ఋతువులు నిర్వర్తించుచుండును.

వేద వాఙ్మయముననుసరించి, ఋతువులలో ముఖ్యమైనది వసంతము, బ్రాహ్మణులు ఉపనయన వివాహ యజ్ఞాది కర్మల నాచరించుచు, బంధు మిత్రులను రావించుచు మృష్టాన్నభోజనాదులచే వారి నానందింపజేయుదురు,

---

1 సామవేదము 6- 4- 2

గ్రీష్మము వసంతము వలెగాక, తన తీవ్ర తాపముచే భూమిని తపింప జేయును. శుక్ల వస్త్రధారియై ఏకాదశ రుద్రగణము గ్రీష్మమున నుండుటచే నిరుపమాన జ్యోతిచే తాపాధిక్యము కలిగించును.

వర్షర్తువు భూ తపనను తొలగించి ప్రాణికోటికాధారమై కృష్యాతి ఫలములను సమకూర్చును. వర్షర్తువునకు 'ఆదిత్యులు' ప్రభువులు. వారు తిరిగి ఈ ఋతు కాలము వచ్చువరకు సరిపడ సస్యఫలముల లభింపజేయుదురు. కర్షకులు భూమిని పదనుచేసి, విత్తనములు చల్లి, వ్యవసాయము చేయుదురు. ప్రాణులకు ఈ ఋతువు నేత్ర రోగములను కలిగించును. గాలిచేతను శీతలమైన ఈ ఋతువునందు 'కంబళి' మొదలగువానిని కప్పుకొనుటచేతను శీతలబాధ తొలగిపోవును.

శరదృతువున పై వర్ష ఋతువునందు సంక్రమించిన నేత్ర రోగములు శాంతించును. భూమిపై బురద ఆరి ప్రసన్నముగా కానవచ్చును. ఈ ఋతువునకు ప్రభువులు 'ఋతువులు' (దేవతలు) ఈ ఋతువునందు చల్లని వెన్నెలలు, మందమందముగా వీచు మారుతములకు ప్రకృతి స్వాలకరించును.

హేమంతమున చలితీవ్రత హెచ్చుగానుండును. మంచు తెంపరలచే భూ లోకమంతయు కప్పబడియుండును ప్రకృతిలోని ప్రాణులన్నియు చలికి గజగజవణుకును. ఈ ఋతువునకు ప్రభువులు మరుద్గణములు. వాయులోకమునుండి యుద్ధ సన్నద్ధమై వచ్చిన యోధ బృందమువలె వాయుగణము తీవ్రముగా కనిపించును. ఆ వాయువులతో తీవ్రముగా పోరాడ సిద్ధపడినట్లుగా ప్రజలు కంబళ్ళు శిరోవేష్టముల ధరింతురు.

శిశిర ఋతువున పండుబారిన ప్రకృతి తన సౌందర్యమును కొంతవరకు కోల్పోవును. నీటికరువు ఏర్పడును. పైవిధముగా ప్రతి ఋతువు లక్షణములు వేదములందు వర్ణింపబడినవి'

ఋతువులు సాయన ( సౌర ) సంవత్సరానుగతములని యజుర్వేద సంహితలో

"మధుశ్చ మాధవశ్చ వాసంతికావృతూ"

అని ఋతు నిర్వచనము గావింపబడుటచే మధు మాధవ మాసములు సాయన మాసములని తెలుపుచున్నది.

నక్షత్రములనుబట్టి మాత్రమే కాక గ్రహాక్రమణముచేత కాలపరిస్థితుల ఋతు ప్రభావితములగును. ఇది క్రీ॥ శ॥ 16వ శతాబ్దమున వెలసిన గణేశ దైవజ్ఞుని "సిద్ధాంత గ్రహలాఘవము" నందు ముఖ్యముగా పేర్కొనబడినది.

సూర్య నక్షత్ర సంగమము కార్తికార్తులందు భూభ్రమణమువలన వాతావరణమునందు మార్పు కలుగును. కృత్తికా నక్షత్రము అగ్ని దేవతాకమగుట వలన సూర్యుడు కృత్తికలతో నున్న దినములలో మన దేశమున వేడిగాలుల వీచి జనులను దుర్భర తాపముతో బాధపెట్టును

అదియే గ్రీష్మము [1]

స్వాతి సంగమము ఆశ్వయుజ, కార్తికములలో సంభవించును. ఆ౹ కా౹ ములలో వాయుదేవుని బలము కనబడును. గాలివానలు, తుఫానులు, ఉప్పెనలు చెలరేగును.

మృగశిరా ప్రవేశముతో వర్షాగమమును. తత్ఫలితముగ గ్రీష్మతాపోపశమమును కలిగించుచుండును.వాతావరణమునందు వేడి మందగించి చల్లబడును

పై విషయములనుబట్టి సూర్యుడు ఆయా నక్షత్రములయందు ప్రవేశించుట వలన కలుగు మార్పులనుబట్టి ఋతువులు ఏర్పడునని సూచింపబడినది.

జ్యోతిశ్శాస్త్రవేత్త వరాహమిహిరాచార్య 499 A. D. నక్షత్ర పరిగణనము అశ్విని నుండి అరంభించి చైత్ర వైశాఖ మాసములు వసంత ఋతువుగా నిర్ధారించెను. వసంతారంభ దినమున దివారాత్రులు సమాన కాల ప్రమాణము నొందునని జ్యోతిశాస్త్రవేత్తల అభిమతము. కాలమును విభజించినపుడు ప్రధాన విభాగము. 'ఋతువు' అనియును, సూక్ష్మతను విభాము 'త్రుటి' యనియున పేర్కొనినారు.

---

1 తైత్తిరీయసంహిత 4కాండము. నక్షత్ర ఇష్టిభాగము
"కృత్తికా నక్షత్ర మగ్నిదేవతా"

## కాలమానము :-

| | | | |
|---|---|---|---|
| 100 | త్రుటులు | - | 1 లవము |
| 30 | లవములు | - | 1 నిమేషము |
| 18 | నిమేషములు | - | 1 కాష్ఠ |
| 30 | కాష్ఠలు | - | 1 కల |
| 30 | కలలు | - | 1 క్షణము |
| 12 | క్షణములు | - | 1 ముహూర్తము |

## భాస్కర ఉపాధ్యాయుని కాలప్రమాణము

| | | | |
|---|---|---|---|
| 10 | గురువులు | - | 1 ప్రాణము |
| 6 | ప్రాణములు | - | 1 వినాడి |
| 60 | వినాడులు | - | 1 ఘటిక |
| 60 | ఘటికలు | - | 1 దినము |
| 7 | దినములు | - | 1 వారము |
| 15 | దినములు | - | 1 పక్షము |
| 2 | పక్షములు | - | 1 మాసము |
| 2 | మాసములు | - | 1 ఋతువు |
| 3 | ఋతువులు | - | 1 అయనము |
| 2 | అయనములు | - | 1 సంవత్సరము |



## భారతము :-

పంచమ వేదమనబరగిన ఆంధ్రమహాభారతమునందు ఋతు స్వరూప సందర్శనమిట్లున్నది.

ఆదిపర్వము ప్రథమాశ్వాసము నందు కాలచక్రములో పొదిగియున్న "ఋతుచక్రము" వర్ణింపబడినది. ఉదంకోపాఖ్యానము నందు తక్షకునిచే అపహరింపబడిన కుండలములను కొని తెచ్చుటకు ఉదంకుడు వానిని వెంబడించి నాగలోకమున కేగెను. అచ్చట

"సితాసిత తంతు సంతాన పటంబునను వయించుచున్న వారిని ఇద్దరు స్త్రీలను ద్వాదశార చక్రంబు పరివర్తించుచున్న వారి నార్వుర కుమారులను అతిభద్రమునాతురగారూఢుడైన యొక్క దివ్య పురుషుని చూచెను [1]

"ఆ పురుషుడు పర్జన్యుడు. ఇంద్రసఖుడు. ధాత విధాతలను ఇద్దరు స్త్రీలచే నానునయింపబడు సిత కృష్ణ తంతు రాజిత తంత్రములు అహోరాత్రములను ఉదంకుడు చూచెను [2]

ద్వాదశారములు గలుగు చక్రము మాసాత్మక సంవత్సరము. ఆర్వురు కుమారులు మహిత ఋతువులు.

## భగవద్గీత

భారతాంతర్గతమైన భగవద్గీతలో ఋతు ప్రశంస కలదు. శ్రీకృష్ణుడు మోహావిష్టుడైన అర్జునుని కర్తవ్యోన్ముఖుని చేయుచు, జ్ఞానోపదేశము చేయును. అందు ఆత్మ పరమాత్మల గూర్చియు, కర్మ జ్ఞాన భక్తి తత్వములను గూర్చియు పరమ ప్రామాణికమైన జ్ఞానమును వ్యాసుడు అందజేసెను. ప్రకృతి యంతయు తానేనని, ఋతువులలో వసంత ఋతువు తన స్వరూపమేనని యు శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించును.[3]

1 ఆంధ్రమహాభారతము - ఆదిపర్వము ప్రథమాశ్వాసము 117 పద్యము
2 „ „ „ 118 పద్యము
3 భగవద్గీత - విభూతయోగము - "బృహత్సామ.. . .... ...... ....."

# భౌగోళిక పరిస్థితులు - ఋతువులు

భూమి ఒక గోళము. ఇది తన అక్షముపై 24 గంటల కొకసారి భ్రమణము చేయుచు, ఒక సంవత్సర కాలములో సూర్యుని చుట్టూ ఒకసారి ప్రదక్షిణము చేయుచున్నది భూమి సూర్యుని నుండి దాదాపు 93 మిల్లియనుల మైళ్ల దూరములో నున్నది. ఇది సూర్యుని చుట్టూ తిరుగుటచేత సౌరకుటుంబములోని నవగ్రహములలో చేరినది దీని అక్షము 66 1/2 డిగ్రీల వద్ద ఉండి సమాంతరముగా ఎల్లప్పుడు తన కక్ష్యలో తిరుగుచుండును. ఆ విధముగా సూర్యుని చుట్టూ తిరుగునప్పుడు. దాని ధ్రువములు దూరముగా నుండి మార్పులు కలుగుచుండును.

అట్టి సమయమున ఆయా ప్రదేశములందు వాతావరణములో వసంత గ్రీష్మ హేమంత శిశిరము లేర్పడును. కాని భూమధ్య రేఖాప్రాంతము నందు ఋతువుల మార్పు చాల కొద్దిగా గమనింపబడును. వేసవిలో అత్యధిక ఉష్ణమును, శీతకాలములో చల్లదనమును సూర్యునినుండి పడు కిరణములను, వాని దూరమునుబట్టి ఏర్పడుచుండును.[1]

సంవత్సర కాలములో వాతావరణములోని మార్పులనుబట్టి ఉత్తరార్థ గోళమునందు శీతకాలము, వసంత కాలము, వేసవి కాలము, శిశిర ఋతుకాలములు కలిగియుండును. హేమంతము (Winter) డిసెంబర్ 22 లేక 23 న భూమధ్య రేఖా ప్రాంతమునందు, మార్చి 20, 21, లో వసంతము, జూన్ 21 లేదా 22 నుండి వేసవియు, శిశిరము సెప్టెంబర్ 22 లేదా 23 నుండి ప్రారంభమగుచుండును, అచట వేసవి యందు పగలు దీర్ఘముగను, రాత్రులు అల్పముగను, శీతకాలమునాడు పగలు అల్పముగను, రాత్రులు దీర్ఘములుగను ఉండును.

దక్షిణార్థ గోళమునందు ఉత్తరార్థ గోళము నందున్న వాతావరణమునకు భిన్నముగా నుండును, సూర్యుని కిరణములు ఉత్తరధ్రువ ప్రాంతమునందు ఏటవాలుగా పడునప్పుడు, ఆ ప్రాంతములందు ఆరు మాసములు పగలు, అదే సమయమున దక్షిణ ధ్రువప్రాంతమునందు ఆరు మాసములు చీకటి కలిగియుండును. సూర్యుని కిరణములు దక్షిణ ధ్రువముపై పడినపుడు మిగతా ఆరు మాసముల కాలము దక్షిణ ధ్రువమున పగలును, ఉత్తర ధ్రువమున చీకటి ఏర్పడును.

1 Oxford Junior Encyclopedia Vol III The Universe

మన భారతదేశమునందు వాతావరణ పరిస్థితులనుబట్టి డిసెంబర్ నుండి ఫిబ్రవరి వరకు శలికాలమను, మార్చి నుండి జూన్ వరకు వేసవి కాలము కలిగి యుండునని తెలియుచున్నది.[1]

## మానవుడు – ఋతువులు

మానవుడు అతడు నివసించు ప్రదేశము యొక్క వాతావరణము వలన ప్రభావితుడగుచుండును.[2] వేసవి యందు నూలు. పట్టు వస్త్రములు ధరించుట, ఆయా ప్రదేశముల శీతోష్ణస్థితులను బట్టి జరుగుచుండును. అట్లే వారు నివసించు ప్రదేశములందు నిర్మించుకొను ఇండ్లు ఆయా వాతావరణములను తట్టుకొనుటకు అనుకూలముగా నుండును. శీతల ప్రదేశములందున్నవారు పై కప్పులపైబడు మంచు సులభముగా జారిపడునట్లు నిర్మించుకొందురు. మరి కొందరు తాత్కాలిక నివాసమునకు గుడారములను వేసికొందురు.

ఆహార విషయమున ఆయా ప్రదేశములందు ఎక్కువగా పండు పదార్థములను వాతావరణములకు అనుకూలముగా భుజించెదరు. ఇట్టి వాతావరణ పరివర్తనములు సూర్యుని నుండి పొందు కిరణములపై ఆధారపడియుండును. వాతావరణము భూమధ్యరేఖ నుండి దూరము ఎక్కువైన కొలది మార్పు చెందును. సముద్రము నుండి దూరమైన కొలది వేడిమి, వర్షములందు మార్పు సంభవించుచుండును. సముద్ర మట్టమునకు ఎత్తయిన ప్రదేశములందు మార్పులు కలిగి ఆయా ప్రజాజీవనములో వ్యత్యాసము కనబడుచుండును. ఋతుపవనములు మానవ జీవితములపై ఎక్కువగా ప్రభావితము చేయును.

ఋతువులు అరబిక్ పదము Monsoon యొక్క అర్థమని తెలియజేయుటకు.

The word Monsoon Comes From an Arobic and meaning 'Seasons' and its appropriate."

ఇందు రెండు విధముల ఋతుపవనములు కలుగును.

1) వేసవి ఋతుపవనములు సముద్రమునుండి భూమిపైకి.

2) శీతకాలపు ఋతుపవనములు భూమిపైనుండి సముద్రమువైపునకు వీచును.

---

1 Encyclopedio of Britanica-- Micropedio

2 Oxford Juneor encyclopedio Vol III the universe

మన దేశములో మార్చి నుండి జూన్ వరకు గల వేసవికాలములో భూమిపైపై సూర్యకిరణములు నిటారుగాపడి అధిక ఉష్ణము నిచ్చును. పవనములు బలహీనములగును. భూభ్రమణమున ఋతుపవనములు అరేబియా, హిందూ మహాసముద్రముల నుండి వచ్చి భూమిని చల్లబరచును. తుఫానులు చెలరేగి అధికవర్షమును కురియును[1].

## ఋతు విభాగము

'ఋతు' శబ్దము కాలవిశేషమును నిర్ణయించునది. కావున సంవత్సరమునకు గల పండ్రెండు మాసములను ఆరు ఋతువులుగా విభజింపబడినవి.

అమరమునందు ఋతు విభజనమును

"మార్గశిర పుష్యౌ హిమః మాఘఫాల్గుణౌ శిశిరః
చైత్ర వైశాఖౌ వసంతః జ్యేష్ఠాషాఢౌ గ్రీష్మః
శ్రావణ భాద్రౌః వర్షాః ఆశ్వీజ కార్తికౌ శరత్"

పేర్కొనబడుట చేత ఆయా ఋతుకాలముల మాసములు తెలియుచున్నవి

కాలవర్గమున 3 విధములు కాననగును.

"కార్తికౌ మార్గశీర్షాం పౌష్యమాఘౌ శీతః
ఫాల్గుణ చైత్ర వైశాఖ జ్యేష్ఠాః గ్రీష్మాః
ఆషాఢ శ్రావణ భాద్ర పదాశ్వీజః వర్షాః"

శీతకాలమునందు కార్తిక మార్గశిర పుష్యమాఘ మాసములును, గ్రీష్మకాలమునందు ఫాల్గున, చైత్ర వైశాఖ జ్యేష్ఠమాసములును, వర్షాకాలమునందు ఆషాఢ శ్రావణ భాద్రపద అశ్వయుజమాసములు కూడియుండి, సంవత్సరమునకు మూడు కాలములుగా పేర్కొనినారు.

---

1. Oxford Juneor encyclopedio Vol III the universe climate

'స్మృతి' యందు శీతకాలము, గ్రీష్మకాలములని రెండు భాగములుగ సంవత్సరకాలమును పేర్కొనినారు.

"కార్తికాది షణ్మాసాః శీతః
వైశాఖాది షణ్మాసాః గ్రీష్మాః" అని

ఆరు మాసములకొక కాలముగను, సంవత్సరము కార్తిక మాసముతో కాలవిభాగము జరుగుటను గమనింపవచ్చును. కావున ఋతువు రెండు మాసముల కాలమనుటకు—

"మాసద్వయాత్మకః కాలః ఋతుః"

అని శ్రుతుల యందు చెప్పబడినది.

"ద్వాదశమాసాః పంచర్తవః"

అనుటలో పండ్రెండు మాసములలో 5 ఋతువులని చెప్పి, హేమంత శిశిరములను ఏకము చేసినారు.

"హేమంత శిశిరయోరేకార్త కరణమ్ వివక్షితమ్"

సూర్యుడు ఋతుషట్కమున రాసులయందు సంక్రమించునని తెలియుచున్నది.

"గ్రీష్మోమేష వృషౌప్రోక్తః ప్రావృడ్ మిథున కర్కటౌ
సింహ కన్యే స్మృతావర్షా తులావృశ్చికయోః శరత్
ధనుర్ గ్రాహైచ హేమంతా వసంతః కుంభమీనయోః"

గ్రీష్మము ఋతుక్రమమున ప్రథమముగను, రాశులందు మేషమును మొదటగా ఇందు పరిగణింపబడినది. గ్రీష్మర్తువున సూర్య సంక్రమణము మేషవృషభ రాసులయందును, శిశిరర్తువున మిథున కర్కాటకములందును, వర్షర్తువున సింహ కన్యారాసుల యందును, శరదృతువున తులా వృశ్చికములందును, హేమంతర్తువునందు ధనుర్మకర రాసులయందును, వసంతర్తువున కుంభమీనరాసుల యందును జరుగును.

ఋతుషట్కము మాఘాదిమాసమునుండి ప్రారంభింపబడి ప్రతి రెండు మాసములకొక ఋతువు అని, అట్టి ఋతువులు శిశిరము నుండి క్రమముగా లెక్కింపబడునని తెలియుచున్నది.

"శిశిరః పుష్పసమయో గ్రీష్మో వర్ష శరత్ హిమాః
మాఘాదీ మాస యుగ్మో మిత్సర్ధవః షట్ క్రమాదమా"

ఋతువుల క్రమములో వర్షర్తువుతో ప్రారంభించి. ఆరు ఋతువులను "హారితనోక్తమ్" చతుర్థాధ్యాయ ప్రథమస్థానమునందు.

"వర్షాశరత్ హేమంత శిశిరశ్చ వసంతకః
గ్రీష్మశ్చేతి క్రమాదేతే ఋతువః షట్ ప్రకీర్తితాః
పృథక్ పృథక్ ప్రవంచామి రవేర్గతి విశేషతః"

అని పేర్కొనబడినది.

'వాభటేనోక్తమ్' తృతీయాధ్యాయమునందు ఆరు ఋతువుల క్రమమును శిశిరముతో ప్రారంభించినాడు.

"మాసార్ద్వి సంఖ్యాః మాఘాద్యైః క్రమాత్ షడృతవఃస్మృతాః
శిశిరోఽథ వసంతశ్చ గ్రీష్మవర్షా శరత్ హిమా".

అరవ అధ్యాయ సూత్రమునందు

"ఇహాఖలు సంవత్సరమ్ షడంగామృత విభాగేన విద్వాత్"
సంవత్సర కాలము ఆరు అంగములుగ విద్వాంసులచేత వివరింపబడినది. కాల విభాగమున ఉత్తర దక్షిణాయనములందు

"తత్ర మాఘాదయో ద్వాదశమాసా ద్విమాసి కంటతుం
కృత్వాషడృతవో భవన్తి"
"శిశిర వసంత, గ్రీష్మ, వర్ష, శరద్ధేమన్తాః"

మాఘమాసము మొదలుకొని వంద్రెండు మాసములతో రెండేసి మాసములకొక ఋతువేర్పడి, సంవత్సరమునందు శిశిరవసంత గ్రీష్మ వర్ష శరద్ధేమంతములను ఆరు ఋతువులైనవి.

అవి

"తపస్త పస్యౌ శిశిరః
మధు మాధౌ వసంతః
శుచి శుక్రౌ గ్రీష్మః
నభో నభస్యౌ వర్షాః
ఇషోర్జ్యౌ శరత్
సహాసహస్యౌ హేమంత ఇతి"

ఋతు నిర్ణయము గావించుటకు మాస నక్షత్ర విభాగమును "అష్టాంగ హృదయము" నందు

"మాసై ద్వి సంఖ్యైర్మాఘాద్యైః
క్రమాత్ షడృతవ స్మృతాః
శిశిరోథ వసంతశ్చ
గ్రీష్మ వర్ష శరద్దిమాః"

శిశిరముతో మొదలిడి వరుసగా వసంత గ్రీష్మ వర్ష శరత్ హేమంతములను ఆరు ఋతువులు మాఘాదిమాసము నుండి ప్రతి ఋతువు రెండేసి మాసములు కలిగి సంవత్సరములో ఆరు ఋతువులు ఏర్పడుచున్నవి.

"పరాశరసంహిత" లో ఋతు నక్షత్ర విభాగము.

"ధనిష్ఠాద్యాత్ పౌష్ణార్ధాంతు (రోహిణ్యంతం) చరశ్శిశిరః
వసంతః పౌష్ణార్ధాత్ రోహిణ్యంతం
సౌమ్యాదాదేషార్ధాంతం గ్రీష్మః
ప్రావృడాశ్లేషార్ధాత్ హస్తాంతం
చిత్రాద్యాత్ జ్యేష్ఠాంతం శరత్
హేమంతా జ్యేష్ఠార్ధాత్ వైష్ణవాంతం"

ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రార్ధము శిశిరఋతువును, రేవతి రెండవ సగము నుండి రోహిణి నక్షత్రము వరకు వసంతమును

మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష నక్షత్రార్ధభాగము వరకు గ్రీష్మ ఋతువును, ఆశ్లేష రెండవ అర్ధభాగము నుండి మఖ, పుబ్బ, హస్తాంతము వరకు వర్షఋతువును, చిత్రస్వాతి విశాఖ జ్యేష్ఠార్ధభాగము శరత్తును, జ్యేష్ఠార్ధమునుండి మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢ శ్రవణ నక్షత్రమువరకు హేమంత ఋతువును కలిగియుండును.

దినరాత్రి ప్రమాణములు సమానములైన విషవత్తుల నారంభించి యే వసంతాది విభాగము జరుగును, కావున చైత్రవైశాఖములు వసంతము.

"ఆదిత్యాత్ జ్ఞాయతే వృష్టిః"

అను ప్రమాణ వాక్యానుసారము వర్షయోగము సూర్యరశ్మి వలననే కలుగును. కావున దాని మార్పు వలననే ఋతువులు కలుగుచున్నవి.

## ఋతుసంఖ్యా నిర్ణయ విచారము

వాతావరణము భూమండలమందంతటను ఒకే రీతిగా నుండదు. ఆయా ప్రదేశములపై బడు సూర్యుని కిరణముల తీక్షత వలన అచ్చటి శీతోష్ణ స్థిత్యాదులలో మార్పు కలిగియుండును. భూమధ్యరేఖా ప్రాంతమునందు అత్యధిక ఉష్ణోగ్రత కలిగి సాధారణముగా ఆరు ఋతువుల ప్రభావము కలిగియుండును,

ఉత్తరార్ధగోళము నందు కేవలము నాలుగు ఋతువుల ప్రభావము మాత్రమే గోచరించుననుటకు

"There are four seasons in a year
Spring season winter, Summer and Autumn"[1]

అని ఆంగ్లేయ సాహిత్యమున వర్ణింపబడినది,

ఈ ఋతుసంఖ్యా నిర్ణయముపై భిన్నాభిప్రాయములున్నట్లు గోచరించును. ఆయా కాలములందు ఆయా ప్రదేశములలో గల వాతావరణ పరివర్తనము ననుసరించి ఈ ఋతుసంఖ్యా నిర్ణయము ఆధారపడియుండును, పాశ్చాత్య

---

1. The seasons : John keats poem.

పారశీకార్బీకులకు ఋతువులు నాలుగు. భారతీయుల విషయములో ఋగ్వేదమునందు ఋతువులు 5 (ఐదు)

"పంచపాదం పితరం ద్వాదశాకృతిం
దివ ఆహుః పరే అర్ధే పురీషిణమ్
అథేమే అన్య ఉపరే విచక్షణం సప్త
చక్రేషశర ఆహురర్పితమ్"[1]

పై వాక్యముయొక్క అర్థమును ఋతువుల పరముగా విచక్షణుడగు పితరుడు ఆకాశోపరి స్థలమున షడరములతో (అరు ఆకులతో) ప్రకాశించు సప్తచక్ర రథముపై నున్నాడని కొందరు అర్థసిద్ధాంతమును నిల్పిరి. పితరుడనగా ద్వాదశవర్ష పరిశోభితుడైన 'సంవత్సర మూర్తి', ఋతువులు అయిదుగా లెక్కించి పంచపాదుడనినారు. షడరమతమును అంగీకరించినవారు ఋతువులు 'ఆరు' అనియే నిర్ధారించినారు.

ఐతరేయ బ్రాహ్మణము, తైత్తరీయ సంహితలయందు హేమంత శిశిరములను ఏకము చేసి ఋతువులు 'అయిదు' గ నిర్ణయింపబడినవి.

శతపథ బ్రాహ్మణమునందు శరద్వర్ష ఋతువులనేకము గావించి ఋతువులు 5 గనే పేర్కొనబడినవి.

ఆ తర్వాత సూర్యకాంతి ద్వాదశమాసములయందు గల తీరునుబట్టి ఋతువులు 'ఆరు' అయినట్లు పై ఏకము చేసిన ఋతువులను వేరువేరుగా చెప్పబడిన దానిని బట్టి తెలియుచున్నది.

దీర్ఘతముడు ఋషిగా గల 164 సూక్తము నందలి

"త్రీణీ వఖ్యానిక ఉతత్ చికేత"

అనుటచేత ఋతువులు గ్రీష్మ హేమంత వర్షఋతువులు మూడుగనే కనిపించుచున్నవి.

1. ఋగ్వేదము I — 164-12.

సంస్కృత వాచస్పత్యము ద్వితీయ భాగమునందు 'ఋతు' శబ్ద వివరణ ములు, వాని సంఖ్యావిషయములు, మరియు ఋతువులను గురించిన ప్రాధాన్యము చూపబడినది.

"షడ్వా ఋతవ ఇతి"

అని స్మృతి యందు పేర్కొనబడినవి, యాజమాన్యేషు మంత్రముల యందు

"ద్వాదశమాసాః పంచర్తవ"

అనుటచేత హేమంత శిశిరములను ఏకముచేసి ఋతువులు 'అయిదు' అని చూపి నారు. అయినచో వసంత గ్రీష్మవర్ష శరత్ ఋతువులు నాలుగు ప్రయోజనము లందు వేరువేరుగా చెప్పబడును. హేమంతశిశిరములను ఒక్కటిగా చెప్ప బడినది దీనిని పురస్కరించుకొని బృహచ బ్రాహ్మణమునందు

"ద్వాదశ మాసాః పంచర్తవో హేమంత శిశిరయోః సమాసేనేతి"

పండ్రెండు మాసములు, హేమంత శిశిరముల నొకటిగా చేసి పంచఋతువులని తెలియుచున్నది.

ప్రయాజములు అయిదు విధములై యుండుటచే శిశిర ఋతువున హేమం తములో కలిపి 'అయిదు' ఋతువులుగా పేర్కొనుట అన్యాయము, అందువల ననే ప్రయాజ[1] బ్రాహ్మణమునందు

"వసంతమే వర్తూ నామ వరున్ధా"

అనుదానిచే నాలుగు ప్రయాజములను పేర్కొని, కేవలము హేమంతము ఒక్కటే పేర్కొనబడలేదనుట స్పష్టము. అయినప్పటికిని వాని స్వరూపము చేతను సంవత్సర కాలము ననుసరించి రెండు మాసములకొక ఋతువు చొప్పున "ఆరు" ఋతువులు గలది యనునట్లుగా తోచుచున్నది. కేవలము "అయిదు" ఋతువులే యన్నచో ఏకాదశ, ద్వాదశ మాసముల పేర్కొనబడుట అనుచితము కాని అది యుక్తము కాదు. కావున "ఆరు" ఋతువులనెడి ఆవశ్యకత ఏర్పడు చున్నది.

ఈ విధముగా వసంతాది ఋతువులకు చైత్రమాసాది ద్వంద్వమును చెప్ప వలయును.

---

1. ప్రయాజ = దర్శపూర్ణమాసము' అను యజ్ఞ అంతర్భాగము.

ఇష్టకోపదాన మంత్రముల యందు

"మధుశ్చ మాధవశ్చ వాసంతికావృతూ"

"శుక్రశ్చ శుచిశ్చ గ్రీష్మావృతూ"

"నభశ్చ నభస్యశ్చ వార్షికావృతూ"

"ఇషశ్చోర్జశ్చ శారదావృతూ"

"సహస్య సహస్యశ్చ హేమంతికావృతూ"

"తపస్య తపస్యశ్చ శిశిరావృతూ"

మధు మాసమనగా చైత్రము. అట్లే అన్నింటికి ఉదాహరణముగా....

"చైత్రమాసో మధుః ప్రోక్తోవైశాఖో మాధవో భవేత్
జ్యేష్ఠ మాసస్తు శుక్రః స్వదాషాఢః శుచిరుచ్యతే
నభోమాసః శ్రావణః స్యాత్ నభస్యో భాద్ర ఉచ్యతే
దూశిశ్చాశ్వయుజో మాసః కార్తికశ్చోర్జ సంజ్ఞకః
సహీమాసో మార్గశిర., సహస్యః పుష్యనామకః
మాఘా మాసస్తపాః ప్రోక్త. స్తపస్యః ఫాల్గుణః స్మతః"

చెప్పబడుటచే ఋతువులు "ఆరు"గా నిర్ణయింపబడినవి.

సౌత్రా మణియ హోత్ర మంత్రముల యందు—

వసంతాది షడృతువులను

"వసంతేన ఋతునాదేవా!"

అని చెప్పబడినట్లుగా. "ఆధాన బ్రాహ్మణము" నందుకూడ ఈ క్రింది విధముగా కనబడుచున్నది.

"వసంతోవై బ్రాహ్మణ్య స్యర్తుః
గ్రీష్మోవై రాజన్య స్యర్తుః
శరద్వైవైశ్య స్యర్తుః ఇతి"

దీని అన్నిటియందు వసంతమునకు ప్రాధాన్యము నివ్వబడినట్లు తెలియుచున్నది.

వసంతాది ఋతువులు చాంద్రసౌరములని రెండువిధములు. "చైత్రాదయశ్చాంద్రాః" చైత్రాత్మకము లైన వసంతాది ఋతువులకు చంద్రగతిని పురస్కరించుకొని చాంద్రత్వము సిద్ధించు చున్నది. అట్లగుచో 'ఋగ్బ్రాహ్మణ' మంత్రానువాదమునందు

"ఉపయామ గృహీతోసిఽ సంసర్పోఽసి
అహస్పత్యా య త్వే స్వాహాస్తి త్రయోదశమాస
ఇత్యాహాస్త మేవ తత్ ప్రీణాతతి" అనియు

'వపద్య బ్రాహ్మణము' నందు

"అస్తి త్రయోదశో మాస ఇత్యాహుః
యత్రయోదశే పరిధీ ర్భవతి తేనవ
త్రయోదశం మాస మవరన్ధే"

త్రయోదశ మాసములను పేర్కొనుటచేత 'ఆరు' ఋతువులతో యోగము కుదరదు. ఏడవ ఋతువు ఏదియును, ఎక్కడను, చెప్పబడలేదు. ఒకవేళ ఈ 'ఆరు' ఋతువులయందే అంతర్భావ మొందునని యన్నచో పదమూడు మాసములలో మధ్యన నున్న తరువాత మాసములో అంతర్భాగమై పోవును. కావున పండ్రెండు మాసములే ఏర్పడి 'షట్' సంఖ్యానియమము వలన ఋతువులు ఆరే వని నిర్ధారణ చేసినారు.

సౌరములో 'బౌద్ధాయనము'నందు మీనమేషములకు గాని, మేషవృషభములకు గాని, వసంత మని చెప్పబడుటవలన మీనాదిత్వము, మేషాదిత్వమును, వైకల్పికముగా వసంతమునకు అంగీకృత మగును. అదేక్రమముగా గ్రీష్మాది ఋతువులకు వైకల్పికత్వము సంభవించును.

— o —

# ఋతు వినియోగము

శ్రుతి స్మృతి పురాణముల యందు ఋతు వినియోగము చెప్పబడినది.

శ్రుతి :- వసంతే బ్రాహ్మణోఽగ్ని మాదధీత
గ్రీష్మే రాజన్య ఆదధీత
శరది వైశ్య ఆదధీతేత్యాది"

స్మృతి :- వసంతే బ్రాహ్మణం ఉపనయీత్
గ్రీష్మే రాజన్యం శరది వైశ్యమితి"

పురాణము :- 'విష్ణుధర్మోత్తరము' నందు వసంతఋతువునందు వేరువేరు పూజలు విశేషముగా చెప్పబడినవి. అట్లే వసంతమునందు స్నానానులేపనాది దానము, గ్రీష్మమునందు మానకాది దానము, వర్షమునందు తిలదానము, శరత్తునందు అన్నదానము, హేమంతమునందు వస్త్రాగ్నిదానము, శిశిరమునందు వస్త్రదానము, చేయవలయు నని పురాణములందు నుడువబడినది.

ఆయా ఋతువులయందు స్తుతింపబడు దేవతల నామ నిర్దేశములను 'యజుర్వేదము'

"వసంతేన ఋతునా దేవా వసవా స్త్రివృతా స్తుతాః
గ్రీష్మేణ ఋతునా దేవా, రుద్రాః పంచదశే స్తుతాః
వర్షాభి ఋతునా దైత్యాస్తోమో సప్తదశే స్తుతాః
శారదేన ఋతునా దేవా స్వయస్త్రింశే ఉమృతా స్తుతాః
ప్రాఖస్యాత్."[1]

'సూర్యసిద్ధాంతము' ననుసరించి పేర్కొ చున్నది. రెండురాసుల కొక ఋతువు చొప్పున, మేషాదులు పండ్రెండును. సంవత్సరమున నుండును. వత్సరారంభము వసంతముతోనే జరుగును.

1 యజుర్వేదము 21, 23, 24, 25, 26, 27, 28.

# ఋతుచర్య

కాలము భగవత్స్వరూపము. ఆద్యంతములు లేనిది. సంవత్సర నందు వర్షశరత్‌హేమంతములు దక్షిణాయనమున నుండును. చంద్రుడు ఈ ఆయనము నందు ఆమ్లమును (పులుపు), లవణమును (ఉప్పు), మాధుర్యమును, సర్వ ప్రాణులకు ప్రసాదించి బలమును, సౌఖ్యమును ఇచ్చును.

ఉత్తరాయణము శిశిర వసంతగ్రీష్మములయందు అర్క, తిక్త, కషాయ, కటువు (కారము) రసములు సర్వప్రాణులకు బలవర్థకము లగును. చంద్రుని కిరణములు భూమిపై బడి చల్లదనమును ప్రసరింపజేయు చున్నవి. సూర్య చంద్రులు వాయువుతోకలసి ప్రజలను పాలించుచున్నారు. వీరి కలయికవలన ఒక సంవత్సర మేర్పడు చున్నది. (అవియే పంచయుగము లని పేర్కొనబడినవి) నిమేషము మొదలుగా గల యుగ పర్యంతము కాలచక్రమున తిరుగు చున్నది. కావున వర్షశరత్‌హేమంతవసంతగ్రీష్మశిశిరములను ఆరు ఋతువులు దోష నాశనము కొరకు ఏర్పడు చున్నవి. అవి భాద్రపదము నుంచి రెండేసిమాసముల కొక ఋతు వేర్పడు చున్నవి. వర్షఋతువు భాద్రపద అశ్వయుజములందును, శరత్తు కార్తికమార్గశిరములందును పుష్యమాఘములందు హేమంతమును, ఫాల్గుణచైత్రములందు వసంతమును, వైశాఖజ్యేష్ఠములందు గ్రీష్మమును ఆషాఢ శ్రావణములందు శిశిరమును కలుగు చున్నవి.



# ఋతువుల వర్ణములు

ఋతువుల గుణప్రవృత్తులనుబట్టి వర్ణము లేర్పడినవి.

"అంగపురాణము" నందలి పూర్వభాగమున సూర్యరశ్మి వలన కలుగు ప్రయోజనములను వివరించుచు

[1]"వసంతము విష్ణుకిరణ ప్రభావితమై పీతవర్ణమును కలిగి యుండు ననియు, కపిలముగా నుండు నని తెలుపినారు. ఈ కిరణములు ఉత్తరాయణమున వికసించి దక్షిణాయనమున క్షీణించును.

గ్రీష్మమునకు హేతువులు సూర్యకాంతులు. ఈ ఋతువు సువర్ణకాంతులతో ప్రకాశించును.

వర్షఋతువునకు మూలము "అరుణగభస్తులు" సూర్యరశ్మి సంవత్సర కాలములో ఎనిమిది నెలలు జలమును గ్రహించి వర్షమునకు హేతువగును. రవి తన చండికిరణములతో జలమును గ్రహించి చంద్రుని కొసగగా అతడు వాయు నాడులతో వానిని ఆకాశమున మేఘములుగా రూపొందించి వర్షమును కురిపించును.

శరత్తు వర్ణము తెలుపు. ఆకాశము మేఘ రహితమై నిర్మలముగా నుండును.

హేమంతమునకు మూలము వాతాగ్ని జలములు. దీని వర్గము తామ్రము. ఈ ఋతువునందలి "జ్యోతిస్సులు" మిక్కిలి ఆకర్షణీయములు

శిశిరమునకు మూలములు కిరణములు హేమంత శిశిర సంబంధములైన జ్యోతిస్సులు. కిరణనాడులద్వార జలము నాకర్షించి కాలగుణ కర్మానుసారములై వర్షించును.

---

1. అంగపురాణము "వసంతే కపిల సూర్యో"

# ప్రకృతి - ఋతువులు - మానవజీవితము

"ఆనందో బ్రహ్మ" అను శ్రుతి వాక్యము, ప్రకృతి తత్త్వము ఆనందమే యని నిరూపించుచున్నది.

ప్రకృతిలో గల మార్పులు అవినాభావరూప విలసితములై మానవునకు ఆలంబనోద్దీపన విభావాది లక్షణములతో రసస్ఫూర్తి కలిగించుచున్నది.

ప్రకృతి చిత్రవిచిత్రము. ఋతుసూచితము. ఋతు సంయోగము. దృశ్యమాన జగత్తునందలి చైతన్యమునకును, పరివర్తన శీలము అగు ప్రకృతి విలాసములకును ఋతువులే కారణభూతములు. ప్రతిఋతువున కొక విశిష్టతకలదు. ఆ విశిష్టత ప్రకృతిలో ప్రతిఫలించు చుండును.

కాలమొక చక్రము. ఈ కాలచక్రభ్రమణములో కలుగుమార్పులకు అనుగుణముగా ప్రవర్తించుచు సకల చరాచరములు తమ ఉనికిని సార్థక పరచుకొనుచున్నవి. ఈ కాల చక్రములోని పరిమాణములందు అనుభవమునకు ఋతువులు. సంవత్సరములను, అయనములను మానవుడు వ్యంజకములో తన సౌలభ్యముకొరకు బుద్ధిపూర్వకముగా కల్పించుకొన్నాడు. పక్షములు విడువడని చీకటివెలుగుల వలయములు, దినములు, సూర్యుని గమనములు, ఋతువులు ప్రకృతిలో స్పష్టముగా భాసించు లక్షణములు అనూహ్యమాన మగు కాలమును కూడ అనుభవైకవేద్యము గావించుచున్నవి. ఋతువులు కాలముయొక్క లౌకికాలౌకిక లక్షణముల సమన్వయపరచును. ఈ సమన్వయమే ఋతువుల ప్రధాన స్వరూపము.

ఋతు చక్రమునకును, జీవిత చక్రమునకును సంబంధమున్నది.

"ఋతుచక్రమట్లు జీవితచక్ర మ్మనిశమ్ము భ్రమణశీలము గలది" 1 మానవప్రకృతి ఋతుప్రకృతిలోని వసంత గ్రీష్మ. వర్ష, శరత్. హేమంత,

---

1 డా॥ సి. నారాయణరెడ్డి ఋతుచక్రము.

శిశిర ఋతువుల కనుగుణముగా, ఐశ్వర్య, వీర్య, విశ్వయశ, స్వచ్ఛశ్రీ, విజ్ఞానము, విరాగ మగు షడ్గుణములతో కుడిన అవస్థలతో నిండియున్నది. నిరంతర సుఖదుఃఖ యాత్రా శీలమును, విసుగు వేసటలకాడలి ఈ మానవ జీవితము, అలసిసొలసిన కన్నులకు అలమటించు హృదయములకు సుధాంజనము పూసి, క్రొత్త ఆశలను, క్రొత్త ఉత్సాహములను పోసి, ఊరట నిచ్చు కాల పురుషుని వరప్రసాదములే ఈ ఋతువులు. నవ్యఋతు సంచర్యనముని హృదయము ఉప్పొంగి తత్సౌందర్యమును గానము చేయుదురు."

ఒక్కొక ఋతువు ఒక్కొక్క మనఃప్రవృత్తిని వికసింపజేయును. ఋతువులు జీవితములో కష్ట సుఖములు తాత్కాలితములని సూచించును.

వర్షమున మయూరములు మత్తిలి నృత్యముల నాచరింపగా మరాళములు మనోవ్యథ నొందును. శరత్తున హంసలు హసింప కేకిలోకములు వ్యాకులము చెందును, ఇది ఋతు తత్త్వము.

మానవుడు ఆయా ఋతువులలో తత్తద్గుణానుసారముగా జీవితము సుఖమయము చేసికొనవలయును.

వసంత ఋతువున ఉపవన సౌకుమార్యమును ననుభవించవలె ననియును గ్రీష్మమున శీతలోపచారమును, శరత్తున వెన్నెల విహారమును, చేయవలయును యనియు చరకుడు 'ఋతుచర్య'లో సూచించెను.

'అష్టాంగ హృదయసూక్తి'లో హేమంతమున 'జేతాంక' మను స్వేద కర్మను సూచించెను. భోజుని 'చారుచర్య'లో ఏ పుష్పము లేయే ఋతువులలో అనుభవ యోగ్యములో వివరింపబడినవి. శరత్తునందు లలిత జ్యోత్స్నా స్పర్శ ఆరోగ్యకరమనియు నతడు వివరించెను.

ప్రకృతీదేవి గుణములే ఋతువులు. మానవ జీవితము షడ్గుణ ప్రేరితములైన ఋతువులే ప్రభావిత మొనర్చు చుండుననుట యదార్థము.

# ఋతువులు - ఆయుర్వేదము

ఆయా ఋతువులలో గలుగు అనారోగ్యములను నివారించుటకు సేవింపదగు ఔషధములు వైద్యగ్రంథములందు వివరింపబడినవి. వైద్యులు ఋతుక్రమ పరిణామములను అనుసరించి చికిత్సలు చేయుదురు.

గ్రీష్మమునందు వాతము క్షీణించి, శిశిరమునందు ప్రకోపించును. అట్లే వర్షఋతువునందు పిత్తము, హేమంతమునందు శ్లేష్మములు నశించి క్రమముగా శరద్వసంతములలో పిత్తశ్లేష్మములు ప్రకోపించును. ఈ విధముగా ప్రకోపింపబడిన గుణత్రయము శరద్వసంతశిశిరములలో చికిత్స చేయకయే ఉపశమింపబడును. ఈ మార్పు కాలపరిణామము వలననే కలుగుచున్నది.

సూర్యుడు మేషాది రాసులలో ప్రవేశించుటచే రాశిద్వయమునకు ఒక్కొక్క ఋతువు ఒక సంవత్సర కాలములో ఆరు ఋతువులు ఏర్పడును. కనుక ఆయా ఋతుభేదములచే వాతపిత్తశ్లేష్మాది దోషములకు సంకరము, ప్రకోపము, శాంతియు కలిగి యుండుననుటకు 'శార్గధర సంహిత' లో

"చయకోప శమా యస్మిన్ దోషాణాం సంభవంతి
ఋతు షట్కం తదాఖ్యాతం రవే రాశిషు సంక్రమాత్"

అని పేర్కొనబడినది.

ఋతుభేదములచే రేచనౌషధములు స్వీకరించుటను గూర్చి. శార్గధర సంహితలో చాలా ముఖ్యముగా చెప్పబడినది, ఏ యే ఋతువులలో ఏ విధమైన ఔషధము రేచనమునకు వాడవలయునో అందు వివరింపబడినది.

శరత్తులో

"త్రివృద్దురాల భామస్తా, శర్కరా దివ్యచందనమ్
ద్రాక్షాంబు నాస యష్టీకం, శీతలంచ ఘనాత్యయే"

హేమంతములో —

త్రివృతాం చిత్రికం పాఠజాజి సరతాం వచాం
హేమక్షీరం చ హేమంతే చూర్ణముష్ణాంబునాపిచేత్

శిశిర వసంతాలలో

పిప్పల్ నాగరం సింధూ శ్యామా త్రివృతయా సహా
లిహే క్షౌద్రేణ శిశిరా వసంతే చ విరేచనమ్

గ్రీష్మమునందు

త్రివృతా శర్కరా తుల్యా గ్రీష్మే కాలే విరేచనమ్

ఋతు పరిణామము ననుసరించి జీవకోటిలో మార్పులు సంభవించును. వృక్షములు అయా ఋతు సంబంధములై వికాసవిరూపముల నొందును.

ఆయుర్వేద మర్మజ్ఞులు ఆయా ఋతువుల ననుబట్టి అవసరమగు వృక్షముల నాశ్రయింతురు.

వేద వాఙ్మయమునందు ఎన్నియో దివ్యవృక్షములు పేర్కొనబడనవి. ఋతు ధర్మమును బట్టి ప్రసిద్ధమైన 'సోమలత' యను ఔషధిలో కలుగు మార్పు విచిత్రము.

"సోమనామా మహౌషధ రాజ పంతిదశ
పర్వణః సోమ ఇవ హీమతే వర్తతే చ"

ఒక్కొక్క గుత్తికి పదునైదు పత్రము లుండును. ఆ పత్రములు సోముని వృద్ధిక్షయమాల ననుసరించి పెరుగుచుండును.

[1]అట్టి సోమలతా పత్రగుచ్ఛము శుద్ధ పౌర్ణిమనాడు పంచాదశ పత్ర శోభితమై వికసించును. కృష్ణ పాడ్యమినుండి దినక్రమముగా ఒక్కొక్క ఆకు రాలుచుండును. అమావాస్యనాటికి కేవలము కాడ మాత్రమే మిగులును.

---

1. శ్లో సర్వే షా మేవ సోమానాం పత్రాణి దశపంచతాని
శుక్లే చ కృష్ణే చ జాయంతే నిపతాంతి ఏకైకంజాయతే

చరకసంహిత ప్రథమా - 13 కల్పస్థానములో శాఖాపత్రములను వర్ష, వసంత ఋతువులలో గ్రహింపవలయును. గ్రీష్మ శిశిరములలో పత్రములు రాలి, క్రొత్తగా చిగిర్చి యున్నప్పుడు, వాని వ్రేళ్ళను గ్రహింపవలయును. త్వక్కును, గడ్డను, క్షీరములు శరత్తున గ్రహణీయములు. హేమంతమున ఫల పుష్పముల సారమును స్వీకరింపవలయును.

కొన్ని ఔషధములు కొన్ని ఋతువులలో ప్రకృతిశక్తి ప్రేరితములై మంచి గుణమును కలిగించును.

చరకసంహిత ప్రథమాధ్యాయము కల్పస్థానము 17 లో "మైత్రీ ముహూర్తమునందు వమనద్రవ్యములు మదనఫలములు శ్రేష్ఠము లని చెప్ప బడుచున్నది. వసంత గ్రీష్మములయందు గల పుష్య ఆశ్వయుజ మృగశిర మాసములందు వరగడుప్పననే గ్రహింపవలెనని చెప్పబడినది. పై విధముగా వైద్యశాస్త్ర వాఙ్మయ విజ్ఞానములందు ఋతుప్రాధాన్యము వివరింపబడినది.

వర్షఋతువునందు ఔషధులు యువకులకు వీర్యమును వృద్ధిచేసి ప్రసన్ను లను చేయును. క్షితిమలములవంటి ప్రయాసములచేత కూడుకొనినవాడై ఆకాశ మునందు మేఘమువలె వారు భూమియందు పీతవాతరోగాగ్నిచే దహింపబడుదురు దీనివలన పిత్తమను వ్యాధిని పోగొట్టుకొనుచున్నారు.

శరత్తులో బురదలో సూర్యకిరణములు ప్రసరింపబడి "పైత్రిక"మను వ్యాధిని పుట్టించును. ఆ ఔషధులు కాలపరిణామమున వృద్ధిపొంది వీర్యవంత

---

చరకసంహిత :—

వమనద్రవ్యాణాం మదనఫలాని శ్రేష్ఠతమస్యాచక్షతే
అనపాయిత్వాత్ తాని వసంతగ్రీష్మయోరంతరే
పుష్యాశ్వయుజాఖ్యాం మృగశిరసావా
గృహ్ణీయాత్ మైత్రేముహూర్తే

ములై బలవర్ధకములగును. హేమంతమందు దట్టమైన గొప్ప కిరణములచేత ప్రాణులకు, స్నేహ, శైత్య అధిక్యముచేత శ్లేష్మము కలుగుచున్నది.

వసంతములో సూర్యరశ్మిచేత స్తబ్ధములైన ప్రాణుల దేహములకు శ్లేష్మ మను వ్యాధిని కలిగించుచున్నది. ఆ ఔషధులే వేసవిలో నిస్సారములై ఎక్కువగా నీటిని పొందును. సూర్య ప్రతాపములచేత కష్టపెట్టబడు ప్రాణుల దేహములకు, వాయువుచేత కొద్దిగా ఉపశమము కలుగుచున్నది

శిశిరముల యందు ఎక్కువగా భూమి జలమయ మగుటచే ప్రాణులకు చల్లని గాలి, వర్షములచేత వాత మను వ్యాధి కలుగుచున్నది.

ఈ విధముగా ఋతుదోషములకు కారణములు చెప్పబడినవి. వర్ష హేమంత గ్రీష్మము లయందు కలుగు దోషములు, శరత్ వసంత శిశిర ఋతువుల యందు ఉపశమించును. పైత్తికవ్యాధి హేమంతమునందు, శ్లేష్మము గ్రీష్మమునందు, వాతము వర్షర్తువునందును వాని స్వభావసిద్ధములే అయినను. ఇవి శాంతమును కలిగించును. ఉదయకాలమును వసంతఋతువునకును, మధ్యాహ్నమును గ్రీష్మమునకును, సాయం సమయమును, శిశిరమునకును, చీకటి పడు సమయమును వర్షఋతువునకును, శరత్తు మధ్యరాత్రమునకును, హేమంతమునకు అహోరాత్రములు కూడ వర్షఋతువులో శీతోష్ణ వర్ష లక్షణములచే కలుగు దోషములను ఉపశమించునవని తెలిసికొనవలయును ఋతువుల యందు ఔషధులు కలిగినప్పుడు, వానిని ఉపయోగించుకొను ప్రాణులు, ఆయుస్సు బలము, వీర్యములు కలిగి, కాంతిమంతు లగుచున్నారు. వారికి తెలియకుండగనే వారిని అదృష్టవంతులుగా చేయుచున్నది. శీతోష్ణ వాత వర్షములు విపరీతములైన ఇతర ఔషధులను కలిగించి, వాని ఉపయోగముచేత వివిధ రోగములు పుట్టుకనుగాని, పుట్టకపోవుటనుగాని జరుగవచ్చును, అక్కడ పుట్టిన ఔషధులకు ఆయిధు విధముల ఉపయోగము లుండును. ఒకప్పుడు ఋతువులయందు, జనపదులు పిశాచకృత్యములచే మరొకప్పుడు క్రోధ ధర్మములచే (రేకెత్తింప బడుచున్నవి) విషవృష ఓషధి సుగంధముచేత. వాయువుచే కొనితేబడిన దోష ప్రకృతి విశేషము చేత. వివిధ రోగములచేత. గ్రహనక్షత్ర గమనము చేత గాని, మణిరత్న ఉపకరణములచేతగాని దోషములు కలుగవచ్చును. ఆ స మ

యమున స్థానపరిత్యాగము, శాంతికర్మ, ప్రాయశ్చిత్తము, మంగళజపము, హోమము, ఉపాహారము, అంజలి, నమస్కారము, తపము, నియమము, దయ దానదీక్ష మోక్షము. దేవత, బ్రాహ్మణ, గురువు, ఇతరులచేత శుభము కలుగును పై చెప్పబడిన లక్షణములను ప్రత్యక్షముగా వారివలన మనము చూడగలము. హేమంతముతో కుపిత వాయువువలన కలిగిన పిత్తరోగము ఆమ్ల, లవణ, రసముల వలన ఉపశమింపజేయబడును. గోధుమపిండి, మాంసము, పాలు, వికారమును కలిగించుచు. నవరసభోజనము కలిగి తైల, మర్దనము, నీటిచే, తప్తముచే తడుపబడిన మానవులు శుచిత్వము పొందుదురు. సూర్య కిరణముల శక్తిచేత ఎల్లప్పుడు చెమటను తుడుచుకొనుటను, పాదములను రక్షించుకొనుట యందును, కొద్దిపాటి ఉష్ణస్వభావముచేత కూడుకొనినవాడై శయనించును. ఈ కార్యములన్నియు శిశిరములో విశేషముగా మానవులు జరుపుకొనెదరు.

వసంతములో ప్రకోపించిన శ్లేష్మము కూడ అగ్నిని తగ్గింపచేయును. పాతగోధుమలు, క్షుద్ర జంతుమాంసము, తినువాడు గొప్పదనముచేత మధురమైన పగలును మరపుచెందును, శర్కరతో కలిపిన చల్లనినీరు దట్టమైన అనుపానము శిశిరమందు శుభమును గూర్చును.

గ్రీష్మము నందు నెయ్యిని, నీరును, పాలను, ఆమ్లమును త్రాగరాదు. మధ్యాహ్నమునందు చల్లనైన గాలులు రాత్రులందు హిమాశ్రితములగును. మరియు లవణ ఆమ్ల కటు రసములను, వ్యాయామమును గ్రీష్మమునందు వదలవలెను. గ్రీష్మ వర్షాకాలములందు పవనములు ప్రకోపింపబడుచున్నవి. అగ్నికి ద్రవ్యము, జీర్ణధాన్యములు, రసములు కొద్దిగా సంవర్ధకములగుచున్నవి.

శరత్తునందు పిత్తవ్యాధి కలుగును. తిక్త, కషాయ, ఇక్షు, క్షారములతో కూడిన సరోజలము మంచిది.

ఈ విధముగా నిత్యము అన్నిరసముల ఆస్వాదనము అమృతమునిచ్చి ఆరోగ్యము కలిగించుటకు దోహదపడుచున్నది.

# ఋతువులు - పర్వములు, ఉత్సవములు

ఋతువులు ప్రాచీనకాలమునుండియే మానవ జీవితములో పర్వములుగ వెలసినవి.

'భవిష్యత్ పురాణము'లో చైత్రోత్సవప్రశంస గలదు.

"చైత్రోత్సవే సకలలోకమనోనివాసం
కామం వసంత మలయాద్రి మరుత్సహాయం
రత్యా సహార్చ్య పురుషః ప్రవరా చ యోషిత్
సౌభాగ్యరూపసుత సౌఖ్యయుతా సదా స్యాత్"

వాత్స్యాయన కామసూత్రములకు యశోధరుడు తన "జయమంగళ" వ్యాఖ్యలలో సువసంతక, మదనోత్సవ, హోలికోత్సవములను వర్ణించినాడు.

వసంతకాలమున ప్రకృతిలో నవచైతన్యము మోసులెత్తుచున్నది. ఈ కాలమే నూతన సంవత్సరారంభమని పూర్వులు అభిప్రాయపడినారు. క్రీ. శ. నాల్గవ శతాబ్దములో నున్న జోతిర్వేత్త 'వరాహమిహిరాచార్యుడు' వసంత విషువత్కాలము వివిధనక్షత్రములకు చలించి, అశ్వినీనక్షత్రములకు చలించి, అశ్వనీ నక్షత్రాదిలో సంభవించుట గ్రహించి, మనప్రాచీనదేవమాన దినప్రారంభ కాలమైన ఉత్తరాయణ పుణ్యకాలములో మొదటిదినమే వసంత కాలమని, వసంత విషువత్కాలము నిర్ణయించి, మాస ఋతుసామరస్యము సాధించి, సంవత్సరాది వసంత కాలములోనే అని నిర్ణయించినారు, అప్పటినుండి చైత్ర మాసమునే సంవత్సరాదిగా పరిగణించు చున్నారు.

గ్రీష్మ ఋతువులో "అక్షయ తృతీయ" పండుగ వైశాఖ శుద్ధ తదియ నాడు జరుపుకొందురు. ఈ తిథి నాడు కృత యుగము అరంభ మైన దని విష్ణు పురాణాదులు తెలుపు చున్నవి.

'వైశాఖ మాసస్య చయా తృతీయా, నవమ్యసౌ కార్తీక శుక్లపక్షే, నభస్యమాసస్య తమిస్ర పక్షే, త్రయోదశీ పంచదశీ చ మాఘే"

తదియరోజు, గ్రీష్మ ఋతువులో పండు ధాన్యము, వస్త్రోదకము, దానము చేయుదురు. బదరీ నారాయణమందిర ద్వారము తెరచెదరు. పుణ్యకార్యముల ఫలము, అక్షయముగా నుండును. కావున ఈ పండుగ ఋతువునకు సంబంధించిన దనుట స్పష్టము.

ఋతువులను అనుసరించియే ఏపనినైనను ప్రారంభించవలయు నని మన పూర్వుల విశ్వాసము. ఈ దృష్టితో విద్యారంభమునకు కూడ ఒక కాలమును నిర్ణయించినారు. ఆ విద్యారంభకాలమే శ్రావణపూర్ణిమ. ఇది వర్షఋతు ప్రారంభమున వచ్చును. వర్షఋతువునుండి "చాతుర్మాస్యవ్రతము" ఆరంభమగును. వానలవలన ఎక్కడికిని పోవుటకు అవకాశ ముండదు. పరువాక సాగి పొలములో మొలకలు లేచియుండును. ప్రశాంతి లభించును.

కనుకనే గృహసూత్రకారులు "ఓషధీనాం ప్రాదుర్భావే" ఓషధులు మొలకెత్తిన తర్వాత శ్రవణనక్షత్రయుక్తపూర్ణిమనాడుగాని, హస్తానక్షత్రదినమునందుగాని వేదాధ్యయనము చేయవలె నని ధర్మశాస్త్రజ్ఞులు నుడివినారు. కనుకనే శ్రావణ పూర్ణిమ యజ్ఞోపవీతధారణమునకు శ్రేష్ఠమైన దని సంప్రదాయము. చైత్రశుద్ధ పాడ్యమి మొదలుకొని నవమివరకు వసంతనవరాత్రములను జరుపుకొందురు. ఈ ఉత్సవములకు అధిదేవత శ్రీరామచంద్రుడు.

వసంతపంచమినాడు సరస్వతీదేవిపూజలు గావింతురు. పుష్యమాసములో మకరసంక్రాంతి జరుపుకొందుము. ఇది కేవలము ఋతు సంబంధమైనదే.

శరదృతువులలోవచ్చు ఆశ్వయుజశుద్ధపాడ్యమినుండి జరుపునవరాత్రము లను 'శరన్నవరాత్రము' లందురు. ఇవి పురాణోపదిష్టములు. దేవీనవరాత్ర ములుగా ప్రసిద్ధములు. దేవీనవరాత్ర్యుత్సవము రాజులపండుగ. ఈపండుగనందు విచిత్రవేషధారణ, బొమ్మలకొలువులు వంటి వినోదములకు ప్రసిద్ధము. ఈపర్వమునందు ఆయుధారాధనము క్షత్రియుల సంప్రదాయము. వర్షఋతువులో ఏర్పడిన మధుకీటకభ్రమరాది ఈతిబాధలను, మాలిన్యమును ప్రక్షాళనము చేయు ప్రయత్నము దేవీనవరాత్ర్యుత్సవ పూజావిధానములో వ్యక్తమగును.

వానలు వెలసినతరువాత ఆకాశము నిర్మలమగును. కనుకనే శరత్కాలము రాజుల విజయయాత్రకు అనువైనకాలము. ప్రకృతీదేవి మంచుతెరలను తొలగించుకొని, క్రొత్తశృంగారముతో సాక్షాత్కరించినపుడు ఆమెకు స్వాగతము పలుకుట భారతీయుల అనాదిఆచారము. ఈఆచారముయొక్క ఆనందస్వరూపమే 'ఫాల్గుణోత్సవము' అదియే 'హోళీపండుగ'

ఆంధ్రదేశమును పరిపాలించిన కొందరురాజులు వసంతోత్సవములను ఆఋతువునందు ఆనందమును పొందినట్లు చారిత్రకనిదర్శనము లున్నవి. అందు వసంతోత్సవములకు ప్రాముఖ్యము నిచ్చి శ్రీకారము చుట్టినవారు రెడ్డిరాజులు. కొండవీటిని పరిపాలించిన కుమారగిరిరెడ్డికి వసంతోత్సవ కారణముగనే "కర్పూరవసంతరాయలు" అను నామాంతరము సార్థకమైనది. అతని "వసంతరాజీయ"మను కృతి అతని మధుమాసప్రేమకు చిహ్నము. విజయనగర ప్రభువు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి నందితిమ్మన పారిజాతాపహరణమునందు "ప్రతివర్షవసంతోత్సవ" ప్రసక్తి యున్నది.



# ప్రవేశిక

మానవానుభూతి శబ్దాకృతి దాల్చినప్పుడు సాహిత్యముగా పరిణమించును. సాహిత్యము మానవ జీవితానుభవమునకు ప్రతిఫలము. మానవ జీవితము కాల ప్రేరితము, ఋతుప్రేరితము. మానవుని కష్టసుఖములకు, మానవుని హృదయగత భావములకు ఋతుప్రేరితములైన పరిసరములు రూపకల్పనచేయు సందర్భములు లెక్కకురానివి. సాహిత్యమునకు ప్రమాణమేర్పరచి, ప్రయోజనములను నిర్దేశించి, కవులకు మార్గదర్శన మొనరించు సాహిత్య శాస్త్ర గ్రంథములు ఋతువర్ణనముల గూర్చి చర్చించినవి. కొన్ని లక్షణముల నేర్పరచినవి భరతాది సంస్కృత లాక్షణికులు, చిన్నకోట పెద్దనాది తెలుగు లాక్షణికులు ఋతువర్ణనములనుగూర్చి చేసిన సూచనలను ఈ ప్రకరణమున అనుశీలింతును.

## సంస్కృత లాక్షణికులు - భరతుడు

లాక్షణికులు మహాకావ్యమున అష్టాదశ వర్ణనములు ఉండవలెనని నిర్దేశము గావించినారు. అందు ఋతువర్ణన మొకటి. ఋతువర్ణన మనగా - ఆయా ఋతువులలో చరాచర ప్రకృతి పొందు సారూప్య వైరూప్యములను వర్ణించుట యగును. ఈ వర్ణనము కథకును రసమునకు అనుకూలముగా చేయబడినప్పుడు కావ్యమునకు అపార శోభ కలిగించును. లాక్షణికులు ఏయే ఋతువులు అనుకూలముగా నుండునో అనుభవ పూర్వకముగా తెలిపియుండిరి. దానికితోడుగా స్వానుభవ సిద్ధమైన ఔచిత్యదృష్టికూడ ఉండవలయును. కాలధర్మమును తెలిసికొనుటకు ఋతువర్ణనములు సహాయకారులు. అట్టి ఋతువుల వర్ణనా విధానమును, అనుసరింపదగు అంశములను గురించి మొదటగా భరతుని నాట్యశాస్త్రమునుండి సూచన లభించుచున్నది. ఋతుధర్మము కలిగిన సహజప్రకృతి వస్తువులను రంగస్థలమున ప్రదర్శించుటవలనగాని, ఆంగిక సంచలనము వలనగాని, ఋతువులు సూచింపబడును. ఇవి కేవలము నటనకును, రంగస్థలమునకును మాత్రమే పరిమితమయినను, ఉపకరింపబడు వస్తువులు కూడ ఋతుధర్మముల కనుకూలముగా నుండవలెను. మరియు ఆయా ఋతువులవలన కలి

గిన వస్తువులు కూడ కావ్యవర్ణన విషయమునందు గ్రహింపవచ్చును. ఇట్టి విషయములను ఏ ఏ ఋతువులందు ఏ విధముగా సూచింపవలనో భరతుడు తన నాట్యశాస్త్రమున 25 వ అధ్యాయములో వివరించినాడు.

దృశ్యకావ్యములలో 'నాంది' తరువాత ఆ ముఖమునందు సూత్రధారుని చేతగాని. నటిచేతగాని. ఏదేని ఒక ఋతువుయొక్క ప్రస్తావన జరుగుట చూచెదము. ఆ నాటకము వీరరసప్రధానమైనచో శరదృతువు లేక శృంగార రస ప్రధానమైనచో వసంత ఋతువు ప్రస్తావింపబడుట నాటక లక్షణము.

ఈతని నాట్యశాస్త్రమున సూచింపబడిన విషయములు తరువాత సాహిత్య లాక్షణికులకు మూలగ్రంథమై, మార్గదర్శకమై ప్రభవిల్లుటచేత నాట్యమునకు అతడు నిర్దేశించిన సూత్రములన్నియు సాహిత్యమునకు అన్వ ర్తింపబడినవి. సాహిత్య లాక్షణికులందరును ఋతు వర్ణనలను కావ్యోత్కర్ష హేతువులుగా గు ర్తించి తమ లక్షణ గ్రంథములలో విశ్లేషించియుండిరి.

భామహుడు :-సంస్కృత - లాక్షణికులలో ఆరవ శతాబ్దివాడగు భామహుడు 'కావ్యాలంకారము'న మహాకావ్యము సర్గబంధమని[1] చెప్పి, అందు "మంత్ర. దూత. ప్రయాణాజి నాయకాభ్యుదయైశ్చయత్" అను ఆయిదు వర్ణనములను మాత్రమే పేర్కొనెను. ఈతడు నాయకుడు ధీరోదాత్తుడని, ఆతనికి సంబంధించిన వానిని మాత్రమే తెలిపియున్నాడు. కాని ప్రకృతి సంబంధించిన వర్ణనసుగాని నిర్దేశించి యుండలేదు. అతని తరువాత దండి. భామహుడు సూచించిన మహాకావ్య లక్షణములతోపాటు, తన "కావ్యాదర్శ" యందు ప్రథమాధ్యాయమున అష్టాదశ వర్ణనములను చేర్చి మహాకావ్యమునకు లవి ఆవశ్యకములని నిర్దేశించినాడు.

"నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః" [1] అను వర్ణనలలో ఋతువర్ణనము కూడ మహాకావ్య లక్షణములందు చేర్చినాడు. పై వర్ణనలను దండి వేద పురాణేతిహాసములందు చూచియు, అందు వర్ణితమైన బాహ్యాంతర ప్రకృతులను పరిశీలించియు. నిర్ణయించినాడు.

---

1. "స్వర్గబంధోమహాకావ్యమ్" - భామహుని కావ్యాలంకారము 1-19.
2. దండి కావ్యాదర్శ 1-16. 17.

ఇక ఆ తరువాత వెలసిన లాక్షణికులు, వర్ణనలు సంఖ్యతో నిమిత్తము లేకుండా కొన్నింటిని చేర్చియు, ఉన్నవానిని మార్చియు తమ గ్రంథములలో సూచించినారు.

భోజుడు :- పదవశతాబ్దిలో భోజుడు తన 'సరస్వతీ కంఠాభరణ ము నందు వర్ణనా ప్రయోజనములను మహాకావ్య లక్షణములను పేర్కొనినాడు.

"ఋతురాత్రిం దివారేంద్వుదయాస్తమయ కీర్తనైః
కాలః కావ్యేషు సంపన్నోరస పుష్టిం నియచ్ఛతి"[2]

లందు ఋతువు, రాత్రిపగలు. సూర్యచంద్రోదయాస్తమయములు కాల సూచిత ములై కావ్యమునకు రసపుష్టిని చేకూర్చునని తెలిపినాడు.

విద్యానాథ :- శ్రీ విద్యానాథ మహోపాధ్యాయ విరచితమగు "ప్రతాపరుద్రీయ"ము నందలి కావ్యప్రకరణములో మహాకావ్యాది ప్రబంధ నిరూపణము కా... డినది.[3] ఇందలి మహాకావ్య లక్షణములు దండిని అనుస రించి చూపబ... కాని ఈతడు వర్ణనములను పదునెనిమిదిగా పరిమితము చేసినాడు.

ఋతువర్ణనా ప్రాముఖ్యమునుగూర్చి

"నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్" అని పేర్కొనుటను బట్టి కావ్యమునందు ఋతువుల వర్ణించుట తప్పనిసరి యని తేలుచున్నది.

విశ్వనాథుడు :- విశ్వనాథుని సాహిత్యదర్పణము ఆరవ పరి చ్ఛేదము కారికాసంఖ్య 322, 323 లలో మహాకావ్యమునందు. 25 వర్ణనలకు పెంచి వ్రాసినాడు. లందు ఋతువర్ణన కలదనుటకు "ప్రాతర్మధ్యాహ్న మృగయాశైలర్తు వనసాగరా" యని పేర్కొనబడినది.

1. సరస్వతీ కంఠాభరణము పుట 569, 570.
2. కావ్యప్రకరణము

కే శ వ మి శ్రు డు :- విశ్వనాథుని తరువాత కేశవమిశ్రుడు చంద్యాదులు చెప్పిన 18 వర్ణనలతోగాని, 25 వర్ణనలతోగాని ఆగక, 34 వర్ణనలుండవలెనని, తన 'అలంకార శేఖరము' న సూచించినాడు. అందు

"వర్ణ్యాంశ్చ రాజాదేవీచ దేశోగ్రామ పుర్ సరిత్
సరోబ్ధ్యరణ్యాద్యానాద్రి ప్రయాణ రణ వాజినః
హస్త్యర్క చంద్రావృతవో విశ్లేష మృగయాశ్రమాః
కాలాంతరం వయస్సంధి ధాతు వృష్ట్యాభిసారికాః" అని

కేశవమిశ్రుడు మహాకావ్యమునందు ఉండవలసిన వర్ణనములను పేర్కొని వానిని వర్ణించు విధానమును, వివరములను విశదీకరించియున్నాడు.

ఋతువర్ణనములను అవసరముల ననుసరించియు, వాని సహజత్వము ననుసరించియు, కావింపవలయునని వివరించినాడు.

రా జ శే ఖ రు డు :- రాజశేఖరుడు తన 'కావ్యమీమాంస' యందు అష్టాదశ వర్ణనలుగాని, మహాకావ్యలక్షణములనుగాని పేర్కొని యుండలేదు, కాని పదునెనిమిదవ అధ్యాయమునందు కాల విభాగమున ఋతు లక్షణములను విపులీకరించినాడు.

ఋతువర్ణనములను గూర్చి సాహిత్య శాస్త్రగ్రంథములలో అతి విపులమైన నిర్దేశములు, సూచనములున్నవి

సంస్కృత అలంకారికుల మతానుసారము మహాకావ్యములందు వర్ణనలు తప్పనిసరిగా ఉండవలెనని నిర్దేశించినారు. సంఖ్యానిర్ణయములో ఒక ఖచ్చితమైన సంఖ్యపై అభిప్రాయము మనకు కనబడదు. కాని అందు ముఖ్యముగా ఋతువర్ణనమునకు అలంకారికులందరును తగిన ప్రాధాన్యమునిచ్చియే యున్నారనడంలో సందేహములేదు.

# తెలుగు లాక్షణికులు - ఋతువర్ణనలు

తెలుగు లాక్షణికులలో ప్రథముడు విన్నకోట పెద్దన. ఇతడు "కావ్యాలంకార చూడామణి" యను లక్షణ గ్రంథమును వ్రాసినాడు. అందు నాయికా నాయక ప్రకరణమున అష్టాదశ వర్ణనలను తెలిపినాడు. ఆ వర్ణనలు "క్రాంతి సంకీర్తనాకరమష్టాదశ వర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యంబిలన్"[1] అని పేర్కొనబడుటచే క్రాంతి సంకీర్తనాకరములయినవి. యీ అష్టాదశ వర్ణనలని, అట్టి కావ్యము ఇలలో భవ్యమని ప్రశంసింపబడినది. అటువంటి అష్టాదశ వర్ణనలలో ఋతువర్ణనము

"పురవారాశి మహీధరర్తు శశిభృత్సూర్యోదయోద్యాన పు
ష్కర కేళీమధుపాన, మోహన, వియోగక్షేమయాన స్వయం
వర పుత్రోత్సవ, మంత్రదూత్య రణదోర్వైర్య క్రాంతి సంకీర్తనం
కర మష్టాదశ వర్ణనాన్వితము తత్కాలంబు భవ్యంబిలన్"

అను పద్యమున కలిగియుండుటచే మహాకావ్యమున ఋతువులు చోటు చేసుకొని ప్రశస్తికెక్కినది. ఇతని కావ్యమున ఆరు ఋతువులు వేరువేరు ధర్మములను కర్మములను కలిగియున్నవని వర్ణింపబడినవి.[2]

పదునారవ శతాబ్దమునకు చెందిన ప్రసిద్ధ అలంకారికుడు భట్టుమూర్తి. ఇతడు తన లక్షణశాస్త్ర కృతియగు 'కావ్యాలంకార సంగ్రహము'న కావ్య ప్రబేధములందు అష్టాదశ వర్ణనలు 'మహాకావ్య తిలకము' నకు కలుగవలయునని వివరించినాడు. అందు ఋతువర్ణనము కలదు.

పురసింధు నగర్త్విన శశి
సరసీవన మధురతి ప్రసంగ విరహమున్
పరిణయ తనయోదయ నయ
విరచన యాత్రాజిదౌత్య విభు వర్ణనమున్

---

1 కావ్యాలంకార చూడామణి 92 ప.

2 ,, ,, 99 - 110 వరకు.

అప్పకవి పదునేడవ శతాబ్దమునకు చెందిన ప్రసిద్ధ లాక్షణికుడు. ఈతడు 'అప్పకవీయము' నందు కావ్యమునకు 22 వర్ణనల గూర్చి చెప్పవలెననినాడు.

"పురము"ను ఋతుషట్కమును ప్రయాణంబును, శైలంబు
వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు, దూత్యంబు
పిదప సద్భృతి రణంబు
విషయంబు మధ్యపాన జ వికారంబును, వనవిహారంబును
నారీకేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరాభ్యుదయంబు విప్ర
లంభోచితంబు

పద్మమిత్రోదయంబును పరిణయంబు
సురతమును దౌహృదంబును సుత జననము'
ననగ నిరువది రెండు వర్ణనల గూర్చి
చెప్పవలయు ప్రబంధంబు శ్రీనివాస" ! 1-28

ఇందు 'ఋతుషట్కము' అను శబ్దము ఋతువులు 'ఆరు' అను విశ్వాసమునకు సిద్ధాంతమునకు బాసటగానున్నది.

శ్రీమాన్ కిళాంబి వేంకట వేదాంతాచార్యులవారు పందొమ్మిదవ శతాబ్దమునకు చెందిన సాహిత్యశాస్త్రవేత్త. ఈతడు తనగ్రంథమగు 'కావ్య లక్షణము' ప్రథమాధ్యాయము నందు అష్టాదశ వర్ణనలను పేర్కొనినాడు.

నగరము, ఋతువు, సూర్యోదయము, అస్తమయము, చంద్రోదయము, అస్తమయము, సముద్రము, పర్వతము, జలక్రీడ, వనవిహారము, యుద్ధము, పుత్రజననము, మద్యపానము, జూదము, రతి, విరహము, యాత్ర, సయంచవన రాజు

ఇందు నగర వర్ణన తరువాత ఋతువర్ణకేన ప్రాధాన్యము నీయబడినది. దీనినిబట్టి కావ్యమునందు ఋతువర్ణన ప్రధాన స్థానము నాక్రమించినదని తెలియు చున్నది.

తెలుగు లాక్షణికులే కాకుండా కవులుకూడ కావ్యమునందు అష్టాదశ వర్ణనము లుండవలెనని సూచించినారు. అట్టి కవులలో మొదటివాడు 'కుమార సంభవ' కర్త నన్నెచోడ మహారాజు. ఈతడు 940 ప్రాంతమువాడు. అతడు తన కావ్యావతారికలో అష్టాదశ వర్ణనము మహాకావ్యమునకు ఋతువర్ణన ఆవశ్యకమని వ్రాక్రుచ్చి తన కావ్యమునందు అన్వర్తింపజేసినాడు. అందు ఋతు వర్ణన కూడ పేర్కొనబడినది.

"వన జలకేళీ, రవి, శశి
తనయోదయ, మంత్ర, రతి, క్షితిప, రణాం
బునిధి, మధు, ఋతు, పురో, ద్వా
హ, నగ, విరహ, దూత్య, వర్ణనాష్టాదశమున్"

తరువాత పాల్కురికి సోమనాథుడు 'పండితారాధ్యచరిత్ర' అవతారిక యందు "ద్విపదకావ్యములలో సహితము అష్టాదశ వర్ణనలు ఉండవలెనని సూచించినాడు. కాని పేర్లను చెప్పలేదు.

సంస్కృత సాహిత్యశాస్త్ర నిర్మాతల ఆలోచనల అడుగుజాడలనే తెలుగు లాక్షణికులు, తెలుగుకవులు అనుసరించిరను మాట స్పష్టము. నేటికిని స్వతంత్రమైన సాహిత్యశాస్త్రము తెలుగు వాఙ్మయమున అవతరించనే లేదను విషయము విద్వాంసులందఱును ఎరుగుదురు.

## వ్యాఖ్యానము : ఋతులక్షణములు :

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి 'కావ్యాలంకార సంగ్రహము' వివరణమున ఋతువర్ణనా విధానము చక్కగా వివరింపబడినది. ఈతని వివరణ

మున వర్ష, శరత్, హేమంత, శిశిర, వసంత, గ్రీష్మ ఋతుక్రమమున ఆయా ఋతువుల యందలి ప్రకృతి వర్ణనలు, అందు కలుగుమార్పులు సహజ సిద్ధముగా వర్ణింపబడినవి.

కవులు తమ కావ్యముల యందు కాలౌచిత్యమును పాటించి ఋతు వర్ణనలను వానికనుగుణముగా వర్ణించుచుందురు. జ్యోతిష్కులు సంవత్సరమును చైత్రమాసముతో ప్రారంభింతురు. కాని లోకయాత్రవేత్తలు శ్రావణమాసముతో నారంభించుచుందురని చెప్పుటచేత ఋతువులలో మొదట వర్షఋతువర్ణనము కావించబడినది.

వర్ష ఋతువు : శ్రావణ భాద్రపద మాసములు వర్షఋతువు. ఈ ఋతువున వరి. బొట్టుగోరుగు, అడవి మొల్లలు, తటిగొట్టు, గిరిమల్లిక పుష్పించును. (అనుబంధము చూడవలెను)

## ఋతు లక్షణములు

తారనాథ వాచస్పత్యము నందు ఋతువుల లక్షణములు ఈ విధముగా చెప్పబడినవి.

హేమంతములో ఉత్తరదిశయందు దుమ్ము ధూళితో కూడిన చల్లని వాయువు వీచును. జలాశయములు తుషారముచే కప్పబడియుండును. మృగములు. ఏనుగులు, దున్నలు, గుఱ్ఱములు మొదలగు జంతువులు మదించియుండును. లోధ్రము మొదలగు పుష్పములు హిమముచే కప్పబడియుండును. శిశిరమునందు చల్లదనమధికముగా నుండి, గాలులతో కూడిన వర్షములు కురియును. వసంతమునందు అడవులన్నియు పచ్చగా శోభించును. కింశుక (మోదుగు) వకుళ, రసాలము, అశోకాది వృక్షములు పుష్పించును. కోకిలలు, భ్రమరములు మనోహరముగా గానముచేయును. దక్షిణము నుండి వీచు గాలులు మంచి సుఖమునిచ్చును. లే చిగుళ్లు ప్రకాశించును

గ్రీష్మమునందు సూర్యుని తీక్షణాంశువులచేత నైఋతి నుండి వచ్చు గాలులు సుఖము నందించును. భూమి సూర్యకిరణములచే పరితప్తమై దిక్కులు

ప్రజ్వలించునట్లుగా నుండును. చక్రవాకముల జంట తిరుగుచుండును. మృగములు నీటిని త్రాగుటకు వ్యాకులత చెందినవై యుండును. శిశిరమునందు ఆకాశము పశ్చిమ వాయువులచేత ఆకర్షింపబడును. సముద్రములచేత, మెఱపులచేత ప్రకాశింపబడి, మేఘ శబ్దములచేత కొనియాడబడును. మృదువైన నల్లని మేఘము కోపముతో వర్షించి భూమిని కాంతిమంతమొనర్చును. కదంబ నీప వృక్షములు, నక్షత్రములచేత ప్రకాశించును. వర్షాకాలమునందు నదులు. చెరువులు నిండి చెట్లను ముంచును. శరత్తునందు సూర్యుడు శుభ్రమైన, నిర్మలమైన ఆకాశమున ప్రకాశించును. ఆ విధముగనే సరస్సుల సందర్యమును హంసలు, కమలములు ఇనుమడింపజేయుచుండును.

## ఉద్దీపన విభావములు - ఋతువులు

వసంతాది ఋతువర్ణనలను కవులు కావ్యప్రపంచమున ఉద్దీపనములుగా పేర్కొనినారు.

ఋతువులు నాయికా - నాయకులకు ఉద్దీపన విభావములను కల్పించు సమ్మోహనాస్త్రములు.

"భావమనగా మనోవికారము"

ఈ ఉద్దీపనమునకు హేతువులు - చంద్రమలయానిలము మొదలుకొని ప్రకృతిలోనున్న రమణీయ పదార్థ సమూహములు.

అచేతన పదార్థములు మానవులలో, ప్రాణులలో చైతన్యమును కలిగించి మనోవికారమును కలిగించును. ఈ చంద్రచందన మలయమారుతములు ఆయా ఋతువులయందు వికాసమునొందును. కావున ఋతువర్ణనములు కావ్యములలో ఉద్దీపన విభావములై తద్వికాసమునకు కారణభూతములగుచున్నవి. అట్టి ఋతువులలో వసంతము మానసోల్లాసమునకును, కామోద్దీపనమునకును, విరహమునకును, ఉపకరించు పదార్ధములెన్నియో, ఈ ప్రకృతి యందు కలిగియున్నవి.

వసంతము ఆరంభ, ఉపభోగ, ఉత్సవములచేతను, నానా పుష్ప ఫల ప్రదర్శనచేతను, మందమందముగా వీచే మారుతములచేతను, భ్రమరముల ఝుంకారములచేతను, చిగురుటాకులు తొడిగిన పచ్చని వృక్ష సముదాయముల చేతను, ప్రకృతికి నూతనశకము నారంభించినట్లుండుటచేతను, మనోల్లాసము కలిగించును. దానితో ఆనందానుభూతి కలిగి జనులు క్రొత్త ఆశల చిగురులతో సుఖజీవనము సాగింతురు.

చైత్ర మాసమున వసంతఋతువునందు శృంగార ఉద్దీపన విభావములను కలిగించు ప్రకృతి మనోహరత్వమును, మన్మథుని పంచ బాణములలో చూపించెదరు.

"అరవింద మశోకం చ, చూతంచ నవ మల్లికా!
నీలోత్పలం చ పంచయితే, పంచ బాణస్యసాయకాః"1

అరవిందములు, అశోకములు, మామిళ్ళు, క్రొత్తమల్లెలు, నీలోత్పలములు ఇవి అయిదు మన్మథుని పూవిలుకాని బాణములు. ఇవి వసంత ఋతువునందు నాయికా నాయకులలో శృగార భావములను కల్పించును.

2మరువకు ప్రాముఖ్యము నిచ్చునది వసంతము. ఈ ఋతువునందు మరుని వర్ణన అతి ప్రాకృతితముగానుండి మనోరంజనమును కలిగించును. ఇచట భృంగములు, మలయమారుతములు, కమలములు, ఆమ్రకిసలయము, పరాగము, సీధువుపలాశము, కీరము ఇవన్నియు మన్మథ జన్మకారణములుగను, ఉద్దీపన కారణములుగను ఊహింపబడును.

గ్రీష్మమునందు పగలంతయు సూర్యుని ప్రచండ కిరణములధాటి కోర్వజాలని జనులకు, రాత్రులందు కలుగు పండు వెన్నెలలు, చెఱకుతోటలు, మల్లెపూలు, పాటల పుష్పములు, శృంగారోద్దీపన విభావములగును.

---

1. సూర్యనారాయణాంధ్ర నిఘంటువు — మన్మథుని పంచబాణ విశేషము.
2. ఆముక్తమాల్యద 5 „ 14/1

వర్షఋతువు ఆగమన సమయమునకనబడు తొలకరి మేఘములు మనస్సునకు ఊరటను కలిగించును. ప్రియా సమాగమును కోరు పడచులకు యీ తొలకరి మేఘములు ఉద్దీపనములగుచున్నవి కామినీకాముకులకు చల్లనిగాలులు చిరుతెంపరలు, నిండైన సెలయేళ్ల దూకుడులు, పచ్చని వనములు, నెమళ్ళ నృత్యములు, మనోహరములై మదనోద్దీపము లగుచున్నవి

గుడిసెలల్లో నివసించు జనులు నిలువ నీడలేనివారై, పరితప్తహృదయు లగుదురు. ప్రకృతి సౌందర్యమును అనుభవింపలేకపోవుదురు;

శరదృతువునందు వర్షములు వెనుకబడును. ఆకాశము నిర్మలముగా నుండును. పండువెన్నెలలు విరియును. కావున ప్రియుల రాకకై ఎదిరిచూచు ప్రేయసులతో ఇవి కామోద్దీపన భావముల కలిగించును, రాజులకు యుద్ధ కాలమిది. కావుననే ఈ ఋతువు శౌర్యమునకు, ప్రతీక. విజయదశమి ఈ ఋతువు నందే వచ్చును. దీనినిబట్టి పాండవులు కౌరవులపై. శ్రీరాముడు రావణునిపై. యుద్ధప్రకటనల గావించినారు. ఆనాటి నుండియే ఏ పనులైనను ప్రారంభింప వచ్చునని శుభ సూచితమగుచున్నది. కార్తీక పౌర్ణమినాటి రాత్రి చల్లనిగాలులు, సముద్ర కెరటాల పొంగులు, హృదయమున మదనోద్దీపములు కలిగించును.

హేమంత శిశిరములందు చలితీవ్రత హెచ్చుగానుండి, సంయోగ వియోగములపై తన ప్రభావమును చూపును.

సాహిత్య శాస్త్ర రహస్యములను భద్రపరచి లాక్షణికులు జాతికి ఎంతేని మేలు చేసిరి. సాహిత్యము నందభినివేశము సంపాదించుకొనదలచిని వారికిని తమ్ముతాము సహృదయులుగా మలచుకొనదలచుకొను వారికిని, ఈ సాహిత్య శాస్త్ర గ్రంథములు అత్యంతోపయుక్తములని వేరుగా చెప్పనక్కరలేదను కొందును. ఆయా సాహిత్య శాస్త్ర గ్రంథములలో సూచింపబడిన ఋతు వర్ణనాంశములను నేను సంగ్రథనముచేసి యిచట ప్రస్తుతించితినే కాని నా యిచ్చ వచ్చిన తెలుగును ప్రదర్శించి యుండలేదు. నా పరిశోధనాంశమునకు అనుకూలముగా, లాక్షణికులు చెప్పిన చొప్పును చొప్పించుటకు ఇచట ప్రయత్నించితిని. ఉద్యానవనములోని పలువన్నెల పూవులను తెచ్చి 'మాలానిర్మాణము చేసిన విధమున నేనీ పని చేసితిని. ఈ మాలను కూర్చుటలో నేను కొంత పనితనము చూపితినను యదార్థము విజ్ఞులు తెలిసికొనకపోరు.

# ప్రవేశిక

సృష్టి కాలాధీనము. అట్టి కాలప్రభావము కావ్యములందభివర్ణితము. ఉత్తమ కవులందరును ప్రకృతిని తనివితీర వర్ణించిరి. ప్రకృతికిని మానవునకును అవినాభావ సంబంధముండుట వలన కావ్యప్రపంచమున ఋతువర్ణనలు అనివార్యమైనవి. మానవప్రవృత్తి ప్రకృతి పరిస్థితుల ననుసరించి ఎప్పటికప్పుడు మారుచుండును. ప్రతికూల పరిస్థితులను అనుకూలముగను, అనుకూల పరిస్థితులను ప్రతికూలముగ మార్చగల శక్తి ప్రకృతికీ మాత్రమే గలదు. ఈ అనుకూల ప్రతికూల పరిస్థితులు కావ్యమునందు ప్రతిఫలించుట సహజము. అట్టి సందర్భమున ప్రకృతిని ప్రతిబింబించు ఋతువులను వర్ణించుట కవులకు అనుల్లంఘనీయమైనది.

సాహిత్యలోకమున ఋతువర్ణనలు సహజముగను, కల్పనామనోహరములుగను, కవులు ఆవిష్కరించిన సందర్భము లనేకములు. ఋతువర్ణనా సందర్భములందు కనిపించు కవుల సహజ వర్ణనా పాటవము ఒక ఎత్తు. స్వకీయానుభావములకు అనుకూలమైన వర్ణనా విధానము మరొక ఎత్తు.

కవులు ఋతువులను అతిసహజముగను, స్వీయానుభూతితోడను, కొన్ని సందర్భములలో ఆయా ఋతువులకు సంబంధించిన లక్షణములను శాస్త్రజ్ఞులు చూపిన మార్గముల ననుసరించి వర్ణించినారు. ప్రకృతి సౌందర్యాభివర్ణనమునకు పాత్రల మనస్తత్వ చిత్రణమునకును. కవులు ఋతువర్ణనములను కావ్యములందు ప్రవేశపెట్టి యుందురని మనమూహింపవచ్చును. కాని తెలుగు కావ్య ప్రపంచమునందు ఋతువర్ణనకు మనస్తత్వ చిత్రణమునకు అంతగా సంబంధము లేదు. ప్రకృతి సౌందర్యమునకును, కథాగమనమునకును, సంబంధములు అరుదు. సమకాలీక జీవితవృత్తములకు అనుకూలముగా ప్రకృతి వర్ణనములు కూడ సాగిన సందర్భములు కూడ తక్కువే. కేవలము అలంకార శాస్త్ర మర్యాదలను పాటింపదలచి ప్రకృతి వర్ణనముచేసిన సందర్భములే ఎక్కువని అభిప్రాయపడుటలో దోషములేదు.

ఏ వర్ణనమైనను కథా సందర్భమునకు భంగము కల్గించనిదై యుండవలెను. కావ్యమునకు ఋతు సంబంధములైన వర్ణనలే అధిక శోభ కల్గించునని

ప్రాచ్య పాశ్చాత్య విమర్శకుల భావన. వర్ణనలు ఉదాత్తములై, రసపోషకములై, కావ్యమునకు అలంకారముగా అలరారినప్పుడే ఆ కావ్యము పాఠకులకు ఆకర్షణీయమగుచున్నది.

సంస్కృత వాఙ్మయము :– ప్రకృతి వర్ణనమునందు తెలుగుకవులు స్వతంత్రత చూపినప్పటికిని, వారి వర్ణనా దర్పణములలో సంస్కృత కవుల వర్ణనల నీడలు కన్పించుచునే యున్నవి

రామాయణమునందు ఋతువర్ణనలు ఆత్మాశ్రయ, పరాశ్రయ కవితా గర్భితములుగా సాగినవి. వాల్మీకి పాత్రలచేతగూడ ఋతువులను వర్ణింపజేసినాడు. విరహాతురుడైన రాముని వసంత, వర్ష, శరదృతువులు ప్రభావితునిచేసిన తీరు హృద్యముగ వాల్మీకి వర్ణించినాడు. ఆదికవిని అనుసరించని సంస్కృత కవులు లేరు. తెలుగు కవులు లేరు. ఇట్లనుట సాహసము కానేకాదు.

ఋతువర్ణనా కుతూహలముగల కాళిదాసు తన 'ఋతుసంహారము' అను కావ్యమునందు వాల్మీకిచేసిన ఋతు వర్ణనలకంటె అధికముగా ఏమీ చేయలేదని విజ్ఞుల మతము. కాళిదాసు వర్ష ఋతువర్ణనయందు చూపిన మేఘాడంబర, వర్షధార, చాతక, ఇంద్రగోప, మయూర, భ్రమర, భేక పక్ష్యాదులు, మన్మథక్రీడలు వాల్మీకి వర్ష ఋతువర్ణనలోనివే. వాల్మీకి శరదృతు వర్ణనములోని నీరసించిన ప్రవాహములు, నిర్మల మేఘములు, బయలుపడిన ఇసుకతిన్నెలు, ఏడాకుల అరటిచెట్లు, హంసలు, బెగ్గురుపక్షులు, చక్రవాకములు, క్రౌంచములు, పద్మములు, నీలోత్పలములు, సువర్ణ బంధూక ప్రేంకణాది కుసుమాలు కాళిదాసు శరద్వర్ణనమునందు కనిపించును. ఆ విధముగనే వసంత హేమంతములు వర్ణనమునందు కాళిదాసుకు ఆదికవియే మార్గదర్శకుడు.

ఋతువర్ణన విషయమున కాళిదాసు వాల్మీకిని అనుసరింపగా, అనంతర కవులు కాళిదాసునే అనుసరించినారు. 'ఋతుసంహారము' ప్రత్యేకముగా ఋతువర్ణనల కొరకే వ్రాయబడిన తొలికావ్యము. ఈ కావ్యమున ఆరు ఋతువుల వర్ణనమున్నది. ఋతువులలో వసంతఋతువును ప్రప్రథమముగా వర్ణించు సంప్రదాయము ఉండగా, కాళిదాసు గ్రీష్మఋతు వర్ణనముతో కావ్యమును ఆరంభించినాడు.

వాల్మీకి రామాయణమున వసంతఋతువునకు కావ్యగత వర్ణనమునందు అధిక ప్రాధాన్యము ఉండగా, కాళిదాసు తన కావ్యములందు గ్రీష్మమునకు ఒసగినాడు. వాల్మీకి రామాయణమున ప్రకృతి వర్ణనలను సహజముగ, స్వాభావ రమ్యములుగా తీర్చిదిద్దినాడు. ప్రకృతికిని, పాత్రలకును తాదాత్మ్యమును చూపిన కవులలో వాల్మీకియే ప్రథముడు.

సంస్కృత భారతమున కథాగమనమునకున్న ప్రాధాన్యము ప్రకృతివర్ణనకు లేదు ఇతిహాసము కనుక ఋతువర్ణనములకు అవకాశము అంతగా లేక పోయినది. కాని సంస్కృత భారతమున అటనట కనిపించు ఋతువర్ణనలు తెలుగు భారతమున కథాగమనమునకు తోడ్పడునట్లుగా వర్ణింపబడినది. వ్యాస భారతమున వసంతము పాండుపుత్రోదయ సందర్భమున స్వాభావ సుందరముగ వర్ణింపబడుట విశేషమే

## తెలుగు వాఙ్మయము - పురాణకవులు

నన్నయ : నన్నయ చిత్రించిన వసంతము:-

"కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు
        మధుపమ్ముల సుగీత నినదమ్ములెసగెం, జా
తమ్ముల లసత్కిసలయమ్ములసుగంధి
        ముకుళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ముగు కోకిల కులమ్ముల రవమ్ము మధుపమ్ముగుచు
        విన్చె రనిశమ్ము, సుమనో భా
రమ్ముల నశోక నికరమ్ములును జంపక చయమ్ములను
        గింశుక వనమ్ములును నొప్పెన్"

అను పద్యమున రసాలవర్ణన కావించి వసంతశోభను ఇనుమడింపజేసినాడు. తాపసవృత్తిలోనున్న పాండురాజుకు మాద్రిపై మరులుగొనుటకు వసంతము కామోద్దీపకమైనట్లు వర్ణించినాడు.

గ్రీష్మము ఖాండవదహన సమయమునందు సందర్భోచితముగ రేఖామాత్రముగ వర్ణింపబడినది.

సూర్యుని వేడిమికి దాహముగొనిన వనవృక్షములకు ఆనందము కలిగించునదిగా తొలికారును. వర్షఋతువును. స్వభావసిద్ధముగా వర్ణించినారు

నన్నయ శరత్తు

"శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహార పంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధబంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి పూరము లంబర పూరితంబులై"

అని అతిరమ్యముగ వర్ణించుటలో సాహిత్యలోకమున ఈ పద్యము ప్రదీపకమయినది.

తిక్కన:- తిక్కన ఋతువర్ణనలకు అంతగా ప్రాధాన్యము నిచ్చినట్లు కనిపించదు. పాండిత్యప్రకర్షమునకై ప్రదర్శించు కథను శీఘ్రముగ నడిపించుచు భారతభాగమునొక శిల్పఖండముగ తీర్చినాడు మూలభారతమున విరాటోద్యోగాది పర్వములందు ప్రకృతివర్ణనల జేయుటకు తావు లభింపలేదు. కనుకనే తిక్కన కథాగమనమునకు అడ్డుతగులునన్న భయముచేత వర్ణనలను పెంచక. కథను మాత్రమేకధాటిగా నడిపించినాడు సూర్యోదయాస్తమయాది వర్ణనల చేయుచు. ప్రకృతికి పాత్రలపైగల సానుభూతిని చూపినాడు

ఎఱ్ఱన :- ఎఱ్ఱన తానును 'నృసింహపురాణము' న వసంతమును కామోద్దీపకముగనే చిత్రించినాడు. హిరణ్యకశిపుని తపస్సును భంగపరచుటకు. దేవేంద్రుడు తిలోత్తమాది అప్సరసలను పంపించినాడు. ఈ సందర్భమున వసంతము వర్ణింపబడినది. అయినను ఇక్కడొక విశేషము గలదు. ఎఱ్ఱన వసంతమున వర్షఋతు లక్షణములు స్ఫురింపచేసినాడు. ఇట్టి వర్ణనయే అనంతర కవులు ఒక ఋతువునందు మరియొక ఋతు ధర్మములు తోచునట్లు వర్ణించుటకును. ఒకే కాలమున 'ఆరు' ఋతువులు ద్యోతకమగునట్లు వర్ణించుటకు

పొంగుచున్నది. నిజమునకు ఇట్టి వర్ణనా విధానమునకు బాటలు వేసినవాడు మేఘ సందేశ కర్త కాళిదాసే. ఎట్టిని అరణ్య పర్వశేషమునకు శ్రీకారము చుట్టుచు, శరదృతు వర్ణన చేసినాడు. అరుణాంశ రాగరుచులు అతిశయిల్లగ, ఆకాశము నిర్మలముగ నున్నదనియు, వికసించిన కమలములు శోభాపరముగ గోచరించు చున్నదనియు వర్ణన కావింపబడినది. ఈతడు 'హరివంశము' న చేసిన శరద్వర్ణన వ్రేపల్లె గోపక జీవితమునకు అద్దము పట్టినది

పోతన : భక్తిరసభరితమగు 'మహాభాగవతము' నందు సహజ పాండిత్యప్రతిభ కలిగిన పోతన వర్షాది ఋతువులను సహజ సుందరముగ వర్ణించి చరితార్థుడైనాడు.

నన్నెచోడుడు : 'కుమారసంభవ' కర్త నన్నెచోడుడు అష్టాదశ వర్ణనలు కావ్యములందుండవలయునని నిర్దేశించి. ఋతువర్ణనమునకు ప్రాధాన్యము నిచ్చినాడు.

వసంతమును యోగీశ్వరుడైన పరమేశ్వరునికి పార్వతిపై మనసు నిలుపు టలో కడు రమ్యముగ వర్ణించి, కామోద్దీపకరముగ జేసినాడు.

హేమంతమున తన కూతురగు పార్వతికి శరత్కాలము తాపము కలిగించినదని, దానికి ప్రతీకారమునకై హిమవంతుడు ఉగ్రుడైనాడు ! అనునట్లు మంచు ఎల్లెడల వ్యాపించెనని ఉత్ప్రేక్షించినాడు. చలిబాధ నోర్వజాలక పాములు బొరియలలో దాగినట్లు నాగరికులు ఇండ్లలో దాగిరని ప్రజల జీవన విధానమును వర్ణించినాడు.



# ప్రబంధ కవులు :

పదునారవ శతాబ్దమునందు తెలుగులో ప్రబంధములు వెలసినవి. ఇవి పాండిత్యప్రకర్షకు, శృంగారరస ప్రాధాన్యమునకు ప్రసిద్ధిని పొందినవి. ఒకే కథ, ఒకే నాయకుడు గలిగి అష్టాదశ వర్ణనలతో నవతరించిన ఈ ప్రక్రియ తెలుగులో ప్రబంధములనిపించుకొనినవి. నిజమునకు ప్రబంధమనగా కావ్యసామాన్యము కాని తెలుగులో ప్రబంధ శబ్దమునకు విశిష్టత యేర్పడినది.

వాల్మీకి కాళిదాసాదుల వలెకాక, కవిత్రయము వారివలె కాక, ఈ ప్రబంధ కవులు ఋతువర్ణనములను అష్టాదశ వర్ణనల చట్రము ప్రకారము తీర్చిదిద్దిన వారేకాని, వీని ఔచిత్యమును అంతగా ఎరిగినవారుకారు. కాని ఋతువర్ణనా సందర్భముగ వారు వ్రాసిన పద్యగద్యములు, ఉత్తమకవితకు చక్కని తార్కాణములు. వీరి ఋతువర్ణనములకును, కథాగమనమునకును, చాలా సందర్భములలో సంబంధమును లేదు. ఒక్క రాయలు తప్ప తక్కిన ప్రబంధ కవులెవ్వరును సమకాలిక ప్రజలు ఆయా ఋతువులలో అనుభవించిన కష్టసుఖములను గూర్చి పట్టించుకొని యుండలేదు. ఋతువర్ణనల విషయమున రాయలు చూపిన మార్గము రాచమార్గము. నిరుపేదలు, ధనాఢ్యులు ప్రకృతి ఆయా ఋతువులలో అనుభవించిన తీరుతెన్నులనుగూర్చి శ్రీకృష్ణదేవరాయలు తన 'ఆముక్తమాల్యద' అను మహాకావ్యమునందు అతి సహజముగ, ఔచితీ శోభితముగ వర్ణించి, తన కావ్యమునకు ఒక ప్రత్యేక స్థానమును ప్రబంధ మండలియందు కల్పించుకొనినారు.

ప్రబంధ కవులు అలంకార శాస్త్రజ్ఞులు నిర్దేశించిన ఋతు లక్షణాలనే పద్య గద్యములలో నిబద్ధము చేయుటకు ప్రయత్నించిరే కాని, స్వకీయానుభూతులను ఋతువర్ణనల సందర్భముగ అందించలేకపోయిరి.

పదునారవ శతాబ్ది ఆరంభము నుండి తెలుగులో వెలసిన ప్రబంధములను జాగరూకతతో పరిశీలించిన సహృదయులు నాతో ఏకీభవింతురని నా నమ్మకము.

o — o

# ఆధునిక కవులు

గురజాడ అప్పారావు : నవ్యాంధ్ర సాహిత్యమునకు యుగకర్త అయిన గురజాడ అప్పారావుగారి రచనలు నూతన విజ్ఞాన భానూదయ కాంతులు ప్రసరింపజేసినవి. క్రొత్తపాతల మేలుకలయికతోపాటు కమ్మని తెలుగుదనము ప్రతి శబ్దమునందును ఉట్టిపడుచుండును. కొద్ది మాటలతోనే భావమును సూటిగా గుండెకు తగులునట్లుగా చెప్పు స్వభావ మీ కవిది.

అప్పారావుగారి 'ముత్యాల సరాలు' లో 'డామన్ పిథియస్' నందు వర్ణితమైన సీమకవులకు పుట్టిల్లై వెలసినదట. అప్పుడు

"ఋతువులకొకొక్క వింతరూపం
బతుల శోభా భాజనంబై
మతుల కొల్లల నాడు స్వర్గం
బేమొ యీ సీమ"

అని సరిక్రొత్తగా వర్ణించినాడు. కాసుల కాసపడి కన్నకుమార్తెనే ఒక ధనిక ముదుసలి కమ్ముకొన్నాడొక తండ్రి. ఆ పిశాచ కోరల్లో చిక్కిన 'పూర్ణమ్మ' గాథయందు కూడ ఋతు ప్రశస్తి చోటు చేసికొనినది.

పూర్ణమ్మ చిన్నతనమున భక్తితో ప్రతిదినము దుర్గను కొలిచెడిది. ఆ దేవికి

"ఏయే వేళల పూచే పూవుల
ఆయా వేళల లోను,
ఏయే ఋతువుల పండే పండ్లను
ఆయా ఋతువులలో" అందించెడిది.

తండ్రి ఆమెను ముదుసలి మగనితో ముడివేసినాడు. అత్తవారింటికి పోవుటకు సిద్ధమౌచున్నప్పుడు దుర్గను పూజింపబోయిన సందర్భములో పూర్ణమ్మను చూచి,

"ఆమని రాగా దుర్గ కొలనులో
కలకల నవ్వేను తామరలు
ఆమని రాగా దుర్గ వనములో
కిలకిల నవ్వేను కీరములు" అని వర్ణించినాడు.

కుందుర్తి ఆంజనేయులు : వచన కవితారీతిలో అల్పసంఖ్యాకమైన ఋతువర్ణనా కావ్యములలో కుందుర్తిగారి 'నగరంలో వాన' అతి విశిష్టమైన రచన. సాంప్రదాయకమైన కవితారీతులను ప్రజాపరముచేసి, రంజింపచేయు శిల్పము ఈ కావ్యములో ఉదాత్తస్థాయిలో నున్నది.

"నడి బజారులో పడిపోయిన మూర్ఛవాడు
బిందెలతో దాహం తాగినట్టు
పగుళ్ళువారి నోరు తెరుచుకూర్చున్న భూదేవికి
పల్లెల్లో పది దుక్కులైనా లెక్కుండదు.
పల్లెసీమలో వానల మేనాల మీద
దిగినుండి సస్య సమృద్ధి దించే వర్ష కాంత
అవసరం లేనప్పు డడిగితే
అప్పులు సులువుగా లభించునట్లు
అక్కరలేని నగరంలో కూడ
పుష్కలంగా కురుస్తుంది.

ఇందు కవి నిజమునకు చాలా సులువుగా శ్లేషతో మేళవించి, అటు మనిషికి, ఇటు వర్షమునకు అన్వయింప జేసినాడు. అప్పులు అంటే బాకీలు, నీళ్లు కూడ ! అదే విధముగా నగరములో పుష్కలముగా కురియుటలో మేఘము పేరుకూడ ధ్వనించుచున్నది.

కుందుర్తి దేనిని వర్ణించినా, అందు సహజ వాస్తవికతను ప్రధానముగా నిలుపును. వర్ణనలోని సౌందర్యము వాస్తవికతలో నుండి వచ్చినచో బాగుండును కాని ఊహాశక్తిలో నుండి రాకూడదనునది అతని మతము ఈ కాలములో

ఏ అనుకూల పరిస్థితి దొరికినా, దానిని ఆర్థికమైన దోపిడికి వినియోగించు కొనుట సామాన్య లక్షణము సెలవు చట్టాలను ఉల్లంఘించిన కిరాణావర్తకుడు, మామూళ్ళు తీసికొనే పోలీసు, పాలల్లో నీళ్లు కలిపే పాలవాడు, వర్షఋతువర్ణనములో వర్ణింపబడి, వాస్తవికతను ప్రదర్శింపజేసినాడు.

"వర్షాధి దేవతకు రిక్షావాండ్లు
వరాలు కోరుకుంటున్నారు"

"సైకిలుకు కట్టిన బిందె మీద
గుడ్డముూతి పూర్తిగా తీసేసి
వణుకుక్కంటూ పాలవాడు
వరండాలో నిలబడినాడు"

సంప్రదాయ సిద్ధముగా సాగిన ఋతువర్ణనలకును, సరికొత్త కవులు చేసిన ఋతువర్ణనలకును, భేదము ఈ కవితలో తెలుపగలుగుచున్నది.

విశ్వనాథ సత్యనారాయణ : 'కవిసామ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ తన గేయకావ్యమైన 'కిన్నెరసాని పాట' లో కిన్నెర వైభవము వర్ణనా ప్రచురమైన తుది భాగమున పేర్కొనబడినది

కారుకారునకు, ఋతువు ఋతువునకు ప్రకృతి ఎట్లు వర్తిల్లెనో, కిన్నెర ఎట్లు ప్రవహించెనో, అందలి నీటిరంగు, రుచులెట్లు మారెనో ఇందు వర్ణితములు.

"ఋతువు ఋతువున మారు రుచులలో కిన్నెరా
కారు కారున మారు కాంతియు కిన్నెరా
తెలుగు సత్కవిరాజు పలుకిందుకోలేని
చవులూరి చవులూరి జలముల్ల ప్రోవులై
కదిలేను కిన్నెరా! సాగేను కిన్నెరా!

విశ్వనాథవారు సంస్కృతాంధ్రములకు చిలుకతల్లి, కోకిలమ్మలు కథకు ప్రతీకలనుగ చేసి "కోకిలమ్మ పెళ్లి" అను గేయకావ్యమును రచించినారు.

ఇందు కోకిలమ్మ కానరాక పోవుటచే అడవియంతయు చిన్నబోయినదనియు, ప్రకృతి అంతయు శోషించినదని వర్ణించినారు. వర్ష శరద్ధేమంత శిశిర ఋతువు లరుగగా, వసంతము సమీపించెను. చిగురుటాకులు తొడిగి లతావృక్షములు అడవినంతయు వికసింపచేసినవి. కోకిలమ్మ కమ్మని రాగాలాపన చేయగా ప్రకృతి వచ్చినదని సెలయేళ్ళు పొంగినవి. మావులు చిగురు తొడిగినవి ప్రకృతి అంతయు సంతసించి "కోకిలమ్మను పెళ్ళికూతురు చేయుదుమని" అనిరి. వారి పెండ్లికి చిగుళులు అడవి యందంతట తోరణములయినవి. సన్నని సెలయేట సన్నాయి పాడినది పూలసోనలు కురిసినవి. తేనెలపాటలు విరిసినవి.

ఈవిధముగా 'కోకిలమ్మ పెళ్ళి' కావ్యమంతయు మనోహరముగా, ఋతు వరముగా వర్ణింపబడి, ముత్యాల సరములలో సాగినది.

వానమామలై వరదాచార్యులు:-

'అభినవ పోతన' వానమామలై వరదాచార్యులవారి 'పోతన చరిత్రము' అను ప్రబంధమునందు ఋతు వర్ణనలు సందర్భోచితములై, రమణీయములై ఒప్పుచున్నవి. అతి దీర్ఘ వర్ణనలు కాకుండా, అత్యంత ఔచిత్యభాసురమై, సంగ్రహములై, ఇందలి ఋతు వర్ణనలు సహజములై విలసిల్లుచున్నవి. ఈకవి శిశిరమును తప్ప మిగిలిన వర్ణనల గావించినాడు.

పోతన 'శ్రీమదాంధ్ర మహాభాగవతము' రచన కుపక్రమించుటకు ముందు భాగవత సప్తాహమొనర్చెను. అది వసంతఋతువు. ప్రకృతి నవ్య శోభలతో ఆనందమును కలిగించు వాతావరణముతో మహాకావ్య రచనకు అనుకూలముగా నుండెను. అట్టి వసంతశోభను ( 6 - 3 )

"నవరసంబులఁ జిలుక- నవకావ్యము విధంబు
నవవత్సరాది తా నవతరించి
పంచాంగములు తరుపంచాంగముల యట్లు
జీర్ణ పత్రముల వర్జించి యొప్పె.

శుకపిక ద్విజము లోపిక శుకద్విజులటుల్
తరుణ భాగవత గీతములు పాడె
తోరణమ్ములయి లేమి తోరణమ్ములు సల్పి
పచ్చ పచ్చగ శాంతి పాదుకొల్పె

యువత కుసుమాయుధుని వలం జపిలి యాడె
నవిత ప్రకృతి కామినితో వసంత మాడె
కవిత నూతనాబ్దమునకు స్వాగతముఁ బాడె
నాడె కవివాణి తెరవీడి నాట్యమాడె"

మరియు "లక్షవత్తుల దీపవృక్ష దీధితుల హారతులిచ్చె కింశుక ప్రసవ వనిత" యనియు, కొమ్మలెల్ల సింగారించుకొని రహించి ప్రియ వసంతునిపైఁ బూలవృష్టి కురిసె" ననియు, వసంత శోభలు వెదజల్లు వృక్షములను వసంతుని కొమ్మలుగ చేసి కడు మనోజ్ఞముగ వర్ణించినాడు.

భూదేవి ఆయా ఋతువులలో చెందు మార్పులనుగూర్చి వివరించుచు

"శిశిరమ్ములోనఁ దన జీర్ణవస్త్రము లొల్చె
నల వసంతమున నూత్నలంకృతులు దాల్చె
కుసుమాకరునిఁ గూడుకొని యాడె భూమహిళ
నతి హృద్వికారము లె 'ఋతుషట్కమయ్యె' ననినాడు.

ఈ కవి గ్రీష్మఋతు ప్రభావమును నారయాదులు రాచకొండ కేగు సందర్భమున వర్ణించినారు. మండుటెండలకు మృగపక్షి వృక్ష జాలములు పొందే దురవస్థలను వర్ణించినాడు.

"చండకరుండు వహ్నికణజాలము దిక్కుల గ్రక్కసాగె
బ్రహ్మాండము తప్తభాండమయి యంటగరానటు క్రాగెడిన్"

వర్షాకాలమునందు విజృంభించిన మేఘములలో నొకటి :-

చలన్మహితేంద్ర నీల సన్మణికృత పాకశాసన విమానమునన్"
ఆకాశమున నెగసినది.

మరొకటి :- ఎప్పుడొక యింత యెండ కన్నెఱుగ నిట్టి మెఱపు దొరసాన
మబ్బుల కురులలోన సింగణి యను రంగుల పూలదండఁ
గీలించె" నట.

వేరొకటి :- ఇంతింతై వటుడింతయై" మేఘము ప్రజలకు భీతి కలుగునట్లు
విజృంభినదని చాల చక్కగ వర్ణించినారు.

పెనుగాలిచే మేఘవాహినులు చెల్లాచెదరైనవి దీనిని ప్రజలకు హానికరమై పార్జన్యముచేయు ప్రభుత్వము ప్రజల నిరుగుడాటుచేకోల్పోయినట్లు ఉపమానము చేర్చి వర్ణించినాడు.[1]

గాలివానవచ్చు సూచనను చూచి పోతన కొందర కొందరగా వరి కోయిం చుచు, పొలము వద్దనే ఉండిపోయెను. అతని భార్య నాథుడెంతకు రాని కారణ మున తానే బయల్వెదలి దుర్గాదేవికి భోజనమిడి, పోతనకు భోజనము నిచ్చుటకై పొలమునకు పోవుచుండెను. అంతట వర్షము ఆరంభించి కురియసాగెను. ఆమె తన ప్రియ సమాగమునకై దుర్గాదేవిని ప్రార్థించగా, 'అట్లే' అనినట్లు పక్షులు కలకల ధ్వనులు చేసెను. అదివిని ఆకాశము ఆనందబాష్పములు కురిసెనో యనునట్లు వర్ష బిందువులు రాలసాగెను. ఆ నీరు కొందరికి జీవమును, మరి కొందరికి అమృతమగునని తెలిపినారు.[2]

వాన వెలసిన విషయమును 'ఉటికి ఉటికి తాఁబడి పోవు నదని భాతి' వర్షము కురిసి వెలసినదట. ఆకాశము "మైల కడిగిన ముకురము పోల వెలిగినదట".

క్షామ మేర్పడిన ప్రదేశమున ప్రజల భాగ్యవశమున కురిసిన వర్ష మేఘ మును గూర్చి

---

1. కర్షక విషాద నిర్వాన ఖండ తండమేకమై చండ పవను
సమాకృతిగొని పీచెనన గాలితో మబ్బు విచ్చిపోవు
వర ప్రజాహిత పార్జన్య ప్రభుత యగుచు"

2. పోతన చరిత్ర వర్ణనలు :— సంచిక పేజి 117, 118.
డా॥ అందే వేంకటరాజము.

"ఎవనికై సింగణి నవరత్న ఖచిత సుస్వాగత ద్వారమై వదలనెఱయు" నను పద్యమున హృద్యముగ వర్ణింపబడినది.

హేమంతమున సింగభూపాల పసూపతిచేత భాగవతము ఉపహృత మగుటచేత పోతన విరాగియై ఇల్లు వెడలిపోయిన తరువాత సింగనృపతి పంపగా శ్రీనాథుడు జీర్ణ భాగవతమును తీసికొని బమ్మెరకు వచ్చెను. ఆ సందర్భమున శోభిల్లుచుండిన సంక్రాంతి వర్ణన :

దంపతుల విడగొట్టుటలో ధాత్రి జనము
లూరక మెండగొట్టెనటంచు నుడువు చంద్రు
దంపతుల గూడబెట్టుటలో ధరణి ప్రజలు
నౌర ! చలిపెట్టెనని వడకాడు చంద్రు 9-345

డా॥ సి. నారాయణ రెడ్డి :-

డా॥ సి. నారాయణ రెడ్డిగారి గేయ సంపుటిలో గ్రీ. సూర్య. వసంత, వర్ష ఋతు. వర్ణన విస్తారముగా కనిపించును.

'యౌవనం' ఈతని గేయ సంపుటిలో మొదటిది. ఇందు

యౌవనము జీవిత
స్యందనాగ్ర పతాక
యౌవనము ప్రణయవని
లో వసంతుని రాక !"

"మిసిమి జవ్వనము తో
కిసలాడు దంపతుల
కారు ఋతువుల అపూ
ర్వానంద హేతువులు" అనుట సహజవర్ణితము.

హేమంత విరహిణితో :—

"నేటి చలివేళ న
న్నేల విడిలించితివి
జాణతనమా సఖీ !"

అని అనునయముగా పలుకుచు :—

మన మనసునందు వె
ల్గుని ప్రణయ దీపికలు
మండి నన్నాళ్ళు హే
మంతమె వసంతమ్ము”

అని ప్రణయ సందేశము నిచ్చినాడు.

ఉపమాన సామాగ్రిగా ఋతువులను గ్రహించుట ఈతని ప్రత్యేకత.

“కష్టాలవలె ముసురు కారుమబ్బులు”
దుఃఖాలవలె జారు తుహినధారలు
పశువాంఛవలె రేగు శిశిరానిలము
పిరికితనం వారసత్వం లా
పిడుగు పిండులను కురిపించని జలధారలు
మంచు కోతలు లేని మంజు హేమంతాలు
శైశిర భయం లేని శాశ్వత వసంతాలు కాపు
రమ్మున్న లోకమ్ములో నివసింప” కోరుకొన్నాడు
కవిశేఖరుడు.

“వర్షాసుందరి” లో మేఘముల వర్ణించిన సందర్భములో :—

“కొదమ లేగలకు పాల్గుడుపగా పరుగెత్తు
నిండు పొదుగుల ఆల తండలట్లు
పర వాహినుల బదాబద లొనర్పగ సాగు
శర సముద్ధుర యోధ వరుల యట్లు
నిజమహోన్నత కుంభ నిక్షిప్త దానాంబు
గంభీర మత్తేభ గణము లట్లు
తొడిమవీడని పూల బిడియంపు బరువుతో
అడుగుమోపెడు కన్నెపడుచులట్లు

విరహిణీ పాండుర కపోల వీథులందు
జీరువారు నీలాలక శ్రేణులట్లు
సరస గమనాల తోడ నాషాడ మాస
వేళయందు కాదంబినుల్ వెడలనవిగో"

మరియు ఋతువుల గురించి ఈతని దృష్టిలో

"నిండు వసంతమ్ములోన
పండుటాకు లోక అందము"

శరత్తులో నింగి

"పరమ సాత్వికుని అంతః కరణములు పోలియున్నదట"

'మార్పు నా తీర్పు' అనే సంపుటిలో 'ఉదయం నా హృదయం' అను గేయములో తన తీర్పును

"శిశిరం నుండి వసంతానికి
చీకటినుండి ప్రభాతానికి
నిరాశ నుండి ఆశాశిఖరానికి
అశ్రు జలధి నుంచి ఆనంద తీరానికి"

నడిపించే "మార్పు-నేనిచ్చే తీర్పు" అంటూ విశ్వజనీన న్యాయమూర్తిలా ప్రకటించినాడు.

పలుకు పలుకున తేనెలొలికించు ఈతని గేయ సాహిత్యములో ఋతువర్ణనలు ముఖ్యస్థానము నలంకరించుకొన గలిగినవి.

ఉత్పల సత్యనారాయణాచార్య :—

ఉత్పల సత్యనారాయణాచార్య వసంతమును ఋతురాజ్ఞిగా చేసి, తన గేయములో స్వాగతము పలుకుచున్నాడు.

"అతి గహనమ్ము లైన" శత
శతాబ్ద పథాల నతిక్రమించి యీ
ఋతువు మోయిళ్ళలోఁ బరగు
లేత్తెడు పూలరథమ్ము మీద సు
స్మిత సుమనోజ్ఞ పై అధి వ
సించిన ఓ ఋతురాజ్ఞి! నీకు స్వా
గత మరుబమ్ము - రమ్ము
వనకారులఁ గుంకుమ పొళ్ళ దారులన్"

"శ్రమ పడినట్టి దొక్క- తరుజాలమె కాదు చరాచర ప్రపం
చము శిశిరమ్ము నందు నగుచాటులు పడ్డది రమ్మహో వసం
తమ ! సుమనో మనోజ్ఞ హారిదంతమ ! చెట్ల మొగాలపైని ము
చ్చెమటలు వోని యీ యువము చెమ్మల నద్ది సమాశ్వసింపుమా

"దివి కెగిరి పోవు ప్రతి రజోలవమునకును
ఆల వరింపుమ యీ భువనాభిలాష!
కన్నె ప్రాయంపు చిన్ని మొగ్గలకు నెల్ల
గఱపు మానవ జీవనా కలిత భాషా !"

బోయి భీమన్న :—

'ఏడవ ఋతువు' అను గేయమున కాంత ఏడవ ఋతువుగా వెలసినదని వర్ణించినాడు. ఒకవేళ కాంత లేవిచో ఆయా ఋతువుల ఫలము వృథాయగునని పేర్కొనుట వీరి గేయమున చూపబడినది.

"పూలు- తేటులు. కోకిలాలు రామన్నచో
మధువహాసపు కొడంద మండి ఎండియపోవు"

నవ్యసాహితి - వసంతగీతి - ఉత్పల పుట 170

"ఎలనీరు, గంధమ్ము వలిగాలి వీడుచో
వేసంగి బ్రతు కగ్గిమూస కాల్వలు కట్టు"
"పైరు పచ్చన లూడ్పు పాటలు లేనిచో
ఘన వర్ష మడవి గాసిన వెన్నెలే యౌను"
"నల్ల గల్వలు, రాజనాలు కాదన్నచోఁ
శారద మనికి మంచము పట్టి ముసుగిడును"
"బంతి సంక్రాంతి, దుప్పటియు లేకున్నచో
పుష్యమ్ము వలపు తలపులు రాలి మోడౌను"
"శివరాత్రి వేకువలు చవులూరకున్నచో
శిశిర మూశలు మారి చివురు మంటలు గూలు"
"ఆరు ఋతువులకున్న ఆపదల తొలగించి,
ఆరు ఋతువుల శోభలందుకొని ధరియించి,
ఆరు ఋతువుల జీవి తానంద ఫలమవై
కాంత! ఏడవ ఋతువుగా వెలసినావహో!

ఋతువర్ణనము వంద భీమన్న చేసిన ఒక వినూత్నమైన ప్రయోగమునకి ఉదాహృతి.

దాశరథి :

'జలద సరస్వతి'లో గ్రీష్మమును అతి సహజముగా వర్ణించినాడు జనుఁ

"ఆకసము జూచినంత గ్రీష్మ తపాది
భీకరంబయి గుండియ దాక మండు
లోకమెల్ల పయోధరా లోకనార్థి
శీకర స్నాన సౌఖ్య మాశించు నేడు"

వర్ష ఋతువు :-

మేఘము కనబడగానే కవి ఉల్లమునందు వార్షుక పయోధర ఘోషవిని నాట్యమాడినదట. ఆ మేఘము పశ్చిమ సముద్ర కరముగాని వచ్చుచున్నదట.

"అదిగో! పశ్చిమ వార్ధి సాచిన
కరంబై మేఘమే వచ్చుచు
న్నది, మార్తాండుని చేయి పట్టుకొని
పంతం బార కొంపోవుచు
న్నది గ్రీష్మాతప తప్యమాన జన
చింతా స్వాంతముల్ శాంతిలున్
గద! నీలాంబుధర ప్రమోదకర
తద్గర్జా నినాదమ్ములన్"

ఆ జలదములను,

"చేజేయి కలిపి పచ్చిక బయళ్ళ చరించు
నూత్న దంపతి యయ్యె నొక్క మబ్బు
విరహ బాధార్త తరుణియై తలవంచి
కన్నీరు నించె నొక్క జలదంబు
స్నానమాడుటకై నదికేగి నీరాడి
చనుదెంచు తన్వియౌఱాజ నొక మేఘ
మాలింగనార్థినియై బాహువులు సాచి
ఉరికి వచ్చెడు కాంత ఒక్క మెయిలు
నేనెనై మిన్ను దారుల నిలుచు నొకటి
తానయై వ్యోమ భాగాన తిరుగు నొకటి
విడివడిన ప్రేయసీ ముఖ బింబమూని
ప్రక్క ప్రక్కన నిలుచుండ వచ్చు నొకటి"

ఆ విధముగా మేఘములు ఆకాశమున వనదారులలో పయనిస్తున్నావట.

దాశరథి గారికి మబ్బు పంచభూతమయమగుటచేత అమోఘమైన ప్రీతి గలదట.

"అంతేగాక దాన నలరారు కరుణమ్ము
గుండెకంటి నీటి కుండ గాగ
మబ్బులోన విందు మదవతీ పాద
మంజీర యుగ జ మంజు శింజితమ్ము
మబ్బులోన కందు మానినీ నయనాంత
గళిత భాష్పబిందు కణగణమ్ము

మూగ వాని నోట రాగాలు పాడించ
ఇసుక నేలలందు మిసిమి నించ
సాగి వచ్చె నేడు జలద సరస్వతి
కాళ్ళ హంసకములు గల్లు మనగ"

అనుచు 'జలద సరస్వతి'ని[1] రావించినాడు.

'తామసి' యందు దాశరథిగారు వసంత మవతరించుటను[2]

"ఇరులు కోకిలములై ఎచ్చటకూయునో
అచ్చోట ఆమని అవతరించు
ఇరులు తుమ్మెదలుగా ఏ వేళ మ్రోగునో
ఆ వేళల వసంత మూగ మించు

అని చక్కని వర్ణన గావించినారు.

---

1 నవ్యసాహితి - జలద సరస్వతి - దాశరథి పేజి : 74
2 ,, - తామసి దాశరథి పేజి : 77

# ఋతు సంహారము

విశ్వనాథ :-

విశ్వనాథ సత్యనారాయణగారి 'ఋతు సంహారము' ఆరు ఋతువుల వర్ణనమును సంతరించుకొనిన తెలుగుకావ్యము. దీనికి 'తెలుగు ఋతువులు' అను నామాంతరము. ప్రత్యేకముగా తెలుగుదేశమునందలి ఋతువులు, చేతనాచేతనములైన ప్రకృతి కన్నులకు కట్టినట్లుగా వర్ణింపబడుటచేత ఈ కావ్యమునకు 'తెలుగు ఋతువు' లను పేరు సార్థకమైనది. ఇది తెలుగున గల ఋతుకావ్యములలో ప్రథమమైనది.

ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నింటిని ఆపోశనముపట్టిన అపర ఆగస్త్యుడు విశ్వనాథ. ఆధునికాంధ్ర సాహితీరంగములో 'కళాప్రపూర్ణ', 'కవి సమ్రాట్', 'పద్మభూషణ' బిరుదములనందిన ధీశాలి. బహుముఖ ప్రజ్ఞాశాలి. ఈతడు గీర్వాణాంధ్ర భాషలలో నిష్ణాతుడు. ఈతని సాహిత్యసృష్టి సహృదయ లోకమునకు ఆనందానుభూతులతోపాటు విజ్ఞాన వివేకముల గలిగించును.

కాళిదాసు చేసిన వర్ణనలు ప్రాయకమున కవి సమయానుగుణములై కవులకు మార్గదర్శకములైన మాట సత్యమే. అయినను కాళిదాసీ సంస్కృత ఋతుసంహారమునకు విశ్వనాథ తెలుగు 'ఋతు సంహారమం' నకు వర్ణనల యందు ఎట్టి సామ్యము కనిపించక స్వతంత్ర రచనగా గోచరించును.

విశ్వనాథ కవి ఈ కావ్యమును కట్టమంచి రామలింగారెడ్డికి అంకితము చేయుచు,

> జయంతి తాస్తా అతి కాళిదాస
> త్రిలింగ భాషాకృతి నిర్ఘణ్యాః
> పయస్య మాశ్లిష్ట సరోజమాలా
> సుధా చయసాం రస రాజధానిః" అని వ్రాసినాడు

తెలుగుభాషపై అభిమానముతో పాటు ఋతువర్ణనమున స్వీయనైపుణ్యము 'అతికాళిదాస' మను ఆత్మప్రత్యయము కూడ నున్నది.

కాళిదాసు 'ఋతుసంహారం' కావ్యమును గ్రీష్మముతో ఆరంభింపగా, విశ్వనాథ, కావ్యమును వసంతముతో ప్రారంభించినాడు.

విశ్వనాథ సత్యనారాయణ 'ఋతుసంహారము' లో వసంతాగమనమును ప్రకృతి రమణీయముగ వర్ణించినాడు. ఆయనకు కలిగిన మధురోహలో ప్రియురాలి పదచెమరింత, మల్లె మొగ్గలు, వేపపూత, కోకిల స్వనములు, చోటుచేసుకొనుట కలదు. వీని వర్ణన కవి ప్రతిభకు నికశోపలములు. సుమసుకుమార మూర్తియగు వసంతుడు మహారాజ వైభవముతో నొప్పుచున్న 'ఋతురాట్సభానల కుమారుని' వలె ఏతెంచినాడని వర్ణించినాడు. ఇందు "శిశిర హేమంత శుచి శరత్సేవ్యమానుడు వసంతుడు" అనుటను బట్టి వసంతమున ఒక వర్షఋతువు తప్ప మిగిలిన నాలుగు ఋతువుల లక్షణములు గోచరించుచున్నవి. ఇట్లు గోచరించుటలో కాళిదాసు మరియు ఎఱ్ఱనల ఛాయలు కనిపించుచున్నవి వసంత వనాంతర వీధులందు 'నూత్న యౌవనోద్వేగవేగి యనుచు కోకిలమ్మ తన పెంజిగురై ఆమ్రకిసలయములను ముక్కున చిదుముచుండుటలో కవివర్ణన మనోహరము.

ఋతువర్ణనల నెపమున తెలుగునేలలోని వనములలో తోటమాలి చేయు పనులను కన్నులకు కట్టినట్లుగా వర్ణించినాడు. నారికేళముల పూతిరాలకుండ నిలుచుటకై గొడ్డలిచే కాట్లు పెట్టుట, మల్లెపాదులలో గండుచీమలు చేరకుండ వెల్లికచ్చికల బూది చల్లుట, బత్తాయి మొదలగు ఫలవృక్షముల కాపు చెడకుండా చూచుట, పండి పగిలిన పనసలను భద్రపరచుటవంటి వ్యవసాయ కృత్యముల ద్వారా దుక్కిదున్ని బ్రతుకు రైతులను గూర్చి తనకు గల అవగాహనను చాటుకొని ఇతరులకు ఈ విషయమున మార్గదర్శకులైనారు.

గ్రీష్మాగమమును, దాని ప్రతాపమును వర్ణించుచు,

"గ్రీష్మ మరుదెంచి తన ప్రతాపోష్మమురలి
కలిమి యధికార మప్పుడు తేగలుగువారి
గ్రొత్త రుచులకు మఱగించు కొంచు నేలు
బడిని సాగించెఁ బెఱ జగముడుక బెట్టి" అని

ప్రపంచమునే తపింపజేయు గ్రీష్మమున గడుసు వడగాలులను, మామిడిపండ్ల అధిక ధరలను, చలువచేయు నూలు వస్త్రముల అవశ్యకతలను గూర్చి తెలిపినాడు.

దప్పిగలవారిని గ్రీష్మము తన ప్రతాపముచేత రొప్పించి, ఎండమావుల లోను నీళ్లు కలవను భ్రమను కలిగించి, యీడ్చుకొనివెళ్ళి, నాలుక పిడచ కట్టించుననుటయు. చల్లని వెన్నెల సొరలను ఆవిరిపెట్టుచున్నాడనియు, వచించు టలో ప్రధమ అవతారమూర్తియగు గ్రీష్ముడు, మొదట ప్రజలను నిస్సహాయుల చేసి, తపింపజేసి, తాను పడమటిగాలులతో కూడి అధికముగా మండు చున్నాడని వర్ణించుట గ్రీష్మము యొక్క సహజ స్వభావము ఉట్టిపడుచున్నది. గ్రీష్మోష్ణతకు బ్రహ్మాదండిమోళ్లు ముండ్లగుట, జిల్లేడుకాయలు పగిలి ప్రత్తి గాలికి లేచుట, గటికలు ఎండి సూదులవలె గ్రుచ్చుట, సుడిగాలులకు దుమ్మెగసి మొగమాచి కొట్టుట, సర్వము ఎండిపోవుట వంటి వర్ణనలు గ్రీష్మప్రతాప వహ్నికి చిహ్నములుగా చెప్పుట కవి సూక్ష్మ పరిశీలనమునకు తార్కాణములు

గ్రీష్మ తప్తులైన జనుల తాపనివారణార్థమై అకాశమున మేఘములు ముసరికొనివచ్చి తెలుగునేలను ముట్టడించినవని కవి వర్షారంభమున సూచించి నాడు. వర్షించు మేఘములు బాగా గర్జించుచు, భయంకరములైన అశనిపాతము లతో, ప్రౌఢధారలతో, నీలనమ్రస్నిగ్ధములై భాసించుచున్నవను విషయమున కవి ప్రతిభ అనన్య సామాన్యము. పొట్ల, చిక్కుడు, బీర మున్నగు కాయలు, ఆరుద్ర పురుగులు, కుక్కగొడుగులు, ఇంద్రధనుస్సు ఈ కాలమున కనబడును.

వర్షఋతువు "ఈ నవాంభోద ఋతువు మహేమొ వాల హృదయములకు నానందమందిచ్చునట్లు" వచ్చినదని కవి తెలిపినాడు.

సస్యలక్ష్మి శరదృతువున బంగారు వన్నె దాల్చినది. వైడూర్య శకల ములు కుప్పగా పోసినట్లు సస్యలక్ష్మి చూపరుల ఊహలకు సొగసు నాపాదించు చున్నవి. చెరువులోని నీరు గాలికి ఒడ్డుల నొరసికొనుట, గొడ్లగిట్టల గుర్తులతో బురద ఎండి బిగుసుకొనిపోవుట వంటి సహజ సౌందర్య వర్ణనలిందు కలవు. కొత్తిమీరచేలు, జొన్నచేలు, దోసపండ్లు, మిరపపండ్లు, పొగాకు, సెనగ తోటలు, బంతిపూలు మొదలగునవి కలిగి "శరదృతువు సమస్తమును ప్రదర్శ

నను వేసే గూడిమెట్టపొలాల వికసించెన్మ్మ్" అనుట కవిగారి పల్లె ప్రకృతి పరిశీలనా పాటవమును తెలుపుచున్నది. వానలు వెనుకపట్టును. చేమంతి రోలి పొరిగ మొగ్గ తొడుగును. ఏనాకుల అరచేమొవ్వ అందగించును. సాయం కాలపు గాలులు చిరుచలితో పరాచికములాడును. జిలుగువెన్నెలలు బాలచంద్ర రేఖ, సర్వము శరచ్చంద్రిక శోభను ప్రకటించుచున్నవి. శరదృతువునందు శివుని తలపైని గంగలోని తెల్లని మంచు క్రాగి శరీరమున ప్రవాహములుగ మారినట్లు, అర్ధశరీరమున పార్వతిని గూడియుండుటచేత చెమట క్రమ్మినట్లు, చంద్రుని మన్నించుటకు చంద్రకాంత రూపమును ధరించునట్లు, తన భక్తులకు ఎండ తగులకుండ చలువనొంచుటకై మంచుగడ్డగ తానే మారినట్లు అన్న పూర్ణాంబికా సమేతుడైన శివుడు నందమూరున నిత్యాభిషేకములు కొనువాడై ప్రకాశించినాడని విశ్వనాథకవి శరత్తును స్వగ్రామమున వెలసిన విశ్వనాథునకి అన్వయింపచేయుట అపూర్వము.

హేమంతఋతువున హిమముచే కప్పబడిన పకృతి వెలుగులకై వెదుకు లాడును మంచుతుంపర నలుదిక్కుల అలముకొనును. ప్రశాంతమైన వేళలో హేమంత కాంత ప్రాతచీర విడుచుటకు ముందే హిమమున స్నానమాడినట్లు, ఆకురాల్చిన చెట్లు అందమును, కళ్లములు, ధాన్యపుగింజలతో ముత్యాలముగ్గులు తీర్చినట్లలరారునను విషయమున కవి వర్ణనానైపుణ్యము అత్యంత సహజము. హేమంతమందలి మంచుబిందువుల సొగసును వర్ణించు సందర్భము అతి సుంద రము. ఒక మంచుబిందువు గుమ్మడిపూవులోబడి కులుకుచున్నదనియు, ఇంకొకటి చూడనొసగుట ఆడుచున్నదనియు కవి వర్ణించిన తీరు అద్భుతము. మరికొన్ని మంచు బిందువులు పూవు పూవున మసలుచున్నదనియు, ఆకు ఆకున జారుచున్న దనియు, వర్ణించుట కవి సూక్ష్మపరిశీలనమునకు భావనకు నూత్నోపద ప్రయో గమునకు పరమోదాహరణములని చెప్పవచ్చును. మారాకులు వేసిన తమలపాకుల తీవలు వెన్నువదలిన వెలకు పైపై, మంచుకొండమీది ఆడపడచులు ఆశకొలది అలంకరించుకొనిన భూషణములవలె సొరపూలు, చంపసరాలు, గడ్డిపూలు, అందగించినవని కవి వర్ణించినాడు. చేపలు బురదలో చిక్కుకొని గిలగిల కొట్టు కొనుచుండగ కొంగలు తమ దొంగజపమునకు స్వస్తిచెప్పి వాటిని పట్టి భక్షించు చున్నవనుట స్వభావ సిద్ధాంతము. పగళ్ళు ఎండలచే మాడ్చి, రాత్రులు మంచుచే తడిపి వెచ్చ పచ్చిగ విశ్వమెల్ల వేగుటచే

"భూత మాగామియగు ఋతు పూర్వరూపమెల్ల
తనకడుపులోన దాచి వచ్చినదో ఋతువు" అను

మాటను సార్థకము చేయుచున్నవి. మంచు కురియుటచేత పచ్చదనము కలిగిన మెట్ట పంటలు లేనిచో మండు ఎండలు హేమంతమును గ్రీష్మముగ చేయుచుండునని కవి ఒక ఋతువును ఇంకొక ఋతువునందు ఆరోపించినాడు.

విశ్వనాథ 'ఋతు సంహారము'న మానవ జీవితములపై బడు ఋతు ప్రభావమును, జీవన సరళిని, ఆచార వ్యవహారములను సహజముగ వర్ణించినాడు

వసంతఋతువున జనులు వట్టివేళ్ళను పానీయముగను, గంధపుపొళ్ళను పైపూతగను, సన్న చీరలను నీవస్త్రమునకును, తాప నివారణార్థమై ఉపయోగించుకొనినను, అవి ఇంకను తాపకరములగనే పరిణమించుచుండునని తెలిపినాడు. గ్రీష్మమునందు ఉదయమున ఒడలు చితచితలాడునట్లుండును. మిట్టమధ్యాహ్న వేడిమి మండు నిప్పుకణము చేతితో తాకినట్లుండును. సాయంసమయమున ఎదురెండ వలన కొట్టినపుడు 'గూబగుయ్య' మనినట్లుండును. పగలు దీర్ఘమై ప్రపంచములోని సర్వస్వమును పట్టుకొనునని జనులు పడు బాధలను చక్కగ నిత్యానుభవములుగ కవి వర్ణించినాడు వృద్ధ భూసురులు వైశాఖ "పూటలచేత తృప్తులగుచు గృహస్థుల వితర్దికలు వదలి ఇండ్లను చేర నడచుచుందురు. వారి వేషధారణలను కవి జీవిత సరళిని ప్రతిబింబింపచేసినాడు. మెడయందు రుద్రాక్షపూసలదండ, బాగుగా ఉబ్బిన ఉదరములు కరములు, ఉరములు, గంధలేపనము, వామహస్తమునందు తాటాకువీవనలు, తాంబూల దక్షిణలు పట్టుకొనినవారును, పానకపు త్రేన్పులు తీయుచు, మందగమనములతో రొంపియందు దోపికొనిన బొబ్బిలి యీ వెండికట్లు పొడుముకాయలతోను, అలంకరింపబడినారు. వర్షాకాలమున నిత్యాగ్నిహోత్రులయిన సోమయాజులు అగ్నిహోత్రములోకి పోకుండ చూచుకొందురు. వారు వానకాలమున సరిగా తడియారని అంగవస్త్రములను కట్టుకొని, నల్లని విభూతిని ఫాలమున ధరించెదరు. అగ్ని ఆరిపోయినచో ప్రత్యవాయము కలుగునను భీతిచే అడుగున విస్ఫులింగాకృతినున్న మూడగ్నులకు చేయిని అడ్డముగా పెట్టి ఊది, జ్వాలచేసి, అగ్నికర్మకు ఆటంకము కలుగకుండ చేసికొందురు. ఇది సోమయాజులకు పరీక్షా సాధనము.

“సాడు వోవ నీడు సోమూసెపైడికీ
ఋతువసంగ నికష దృషదమట్లు”

శీతకాలమున చలిబాధ అధికముగా నున్నను, నిష్ఠాపరులు ఉషఃకాలమందు నిర్భయముగ స్నానము చేయుదురు. అట్టివారికి చలిబెదరి గుండియలు జారి చదికిలబడినవట. శిశిరమున చలికి అధరములు పగులుటయు, శరీరము వణకుటయు జరుగును. ఈనిన పాడియావుకు దాని దూడకు చేయుపరిచర్యలను గూర్చి కవి చక్కని వర్ణన కావించినాడు. పసిదూడగిట్టలు వచ్చి ఆరకముందే గిల్లుట, ప్రత్తిగింజలు, ప్రాతవడ్లు బాలెంత ఆవులకు పెట్టుట, మావిని తీయనీయకుండ చూచుట వంటివి పంటకాపు చేయుపనులు.

భాద్రపద బహుళ పక్షమున పితరులకు తర్పణములు విడుతురు. పితృదేవతలు మహాలయ పక్షములందు ఇలకు దిగివత్తురను నమ్మకముతో చేయు కర్మకాండనుకూడ వివరించి తెలుగువారి ధార్మిక ప్రవృత్తిని అభివర్ణించినాడు.

ఋతుప్రభావములు పిల్లలపైనే ఎక్కువగా కనిపించును. గ్రీష్మమమున సెగగడ్డలు, వడగడ్డలు, పొటమరించి, బాధను కలుగజేయును. బాలగుంద్రని మొగము గదువచివర వేసిన సెగగడ్డ కారణముగ కోలబారినది. వడగాలులకు శరీరము కృశించినను, అందముగనే కనిపించునట. పిల్లలు వాననీటిలో వేయు కాగితపు పడవలతోను, పొలములోనున్న ఎండ్రకాయలను, తేళ్ళను, మండ్ర గబ్బలను, పట్టి తలక్రిందులుగా వేసి కడుపుడిప్పను తెరచి వానిపిల్లలను ఏమి చేయకుండ పెంల తలుపులను మూసి తాటిచెట్టుమీద వదలుచు ఆడుకొను చుండిరని కని వినూత్న క్రీడలను తొలిసారిగ తెలుగు కావ్యములందు వర్ణించినాడు.

విశ్వనాథ ‘ఋతుసంహారమున’ పెండ్లి సంబరము వర్ణింపబడుట వలన తెలుగు దేశమునందలి ఆచార వ్యవహారములు వ్యక్తములు.

ఉరము గంధముతోడ నుదికిన పాగతో
వేంచేసి నీటుగాఁ బెండ్లి పెద్ద,
గుభుల్మ తప్పెటలతోఁ గొమ్ము బూరాలతో
నెలగోలు మేళమ్ము లేగుదెంచె

గొడుగు నీడలతోడఁ గుచ్చు చెప్పులతోడ
నడచి వచ్చిరి పెండ్లికొడుకు మడతి
ముంత కొప్పులతోడ వింత గంధములతోడ
వెడలిరి నవ్వుల పేరటాండ్రు
పిన్నపాలెగాని పెండ్లి యూరేగింపు
సాగుదెంచె రెండు జాములపుడు
అరుగు పైని నిడిన యాకు వక్కలు గొంచు
వీధి యెల్ల నొజ్జ విరిగిపోయె''

కవి క్రిమికీటకాదులను, పశుపక్ష్యాదులపైబడు ప్రభావమును, ఋతు సంహారమును వర్ణించినాడు.

వసంతమున పకృతి వర్ణనముల యందే కోకిల చోటు చేసికొనినది. పశు పక్ష్యాదులపై గీష్మ ప్రతాపము అల్ప ప్రాణులపై పరమావధి కారి ప్రవర్తనను తలపించుచున్నదట. గొంతు క్రిందిభాగమును గుడగుడ లాడించుచు, కాకి తను తృష్ణను తెలియజేయుట ప్రక్కనుండి పోవు చీమలబారును చూడకుండ తొండ నిక్కి తలవాల్చి సొలయుచుండుట, పందిటిలో కావలాకాయు కుక్క పడుకొనుచు లేచుచు, నాలుక రొప్పించు చొంగజార్చుచుండుట, ప్రక్కనున్న గడ్డిపరకలను కొరకక ప్రక్కసరిగ కుదరని దూడబట్టు వదలచుండుట, నల్లి కండ్లపాము సుక్కి నిలిచిపోవుట మటి వర్ణనలు ఆశ్చర్యమున ముంచెత్తు స్వభావోక్త్యలంకారములు.

వర్షకాలమున వాన దిక్కునుండి ఒక పాతాళ వాయువు వీవగనే మోకలు వంచి, తోకలు ఎగనెత్తి, లేగదూడలు పరువులెత్తును. అల్ప జంతువులు భయపడ అరచిపేవును. మాధుర్యదేవత మరణ వేదనచే మూల్గువిధమున బావురు కప్పలు అరుచును. అభ్రము బలాకలకు రత్యదభ్రిమయ్యె" నను వర్ణన సహజము.

శరత్కాల ప్రవేశమున కొల్లేటి సరస్సుల నుండి సహస్ర సంఖ్యలో కొంగలు మాలాబద్ధములుగ వచ్చి మళ్ళలో విడిచిన దృశ్యము అత్యంత మనోహరము.

హేమంతమున ప్రశాంత వేళలో కురిసిన మంచుచేత పొలములో కట్టి వేసిన ముసలి ఎద్దు నిలిచి, చెవులూపి తలవిదిల్చిన విధము శరత్ప్రభావమును తెలియజేయుచున్నది. శిశిరఋతువున చలిప్రభావము కూడ పశువులపై కని పించును. ఆవుదూడ కుడితి త్రాగకుండుట, ముడుచుకొని మునికాళ్ళతో ముద్దై నిద్రించుట, సహజ వర్ణనను నిపించుకొనినది. చలికి పాడిబర్రియ చనులు పగిలి యుండుటచేత దాదతో పాలు పిదుకనీయుటలేదు. అట్టుపగిలి యుండుటచేత రొంపి దుక్కికి అనువుగాలేదు. ఈ శిశిర వర్ణనలో పశువులు పడు బాధను కవికడు ఆర్ద్రముగ వర్ణించినాడు.

విశ్వనాథ వారి కావ్యమున తెలుగునాటగల ప్రజాజీవనమును, ప్రకృతి సౌందర్యములను ఆయా ఋతువుల యందు కలుగు పరివర్తనములను పరిశీలించి, స్వభావ సిద్ధముగా వర్ణించినాడు. మొదట ఇవి ఈతని 'కిన్నెరసాని; కోకిలమ్మ పెళ్ళి" వంటి ఇతర కావ్యముగ వెలయింప జేయుటకు దోహదములైనవి. మరియు పల్లెల శోభ ప్రకృతి అందము.ఇతనికి ప్రేరణ కలుగుటకు ప్రధానకార ణములైనవి.

ఋతు సంహార గ్రంథ ప్రస్తావన చేయుచు ఆత్మకథ"లో విశ్వనాథ వారే యిట్లు వ్రాసిరి.

"ఇంతకు నేను చెప్పవలసినదేమనగా నా చిన్ననాటి మా యూరిలోని ప్రకృతిశోభ నా గ్రంథములనిండ వ్రాసితిననుట, ఎన్నియో వ్రాసితిని. మాగాణి పల్లెటూళ్ళయొక్క, మెట్టపల్లెటూళ్ళయొక్క, ఒక చిత్రమైన శోభ, మాయూరు నాయందు దయతో చూపించిన శోభ నా గ్రంథమును యందంతట నుండునని చెప్పుటకు మాత్రమే యిది."

ఈ కావ్యముపరాశ్రయ కవితారీతికి చెందినవి. కవి ఆత్మానుభూతిని వ్యక్తిగతముగ చెప్పుకొనక తెలుగు జాతితో తాదాత్మ్యమును పొంది వెల యించిన కావ్యముగా ఋతుసంహారమవతరించినది.

విశ్వనాథ 'ఋతుసంహారము' నందు ఉపమ ఉత్ప్రేక్ష, శ్లేష, భ్రాంతిమద లంకారము అధికముగా కనిపించును. మనోహరములయిన అర్థాలంకారములకు ఈ కావ్యము గని వంటిది. అలంకారములేని ఒక్కపాదముకూడ ఈ కావ్యమున

కానరాదు. ఈ కావ్యమునందలి అలంకారములు ఎత్తిచూపుట అనగా కదలినుండి కెరటాలను తీసి చూపుటవంటిది. అయినను నేను కొన్నింటిని ఇట పేర్కొనుటకు ప్రయత్నింతును. వసంత ఋతువర్ణనమున

"సిరియుగాచిన పండ్ల బరువుచే ... ..." అను

పద్యమునందు ఉపమాలంకృతములైన విశేషములున్నవి. "కోకిల జిగిగొంతు కోలెత్తి ప్రలపించె వనవీధి, భార్యాప్రవాసి వోలె" "బ్రదికి చెడినవాని చిదుకు గుండియల వోలె నేలయెండ బగిలి నెఱియలు బడె" అనియు.

వర్షఋతువునందు ఆకసమున కనిపించు మేఘములు
కదలిగముల కట్లు గజములెలుగుబంట్లు
కారెను బోతుల కరణిఁ గదలు
మెరసి కుప్యద్వ్యాఘ్రములు మహాజంతుసమూహమును
శతఘ్నులవోలె మెఱయు" ననియు

ఉపమానింపబడినది.

గ్రీష్మమున "ఆకాశమును భూమి యగ్ని పత్రము వ్రాస
కొన్నట్లు సుడిగాలి మన్నురేగె" నని

ఉత్ప్రేక్షించుట నవ్యము.

గ్రీష్మరాజు రాక ఉత్ప్రేక్షాలంకార వర్ణితములు

సాగివచ్చిన నీదచ్చులమున యజ్ఞోపవీతముల్ తాల్చిన
వేదమూర్తి

"మృగశిరకార్తెకు మొగిల్ సోకుదుప్పటి కప్పుకొన్నట్టి
భావసిద్ధుడు"

"క్షేత్రేందిరకు నాగేటికట్టు పెకల్చి పదను తెచ్చినయట్టి
పాకయాజి"

"శివి వెలయించి జాలిగుండియను బైకిఁగానరానీని దొరవోలె
జదలివచ్చె" నట

హేమంత ఋతువు ప్రారంభము కాగా రావోవు శిశిరఋతుభయముచేత ప్రకృతికాంత జమిలిదుప్పటి కప్పుకొనినట్లు, ఆకాశమనే నల్లని త్రాచు తెల్లవారగనే కుబుసమూడ్చినట్లు, చంద్రుని చల్లని తెల్లని సుధారాల్చినట్లు తెలిమొగిళ్ళు రాలిపడినట్లు తెలుగునేల నలుదెసల అలముకొనిన హిమమును కవి చక్కగా ఉత్ప్రేక్షించినారు. తెల్లవారుజామున ముగ్గులు పెట్టు కన్నె ముత్తైదువ మంచు కొంచక అడుగిడ్డవలెను. పశువులను తోలుకొని వెడలు రైతు అద్రిరాజు పాలికాపు వలెను. కాపులపనిగిత్త నందీశుని ఊహించి, నిత్యము మంచు కురియుచుండుట చేత హిమశైలరాజు సపరివారముగ దక్షిణాపథమునకు వలసవచ్చెనో యేమో! అని ఊహించుట కవి భావనాశక్తికి నిదర్శనమై అలరారుచున్నది.

హేమంత ఋతువున కనబడు ధూమ వహ్నులు, తుషారములు వర్షకార్యముల కలిమి కలిగి యుండుటచేత, మూరపగనున్న సర్వ వస్తువులు

"రజ్జు భుజంగమ భ్రాంతి" కలుగుచున్నవని అలంకరింపబడినవి. వసంత ఋతువున కలుగు తెల్లని మల్లెలను శ్లేషార్థమున వర్ణించు సందర్భమున

"దీప్తి నాఘూర్ణ్యావధి శిరస్సుధాంశు భా
　　స్వన్మనోహార విలసితమ్ములగుచు,
క్లిష్ట బంధ విచిత్ర కేళీ ప్రశస్తి ర
　　హః కళా పూర్ణోదయమ్ము లగుచు,
కృష్ణ పదాగ్ర భక్తి సుగృహీతాముక్త
　　మాల్యదాచ్ఛప్రౌఢ మధువు లగుచు,
అనితర లభ్య సజ్ఞాత్త శయ్యా హేతు
　　వై పాండురంగ మహత్తులగుచు,

దీయదనములు మెఱుఁగులుఁ బెచ్చుకొన్న
ప్రియులు ప్రియులు కూడి మనుచరిత్రలగుచుఁ
వెలుగు రసిక లోకముల కందిచ్చె నసువు
లత్తుకొని మల్లెపూలే క్రొత్త క్రొత్త రుచులు"

ఇందు తెల్లని మల్లెపూల నొకవైపు. తెలుగు రసికలోకములో కావ్య విషయ ప్రాముఖ్యముతో మరొకవైపు సహజస్ఫూర్తిపడు కాంతులతోను, శ్లేషలో వర్ణించుటయే ఈ కవి రామరాజభూషణుని తలపింపజేయుచున్నాడు.

ఈ కావ్యమునందలి పద్యములు అలవోకగా చదివినవారికి తమ సౌంద ర్యమును కనిపించనీయవు. ఒక్కొక్క పద్యమును పలుమార్లు చదివి, అందు వర్ణితమైన ప్రకృతితో ఏకీభావమును పొందినప్పుడే సామరస్యము బయలు పడును. సారస్యము బయలుపడిన తర్వాత పద్యము హృద్యమగును. పరిపూర్ణ సౌందర్యముతో పరితలముందు పొడకట్టును. విశ్వనాథవారేకాదు. శాస్త్రములను బాగుగా చదువుకొని వైదుష్యమును సంపాదించిన ప్రాజ్ఞులయిన కవులందరి రచనల యందును ఇదే పరిస్థితి. విశ్వనాథ వారు విద్వత్కవులు. కొంత సంస్కార మున్న సహృదయులకే ఆయన కవిత్వము ఆస్వాదనీయము. ఋతు సంహార కావ్యము పరిమాణమున చినదైనను, గుణమున ఆ మహాకవి ప్రతిభకు ఉపజ్ఞకు ప్రతీకగా నిలుచుచున్నది.

విశ్వనాథ 'ఋతు సంహారము' నందు సంస్కృత సమాస భూయిష్ఠములైన పదములతో బాటు చక్కని తెలుగుమాటల మేలికలయికలు కూడ కనిపించు చుండును. ఇందు లోకోక్తులు, జాతీయములు కలిగియుండి కావ్య ప్రతిభను ఇను ముడింప జేయుచున్నవి.

గ్రీష్మమున ఒక బాల సెగగడ్డలతో మొగము కోలపారి, కనురెప్పం కొస చూపులు వెలార్చినను, ఆమె అందమొప్పుచున్న సందర్భమున

"అందమగు చోట నందమ్మె యదును. సర్వము" అను కవికుల గురువు మాట ననువదించినాడు.

వర్షఋతువు నందు బాల బాలికలు 'ఎండవాన, కలసినవేళలో ఎండవాన కుక్కనక్కల పెళ్ళి" అని కేకలిడుచు ఆడుకొనుచుండుటను

"శ్వ సృంగాలములకును వాన వల్లప్పలో
నెండ వానల పెండ్లి యేరు పడియె"

నను విషయములో సామెతగా పేర్కొనినాడు.

వర్షాకాల ప్రకృతిని సహజ సుందరముగ, చక్కని లోకోక్తులతో వర్ణించినాడు.

“కన్ను గొట్టిన వారి వెసరాల గొట్టుచు
న్నట్లు మేఘుడు హేలి కడ్డు వచ్చె”

శాస్త్ర ప్రసిద్ధుఁడైన ఋతురాజు హేమంతమున ధూమము వహ్ని. రెండును కలిగియుండుట చేత.

‘యత్ర ధూమము వహ్ని తత్ర’ యను శాస్త్రోక్తిని తలపింపజేయుట కడు సమంజసము.

సమకాలిక సమస్యలు గ్రీష్మ ఋతువున సాధారణముగా వస్తువులు అగ్ని ప్రమాదములకు గురియై తీరని నష్టము కలుగు చుండునను. విషయమును కవి సృష్టి చేసినాడు.

“దణ్ణెమ్ము పైని వస్త్రము కొంగు జారి క్రిం
దను నంటుకొన్నది దాలి సెగకు,
దొడ్డిలోఁ బొయ్యార్పి, తొలగ, నెక్కడ రవ్వ
మిగిలి, పెన్గాలికి రగిలి యెగిరె
దూలమ్మునకుఁ ద్రాఁట ప్రేలనైన పలుపు
గట్టు నులక దివ్వె ముట్టుకొనెనొ
చిదుకుల మంట బోసిన దృష్టి తీసి, మి
ర్మిల బ్రేలి చూరెక్కె మిరప తొడిమి”

“పురము, పేట, పల్లె పరశురామ ప్రీతి
కాది హేతువులుగ నాడుకొనిరి
నిందలేక యుండ బొందె బోదన్నట్లు
యముని వోని గ్రీష్మ నరయ లేక”

గ్రీష్మమునందు మామిడి పండ్లకు ధర పలుకుటయు, చలువ చేయు నూలు వస్త్రముల వాడకము పెరుగుటయు, పత్రములు వ్రాసికొను పద్ధతి ఒప్పందమున కలదనుట సమకాలిక సమస్యలను ప్రతిబింబించుచున్నవి.

ఋతుసంహార కావ్యమునందు లోకోత్తర వర్ణనా నైపుణ్యము సర్వత్ర గోచరించును. ఇందలి ఋతువులు ఒక్కొక్కటి 'పది' సీస పద్యములలో వర్ణింపబడినవి. పద్యములను చదువుచున్నప్పుడు, తెలుగుదేశమందలి పరిస్థితులను ఆయా ఋతువులందలి లౌకిక వైదికాచారములను, స్త్రీ పురుష, బాలవృద్ధ, యువతీ యువకుల చేష్టలను, పశుపక్ష్యాదుల ప్రవృత్తులను కవితామయముగను, ఒక పూర్ణ మనోజ్ఞముగను వర్ణించి యుండిరి.

కవి పల్లె జీవితము బాగుగా తెలిసినవాడగుటచేత, అక్కడి సౌందర్యమునకు ముగ్ధుడై, తన కావ్యమును ప్రకృతి వర్ణనా సంశోభితముగ రచించినాడు. మరియు ఏ ఋతువుననే యే పంటలు పండునో, ప్రకృతి ఎట్లుండునో, జంతువుల, మానవుల ప్రవృత్తులెట్లుండునో, కవి పరిశీలనకు లక్ష్యములై కావ్యమును హృద్యముగ ప్రతిఫలించినవి.

సంస్కృతమునందును, తెలుగునందును, కొన్నివేల సంవత్సరముల నుండి వెలయుచున్న సాహిత్యమును తలస్పర్శిగా అవగాహనము చేసికొనిన విశ్వనాథ ఋతువర్ణనల విషయమున కొత్తదారిని తొక్కి తమ ప్రతిభను చాటుకొనినారు. గతానుగతికముగ, సంప్రదాయ సిద్ధముగ, సాహిత్యము నందిమిడి పోయిన కవి సమయముల బంధముల నుండి విడవడి విశ్వనాథ తెలుగు పల్లెటూళ్ళ జీవితమును ఆయా ఋతువులలో తమ కవితా చక్షువులతో దర్శించి, అందమైన తెలుగు చందస్సులో అందించి కృతార్థులైనారు

'ఋతు సంహారము' లేక 'తెలుగు ఋతువులు' ఆయనకు తెలుగుల జీవిత సౌందర్యము పట్లనున్న అభినివేశమునకును, అభిమానమునకును, ప్రతీక సహజమైన తెలుగు సంస్కృతిని ఈ కావ్యము భంగ్యంతరముగ చెప్పుచున్నదనుటలో సందేహము ఉండవలసిన యవసరము లేదు.

విద్వన్మణులు 'ఋతుసంహార' ప్రశస్తిని గూర్చి యిట్లు ఉగ్గడించినారు.

ఆచార్య : డా. దివాకర్ల వెంకటావధానిగారు.

"స్వతంత్రముగా ఋతువులను వర్ణించి యుండినవేని ప్రతిభ ప్రస్ఫురించిన వారు కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. ఈచిన్న కావ్యము వారి విజ్ఞాన పాటవమునకు ప్రకృతి పరిశీలనమునకు, జాతీయ పదప్రయోగమునకు, స్వభావోక్తి రచనా సామర్థ్యమునకు ఉదాహరణము. వారి "తెలుగు ఋతువులు" పలువురు యువకులకు మరల మరల ఆ వస్తువునే స్వీకరించి, సుందర కవిత వెలయించుటకు ప్రేరకములయినవి" అని తన అభిప్రాయముతో వెల్లడించినారు.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "ఋతుసంహార" పద్యములు వినిన తరువాత తన అభిప్రాయము ను "ఈయన వాని నన్నింటిని కలిపి ఒక విచిత్రమైన పాకము సిద్ధము చేసినాడు. ఈయన వ్రాసిన తెనుగు ఋతువు లన్న గ్రంథము "ఆఱు వందలఱువది పద్యములు" ఒక్కొక్క పద్యమున కొక్కొక్క బొమ్మ గీయించి ఒమర్ ఖయామ్ వలె (డీలక్సు) ప్రచురణ చేయవలయును. ఇది అంతటి మహా గ్రంథము[1] అని తెలిపినాడు.

కావ్యమునందున్న ఉపమానములు వీరి ప్రకృతి పరిశీలనమును, ఔచిత్య పరిజ్ఞానమును, ఔన్నత్యమును చూపుచుండును.

---

1. తెలుగు ఋతువులు పీఠిక — విశ్వనాథ

## "ఋతు ప్రబంధము"

– పైడిపాటి సుబ్బరామశాస్త్రి

"ఋతు ప్రబంధము" వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువులు వరుసగా వర్ణింపబడినవి మరొక స్వతంత్రమైన తెలుగు ఋతు కావ్యము శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారిది. ఇందులో ఒక్కొక్క ఋతువు ఆరేసి సీస పద్యములలో వర్ణింపబడినది విశ్వనాథ వారి అడుగుజాడలలో కొంతవరకు నడచి, తెలుగుదేశమునందలి, పండుగ పబ్బములను, ఆచార వ్యవహారములను తన దృష్టియందుంచుకొనిరి.

'ఋతు ప్రబంధ'మను ఈ కావ్యము పుస్తక రూపమున 1961 లో మొదటిసారిగ ముద్రితమైనది. అంతకు పూర్వము "ఆంధ్రప్రదేశ్" మాస పత్రికలో అప్పుడప్పుడు ఇందలి భాగములు ప్రచురింపబడినవి.

విజయవాడలో కనకాద్రిపై నిలిచియున్న శ్రీ కనకదుర్గాదేవికి శాస్త్రి గారు తమ కావ్యమును అంకిత మొనర్చిరి. శాస్త్రిగారు తెలుగు కవులే అయినను తమ భారతీయతను ప్రకటించుకొనిన తీరు యీ కావ్యమున కడు హృద్యముగ నున్నది. కృతిని సమర్పించుకొనును,

"శ్రీ కాశ్మీరము మొదలుగ
నీ 'కన్యాగ్రమ్ము' వరకు నెసగిన ప్రజన
స్తోకమ్ముగ నే పదములు
నాకర్షించెడి 'అమ్మ'" గా కనకదుర్గను కీర్తించినాడు

శ్రీ పైడిపాటి, కావ్య, గేయ, నాటికా కర్తలై, అవధానులై, విమర్శకులై కథకులై, నవలారచయితలై ఉత్తమ అధ్యాపకులుగా పేరొందినారు. 'కవిరాజు' 'కవి సామ్రాట్' బిరుదములను కూడ పొందినారు.

పైడిపాటి 'ఋతుప్రబంధము' స్వతంత్ర కావ్యము. ఇందులోని వర్ణనలకు కాళిదాసు 'ఋతు సంహారము' నందు ఒకటి రెండు చోట్ల భావ సాదృశ్యము కనిపించును. విశ్వనాథ 'ఋతు సంహారము' నందు హిమబిందు, మేఘ వర్ణనముల సామ్యములున్నవి. అయినను, ఋతుధర్మములు కొన్నిచోట్ల సమానము లగుటయు, ఒకే విధముగా భావనము చేయువారికి ఒక్కొక్కసారి కలుగు సాజాత్యము దీనికి కారణము.

పైడిపాటి వారి ఇతర పద్య కృతులయిన 'ఆంధ్రభారతి, అభిషేకము, దివ్వెలీలు, శతపత్రము' పైడి సంక్రాంతులు ఋతువులు సహజముగ సందర్భోచితముగ వర్ణింపబడినను, 'ఋతుప్రబంధము' నందు ఆయా ఋతువులు కావ్యగత వర్ణనములందునవి.

పైడిపాటి 'ఋతుప్రబంధము' నందు సహజమైన వర్ణనలున్నవి. ప్రతి ఋతు ప్రారంభమున ఆయా ఋతువులందు వచ్చు ముఖ్యమైన పండుగలను, పేర్కొనుట గలదు. జాతీయములైన విషయములను స్మరించుకొనునట్లు చేయుట, ఆస్తిక భావములను ప్రబోధించుట వంటి సందర్భములందు కవి ఉపదేష్ట యగుచున్నాడు.

ఆద్యంతములు లేని కాలమున వసంతము, 'ఉగాది'తో మొదలగునవి. రమణీయములైన వసంత నవరాత్రములు, భూసురకోటికి, ఫలపుష్ప నిచయ సంభావనలు పుణ్యోపలబ్ధికై పూర్ణిమా స్నానము జరుపుదురు. గ్రీష్మమున జ్యేష్ఠ మాసమును, జీవనాధారముసకై ఏరులను పూజించెదరు. వర్షఋతువున వాంఛి కార్థములకై శ్రావణగౌరీ వ్రతమును, కృష్ణాష్టమి, శ్రావణ పూర్ణిమ, భాద్రపద మాసమున పితృదేవతలను భక్తిని గొలుసు మహాలయామావాస్యలను జరుపు కొందురు.

శరత్కాలమున రాజులు దాడులకు వెడలుదురట. ఛాత్రులు గురువులను భక్తితో కొలిచి, దక్షిణలర్పించు కొందురట. విజయుని, రాముని విజయములను పాడి, పసివారిని ఉత్తేజపరచెదరట. ఉపాసనము చేసి మహిషాసురుల వంటి రక్కసులను మర్దించు శక్తిని బడయుదురట హేమంతమున కాలపురుషుడు. దక్షిణాయన పాపదహ్యణమై పూజలను పొందుచున్నాడట గోవు. గోపాలక

గోవర్ధనములుగా గొబ్బిళ్ళను తీర్చి కొలిచెదరట. దాసరుల భక్తిగానములను, ఉత్తరాయణ పుణ్యకాలమును, పావనమైన శ్రీకృష్ణుని మార్గశిర మాసమును ఈ ఋతువులో కలిగియుండును. శిశిర ఋతువున పుణ్యార్థమై మాఘమాస స్నానము, సప్తాశ్వ పూజ, భీష్మైకాదశి, శివరాత్రి, పండుగలను జరుపుకొందురు. ఈ పండుగలు, ఉత్సవములు ప్రజలలోని కర్మనిష్ఠకును, భక్తిశ్రద్ధలకును, వేడుక సంబంధములకును, ఆనవాళ్ళని, కవి హృదయము, వైశాఖ పూజచేయు ఆచారము గ్రీష్మ ఋతువునను, యజ్ఞోపవీతధారణము, రక్షాబంధనము, స్మరింపజేయుట, వర్షఋతువునను, రాబోవు సంతతి వారిని వీరులనుగా చేయుటకు విజయుని, రాముని విజయములను ఆదర్శముగా చూపుట శరదృతువునను భక్తిశ్రద్ధలకు మహాశివరాత్రి వంటి పండుగలను, శిశిర ఋతువునందున జటక్షు కొనుటవంటి ధర్మబద్ధములైన క్రియాకలాపములను కవి తెలిపినాడు,

ప్రతి ఋతువుయొక్క ఆగమ వర్ణనము అత్యంత రమణీయము. వసంత ఋతువు రమ్యమైన వాతావరణమున "మ్రోగులు చిగురించు, సొగసు తొలికి సకల జనహితముగ ఒక కోటి దా శతపత్రశోభ" తో వచ్చినదనియు, వేసవిలో

"భూమి యెంతగా వేగి వేగి
నిండుగా విచ్చునో పంట సిరుల నంక తెచ్చునను సూక్తి"

కీర్తి కిరీటమును కట్టుటకు గ్రీష్మము శక్తిమంతమై వచ్చినదనియు, వర్షఋతువు "మెఱక పల్లమ్ము లొకటిగా ధరణియెల్ల పైరు పచ్చల మురిపించుటకు మేదినికి దిగ్గె నిలువెల్ల మెఱసి మెఱసి" యనియు.

శరదృతువు "నెల నెలగ వీసకొంతుల నిలిపి, శివుని యాలమెల్ల తేజమ్మైన యట్లు" రమ్యంతరముగ వచ్చినదనియు,

హేమంతము, 'వర్షములకు చివురులను తొడిగి అందగించుచు వచ్చినదనియు,

శిశిరము, హేమంత ఋతు ధర్మముల తోరణములను తాల్చి ఋతువుల వరుసలోను, కాలపురుషుని కడపటి కడుపు పంటయై వచ్చినదను వర్ణనములు సహజములు.

ఋతురాజైన వసంతుని అధిక తేజస్వంతునిగా చేయుటకు "తుంబి విలుకుడు పెద్ద యోధుడుగ నిలిచె" నని వర్ణించుట ఋతుధర్మమును తెలియజేయుచున్నవి. అశోక సుమములు కర్ణికారములు, ఫలాశ సుమములు, ఎఱ్ఱగోరింటలు మల్లెలతో వసంతము మిక్కిలి అందగించుననుట వర్ణన సహజత్వమును చాటుచున్నది. 'పుష్పమయ శోభ సిరిలెగ బోసెననుచు పుంస్కోకిల వసంత వైభవమును "కొమ్మకొమ్మను జేరి" పెల్లాది మధురముగ పలుకుచున్నదని వర్ణించుట కవి ప్రతిభను తెలుపుచున్నది. పుష్పములు ప్రశస్తిని పొందకుండినను. తమ [illegible]దనమును వెలార్చుచున్నదను విషయమును -

"మధులిహమ్మున కిష్టమైన మాననేమి
కమనీయముగ చంపకము పూచె
మధు వృక్షమును బోలి మనిన మానిన నేమి
రెమ్మ రెమ్మను వేపకొమ్మ పూచె
కమలమ్మునకు బోలికయిన మాననేమి
యుల్లమ్ము లలరించి మల్లె పూచె
నాదగీతమ్ము దోహదమైన కానున్న
గుమ్ముగా నాగ్రేంకణమ్ము పూచె," నని

నవ్య వర్ణనా రీతిని కవి ప్రదర్శించినాడు.

రమణీయ పుష్పసుగంధ వాయువులు, అందమైన పగళ్లు, కనులవిందైన వెన్నెలలు, మకరందమును గ్రోలు తుమ్మెదలు, మావి చిగుళ్ళను చిదుము పికములు, వసంత ఋతు శోభితములు.

గ్రీష్మ ఋతువర్ణనమున గ్రీష్మరాజు ప్రతాపము 'కాఱవితో నొకప్రక్క' అను పద్యమున శివుని త్రినేత్రము యొక్క 'సెగమంట' యనెడి మొహరువేసి; నిత్యము పవనునికి భత్యమునిచ్చి, అగ్నిగుఱ్ఱమును తోడునిచ్చి ఆజ్ఞలను అమలు జరుపుటకు పంపెనను వర్ణన సహజ గాంభీర్యత తెల్పుచున్నది.

అగ్ని చెలరేగుట, నదులు, తృణలతలు, పొదలు ఎండిపోవుట, దిక్కులు మండుట వంటివి గ్రీష్మ ప్రభావితములైనవని కవి తెలిపినారు. గ్రీష్మము ఋతువులలో భయంకరమైనదే అయినను ప్రకృతిలో బాధతో పాటు సుఖమున్నదను సత్యమును

"ఎంత నెండ రగుల్చు నంత తీపి తగుల్చు
చూడ ముచ్చటైన చూతమందు
ఎంతగా నెండలు హెచ్చు నంతగ హెచ్చు
పరిమళమ్మ్మదు సంపంగి యందు
ఎంత లెండలు పేర్చు నంత తావినిం గూర్చు
పాటల మల్లికా పద్మములను
ఎంత ఎండలు మించు నంతగా మాధురి
నించును పనసల నించులందు

నాగ్రహమెంతయో యంత యార్ద్ర బుద్ధి
తరణి సమయమ్ముం గెంచు నుదార బుద్ధి
దిరిసెనపు సౌకుమార్యంపు' దేజు నెఱుగు
గ్రీష్మఋతు వల్లభుండన్నఁ గేవలుండె" యని

వర్ణించుటయందు గ్రాహ్యము

వర్షఋతువున ఆకాశమున కనిపించు మేఘము వర్ణించుటలో విశ్వనాథ వారి ప్రభావము కనిపించుచున్నది. శరదృతువున నదులు పూర్వపు వేగములను తగ్గుటచేత తీరపుకత్తెలవలె కనిపించుచున్నవనియు. నదులలో అచ్చటచ్చట పిఱుదుల అందమొప్పునట్లుగ తెన్నెలగుపించుచున్నవనియు. జాజి తానె వెన్నెలగ ధవళమగుచు. ఉద్యానవనములందు పరిమళము నింపుచున్నదను వర్ణన అత్యంత రమణీయము.

శరత్తురాజు సస్యలక్ష్మికి అందాలు సవరించి హత్తుకొనుచున్నదనుట. శరద్గంధమహుడు దూదిపింజలవలె తూగాడే మేఘములను చూచి, మనస్సునందే

నవ్వుకొనుచున్నాడనుట, బెగ్గురు పక్షులను తట్టుచున్నాడనుట, మానససరోవరము నుండి మరలివచ్చిన హంసల కూజితముల నాలకించినాడని వర్ణించుట కవి భావనలు మనోహర కల్పనలు. హేమంత వేళరాలిన మంచుబిందువుల వర్ణన శాద్వలాగ్రకొనలయందు మనోజ్జ్వలమణి గోపురములవలె ధగధగలాడినవనుట. తండ్రి మస్తకముపైన తనయునివలె నిల్చియున్నవనుట, ఆచార రహితుని ఐశ్వర్యము వలె, తుమ్మాకు కొన దాటి దుసికిల పడినట్లున్న దనుట చిత్తనిరోధము చేసిన యోగివలె, నీలోత్పలములో నిలకడగా నున్నవనుట. కవి వర్ణనా నైపుణ్యము చాటుచున్నది.

శిశిరఋతువున దిశలయందు ధూళి రేగునని, ఉత్తరపుగాలి చలితో వీచునని కవి సహజముగ తెల్పినాడు.

పైడిపాటి 'ఋతుప్రబంధము'న కామినీకాముకులపై, స్త్రీలపై, రైతులపై, పశుపక్ష్యాదులపై పడిన ఋతుప్రభావముల వర్ణనారీతి అత్యంత రమణీయము.

కవి, వసంతఋతు వర్ణనమంతయు ప్రాచీనుల మార్గమున నడిపించినాడు. కాని మల్లెల ప్రాధాన్యమును వర్ణించుటయందు క్రొత్త పోకడలను త్రొక్కినాడు. స్త్రీలు మల్లెలను ఉల్లములలరింపగ కీలుగంటునను, ప్రమోదము నిండారగ పంపిణీకొను అందముకొరకు చొళ్లము నందును, తెలివి పెంపారగ ద్విజటలందును ధరింతురను వర్ణనలు పూల నలంకరించు సందర్భముల ననుసరించి జడలు వేసికొను పద్ధతులను తెలియ జేయు చున్నవి.

గ్రీష్మమున ఎండవేడిమికి తాళజాలని స్త్రీలు ముదక బట్టలను మాని, పలనాటి ఖద్దరును, పొందూరు సన్నచీరలను ధరించుందురని సమకాలిక జీవనమున చూపినాడు. మంచిగంధమును పూసికొని మల్లెమాలలను దాల్చి వట్టివీవనలతో విసరుకొనుట వంటి తాపోపశాంతికై చేయు కృత్యములు, తాటిముంజలు, ఖర్జూర ద్రాక్షానీరము, అరటిఫలములు, పనస, అధికముగ ఉప్పు కలియు మజ్జిగ, టెంకాయ జలము, గ్రీష్మమందు కోరుట యందు కవి సహజవర్ణన కావించినాడు.

వర్షఋతువు వర్ణనమున వర్షరాజు లేతబుగ్గపై చిటిక వేసినట్లు, జవరాలు వీపుపైచఱచినట్లు చినుకులు రాల్చినాడనియు, ఏకాంతముగనున్న కాంతుని కలవు పరచుట, ఇంతి వక్షమును తుళ్ళింత పరచుట, కలువపూలీను భామల గుట్టులను బయలు పరచుటకు వర్షించుటచే నీతడు పరమ విరసుండో! రసికుడో! తేల్చ లేమని కవి చక్కని శృంగార వర్ణన కావించినాడు. ఆలుమగలకు ప్రేమ నధిక ముగా కలిగించు మధుర శరదృతువు మరన ఏడాది వరకు దగ్గరకు రాదని కవి పుష్పములను మేల్కొలుపు చున్నాడు. శేఫాలికను పరిమళము మాదుట కొఱకు, నవమాలికను తరుణి వాల్జడలయందు తావులిచ్చుటి ఊగుట కొఱకు, బంధూ కమును రమణుల కాళ్ళ పారాణులందు రంగు నొత్తుట కొరకు, సప్తచ్ఛదము కొమ్మల పెదవులందు నవ్వు చిమ్మినట్లు హొయలు చూపుటకొఱకు చేయుపనుల తీరులను తెలుపుటయందు కవి ఊహించిన విధము వర్ణనాతీతము.

శిశిర ఋతువున కాముకులు పూలదండలను సిగలో ధరించి, ప్రియుల అపరాధములను మన్నించి పడకటింటికి చేరుట, కాముకులు స్తన భారమున వంగు తరుణులను ప్రీతితో హత్తుకొని, ప్రియభాషణముల నలుపుట వంటి శృంగార వర్ణనములు అత్యంత సహజ సుందరములు.

ఆయా ఋతువులలో రైతులు చేసికొను సేద్యపు పనులను కవి హృదయముగ వర్ణించినాడు. వ్యవసాయమే ప్రాణప్రదముగ చూచుకొను రైతుకు కృషియందే లక్ష్యముండుట వలన గ్రీష్మమును రైతు లెక్కచేయడను విషయము కార్య నిమగ్నతను, పట్టుదలను సూచించుచున్నది. పేదజనులకు వర్షఋతువున మోడు బారిన చెట్లు మోసు లెత్తగనే చిత్తమున పుట్టిన కోర్కెలు చిగురు వాఱుట సహజము. అధిక వర్షము వలన గుడిసె తడిసి తెలివోగా అందులోని బీదరాలు తూలిపోయినదని శిశిర ఋతువున చలికి కంటికి నిదురరాక బాధపడుదురను వర్ణ నలు పేదరికముపై కవికి గల సానుభూతిని తెలుపుచున్నది.

పశు పక్ష్యాదుల వర్ణమున తమకులము వారు సంపన్నులయినచో వారిని చూచి మిట్టిపడు వారును లోకమున గలరను - విషయమును

"చేప కొలమున కింత జీవనమ్ములు కల్గ
మీన కేతన మిట్టె పడియె

మకర సంతతి యాతన సుఖముగోఁ దేలంగ
మకర ధ్వజము దీప్తి మంతమయ్యె" నని

వర్ణించిరి.

పైకిపాటి 'ఋతు ప్రబంధ' రచనమున వర్ణించిన తీరుతెన్నులను పరిశీలించినచో ప్రకృతి సహజసౌందర్యములను చాటుచున్నవి. ఈ కావ్యము నందలి వర్ణనలు ఈ ప్రదేశమున గల ప్రజాజీవన విధానము, స్త్రీలు, ప్రకృతి, ఆచార వ్యవహారములను, ఆయా ఋతువులయందు కలుగు మార్పులను పరిశీలించి స్వభావ సిద్ధముగ వర్ణించినాడు. ఈతడు ఆధునిక కవి, కావున సామాన్య ప్రజల బ్రతుకు బరువులను ఆర్ద్ర హృదయముతో వ్రాయవలననిన తన ఆశయముతో ఈ ఋతు వర్ణనల నెపమున వర్ణించినాడు.

ఈ కావ్యమున కవి తన స్వీయ పరిశీలనా పాటవము చేత, వర్ణనా నైపుణ్యమును, ఋతువున యెడ చూపినను, ఇది పూర్తిగా పరాశ్రయ కవిత్వ విధానమునకే ప్రాధాన్యము నిచ్చుచున్నది.

ఋతు ప్రబంధమున శబ్దాలంకారములు ప్రతిపద్య పాదమునందు చోటు చేసికొని, కావ్యరమ్యతను చాటుచున్నవి. ఉపమ, ఉత్ప్రేక్ష, రూపక స్వభావోక్తి, అలంకారాదులు సందర్భోచితములై ప్రయోగింపబడినవి. మచ్చునకు కొన్ని మాత్రమే నేనిట పేర్కొనుచున్నాను.

"ఉపమయే సర్వాలంకారములకును మూలము" వసంతవర్ణనమున

"కసుగందు నగుచుఁ బూచిన దశోకసుమమ్ము
రమణీ మణీ పాద లాక్ష వోలె
మది నింపుచునుఁ బూచినగి కర్ణికారమ్ము
సొంపైన చెవి కమ్మ, కెంపవోలె

చెన్నుగా విరియ బూచెను ఫలాశ సుమమ్ము
ఖండితా పొంగ వీక్షణము వోలె
చెలువమ్ము లోలికి పూచిన దెట్టు గోరింట
జేవురించిన చెడె చెక్కిలి వలె" నని

పుష్పచయమును రమణి అందముతో పోల్చినాడు.

వర్షమున :- గిరి మల్లికల జల్లు కురిసినట్లుగ, వాన కురిసె నెండనుఁ దాసె
మెఱసి" యని

హేమంతమున చేమంతిని,

"పసపాడు చెలిమ్ముఖ భావ భంగిమ వోలె" మవ్వమై నిసిచె" నని
వర్ణించుట యందు గల ఉపమానము నవ్యశోభితమై ఒప్పుచున్నది.

"ఊహ" కని భావనాశక్తికి ప్రతీక అట్టి ఉత్ప్రేక్షలను కవి శరదృతు
వర్ణనమున గుప్పించినాడు.

"ఉదయ వేళల యందు చెదరు చీకటులట్లు
చితుకు చితుకు నేల చెమ్మ వదలె
వదలిన సంసార భారంపు జీవినాఁ
దేలి సింగిని మబ్బు తేలిక పడె
తెలివి రంగేమొ యిదే యంచుఁ జెప్పెనాఁ
బుష్కలముగ తెల్లు పూచె
తెలివి కల్గిన మాయ తొలగు తీరిదియన
సరిదంబుల నొండు విరిగిపోయె" నని

ఉత్ప్రేక్షించుటతో పాటు కవి జీవిత పరమార్థమును కూడ తెలిపినాడు

ఈ కావ్యమున అతి మనోహర స్వభావోక్త్యలంకారములు అనేకము
లున్నను ఒకటి రెండింటిని మాత్రమే పేర్కొనుచున్నాడు.

శరత్కాలమున : తెలతెలవారు శీతల మారుతమ్ములు
తమ్ముల సురభిగంధము వహించె"

హేమంతమున తె ఎండ మంచిదిలే యనిపించె".

"కంబళి జోడించి కప్పె దుప్పటి" వంటి వర్ణనలు సహజములు.

శారద రాత్రులందు విరియు ఉజ్జ్వలమైన వెన్నెలయందు

"పేడ పల్వ కదలించి మేతకై దొంగగా
కలుగెత్తు వృషభమ్ము పట్టువడదు"
"తెలిచీర ధరియించి తిన్నియం గూర్చున్న
ప్రేయసి జాడ గుర్తింప బడదు"
"చాటసారికి పుంత బయల్సాగ, ద
గ్గఱ కాని జలములు కానరావు." అను

వర్ణనమున భ్రాంతిమదలంకార ద్వారమున సర్వవస్తు సారూప్యమును. సర్వవస్తువులు వెన్నెలలో తిరస్కృతము అగుట, వ్యంజితమైనది. ఈ అలంకారకృత వస్తుధ్వని లోకోత్తరమైనది లోకములందలి వైయక్తిక పూర్ణత్వము ధ్వనింపజేయుబడినదను విషయమును.

"కొమ్మ కొమ్మను జేరి పుంస్కోకిలమ్మ" అనుటలో శబ్దార్థోభయశ్లేష రమణీయముగ మన్నది.

పైడిపాటి 'ఋతుప్రబంధము' నందు సులభగ్రాహ్యమైన భాషలో, అత్యంత మెందరమైన శైలిలో ఋతువులను వర్ణించినాడు. ఇందు జాతీయములు, లోకోక్తులు, కోకొల్లలు.

హేమంతమువేళ : మంచుమేత మేసి మాహేయ పులకించి ప్రమదాన నేనుగ
పాడిఁబిదికె" నని

శిశిరమున శీతల బాధను భరింప శక్యముగాని వర్ణనలో

"అంపకోతయెం నీరమ్ములో దిగి తటాకమ్ములో నీద సాధ్యమ్ము గాక" అనియు పుండువంటి చలిలో

"కొంపల్లోనన్ గడ్డి లేనట్టి గుడిసె యందు
నిదుర కంటికి రాక యుండె' ననియు"

మధుర సంక్రాంతి నాడు హేమంతమువేళ నరుసమ్మ గరిసెలో నున్న ధాన్యమును "ఇచ్చె పేదకుఁ జేతికి నెమ్మలేక" యనియు, సందర్భోచితము లయిన జాతీయములు, లోకోక్తులు చెప్పబడినవి.

'మొహరువేయుట' వంటి అన్యభాషాపదములు ఇందు వాడబడినవి. మెడపల్పు వదలించు, వైడూర్యముల బోత, తంత్రి మస్తముపైన, చలికొంత ముదిరి, అధరమ్ముకాంతల, చలికంఠమును కట్టి, ఉలవలదాలిలో, వంటప సారాను, అను పదములు గ్రామీణ జీవనమును, ద్విజటలందున, పూల వంతెన, ఉద్యానవనములలో ప్రేయసీ ప్రియులు, నగర జీవితమున ప్రతిబింబించు పదములు ఇందు కనబడుచున్నవి.

ఈ కావ్యము సహజ వర్ణనలు, మానవ జీవిత సన్నిహిత ఋతువులు, గ్రామీణ, పట్టణ జీవనములు, కర్మజ్ఞాన భక్తివైరాగ్యములు, వైద్యవిజ్ఞానము, శృంగార రస పోషణము, జాతీయతా భావములు, లోకోక్తులు, అలంకారములు కలిగి ఉత్తమ ఋతువర్ణనా కావ్యముగ వెలసినది.

ఇందు ముఖ్యముగ ప్రతి ఋతువు నందలి తొలిపద్యము ఆయా ఋతువు నందుగల పండుగ పర్వములను, ఆచార వ్యవహారములను తెలుపుట కావ్య వైశిష్ట్యమును చాటుచున్నది. కవి పుష్పసౌరభములను ఆరు ఋతువుల యందు వర్ణించుట మరొక ప్రత్యేకత. ఆయా ఋతువులలో పూచు పుష్పములను ఆయా సందర్భములందు నిబంధించుట రమణీయముకము.

వసంతమున : "మధువృష్టిమును బోలి మనిన మానినమేమి
రెమ్మరెమ్మకు వేపకొమ్మ పూచె".

గ్రీష్మమున : "ఎంతలెండలు పేర్చు నంత తావిని గూర్చు
పాటల మల్లికా పద్మములకు."

వర్షమున : "కొమ్మ నిస్వార్థమ్మైన రాగమ్ము వోలెఁ
గడిమి విరబూచెఁ బ్రాప్పట్టు కదలివచ్చి

శరత్తున :- "ఓసి బంధూకమా! ఒత్తవే నీరంగు రమణుల కాళ్ల పారాణులందు"

హేమంతమున - "గబ్బిళ్ల కొసనిల్చు కుదురు గుమ్మడిపూవు వేయి పూవులశోభ ఏలుచుకొనియె"

శిశిరమున :- "పున్నాగములు నంత ప్రీతిగాఁ బూచెను ప్రేంకణమ్ములుఁ జూడఁ బ్రీతిగొలిపె."

స్త్రీలు పుష్పముల నలంకరించుకొను సందర్భములలో వేసికొను జడలను 'జాబిగా విడిచిన పెంట్రుకల సమూహమును కేలుగంటుగను, సర్పాకారముగ నల్లబడిన జడ పడగజేగను, జడతో చుట్టబడిన చిట్టి చొల్లెముగను, రెండు జడలను 'ద్విజట' గను వర్ణించుట ఈ కావ్యమున కలదు.

సంప్రదాయ సిద్ధముగ, పరంపరాగతముగ, తెలుగుప్రజల జీవితమునందు ఇమిడిపోయిన ధర్మ బద్ధమైన మత విశ్వాసములకును, ధర్మబద్ధమైన క్రియా కలాపములకును కవి విశేషప్రాముఖ్యము నిచ్చినట్లు చెప్పవచ్చును. ఆయాఋతువులను వర్ణించు సందర్భములందు యీ విషయములను ఆతని దృష్టియందిడుకొని వర్ణనములు చేసెననుటకు తార్కాణములను ఎత్తి చూపనవసరము లేదనుకొందును.

ఆంధ్రప్రదేశప్రభుత్వ ఆస్థానకవులుగా ప్రసిద్ధిపొందిన కాశీకృష్ణామాచార్యగారు ఈ కావ్యము తొలి పలుకులందు "ఋతుప్రబంధము నందలి కవిత మృదుమధుర మైనది. కాన నీ కావ్యము "సర్వాంధ్ర లోకాదరణీయము" అని నుడివినారు.

## ఋతుచక్రము

**డా. సి. నారాయణరెడ్డి**

డా. సి. నారాయణరెడ్డి 'ఋతుచక్రము' ఋతువర్ణనలను స్వీయజీవిత ఘటనా సూత్రములతో కూర్చి చెప్పబడిన గేయ కావ్యము. ఇందు ఒక్కొక్క ఋతువు ఒక్కొక్క ఖండముగా ఒప్పినది. ఆరు ఋతువులు ఆరు ఖండములుగా సాగిన ఈ కావ్యములో కవి స్వీయానుభూతులను. చిన్ననాటి జ్ఞాపకములను అక్షరబద్ధము చేసినాడు. కవి ఇందు తెలంగాణా పల్లె జీవితములు సహృదయ రమ్యముగ ప్రతిబింబింప చేసినాడు. ఆరు ఋతువుల యందు ప్రకృతి సౌందర్యము మనోహరముగా వర్ణింపబడి అనుభూతిని కలిగించు కావ్యమిది

'ఋతుచక్రము' 'జీవితచక్రము' నకు అన్వయింప జేయబడినది. కాల మహాస్రవంతిలో కవి ఒక్క సంవత్సర కాలమున తన కవితానుభూతికి అందిన దానిని దిఙ్మాత్రముగా వర్ణించినాడు కావున ఇది ఆత్మాశ్రయ కవిత్వమే యగును. కాని ఇందలి అనుభూతులు ఇతరులకు చెందునట్లు కవిపించుటచేతను, లోకమునకు ఆస్వాదయోగ్యమగుటచేతను, 'ఉత్తమ కవులకు స్వపర భేదములుండవనుట సత్యము

'ఋతుచక్రము' అను ఈ కావ్యము 1964 డిసెంబర్‌లో కావ్యరూపమును దాల్చినను, మొదట యువసాహిత్య పత్రికలో ధారావాహికముగ ప్రచురితమైనది ఈ కావ్యము సహృదయులు, సుప్రసిద్ధ దేశభక్తులు బెజవాడ గోపాలరెడ్డిగారికి అంకితము చేయబడినది.

డా. సి. నారాయణరెడ్డి కవిత్వములోను జీవితములోనూ మానవతను, చైతన్యమును, రస హృదయమును పండించుకొనిన సాహితీమూర్తి ఆధునికాంధ్ర సాహిత్య లోకములో విభిన్నాంశములకు సమన్వయము సాధించుకొనిన సహృదయ విమర్శకుడు మాత్రా ఛందస్సులో సమగ్ర కావ్యరచనలో కృతకృత్యులయిన కవి వరేణ్యులు. వీరు అనేక సాహిత్య ప్రక్రియలలో అవిరళ కృషి చేయుచున్నారు. ఖండకావ్యములు, సమగ్రకావ్యములు, గేయనాటికలు, గద్యములు, సాహిత్య వ్యాసములు, యాత్రాచరితలు, పరిశోధనాత్మక వ్యాసములు, గేయములు, చిత్రసాహితి

వంటి ప్రక్రియలలో సాహిత్య సృష్టి చేసినాడు. ఆయన రచనలలో సంయమము, స్పష్టత చెప్పుకొనదగిన గుణములు.

నారాయణరెడ్డి "ఋతుచక్రము" స్వతంత్రగేయకావ్యము, కాళిదాసు, విశ్వనాథులు రచించిన ఋతుకావ్యములు సాహిత్యలోకమునందు మిక్కిలి ప్రాశస్త్యమును పొందినవి. ప్రత్యేకించి ఒక ఋతుకావ్యమును వ్రాయవలెనను అభిప్రాయము నారాయణరెడ్డిగారికి కలుగుటకు ఈ మహాకవుల ఋతుసంహార కావ్యములే మార్గదర్శకములైనవని చెప్పవచ్చును నారాయణరెడ్డి ఋతుకావ్యము ఆత్మాశ్రయ కవితా రూపమున వెలువడిన కావ్యము. కవి తన ఇతర రచనల యందు సమయానుగుణముగ ప్రకృతి యందలి ఋతువర్ణనలను చేసినప్పటికిని, మేఘమాధురివంటి గేయనాటికలో స్త్రీ పురుషుడు, పృధివి పాత్రల చిత్రణలో ఋతుధర్మములను బయల్పరచినాడు. 'అజంతాసుందరి' గేయ నాటికల సంపుటి యందు కూడ "ఋతువుల రాణి" యను నాటికను కేవలము శిశిఋతువు, వసంతఋతువుల పాత్రలతో కథా సంభాషణాంతర్భాగముగా వర్ణించినాడు "వెన్నెలవాడ" యను గేయనాటికల సంపుటియందు శరదృతువునందలి ప్రకృతిశోభ కడు రమ్యముగ వర్ణితము. కలం కదిపితే చాలు భావ సౌందర్య ముట్టిపడుచున్నట్లు ఇతని ప్రతి కావ్యములో ఆయా ఋతువులలోని ప్రకృతి సహజ సౌందర్యము సాక్షాత్కరించుచుండును.

డా॥ సి నారాయణరెడ్డి 'ఋతుచక్రము' నందు ఆయా ఋతువులలో ప్రకృతి యందు కలుగు మార్పుల వర్ణనలు సహజ సుందరములు. మానవులలో, పశుపక్ష్యాదులలో కలుగు మార్పులను వర్ణించిన తీరు చక్కగా కనిపించును.

కుసుమాస్త్ర భాస్వంతమగు వసంతము చిగురు చిగురున రాగ శీకరము లొలికించును. ఆకు ఆకున మరకతాకృతులు పలికించుచు పూవుపూవున మధువు పులకింత లొనరించుచు వచ్చినదనుట, వసంతాగమన సమయమునందు ప్రకృతి అందమును సహజముగ వర్ణించినాడు. వసంతుని రాకతో ప్రకృతిసీమ క్రొత్త జిలుగులను కూర్చుకొనినదట. జగతి రథము క్రొత్త నడకలను నేర్చుకొనినదట. మొన్నటివరకు వట్టి మోడుగనున్న చెట్టు 'ఆకువచ్చుని సిగ్గులందగించిన వధువువలె వట్టిపోయిన కొమ్మ "ఏడువారాల నగలిడిన ముద్దుల గుమ్మవలెను," చిగురులను లొడిగి అందగించినదట. తొలి సంజలోని తలిరాకు మలిసంజలో పచ్చలను దాపిన

రేకై, గడియముందు బిగియపడు మొగ్గగా మారి, ఇప్పుడు ప్రౌఢవలెనవ్వి, వికసించి నదట. అట్టి వసంతము తరులతలలో పూచిన పూవుల పరిమళములు భరింపజాల కున్నవని కవి ఉవహరించినాడు. కంకేళి పూచి కనులెఱ్ఱజేసిచూడగ కర్ణికారము పూచినదట. దాని కన్నుగ్డు పచ్చబడిపోవగ సురపొన్న పూచినదట. దానిని చూచి తీయమామిడి విరుగబడి నవ్వినదట. ఆ తరువాత విలాసినుల నవ్వులతో ప్రకృతి గుప్పుమనినదను వింత వసంత విలాసమును తిలకించిన కవికి "సర్వేంద్రియములు గుండియలై రసాత్మకతను వహించి" నదట. ఇటువంటి పరస్పర సంబంధ దోహద క్రియలను వర్ణించి పూర్వుల ననుసరించినాడు.

గ్రీష్మ ప్రతాపము పీడజనుల తీవ్ర పరితప్తుల చేయుచున్న విధమును కవి అతి సహజ సుందరముగ వర్ణించినాడు. గ్రీష్ముడు 'యక్షగానములోని రాక్షసునివలె వచ్చి రుద్రుని క్రోధమా!' యన్నట్లు తింద్రించినాడట. కాల దేవత 'కింకరుని' వలె వచ్చి భూజనావళికి చురుకు పెట్టినాడట. గ్రొవ్వెక్కిన కొలది "కొలిమినూదిన యట్లు" దినమంత ఉడికించి, వడగాలి నిప్పుల చెరగినాడట. రాత్రి నేలబడిన వెన్నెలను కర్పూరంలా కరిగించినాడట జాముర్రాత్రి దాటినను ఊపిరి సలుపనీయని మొండి గాడ్పును విసరి ప్రజల గుండెలను దిగ్గుర మనిపించినాడట. అయినను ప్రజలు అప్పుడప్పుడు కనబడు పయోధరములను చూచి ఆశతో బ్రతుకుచున్నారట. ఇందు గ్రీష్మానంతరము వర్షా గమనమును సూచించుచున్నది

వర్షఋతువులో నారాయణరెడ్డి 'మేఘవర్ణన' యందు విశ్వనాథవారి ననుస రించినను, కొంగ్రొత్త కన్పట్టుచున్నది. అవి

"ఆత్మోద్గరః స్థిత భాస్వత్ చంచలా ప్రియములు"

"రమేశ్వర గాత్ర సవర్ణమ్ములు"

"హృద్యమితే రమ్మదాగ్ని శిఖాచ్ఛటా గభీరములు"

"శితికంఠ సహోదరములు"

"గ్రీష్మాదిత్య ప్రచండ కిరణమ్ముల కడ్డము నిలిచినగొడుగులు"

"నీలిరంగు పందిరి నొరిగిన ద్రాక్షా పక్వ ఫల గుళుచ్ఛములు"

అని మేఘములను వర్ణించుటలో కవి నవ్య కవిత్వ భావనా పాటవము కనిపెంచును.

మేఘములు కొన్ని 'నిండు చూలాండ్ర' వలె నెమ్మదిగ సాగుచున్నవని, మరికొన్ని 'సమరభేరి వినిన యోధుల బారులవలె' గుమి కూడినవని, శంఖధ్వని వినిన వీరులవలె' ఉరకలు పెట్టినవని, మరికొన్ని "తడిగుడ్డలతో గొంతులు కోసియు, ఏమియు తెలియని వానివలె' 'కొంపలు మునిగిన వార్తలు కొనిపోవుటకు పరుగెత్తు వానివలె' కనబడునను వర్ణన కవితా చక్షువులలో మెరిసినవి.

మేఘముల కదలికల వర్ణన కవి ప్రతిభావ్యుత్పత్తులకే కాక, ఆతని లౌకిక పరిజ్ఞానమునకు అద్దము పట్టుచున్నది. "ఒక మేఘము అర్ధగౌరవముతో నమ్ర సుందరముగా కదిలితే, మరొకమేఘము పైని పటారములు చూపించే చిత్ర పద్యమ్మ" లో ప్రజలను అడల గొట్టినదట.

శరత్ ఖండమునందు నారాయణరెడ్డి సర్వాలంకార సంశోభితమైన శార దేందిరను సాక్షాత్కరింప జేసినాడు. పిండివెన్నెల గంధపు పొడిగను, నిండుజాబిల్లి పూలచెండుగను, విరియబూచిన రెల్లుపూవులు ఇరుదెసల వింజామరలుగను, శరద్రమను అందముగ వర్ణించినాడు. ఆ విలాసానికి రాత్రులందున కలువపూలు, పగళ్ళందున కమలములు కన్నులుగ నుండెడివట. ఈ శరల్లక్ష్మి కరముల స్పర్శకు "పొగలు గ్రక్కెడు విషధరమ్ముల" పాలవెన్నెలను పుక్కిలించినవట. తెల్లని మబ్బులు అంబరశ్యామ లలామ తలంటు స్నానములాడగ పైకితేలిన కుంకుడు పండ్ల నురుగువలె నున్నవని ఉత్ప్రేక్షించుట కవి నిశిత పరిశీలనాశక్తి, వర్ణనా ప్రతిభకు నిదర్శనములు.

కవి హేమంతపు చలితీవ్రతకు, హ్రస్వపగళ్ళను, "మంచుగడ్డ చేయినుంచగ మునివ్రేళ్లు కొంకరలు పోయినవన్నట్లు" దినములు ముడుచుకొనిపోయినవట. పగళ్లు ఉదయ సాయం సమయములందు వలె వేడిమి వెలుతురులనిచ్చుట హేమంత ప్రభావము విషదము. హేమంతము బీదజనులపట్ల మాత్రమే కాక ధనికులపై చూపు ప్రభావమును

"గడియారములో తొమ్మిది
గంటలయ్యె; కలవారల

పడక గదులలో నెంకను,
ప్రభాతమే ఆవులించె" నని తెలిపినాడు.

ప్రొద్దెక్కినను లేత ఎండ చలిలోబడి తడిసి ముద్దయిపోయినదట. మబ్బులు లేకుండినను శపునివలె చండభానుడు వెలుగకున్నాడట చంద్రుడు "దుమ్ముగప్పిన అద్దంపు బిళ్ళ" యట.

ఇట్టి సూర్యచంద్రులను గూర్చి కవి

"ఒకనాడు జ్వాలముగ భువి
నూగించిన రవి చంద్రులు
పదవీచ్యుతులై మంత్రి
వర్యులట్టులైరి నేడు" వలె కళావిహీనము లయినవట.

హేమంతమున చలి ప్రభావము ఆహార పానీయాదులపై

"ఎల్లిటల్లో వేడియన్న
మింతదిగెను; కాని నీళ్లు
గొంతునుండి దిగజారుట
కొరకు ప్రళయమై పోయెను" ఇది అంతయు దైనందిన
జీవితమునకు సంబంధించిన వర్ణనమే.

శిశిర ఖండమును కవి హిమఋతువు చందశాసనకాలము మరి రెండునెలలు పొడిగింపబడినట్లును జివ్వుమనెడి శ్వాలి జీవనాడులను గంధక ద్రావకతో కత్తిరించినట్లును, అజాండగోళము పెద్ద మంచుముద్దగా బిగిసిపోయినట్లును, చదురు ఎదురుగానున్న తెల్లని మబ్బులు మంచు పచ్చడములుగ పరుచునట్లును స్వభావ సిద్ధముగ వర్ణించినాడు. డా. సి. నారాయణరెడ్డి 'ఋతుచక్రము'న ఋతుధర్మములను బట్టి ప్రకృతి సహజ సౌందర్యముతోబాటు, ఆత్మాశ్రయ కవిత్వరూపమున మానవ జీవన సరళిని కూడ వర్ణించినాడు. ఇందలి వర్ణనలన్నియు అనుభవైక సిద్ధములే. ఆయా ఋతువు

వంటి లభ్యమగు పండ్లు, కాయలు, పుష్పములు, పశుపక్ష్యాదులు మొదలగు వాని ప్రాముఖ్యముతో పాటు అవి వాని జీవితచక్రముతో ముడివడియున్న తీరును వర్ణించినాడు.

ఒకనాటి వసంతమున

"ఒక కుహూచారుతము కర్ణోల్లసితమైనంత
ఒక సుగంధిల సమీరోర్మి తాకిన యంత
ఒక చలత్ కుసుమవల్లిక కనంబడినంత"

కవి మనస్సు చైత్రరథమై పోయినదట.

బాల్యమున కవి మామిళ్ళతోటలో ఒక కోయిలగొంతు విని కుఱ్ఱదండును వెంటపెట్టుకొని కేరింతలు, చప్పట్లు కొట్టినారట. తిరిగి అదే స్వరము వినిపించగా "ఓసి! యీ మామిళ్ళే కూసినవిరోరి" అని యాకి బట్టినారట.

మరియొక ఏటి వసంతమున "చికిలి సిగ్గులు కనులు తొలకరించెడు వధువు తోడ కవికి పెండ్లి జరిగినదట." ఆ సమయమున వారికి 'మాకంద వనలక్ష్మి చిగురుటాకులె జోతలుగా నెత్తి నివాళులర్పించినవట. లేతకెంపుల గుబాళించు మామిడిపూలు వారిపైన ఆశీరక్షతలు రాల్చినవట. నవ్యవధూ తనుస్పర్శచేత కించిత్ ఉష్ణమై కవి మనస్సు తొందరించుచుండగా, అప్పుడు వినిపించిన 'కుహూ' యను కలస్వనము అతనిని మరింత ఉడికించి వల చల్లని దవ జ్వాలలను దరికొల్పినవట. మనసు పట్టగలేక ఆమెపైపు చూడగా, బుగ్గలు గులాబిమొగ్గలై దీపించినవట. మన్మథ బాణములు సపరింపజేసినవట కావుననే అతనికి పికరవమనినను, మామిడులన్నను పూలనినను, లలిత భావనల చిగురించి ఆనందింప జేయునట. ఇది వివాహ సంప్రదాయములను నవ వధూవరుల సహజ భావనల తలపింప జేయుచున్నవి
మరియొక వసంతమున కవిగారి సకియ తన పుట్టినింటికి పోయినదట. ఏకాంతమును భరింపలేక కాళ్ళీడ్చుకొని వాగు గట్టుపైకి ఏగి ఇసుకలో మేను వాల్చినాడట. అంతలో దక్షిణదిశనుండి జాలువారిన మందమారుత గంధలహరికలు అగ్ని సదృశములయిన వనుటచేత.

"ఇది దక్షిణానిలమ ? ఏది దాక్షిణ్యమ్ము ?
పేసులోనె నేతిబీరకాయ విధాన"
ఇది చందనాద్రిను గురించిన సమీరమా ?
భుజగ విష నిశ్వాస పూత్కారమే కాని" అని కవి తన

విరహవేదనను విప్రలంభ శృంగారమున వర్ణించినాడు.

ఇచ్చట నారాయణరెడ్డి యిట్టి సమయమున మరుడు విరహజనులకు ఎట్లు చిచ్చుపెట్టి అలమటింప జేయునను బాధ తీవ్రతను ప్రకటించినాడు.

వసంతమును చివరి రోజులలో వచ్చిన సకియ పండువెన్నెల బయలులో చేసిన వెంపు హాస్యలను చూడగానే కవి గుండెలు గుభిల్లుననవట. అ విషయమును

"ఇది ఎక్కడి పరీక్ష ? పదునైన సూదితో
మెల్లమెల్లగా గుండెమీద గ్రుచ్చెడు శిక్ష" అనియు,

విరహసమయమున ఒక్కొక గడియ ఒక్కొకదినమై పోయినపనియు, అయినను ఇప్పుడు "అగడియలే యుగాలుగ, కల్పకల్పములుగ సాగిపోసాగె" ననుటలో కనులముందు లేని సమయమున నున్న విరహబాధకన్న ఎదుటిగా నుండిన విరహము యొక్క తీవ్రత అతి గొప్పదను సత్యమును తెలిపినాడు.

వసంతమున మదిరేక్షణల స్పర్శాధికముతో గలుగు దోహదక్రియలను వర్ణించు సందర్భమున ప్రతి చేష్టతో నిలువెల్లపూచుట, ఇరుచేతులు జోడించినపుడు నడుమ గోరింటమైపూచుట, మొగము త్రిప్పుటచేత సంపెంగ పరవశించుట, నిట్టూర్పుతో సింధువారమై రసీభావము దహించుట, నవ్వులలో సురపొన్నలు సోనలు కురిపించుట చూపులో తిలకమైన ర్తించుట, మాటవిని కొండగోగు, కూనిరాగముతో ప్రేంకణము రసాబ్ధిని పుడిసిలించునట్టివంటి వృక్షదోహదములకు సంబంధించిన కవి సమయములను చమత్కరించి కవితాబద్ధము చేసినాడు. వృక్షదోహదములు ప్రబంధములలో ఎక్కువగా కనిపించు వర్ణనా విశేషము. కవి ఈ వర్ణనములను తన కావ్యమునందు ప్రయోగించి తాను సంతరించుకొనిన ప్రాచీన కావ్యాభినివేశములను ప్రదర్శించినాడు.

గ్రీష్మము నందు వేసవి పురమునందేకాక పల్లెలయందు కూడ సమ ప్రభావమునే చూపును. పేదరైతు పెంకుటిల్లు ఇంటిలో గల మిరప అంటెము అంటుకొని మసియైనవి. గడ్డివాములు తలగబడి యున్నది. వడదెబ్బకు ముసలి ఎద్దు నేలకొరిగినది. పాడిగేదె దొమ్మ రోగముతో బాధపడుచున్నది. లేగదూడ పుడిసెడు నీళ్ళకై గిజగిజలాడుచున్నది. కోడి కూయకముందే మోటలు కొట్టువారి ఏలపాట సస్యలక్ష్మికి మేలుకొలుపైనది. ఏతము వేయువారి గాలిపాటలు కూలినాళికి ఉత్సాహమును కల్పించినవి. వరిపంట ఇంటికి రాగానే రైతుల బరువులు తీరినవి. ఇవి అన్నియు పల్లియుల జీవితమునకు సంబంధించినవి. వేసవిలో జనులకు, పసపులకు కలుగు కష్టసుఖములు కేవలము కవి వర్ణించుటతోనే తృప్తిపడలేదు. యథార్థ జీవిత కథనమునకు పూసగ్రుచ్చిన కథవలెగా దరిసన మిచ్చినాడు. ఏ ఋతువర్ణనా కావ్యము నందును మనకు ఇటీవల ఇంత విశదముగా యీ అంశములు కనుపట్టు వనుటలో సందేహము ఉండబోదు.

వేసవిలో లభించు కోత మామిడిపండ్ల నధికముగా సేవించుట వలన
"ఒంటి నిండుగ కందిగింజల । వంటి కురుపులు సలపరించెను"
రేగుపండ్లటు కాకగడ్డలు
రేగి త్రిప్పలు పెట్టసాగెను" అను వర్ణన సహజము

కవి ఎండవేడిమిని భరింపలేక

"ఈ నిదాఘు మహోష్మతో నీ
ఇంటిలో జీవించ లేనిక
పోయి యే చలివేంద్రనో తప
ము బొనర్చిన పీడ విరుగును" అనిన మాటలు విని

కవి భార్య గ్రహించి,

పడుచు కన్నెలు నీరు వోసెడు
పంచలో మీ తపమ్మేమిటి ?
కొంత కొంతగ మీ తపమ్మది
కొంగ జపమును బోలియున్నది" అని మందలించగ,

ఆ వ్యంగ వచో విలాసము గ్రీష్మ తాపమును చల్లబరచినది కవి తెలిపినాడు.

వర్షము వెలసిన పిదప కుఱ్ఱవాళ్ల నీళ్ళతో ఆడే ఆటలు వారుపడే సంతృప్తి సంబరాలను కవి వర్ణించేనాడు బాల్య స్థితిని తలంచినాడు. తాత్త్వికా దృష్టితో

"అరిషడ్వర్గమ్ముల బంగరు పంజరములను జిక్కి
తన్నుకొనెడు యౌవనమ్ముకన్న బాల్యమెంతహాయి"

"జరగినదానికి గుండెల జరచికొనుట గాని, భావి
కోసరమై గోళ్లు గిల్లుకొనుట గాని లేని బాల్య
మెంత సుఖప్రదము ? దానినే కాదని త్రిదశత్వము
తెచ్చి పెట్టుకొన్న యట్టి దివ్యులెంత వెఱ్ఱివారు" అని

కవి వాపోయినాడు, వర్షాఖండమున కవి వ్యవసాయ కృత్యగానులను వర్ణించినాడు. ప్రతి రైతు బలరాముని ప్రతినిధియై నాగలిని పట్టి నడచినారట. ముసలి ఎద్దు కోడెలు నాగళ్లను గొరగొర యీడ్చినారట. ఈ సమయమున ఇడుగులు ఇరువాళ్ల దున్నుట, విత్తనములు విత్తుట జరుగును. ఆరుద్ర పురుగులు కొక్కిగొడుగులు, పొందలు కనబడును. ఆకసమున బలాకలు బార్లు గగన లక్ష్మి మెడలో కలువపూల దండలవలె అగుపడును. కప్పల అఱపులు బహు రూపుల వానిని తలపించుచుండును. ఇంద్ర ధనుస్సు "పిల్లలు నింగిని చేరుటకై దేవుడు నిల్పిన నిచ్చెనయో" యనునట్లు నిలిచె ననుట మిక్కిలి హృద్యము.

కవి బాల్యమున భావ శబలత కడు అమృతము.

"చిత్ర జగతి వీరుల వలె చివ్వున పై కెగసిపోయి
హరివిల్లును పట్టుక వ్రేలాడి, జారుబండ లాడి
అలసినప్పుడొక మబ్బు తలగడగా, ఇంకొక్కటి
పానుపుగా పవ్వళించెనని నాడనిపించెను"

"చిట్టిపొట్టి మెఱుపులనేమో కటార్లుగా, పెద్ద పెద్ద
మెఱుపు తీవియలనేమో కొరడాల్‌గా చేతబట్టి
జళిపించుచును తుంటరి కుఱ్ఱల చెండాడుటకై నే
పన్నిన వ్యూహమ్ము లిప్పుడెన్న నవ్వు తెప్పించును"

వర్షధారలను వర్ణించుచు కవి శ్రావణ మాసమున వర్షాసుందరి "మడుమ లంటెడు జడపాయలతో అంబరమ్ము దిగి వచ్చిన"దట. అతని పాలిట అడవి మొల్లలు, జాజిపూలు, మొగలిరేకులు మదన బాణములట. కనుపాపల బోలిన తీయని పాపలు కలిగిన తలిదండ్రుల భావనా రీతులను చక్కగ వర్ణించినాడు. వర్ష ఋతువు నందు తడిసిన కట్టెలు మండక పొగచూరుతో బాధపడు గృహిణులు, "గ్రాసములేని పేదల ఆసాములగతి ఏమన"? అని కవి వారిపట్లనున్న సానుభూతిని వ్యక్త పరచినాడు.

శరదృతువు నందు జొన్నచేలు మాగపండును. మంచెలపై మగవారు కావలా కాయగా పడుచులు వారికి చల్దిమూటలను తెచ్చెదరు. ఇందు కవి తన చిన్ననాటి సంఘటన నేటికిని వింతైన అనుభూతిగ జ్ఞప్తి చేసినాడు. ఈ ఋతువున వచ్చు పండుగలను ఆత్మశ్రయానుభూతులతో చేర్చబడి వర్ణింపబడినవి. ఆశ్వయుజ మాసములో నవమినాడు జరుపుకొను బతుకమ్మ పండుగ స్త్రీలకు అత్యంత ప్రాధాన్యమైనది. రకరకాల పూలను రంగురంగులతో పేర్చబడిన బతుకమ్మ ఎంతో ఆకర్షణీయముగా కనబడును. మధ్యలో బతుకమ్మలు పెట్టి, చుట్టు తిరుగుచు పాటలు పాడు స్త్రీలు "మన్మథుడు వేయిరేకుల పద్మమును త్రిప్పుచున్నట్లు" అందముగా కనిపించెదరు. వారు పాడు 'ఊయల పాటలు' గాలులకే గిలిగింతలు కలిగించునట.

మఱునటి దినము విజయదశమి. ఈ దినమున పూర్వులు 'అరికంఠముల నెత్తి కటారుల త్రుప్పు కడిగిన కాలమిది". కాని యీనాడు అది కథలతోనే మిగిలి పోయినదట. జమ్మి పూజలతోనే దసరా సమాప్తము చేయబడుచున్నదను విషయము కవి వ్యక్తపరచినాడు.

శరత్పూర్ణిమ నాటి వెన్నెలలు పాల సముద్రపు నురుగు మొత్తము బంతి

రూపమున ముద్దగట్టినవా ! యనునట్లు 'పార్వణేందుపు ప్రాక్సతి చిగురు చేతుల యంచు విల్చెనట. వర్షపు నీటితో చంద్రుడు కసటు పోగొట్టుకొని మెరసినాడట. సుందరాంగనలు కామధేను క్షీరమును పొడిగా చేసి భూమిపైన చల్లినారట.

చకోరికలు వెన్నెలలను పూర్వజన్మ ఫలముతో మధువవలె త్రాగుచున్నవట.

శరత్తు ప్రియ సమాగముల నెక్కువ కలిగించి, తృప్తి ఆనందములను పంచు నను విషయమును వర్ణించి కవి శృంగార పరమావధిని చాటినాడు.

హేమంతమున వచ్చు దీపావళినాడు "చలి పొంగకు ఆశ్రయమిచ్చిన చీకటి శిరస్సు పగిలి పదహారు వక్కలైన విధముగ మందుగుండ్లు ప్రేలినవని కవి ఉత్ప్రే క్షించుట ఆయన నవనవోన్మేష ప్రతిభకు చక్కని ఉదాహరణ. దీపావళి రోజున దివ్య దీధితులను చిలికిపోవ నిరాశా జీవుల చీకటి బ్రతుకులందు ఆశల వెలుగులు చిగురించును.

వ్యవసాయ క్షేత్రమున చేలు పసుపు రంగులను ధరించును. గుమ్మడి పూలు క్షేత్రలక్ష్మి బంగరు గిన్నెల వలె, మిరప పండ్లు నీరు దిగని కేలి పగడముల గుత్తుల వలె కనపడుచున్నవట. ముద్దబంతి పూలు మంచు భయముతో రూపము మార్చు కొనిన తామరవలె తోచినవట. కోతలు పూర్తియై ధాన్యము ఇల్లు చేరగ, కాపుల కాపు రములు సంక్రాంతి శిబిరములైనవట. భోగిమంటలు వేసి చలిని కాపుకొనుట, సంక్రాంతి నాటి గంగిరెద్దుల ఆట కన్నుల పండుపుగ వర్ణించినాడు. మంటల కాగు నపుడు తీసికొను జాగ్రత్తలు చలిగి తట్టుకొనుటకు గొంగళ్లు శాలువల వంటి వాటిని కప్పుకొందురు.

నారాయణరెడ్డి శిశిర ఖండమున దంపతుల సుఖనిద్రను అత్మ పరముగ వర్ణించినాడు. చలి "మంగలి కత్తి చేతగొని ప్రాణులను చిత్రవధ" చేయును. శిశిర మున చెట్ల ఆకులు తెల్లబడిపోయి రాలిపోవును. వన వీధులందు నిలిచియున్న జీర్ణ తరువులను చూచినపుడు "ఎవరి బ్రతుకైనా యింతేకదా"! యనిపించి కన్నులు చెమ్మరింప జేయును. తరు విలాసినుల జాతకము "పూలమ్ముచోటనే కట్టెలమ్ముకొను గతి పట్టె"నన్నట్లు మారినదట. ఋతువర్ణన నెపమున జీవిత సత్యములను వివరిం చిన తీరు అపూర్వము. నారాయణరెడ్డి తాత్త్విక దృష్టి యిచట కవితాత్మకముగ

చక్రాని జాతీయములలో, తెలుగు నుడికారములలో, ప్రస్ఫుటమై కావ్య గౌరవమును పెంచుచున్నది.

"ఋతుచక్రము" జీవితచక్రమట్లు" భ్రమణ శీలము గలది. ఒక ఆకురాలి బాష్పములు కురియగా, వేరొక ఆకులో తరిపి వెన్నెలలో విరియును.

"ప్రకృతిలో అణువణువునందు సుప్తమైన చిన్మయ శక్తి ఎగదన్నిన బహిర చిహ్న పంక్తులు". వృక్ష సంతతి శిశిరములో వికృతి చెంది వసంతములో తిరిగి చిగిరించి నిలిచెడి రీతిగ మానవుని 'అయసృష్టి' జరుగుచుండు ననుట జీవిత సత్యము.

నారాయణరెడ్డి 'ఋతుచక్రము'లో స్వభావోక్తులు, ఉపమలు, ఉత్ప్రేక్షలు, అర్థాంతర న్యాసాలంకారాదులు కోకొల్లలు. ప్రతిపదము, పాదము అలంకార మయము. అర్థ భావముల నన్యసామాన్యములు.

వీరి కావ్యములో వీనిని ఎత్తిచూపుట యన "నీటికేత వేసినట్లే" యని పించును. అయినను కొన్ని మచ్చునకు చూపవలసిన అవసరమున్నది.

వర్షాఖండమున మేఘముల వర్ణనలలో ఉపమ ఉత్ప్రేక్షలను గుప్పించినాడు.

మేఘములు "గ్రీష్మాదిత్య ప్రచండ కిరణమ్ముల కడ్డము నిల్చిన గొడుగులు"

"నీలినింగి పందిరి కొరిగిన ద్రాక్షా పకాత్వఫల గుచ్ఛములు" అట్టి మేఘముల కదలికలను "మదోన్మత్త సామ యూథముల వలె"

"నెమ్మదిగా సాగె నెలలు నిండిన చూలాండ్రవోలె"
వాని పరుగులను శంఖధ్వని విన్నంతనే శాత కృపాణములు దూసి, హుంకరించు వీరులవలె ఉరకలు పెట్టినవట. కొన్ని మేఘములు రాత్రిపూట నుబ్బరము నోర్వలేక మునివాకిట పడుకొనిన జనమును.

"దొంగవోలె దడదడ ఒక జలు వచ్చి నిదుచుకపడె"నని ఉపమించుట కవి లోకజ్ఞతను చాటుచున్నది.

"భేకమ్ములలు అఱపు "బహురూపులవాని వదరు తనము" వలెను, మన్ను

నెదుటి కంటుకొనిన ఆంభోతును నందిపలెను. పోల్చుట కవి ప్రతిభకు నిదర్శనములు.

"గ్రీష్మము నందు ఎండుటాకులు "పెద్ద పదవి గడించు అల్పుల వోలె" కనపడినట్లు పోల్చుట ఎంతయో తగినట్లు కలదు.

గ్రీష్మమునందు బూరుగు పండ్లలోని దూది గాలికి పింజలై తేలగా "వడలకు పృథివి సురుసులు గ్రక్కెనో" యనునట్లు ఉత్ప్రేక్షించుట సహజ సుందరము. గ్రీష్మాగమమున "యక్ష గానములోని రాక్షసుని వలె హుమ్మ"ని వచ్చినదట. గ్రీష్మతాపమును "నాటి రుద్రుని క్రోధమా"యన్నట్లు తీవ్రించినదని" "యముని మహిషపు అంకె సాగిన యట్లు 'సైరను' కూత పెట్టగ" వంటి ఉత్ప్రేక్షలు కలవు.

భామినులు బ్రతుకమ్మ పాటలను పాడుచుండగ "రచ్చబండలు కూడ కన్నులు విచ్చి చూచిన యట్లు" తోచెనట. హేమంతమున చలికి "చండభానుడు శత్రుని పోలిక" నుండుట సహజము.

సూర్యచంద్రులు ఈ కాలమున

"ఒకనాడు జ్వాలముగ భువి
నూగించిన రవి చంద్రులు
పదవీచ్యుతులైన మంత్రి
వర్యులట్లుంరెరి నేడు" అని

వర్ణించుటలో కవి రాజకీయ పరిజ్ఞానము వ్యక్తమగుచున్నది.

శరత్ ఖండమున
పెరడులోనున్న బీర పూవులు

"మేలి పచ్చల రాశిపై గోమేధికములు విరిసినట్లు" గోరంట పూలు "వన్నె వన్నెల పరిమళ ద్రవ్యములు నిల్చిన గిన్నెలో" యన్నట్లు అరటి పూల వలన లేచూపరాగ ధూళులు విరిసిపోగా "పగలే వెన్నెల కురిసెనో యన్నట్లు" అనేకములైన వినూత్న వర్ణనలతో ఉత్ప్రేక్షలు ఇందు కనిపించును.

సహజ స్వభావోక్తులందు ప్రతి పదమునందు కనిపించును.

హేమంతమున

"ఇంటి పట్టులో నుండుట యనగ
ముండ్లపైన కూర్చున్నంత పని" అగునట

"గుడిసెలోని మట్టిదివ్వె
గుడి లోపలి మణి దీపము
సమానమ్ములే రెండును
తమస్సులను కసిగివేయు"

కొన్నిచోట్ల అవి ఋతుచక్రమున అర్థాంతరన్యాసములు చోటుచేసుకొనినవి.

"పగిలి పూర్తిగ విచ్చిన ప్రత్తిచేనును చూడగ
వెఱ్ఱిబాగులది నవ్వినయట్లు కనిపించె"
ఔనుమరి ! విశ్వకళ్యాణార్థమై పాటు
పడు మహాత్ములకు పైపై మెరుగులెక్కడివి"?

అని సమర్థించుటలో విశ్వకళ్యాణమునే కోరినాడు.

నారాయణరెడ్డిగారి ఋతుచక్రమునందు లోకోక్తులు, జాతీయములు, సామెతలు, సమకాలిక సమస్యలు, ప్రతిబింబించుచుండును.

"పిడికింతటి గుండె లేట్టులుండు"
"పేరులోనే నేతి బీరకాయ విధాన"
"అగ్నులకు గాడ్పు తోడగును లోకమున"
"తావి మాత్రమే పూవు తాకబోకన్నట్లు"

గ్రీష్మము నందు 'కాలిమిసూడిన యట్లు దినమంతపడికి జోయె".

"ఈడు వచ్చినవారికే కద ఎండయైనను నీడయైనను"

"ముసలితనమున ధూర్తునికి కోసముకుక్క్రపై
కోపమ్ము పోలిక"

"నిప్పులోపల మాటిమాటికి నెయ్యిపోసిన యట్టులయ్యె"
"కొంతకొంతగ మీా తపమ్ము కొంగ జపమును
బోలియున్నది''

"ఊరికే పోవునా నాతోసిగల సహవాస దోసము"

వర్షాఖండము నందు

"తడిగుడ్డలతో గొంతులు తెగిగి ఏమి యెరుగనట్లు
దిక్కులు చూచెడు వానిగతిన్ కన్పడె"

"కాంపలు మున్గిన వార్తను కొంపోయెడు వానివలె పర్వొత్రి"

"పాపపున్నెము లేరుంగని ప్రజల నదరగొట్టు వానివలె"

"వయసుకొద్ది నిలకడవలె ఉచ్చిలి తనముడిగిపోయి
ఓర్మి కుదురుకొన సాగెను"

"పోయి రాచుటకే యింతటి పురాణమ్ము''

"పూవుతో పనియేమి పరిమళముల్ హృదయాంతరమందు
నిల్చెను''

"అమ్మమ్మ కాని ఉదయమన్నది జన్మలో లేని పడటి దిశ"

"దుమ్ము కప్పిన అద్దంపు బిళ్ళ''

"మంట కంత దగ్గరగా మసల వద్దే తల్లీ''

"ఇదియేమి అత్తగారే మనను, లేవనిండు"

"పనిమనిషి వచ్చె ఇకనను వెళ్ళనిండు''

"జాము ప్రొద్దెక్కె ఇదియేమి చోద్యపు నిద్రలమ్మ"
"కొడుకు కోడలు చిలుక గోర్వంకలటులన్న
నిత్యమ్మ మన యెదుట నిండు పున్నమ కదా!"
"అమృతమ్మ వర్షించు అమ్మమాటల తోడ"
"మాసానుమాసపు చలి మంటలం బోదు"
"ఎవరి బ్రతుకైన నింతేకదా యనిపించు"
"పూవులమ్మ చోటనే కట్టెలమ్మకొను గతిపట్టె"
"విశ్వకళ్యాణార్థమై పాటుపడు మహాత్ములకు పైపై మెరుగు లెక్కడివి"?

"దొరగారి కింకేమి వరహాల కొడుకు"
"ఇరువురును కూతుళ్ళె ఇక నొక్క మగమొలకైన
బాగుండు" నను అమ్మ కోర్కె ఫలించె
"దీన లోతున లోన ఒక రసా
త్మకుడైన తన బ్రతుకు దర్శించినం జాలు" వంటివి
కానబడును.

కవి 'ఋతుచక్రము' అను కావ్యములో
'వసంత శిశిర ఖండములు ఖండగతిలోను,
గ్రీష్మ శరత్ ఖండములు మిశ్రగతిలోను,
వర్షా హేమంత ఖండములు త్ర్యస్రగతిలోను నడిపించినాడు.

భావాలను రెండు, నాలుగు పాదములలో అన్వయ కాఠిన్యము లేకుండా చక్కగా నింపినాడు. రచన చాలావరకు సులభశైలిలో సాగి సహృదయులను రంజకమై అలరారినది.

పల్లెజీవితమును ప్రతిబింబించే మాండలిక భాషా ప్రయోగములు తెలంగాణకు చెందియున్నవి.

సవారి బండ్లు అను పదము బరువులు కొనిపోవుటకుపయోగ పడునవి. ఇందు 'సవారి' యనునది ఉర్దూపదము. ఇట్టి పదములు తెలంగాణము నందెక్కువగా వినబడును.

అడ్డెడు, మిరప అంటెము, మోటబావి, కాకగడ్డలు, ఉచ్చిలి తనము, ఇరువాలు, పొంటెజాము, బహురూపుల వాడు, తుంటలు, అసామి, దానిసము, ఇంద్రుమను, కొయ్యకాలు వంటి పదములు తెలంగాణమునకు చెందినట్టివి.

ఈతని కావ్యములో ప్రతి ఒక్క రసాత్మకుడు కవి భావాలను, అనుభూతులను తన బ్రతుకులలో దర్శించు ననుట సత్యము.

ఈ కావ్యము 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి' బహుమతి పొంది సార్వజనీనతను సాధించినది.

ఋతువర్ణముతోపాటు ఆత్మాశ్రయత్వమును పండుగలను, ప్రకృతి సౌందర్యమును తన కవితలో మలచి అందించబడిన మహత్తర వర్ణనా కావ్యమిది.

ఆచార్య బి. రామరాజుగారి వివృతి యందు "ఆధునిక యువకవులందగ్రేసరుడు. మిత్రుడు సి. నారాయణరెడ్డి కూడ కాలమహాస్రవంతిలో ఒక్క ఏటిని మాత్రము తన కవితా చక్షువున కందినదాని దిఙ్మాత్రముగా నీ ఋతుచక్రమునందు ప్రదర్శించినాడు. ఇది యాత్మాశ్రయ కవిత్వమైనంత మాత్రమున ఈ అనుభూతు లితరులకు చెందనివికావు. ఇది నారాయణరెడ్డి స్వీయచరిత్రము కాదు; కాకనుపోదు! ఉత్తమ కవులకు స్వ, పరమను నెల్లలుండవు. సాధారణీకరణమున వారి యనుభూతులు లోకమున కింతటికే నాస్వాద యోగ్యములగును. నారాయణరెడ్డి కవితా వైశిష్ట్యమును గూర్చి యిది చెప్పబూనుట అనవసరమని ఎంతును "గుండెలోన రసవద్ధ భాండమ్ముల దాచి నగ్న సుందరమ్ముగా" కదలినదీ ఋతుచక్రము". మధుమాసపు వడుచుమల్లెల తావులు, గ్రీష్మకాలపు ముదురబండిన కోతమామిడి రుచులు, వార్షికాభ్రమున విరియు హరివిల్లుల శబల కాంతులు, శరత్కాలపు మసృణ చిక్కణమైన వెన్నెల చలువలు- హేమంత నిశాంతమ్ముల నాత్మారాముని యేలుకొల్పు ప్రాభోధికీ గాన గాంభీర్యము, శైశిర శిధిల ప్రకృతిని పునరుజ్జీవింపజేయు విశ్వకళ్యాణ భావనలిందు పొందుపడినవి."

## గుంటూరు శేషేంద్రశర్మ

### "ఋతుఘోష"

గుంటూరు శేషేంద్రశర్మ 'ఋతుఘోష' వసంతాది షడృతు వర్ణనా కావ్యము ఇందు ఋతుప్రకృతి ధర్మముతో పాటు, గ్రామిక జీవులపైబడు ఋతువుల దౌర్జన్య సౌజన్యములను చక్కగా సమన్వయించుటచేత ఈ కావ్యమునకు 'ఋతుఘోష' యను నామంబు సమంజసముగా నున్నది.

శిల్ప భావసౌష్ఠవముతోపాటు ప్రాచీన కవిత్వము వలె ప్రౌఢ పదజాలముతో నింపిన 'ప్రాత క్రొత్తల మేలు కలయికతో,' ఒక కవితా వస్త్రాన్ని నింపి, కాలమునే తన కావ్యములో కట్టుబడి చేసినారు. ప్రాచీన కవుల కవితారీతులను అనుకరింపు చేసికొని, శ్రీనాథునివలె ఒరవడి పోసినాడు. ఈతని రచనలలో ఈ కాలమునకు చెందిన కవిసామ్రాట్ విశ్వనాథ, గుఱ్ఱం జాషువా, రాయప్రోలు, కృష్ణశాస్త్రి పలుకుబడులు ఎక్కువగా కనబడుటచే ఆధునిక కవిత్వరంగములో వారితోబాటు పేర్కొనబడుచున్నాడు.

'ఋతుఘోష' ఆత్మాశ్రయము కాకున్నను, ఆత్మానుభూతులను గూడిన వర్ణనా కావ్యము. ఆరు ఋతువుల నాకళింపు చేసికొని, ప్రకృతిపైబడు ఋతుప్రభావములను అవి గ్రామిక, బీద జనులపై చూపు పక్షపాత ధోరణులను, కవి కన్నులకు కట్టినట్లుగా వర్ణించినాడు.

శేషేంద్రశర్మ సంస్కృతాంధ్రాంగ్ల బహుభాషా కోవిదుడు. మడగాస్కర్, కెన్యా, జర్మనీ, ఫ్రాన్స్ ఇటలీ ఇంగ్లాండ్, గ్రీస్ వంటి విదేశములు తిరిగి, అక్కడి ప్రకృతి సంపదలను, ఋతు ప్రవృత్తిని గమనించినాడు ఇతర భాషలలోని కవితా మాధుర్యమును తెలుగు అనువాద కావ్యముల నింపి కృతకృత్యుడైనాడు. కావ్యములే కాకుండా, కథా, నవలా సాహిత్య ప్రక్రియలన్నింటిలో తన ప్రతిభను చాటుకొనినాడు. వాల్మీకి రామాయణము, హర్ష నైషధము, అలంకార చర్చలపై సాహిత్య విమర్శనా గ్రంథములను కూడా వ్రాసినాడు, వీరి పరిశోధనా వ్యాసంగము నంతయు పశ్చిమ జర్మనీ లోని 'గాటిన్‌గెన్ ఇండోలాజికల్ యూనివర్సిటీ' లో జరిగినది.

ఇతర కావ్యములలో ప్రకృతి వర్ణనలు, ఋతు వర్ణనలు అక్కడక్కడ చోటు చేసికొని నప్పటికిని, వాని ప్రాధాన్యతలను సాహిత్యమునందు గల స్థానమును

ప్రత్యేకముగ తెలుపవలెనని తలంచి, ఋతువర్ణనలనే 'ఋతుఘోష' యనుపేర రచించినాడు.

వృత్తిరీత్యా మున్సిపల్ డెప్యూటి కమీషనర్ అగుటచేత, శ్రామికులు పడు బాధలు అతని కంటబడి, హృదయమును కలచివేయ, 'ఋతుఘోష' గా కలము సాగినది.

శేషేంద్రశర్మ 'ఋతుఘోష' కావ్యములో వసంతఋతు ఆరంభకాలమున ప్రకృతి ఎలప్రాయములో విశ్వమందిరము నందున హేమాకళామూర్తితో కన్నుల పండువుగా కొలువైయున్న పురుషుని కోర్కెలను జారవిడిచి, మేను పులకింపగా "సొంపుల్ కుల్కు సింగారియై యందుల్ కెంజిగురుల్ ధరించి" నడచు అని వర్ణించుట కవి వర్ణనా పాటవమునకు నిదర్శనము

అందమైన మధుమాసము నందు వసంతర్తువును వర్ణించిన తీరు నూతనము. "ఎందు జూచినం నవమల కాంతులం గులుకు జాజులు, మల్లెలు, తీగ సంపెంగలు, కొదమ గులాబులు౦ జిగురుకొమ్మల రెమ్మల కాద్వలమ్ములన్, ముదమున సుమ సముద్రమున ముంచెనట," ఊహా విహంగము 'వసంతమున్న అందగించు, తరు ప్రపంచ నిచయంబును, విశ్వవైశాల్యంబును, ఆకాశమును మహా జలధులను," చూచి ఉత్కంఠతో నెగిరి పోవుటకు ఆశించినదట. మా కంద తరు ప్రవాళములతో కోకిల భామా కంఠము శంఖమై మొరయుచున్నదట. ఆకాశము 'శుంభత్ కీర నారీదళ శ్యామంబై' మెరిసినదట.

శిశిరర్తువు నందు వ్రతాచారములందు జీర్ణమైన మారుతము తిరిగి గంధముల నలుముకొని పునర్జీవితమైనది. ఎండు వేణువు చిక్కని చిగురాకు పెదవులను తగిలి, కంఠమెత్తి పాడినది. ఆకులన్నియు రాల్చుకొని నవసిగా మసలిన సస్యవల్లిక తిరిగి చిగురెత్తినది. యోగివేషములోనున్న కీటకములు, అందమైన సీతాకోకచిలుక రూపములదాల్చి, కంకేళిని గదిసినదట. ఇట్లు వసంతమునందు గలుగు ప్రకృతి సహజమైన మార్పుల వర్ణన అత్యంత సుందరము.

గ్రీష్మఋతువున లోలంబంబు ధ్వనించినదనియు, ఆకాశము వీరెండలను గండూషించినదనియు, వర్ణించుట అతని ప్రబంధ ధోరణిని తలపించును. ప్రత్యూషము లందు కెందమ్మి విరిభాయవలెను, కుతపవేళ గుమ్మడిపూవన్నె పలెను,

మధ్యాహ్నములందు మల్లెవంతలశోభ వెల్లి విరిసినట్లును, అపర సంధ్యల యందు సింధూరకాంతులు చిలకరించునట్లును గ్రీష్మ కాలాతపమును వర్ణింపబడినది.

వర్షఋతువునందు ఆత్మవేదనకొక స్త్రీ ఆకారము నిచ్చి అతి రమణీయముగా వర్ణించుట శర్మగారి ప్రత్యేకతను చాటుచున్నది. ఆమె కబరీభరములోని కురులు ఇనుక రీతిగ చికురనికరము (మెంగ్రుకల) వలె నుండి, జావిల్లి రేకచేత అందగించు చున్నదట. ఆమె ఎదలోని ఆవేదన కాకలి నినదమువలె ధ్వనించినదట. ఆమె మేను విరిచి నిట్టూర్చిన మాటికీ వేడి ఉసుర వాయువులు ఆత్మవేదనా భరితముగా కవిగారిని కాలుచేసినదట. ఆమె ఒక్కసారిగా మేను విరిచిన పరిస్థితులను ఆమె ఎదలోని కోప తపన ఆవేశముల వర్ణన అమోఘము ఆమె జఘన ప్రవేశము నందలి ఘంటికలు గజగ్రైవేయ (కంఠ) ఘంటికల వలె ధ్వనించినదట. ఆమె నాసికాపుట ప్రదేశములు భేతాళ, లుంఠన క్రియల రుద్రభూములవలె నున్నవట, రాక్షస కఠోరాట్టహాసము వలె ఆహార్యబిలము అంతరంగ మందలి తాపమును ప్రకటింప జేయు చున్నట్లు వర్ణితములు.

వర్షము కురిసిన రీతి కన్నులకు కట్టినట్లు వర్ణింప బడినది.

"విరిసెను మేఘ పరంపరి
మెరసెను శాంపేయ లతలు మిన్నులు మెరసెన్
పరచెను ఝుా ంఝుా నిలయములు
కురిసెను వర్షంబు కుంభ కుంభిత రీతిన్"

అట్లు కురిసిన జలరాశి ఘోష ఉద్రేకముతో గీతముల నాలపించుచు పరుగిడి పర్వత సీమల దిగి, నిర్ఝరులుగా మారి మహారణ్యములలో హరిదంత దంతురములై వ్యాపించినవట. వాపీ (సరస్సు) కూప తటాకము లందలి భేకములు మొదలగునవి జీవానేకలోకముల యొక్క ధ్వనుల రొదలు వ్యాపించినవట.

శర్మగారు శరదృతువును ఉజ్జ్వల శారదారాత్రులతో ప్రారంభించినారు. ఆకాశముతో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ముద్దుగొలుపు చంద్రుడు 'రేరాజు' గా కాకుండా 'రారాజు' గా ముల్లోకాలను ఏలుచున్నాడట. ఆయన విరజాజి తీవెలమీద విరహిణీ స్త్రీల మీద, తన అక్కసును వెళ్లడించు కొనునట్లు, వెన్నెల యనెడి తరపి

పాలను త్రాగించుచున్నాడట. అతని ప్రియురాండ్రయిన చికిలి తారకలు అప్సరసల వలె అందాల తళుకులతో ప్రియుని చేరుకొంటున్నాయట. నిర్మలాకాశమనే నీలాటి రేవులో పండువెన్నెలలనే నీటిలో పిండి ఆరవేసిన తెలిమబ్బులనే వలువలు తేలి పోతున్నాయట. ఇట్టి వర్ణన లనేకములు. ఆతని వర్ణనా పాటవమును చాటుచున్నవి

అంధకార వర్ణనము అతి చక్కని సహజ సౌందర్యమును తెలిపించును "సాయం సమయములో అర్కమండలము సాంధ్యశ్రీసుల కొల్పోవుచూ, ఏ వాపిలో గ్రుంకెనో" యనునట్లు అంధకార మొక్కసారిగా సముద్ర మంత విశాలమై లేచి వ్యాపించినది. సాంధ్యరాగ శ్రీలు సాగిపోవుట వలన ఎవరో క్రీనీడలు వ్యాపించు చున్నది సహజ భావన. అల్లె కాకర పాదులోని కిచురాని జంతువుల గొంతులు జగమును ముంచి వేయుట. గదిలో గ్రుడ్డి ముసలమ్మ వత్తేయున్న దివ్వె, తన వెలలేని జీవితమును తలపోసుకొంటున్నదనుట సహజముతే. హేమంతమున చుక్కలు హావమున రీతి సహజ వర్ణనమున గలదు. శరత్కాలమునందు మిన్నుల నిక్కి నిగ్గిన చుక్కలు జారుకొనుట వలన నీలిమాకాశము వెలవెల పోయినదట. అదను చూచుకొని చెంగావి లే యెండలు ప్రాలేయపు జలుగు పరికిణీ ధరించి చిందులాడి నవట. హేమంత ఋతువున ఆకాశమున కానబడు బాలభానుడు

"ఇభ కుంభస్థల వక్త్రికా భరణమో"!

"హేమంత సీమంతినీ కబరీభారముతో ధరించిన

మంజుల కింశుక ప్రసవమో! కళ్యాణ సింధూరమో"!

"శుభ సందోహ మహావతారమో!" యనునట్లు వర్ణితములు శిశిర కాలోదయ వర్ణనము వినుదము

పూల కొరకు బజారుకు వచ్చిన ఒక ఆసాములతో కవి ఆ ఋతు ప్రభావమును వినిపించినాడు.

"జాజుల మీద మోజుపడి
సంతల పుంతల సంచరించి యీ
బూజు బజారు మెట్టితివా

ప్రాచి గులాబి జిలేబి గిన్నెలుం
దేజము లోడ గల్గినవి
తేన్లకు తేనెలూ గోలుపోయి"...... నని దాని

తేజో విహీనతను వర్ణించినాడు.

శిశిరఋతువు ప్రాజీ హిమచంద్రునిచే కాయి వేయబడిన విషయము వర్ణితము. ప్రకృతి

"ఆకులు రాలి శాఖలకు
ఆ - కులపాటు ఘటిల్లె, పాప మీ
లోకము వృద్ధమూర్తి మయి
లోంగి స్మశాన కృశాను కీలికా
సీకము చెంతచేరె .... " ననుట

కవి లోక తత్త్వరీతిని ప్రకటించినాడు.

శేషేంద్రశర్మగారి 'ఋతుఘోష' లో ఋతుప్రభావము పేద, దీన జనుల పట్ల అతి దారుణముగా నున్నదని వర్ణించుచు వారిపట్ల తనకున్న సానుభూతిని వ్యక్తము చేసినాడు.

ఋతువులలో అత్యంత సుందర మనోహరమైన కాలము 'వసంతమే' అయినను, అది అందరికీ అందుబాటుకాదని కవి భావన.

వాసంత రస స్రవంతి ధాత్రీజీవ కూలంబులందు కదియ జారినదట. కాని అందమైన కాసార తీరములలోను, పొదలలోను, తోటలలోను, బాటలలోను, పోలేని కూలిజనులు దాని అందమును రసస్రవంతిని అనుభవింప లేక మనసులోనే పంపుచు ఆ మధ్యాహ్నకాలము నంతయు చేలలోనే తిరిగినారట. వసంతమందున తిమిర తమాల పల్లవము తీరుననున్న కోకిల ఆకులందున కూర్చుండి కుములుచు ఒక కోమల గీతికను పాడినదట. అది సమధిక విశ్వశోకమయి సాహితి పొంపిరి పోగొట్టినదట. అయినా అది శ్రామికుల హృదయ వేణువులను రవళింప జేయలేదని వర్ణించుట కవి ప్రతిభ వ్యక్తము.

"శ్రామికుడు తోరపు పంటచేలను, పూతోటలను, జాడలను, పచ్చబీళ్లను బంగారు తటాకములను, చేరలేని వాడై "ఈ విశాల ధరాతలములో మూర గ్రహాంతరాగత వినూతన జీవిగ తిరిగి ఇల్లు చేరగబోవుచున్న వానివలె" నున్నాడనుట ఉన్నాదనుట ఉదాత్తమైన ఉపమానము. ఇది కవి ఊహాబలమునకు ప్రతీక.

కూలీ వానిని చూచి చేలలో పూలు వెక్కిరించినవట. గగనశ్రీ చంద్రరేఖాంకయై వేళాకోళము చేసినదట. తళుకనట్లు వేలాది తారకలు గేలిచేసినవట. ఘూకము చింతకొమ్మపైన శోకించినదట. అప్పుడా కూలీవాడు కుటీర గర్భమున దీనత్వముచేత నాక్రోశించినాడట. తన జీర్ణకుటిలో నొకవైపు తన ముదుసలి తల్లిదండ్రులును, ముగ్గురు పిల్లలు, చిన్నచెల్లెలు పరుండగా, బిగుసుల చెంత ఒకవైపు తాను, మరోవైపు తన భార్య కన్నులు మూసికొని శయనించినారట. అట్టి సమయమున తిమిరము నేలను నింగియు తెలియకుండునట్లు విశ్వమంతయు నిండగా, మిణుగురులు అంధకారమును చీల్చినవట. చెట్లకొమ్మలు దయ్యములవలె పలించినవట. అయినా ఆ జీర్ణకుటిలో ఎటులో ఆ జీవుడు నిద్రించినాడని వర్ణించుట కవి భావనాశక్తి ప్రశంసనీయము.

'ఋతుఘోష' లోని గ్రీష్మర్తువునందు కలుగు కాలాతప వర్ణనములు అత్యంత సహజములు. కవి గ్రీష్మ ప్రతాపమునకు గురియైన జీవులను వర్ణించిన విధము వర్ణనాతీత.

"దుర్నిరీక్ష్య ప్రభా ఘూర్ణచ్ఛటలతో
క్షేత్రజీవనుల శిక్షించినాడు
పటురోష కాషాయ కుటిలాంశుకలతో
గోగణంబులు చావగొట్టినాడు
ఖరమయూఖ క్రూర ఘన కాండ పటలితో
విహగ జాతులు క్షోభ పెట్టినాడు
గ్రీష్మకాల ప్రాంశు కింశుక ద్యుతులతో
తరువల్లికల కగ్గి దార్చినాడు

గగన ఘనఘోట ఖురసిరాఘాట ఘాటి
నలఘు బ్రహ్మాండ భాండమ్ము పలగద్రొక్కి
చటుల దుర్జన రాజ్య శాసనము వోలె
సాగె మార్తాండ చండ ప్రచండ రథము"

మరియొక చోట మార్తాండుని చండప్రచండుని రథ ధ్వని వర్ణితము.

"ఎవడో చాకలి ఆకలిన్ మరచి తానే వన్య మల్లీలతో
నివహ క్రోడ పుటీ తటాకమున నో నిత్యశ్రమా జీవన
వ్యవసాయం బొనరించుచున్న ధ్వనియె వ్యాపించె ప్రాపంచిక
వ్యవహార ప్రవిహీన విశ్వహృదయ వ్యాపార మేమో యనన్"

గ్రీష్మమందు ప్రయాణికులు పడు బాధలు

"వివిధ నిమ్నోన్నత వీథులం బరుగెత్తి
వైశాఖిలో మేను వాల్చెనొకడు
మధ్యాహ్న పరితప్త మార్గమ్ములం దిరుగాడి
బెజవాడ కన్నీరు బెట్టెనొకడు
మధ్యాహ్న పరితప్త మార్గములం బోయి
గుంటూరులో కుప్పకూలె నొకడు
కాలాహి కుటిల శృంగాటకములు జుట్టి
నెల్లూరిలో సొమ్మసిల్లె నొకడు

రిక్షావాడు క్రూర దారిద్ర్యమనే కారణమున భేతాళమూర్తి ఒక పేదవాని భుజాగ్రముల నెక్కుటచే ఎన్నో బాధలకు గురియై వేసవికాగలేక రిక్షాను లాగలేకున్నాడు. శ్రామికులు పేరెండల ధాటి కోర్చి కొండల పై భాగములను కూల్చి, శిలల చిన్నవగునట్లు పగుల గొట్టి, ఏర్చి, పురీ పరిణయ వీధులందు బండలు లాగుచు తమ బ్రతుకు భారమును మోయుచున్నారనుట — అభాగ్య కోట్ల కష్టములు, వారి జీవన విధానము ఇందు వర్ణితము.

చిన్న పిల్లలకు సైతము పాపమనక గ్రీష్మము విజృంభించినదట. దాని కఠిన హృదయమునకు గునగున సంచరించు పసికూనలు, అబలలయిన చానలు బలియై

పేదికి తాళజాలక ఉన్నారని, నిలువనీడలేని వారిపైన మరియు చెట్ల నీడలందు కాలము బుచ్చు వారలపై గ్రీష్ముడు తన చల్లని చూపు చూడాలని, సమస్త దీన జీ నములు పల్లవించి సుఖవంతములై విలసిల్లాలని కవి కోరుకున్నాడు. అప్పుడే తన మనస్సు "మరు పల్లెలలో చిగురాకు చందము" శమించునని తెలిపినాడు. ఇది ఆ దీన జనముపైన అతనికున్న ఉదారత్వ భావమే యగును.

వర్షర్తు వర్ణనమున పర్జన్యుడు కూడ "హేమ ధామ సముద్ధామ సీమలందు అడుగు పెట్టుటకు భయపడును" కాని అతని పార్జన్య చర్య అంతయు

"భాగ్య విహీన దీనజనుల మీదనే' నని- కవి కొన్నివిధముల బాధలను వివరించినాడు. పర్జన్యుడు చీల్చి తినుట కుద్యు క్తమైన వానివలెను, మన్మథ బాధను కలిగించు వానివలెను, పిడుగు పడినట్లుగా భయపెట్టు వానివలెను, సమవర్తి హుంకార కింకరుని వలెను, చలియనెడి యొలుగుబంటి యొక్క భయంకర కోరవలెను, యువతీ కవోష్ణ సుఖమువలెను, తన ధర్మమును వివిధములుగ నిర్వర్తించు చున్నాడు.

జగన్నేత కూడ ధనిక దీన వర్గములపై వేర్వేరుగా ప్రభావములను చూపుచూ కవి

"అకలంకామృత మిచ్చినా వొకరికిన్ హాలాహల జ్వాలికా
నికర మ్మొక్కరి కిచ్చినాడవు ; జగన్నేత! ఏతద్విధం
బాక కంటన్ దుహినాంశు మండలము రెండో కంట
నుష్టాంశువుల్
ప్రకటింపంగల లోక రక్షణ కళాప్రావీణ్య మేమో ప్రభూ!"

అని ప్రార్థించినాడు.

శరదృతువున దీనజనుల పట్లగల ప్రకృతి ధర్మమును వర్ణించుటలో కవి ఒక వినూత్న ప్రక్రియ నుపయోగించినారు.

"ఈ శూన్య లోకపు యిసుక ఎడారిలో
కళ్ళు మూస్తే పీడకలలు వస్తున్నాయి."
"ఋతువులు మారుగాక
జ్వలియించు క్షుధా వ్యధితోగ్ర జీవన

క్రతువులు మారెనే యుగయుగమ్ముల
భాగ్యమొకింత తీరెనే ?. ......"
"లోకమునకెల్ల నమృతాభిషేక మొసగి
పసుపులెత్తెడి యందాల పాలవెల్లి
పండువెన్నెల రాదేల పంతగించి
చితికి పోయిన దీనుల జీర్ణకుటికి"

"ఋతుకాలము అంతములేని కాల పథమందొక ఒంటెల బారువోలె సాగిపోవుచున్నది. కాని వసంతము యందేకాంతముగా తపించు విధురాత్మను వెంటకొనిపోదు" అని చెప్పుట కలదు.

హేమంత ఋతువునందు కవి లోకబాంధవునితో తన అమల మయూఖముల పరిహాసమ్ము చేయుటకు తిమిరముతోన బాధపడు దీన జనాళికి దారిచూపు మనియు, హార్మ్య పథములందు సంచరించుచు హిమపరిమళయ సౌధముల నెచ్చటనో వసించుట భావ్యము కాదని తెలిపినాడు.

ఆశలు పెంచుకొనిన మల్లె, విరిసి ఊహాలో ముడిసిపోయినదని, అంతరంగములో ఏ ఎలమి ఎగిరిపడియో గులాబి బాల చిలికె నవ్వాలికినదనియు, ఏ కోరిక ఎదనాక్రమించుట వెలెదో, జాజిమల్లె నిట్టూర్పులు పరపించినదని, అయినా పై అందాల భరణిల పద్దనే ఆగిపోకుండా "నీ రాకకు ఎదిరిచూచే శిథిల జీవులకు జీవకాంతులు ప్రసరింప జేయుచు వెలను తొలగిస్తూ వెయిచేతుల్ని కదిలిస్తూ రమ్మ"ని కవి అరుణ మూర్తిని ఆహ్వానించు చున్నాడు.

శిశిరమునందు దీన జనుల ఘోష హృదయ విదారకము.

"చలి పులి వోలె దారుల షికారులు చేయుచుండ ఊరికా
వలపెను మఱ్ఱి క్రింద నెలవంకయె దీపముగా పరున్న పే
దల పసిపాప లెవ్వరికి తప్పు దలంచిరి కాలమే హాలా
హాల మయి పోయె యా శిశువు లాకలితో చలితో నశింపగన్"

కవి ఆ విధముగా బాధపడుచున్న పసిపిల్లలను తలంచుచు

"ఓ పరమేశ్వరా ! యెచట నుంటివి ? నీ వసలుంటివా ? నీవు
శిలవా ? కలవా ? నెలవీయుమని"

నిలవేసి అడిగినాడు. అయినా నిర్భాగ్య ప్రజాకోటిని అణచివేయరాని బాధతో నింపిన అనుదిన జీవిత గాథలచేత కూడుకొనిన సంవత్సరములలో చిక్కుకొనునట్లున్నదను కవి ఊహ ప్రశంసనీయము. చివరికి ఆకలితో, చలితో బాధపడుచున్న ఆ శిశువుచే ఇంధనమై, వారి ఉద్వేల క్షోభ అకాశాంతరాళములలో వ్యాపించి, ప్రపంచ ప్రజానేత్రములలోనుండి బయటపడి, హృదయాగ్ని పర్వతము నుండి పుట్టిన గొప్పదైన రోషాగ్నుల యొక్క జ్వాలాజాలలు, భయంకరమైన జిహ్వికలు తుచ్ఛమైన ఈ లోకమును నశింపజేయును గాక ! ఈ వచనము ప్రపంచమంతట ఘూర్ణిల్లును గాక ! యని తనకు గలిగిన బాధను ఆక్రోశముతో వ్యక్తము చేయుట, అతని మానవత్వానికి సమానత్వ తత్త్వమునకు చక్కని నిదర్శనము.

శేషేంద్రశర్మగారి 'ఋతుఘోష' ఆ యా ఋతువులలో దీన గ్రామికజనుల ఘోషగా వర్ణింపబడు కావ్యమయినను, అతని కావ్యమంతయు రసాలంకారభరితమైనది. శబ్దార్థాలంకారాదులు అనేకములు. భావనా పరంపరలు అనుభవైకవేద్యములుగా గోచరించును. కూలీ జనులపట్ల కవిగారి ఉదారత్వము ఈ కావ్యమున కరుణ రస భరితమై ఒప్పినది. ఋతు క్రమముల సత్ప్రభావముల నందుకోలేని వారి హృదయవేదన శోకతప్తుల జేయును. 'ఋతు ఘోష' యందు ఉపమ ఉత్ప్రేక్షలు, రూపక స్వభావోక్తులు, క్రమాలంకార స్మరణ అతిశయోక్తుల వంటి అర్థానుప్రాసాది అలంకారములు అధికములు. యమకాదుల వంటి శబ్దానుప్రాసాదులు కూడ చోటుచేసికొనినవి. అయినను కొన్ని మచ్చునకు ఇచ్చుట తెలుపుట అవసరము.

వసంతమున,

"గ్రామికుడు దూరగ్రహాంతరాగత వినూతన జీవిగ"

ఉపమింపబడినాడు.

"చెట్లు కొమ్మలును శీర్షముల్ విరబోసి
దయ్యముల్ వోలె చలించె" నట.

గ్రీష్మమున మార్తాండ చండ ప్రచండ రథము సాగు విధము—

"గగన ఘన ఘోరాట ఖుర నిరాఘాట ధాటి
నలఘు బ్రహ్మాండ భాండమ్ము నలగ ద్రొక్కి
చటుల దుర్జన రాజ్య శాసనమ్ము వోలె"

అని ఉపమింపబడినది.

ప్రకృతియందలి సమస్త దీన జనుల జీవనముల తిలకించిన శర్మగారు—

"నాజీవనము శోభించుగాక మరు
వన్నెలలో చిగురాకు చందమై"

అను ఆకాంక్షను ఉపమాలంకారయుత వర్ణన గావించినారు.

వర్ష ఋతువు ఆగమనమున—

"కనక మేఖల వోలె గగనమ్ము జఘనమ్ము
నింద్ర చాపము కుండలీకరించె"
"చిలిపి నవ్వుల వోలె చినుకు ముత్యాలలో
సిహార మధురిమ నివ్వటిల్లె"

హేమంత ఋతువున దీనుల బాధలను వర్ణించునపుడు, వారికి

"శరీర మొక కారాగారమై తోచినదట"

వసంత ఋతువునందలి ఒకనాటి రేయిని యామినీ భామినిగా ఊహించుట యందు ఉత్ప్రేక్ష కలదు.

"సికత రీతిగ తమశ్శికుర నికరమ్ములో
నలతి చొక్కుల మోసు లలము కొనియె"

వెన్నెల యనెడి చీరలో కారుమబ్బులు అనెడు చిరుగుల గంతలవలె ఊహించుటను

"జిలుగు వెన్నెల చీర చినిగి పోయినదేమొ
కారుమబ్బులు మే క్రమ్ముకొనియె"
"మేను విరిచెనేమొ మెల్లగా నిట్టూర్చి
విధుర వాయు వీచి విస్తరించె"

కాలప్రవాహమును వర్షధారాజలమున నడకలను కవి ఉత్ప్రేక్షించినాడు. కవి రూపకాలంకారమును వసంత ఋతువున, వర్షర్తువు వర్ణనమున నింపినాడు.

చైత్రమాసము నందలి కోకిల భామా కంఠము నందు శంఖ ధర్మమును, శుక పంక్తి యందు నారీదళశ్యామత్వమును, భ్రమరములయందు జ్యావల్లి ధర్మమును, మల్లి సుమములయందు మీనాంక శరధర్మములను ఆరోపింపబడినవి.

కూలివాని కుటీర గర్భము నందలి దీనస్థితిని,

"చెలం పూవులు వెక్కిరించె
గగనశ్రీ చంద్రరేఖాంకమై వేళాకోళము చేసె
చింతకొమ్మ పయిన ఘూకమ్ము శోకించె"

వంటి స్వభావోక్తి అలంకారము లనేకములు.

గ్రీష్మమున

"ఇకసము లోలంబంబు ధ్వనించె బీరెండల్ గయూషించె"

అను స్వభావ సిద్ధ వర్ణనలు కలవు. కవి వర్ష ఋతువున జలరాశి ఘోషను క్రమాలంకారమున నింపినాడు. ఇది ఆకాశమునుండి నగసీమలలో అందుంతి మహా అరణ్యము లోను, తరువాత సింహ దంతములవంటి కాంతిని కలిగి ప్రకాశించుచు, భయంకర కల్లోలములయినవని వర్ణింపబడినది.

శర్మగారు అనుప్రాసలను సైతము అలవోకగా చెప్పగలరు.

"ఘన ఘనా ఘన గర్జిత్రేయ ఘంటికా
టంకారములకు ఘంటా పథంబు" నందు 'ఘ' కార ప్రాసను,

"ఘటిత నటనోగ్ర ధాటీ విఘటిత ప్రకట
కుటిల ధూర్జటి ఘన జటా పటల నిటల"

నందు 'ట' కార ప్రాసను గలదు.

త్రిప్రాసాలంకారమును కవి వర్షర్తువు వర్షము కురియు సమయమున వర్ణింపబడినది.

"విరిసెను మేఘ పరంపర......" నందు 'విరిసెను, మెరిసెను, పరిసెను, కురిసెను' అను పదములు,

"కుంభ కుంభిత రీతిన్" యందు యమకము కలదు.

శ్రీ శర్మగారి 'ఋతు ఘోష' యను ఈ కావ్యమున ప్రతి వర్ణనమునందు ఆయా ఋతు ధర్మములయందు ప్రజాజీవన విధానములో సమకాలిక సమస్యలు ప్రతి ఫలించుచుండును. కూలివాడు తన బ్రతుకు భారము నీడ్చు విషయమును, తన కుటీరమునందు కుటుంబము నిద్రించిన విధమభివర్ణితము.

"ముసలి తలిదండ్రులును
మగ్గుచు పిల్లలు చిన్నచెల్లెలున్
ఒదిగి పడియున్న జీర్ణకుటిలో
నొటువైపున భార్య యావలన్
బిడుగుల వెంత దాను తీయు
నించును కన్నులు వ సి"

గ్రీష్మమున—

"కొండల గండ భాగముల గూల్చి శిలాశకలమ్ము లేర్చి పె
రెండల ధాటి కోర్చి శ్రమియించి పురీ పరిణాహ వీథులం
బండలు లాగుచుం భారము మోయు నభాగ్య కోట్లగా
గుండెలలోన నగ్ని దరికొల్పును తీవ్రనిదాఘు వేళలన్"
"గున గున సంచరించు పసికూనలు చానలు చెట్ల నీడలం
దినములు బుచ్చుకాలము గతించుగాక !"

వర్ష ఋతువున—

"ఈ కర్కోటక క్రూరమా చలిలో బీదల బాధలం
దలచినం శాంతింపగా సాధ్యమే !"

శరదృతువున—

"ఋతువులు మారినా
జ్వలియించు క్షుధా వ్యధితో ప్రజవన
క్రతువులు మారెనే యుగ యుగమ్ముల
భార మొకింత తీరెనే ?"

హేమంత ఋతువున—

"శిథిల జీవులు నీరాక కెదిరి చూచె"

శిశిర ఋతువున—

"బీదల బాధలం బాపఁగలేవు !
నీవు శిలవా ? కలవా ? సెలవీయుమో ప్రభూ !"

అంటూ కవి ప్రస్తుత సమాజమందలి జీవితముపట్లఁగల సముత్కొలిన సమస్యలను వాక్యము లందు చాటుచున్నాడు.

శాస్త్రిగారు లోకోక్తులను విషయ వర్ణనముల నొప్పించుటయే ఇతని ప్రతిభ.

"చలి పులివోలె దారుల పచారులు చేయుచునుండె"

"నేలయు నింగియుం దెలియనీక యొక తిమిరంబు
విశ్వమం దేసెను"

"ఊహా విహంగము తా నెగిరిపో నాశించె నుత్కంఠతో"

"చిక్కని చిగురాకు జేబులో నవలించు యెంకు వేణువు
కంఠమెత్తి పాడె" !

"చితికి పోయిన దీనుల జీర్ణకుటీరికి...."

వంటివి అనేకములు ఇందు కానవగును.

17)

# అద్దేపల్లి లక్ష్మణస్వామి

## "ఋతు విలాసము"

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామిగారి "ఋతు విలాసము" వసంతాది షడృతు వర్ణనా తెలుగు కావ్యము. ఇందు ఆరు భాగములలో తెలుగుదేశము నందలి ఆరు ఋతు ధర్మములను, ఆచార వ్యవహారములను మరియు ఏడవ భాగమున ఆరు ఋతువుల సామూహికముగా వర్ణించు ఋతు షట్కము కలదు. ఒక్కొక్క ఋతువునందు కనిపించు ప్రముఖ విషయములను గ్రహించి, వానిని గూర్చి చక్కని వర్ణనలు గావించినాడు. రెండు ఋతువులయందు అతడు ఋతువులకు కన్యాత్వమారోపించి, తత్పరిణయ మహోత్సవములను వర్ణించినాడు. ఇందు మొదటి ఐదు ఋతువులు దీర్ఘముగా వర్ణింపబడి, శిశిర ఋతువును ఆ ఋతు స్వభావ కారణముగ స్వల్ప వర్ణనములో ముగించినాడు. ఋతు షట్కమున మానవ జీవిత మందలి వివిధావస్థల నారోపించుట గలదు. వత్సర పురుషునికి ఆరు ప్రత్యేకావస్థలుగా చిత్రీకరించి, ఆరు ఋతువులు సమన్వయ పరచబడినవి. వర్ణనలయందు కవిగారి ప్రకృతి పరిశీలనము, మానవ జీవిత విధాన పరిశీలనము చక్కగా వ్యక్తమగును. కొన్నిచోట్ల గృహ జీవితము అత్యంత హృద్యమై యలరారుచుండును. ఇవి తెలుగుదేశ ప్రాంతమునగల వ్యవహారములను ప్రతిబింబించుటచేత కవి సమ్రాట్ విశ్వనాథగారి రచనా విధానమును కొంతవరకు అనుకరించి నాడనిపించును.

ఆధునిక సాహిత్య ప్రక్రియల నన్నింటిని ఆకళింపు చేసికొనిన అద్దేపల్లి లక్ష్మణ స్వామి భారతీ స్తవము, భవ్యభారతి, దివ్య పురుషులు, తులసీదాసు, పల్నాటి ముచ్చట, తెలుగు వ్యాసములు, ఋషికథలువంటి ఉత్తమ కావ్యములు వెలువరింప జేసినారు.

ఇతని ఇతర కావ్యములందు ప్రకృతి వర్ణనము ఎడనెడ చోటుచేసికొన్నను ఋతుచక్రము మానవ జీవిత చక్రముతో సమన్వయ పరచవలెనను ఆకాంక్ష ఈ కావ్యమున నెరవేర్చుకొన్నారు.

అద్దేపల్లి లక్ష్మణస్వామి ప్రకృతి వర్ణనముతోపాటు తెలుగుదేశమునగల వైవాహిక సంప్రదాయములను, నిర్వహణ విధానమును సమన్వయించు రీతి మిక్కిలి

హృద్యము. వసంతర్తు వర్ణనమున వివాహ కార్యము లధికములగును. కావున కవి వసంత లక్ష్మిని వధువుగను, మాధవుని వరునిగను, భావ రూపములు కలిగించి వివాహమును జరిపించు వర్ణన గావించినారు. కళ్యాణ వేదిక చలువ పెదజల్లు మావి పందిళ్లతోను, చదలు మేల్కట్టుపైన తలిరాకు తోరణములతోను ముచ్చటను గొల్పుచున్నదట. నేల పూలజమఖానచే పరచబడి నయన పర్వమగుచున్నదట. ఆ వేదిక ప్రక్కలందున చెలువలు, బంధువులు, చక్కని పండితులు, వాద్యములవారు, ఇతరులు తమ తమ స్థానముల నలంకరించిరట. ఇంతలో "రంగు రంగుల నూత్నచేలముల గట్టి" వసంత లక్ష్మిని పెండ్లి కన్నెను తీసుకొని వచ్చి పీటపై కూర్చుండ బెట్టిరట. ఆ కన్య ఒప్పులకుప్ప, లావణ్యరాశి, తళుకులీనెడు మోము పద్మము, నిటల మర్ధ చంద్రుడు, ముంగురులళులు, అక్షి యుగములు తెల్ల తామర రేకులు, పలు వరుస మల్లెపూలు, కెమ్మోవి పగడాలు, హస్తములు తమ్మితూండ్లు, ఊరువులనంట్లు, అంఘ్రులు నీరజములు, పలుకు తేనియలు, కోకిల స్వానము స్వరము, హాసము అంచిత పుష్ప వికాసముగల దానిగా వర్ణించుట స్త్రీ సహజ సౌందర్యము చాటి చెప్పుచున్నది. అంతకు ముందే అక్కటకు వచ్చి కూర్చున్న మాధవునితో సమయ యాజ్ఞికుడు వసంత లక్ష్మి మెడలో తాళిబొట్టును కట్టించినాడట. పూల తలంబ్రాలను తామర తూండ్లవంటి చేతులతో ఒండొరులు తలలపై పోసికొన్నారట. తివిరి పదుపుల పులుగు వైదికులు ఆశీర్వచనములు పలికినారట. పెండ్లివారు పూ తావుల అత్తరులు, మలయజ చర్చ గావింపబడిరట. పెండ్లికూతురు అన్నయగు చూత పూతాఖ్యుడు వచ్చిన వారందరకు మామిడి పండ్ల నిచ్చి సత్కరించెనట.

ఈ వసంతర్తు కాలమునందు లభ్యమగు వంటకములు, ఆవకాయ, మాగాయ, అప్పడములు, వడియములవంటి నెన్నియో విందు భోజనము ముందు వడ్డించినారట.

ఆనాటి వీనుల విందొనరించు గాన కచేరికి "గాన గంధర్వ" బిరుదు పొందిన సరస సారంగ గాయక సార్వభౌముని కోరి పిలిపించినారట. వివాహమును పేర బంధువుల సుఖమును

"అయిదు దినముల పెండిలి యన్నమాటె
కాని రెన్నెల్లు బందుగుల్ కడుపు నిండ
భోజనము చేసి క్రొత్తవౌ పుట్టములను
కట్టుకొని సున్న పడినారు కల్ల గాదు.... అని వర్ణింపబడినది

మధు మాసమున పగలు కంటె రాత్రియందు తెమ్మెరలు, మల్లెమాలతి, చైత్రరథుడు, అను వీరందరు ఉల్లాసమును కనబరచెదరు.

ఆఱంకముల వత్సరాఖ్య నాటకములో మొదటిది వసంత ఋతువు. అది ఆఱు ఋతువులలో అగ్రేసరమయిన కిరీటము వంటిదనియు, షడ్గుణైశ్వర్యములలో సద్గుణము వంటిదని వర్ణించబడుట నూతనము. చిగురు తొగరును కాంచిన చిత్తమందు ఆమని వెలయకు ఎవ్వరో తీసిన ఎఱ్ఱ నీళ్ళవలె మాధవుడు చల్లు నెత్తుటి బుక్కావలె, కందిన చెక్కిళ్ళవలె, ప్రజల మొగముల అనురాగ సుషమ వలె, కెంగేలువలె, అడుగు బోటివలె, మోవి వలె తోచునని వర్ణించినాడు.

"వసంతుడా"! యను శీర్షిక యందు అతనిని సంబోధించుచు

“అచ్చుపు వేల్పు బువ్వ కెనయై రుచులూరెడు మంచి వేప
పూ పచ్చడి తెచ్చినాడవు శుభ ప్రద మియ్యది”
“కుహూ యని కూయు కోయిలలు కూతల గీతల బ్రాతి
నేయుమేల్
తీయదనమ్ము, మల్లెల పరిమళముల్, మలయానిలమ్ములో
హాయియు ... .... .... .... శుభ సూచన”
“జనులకు నెల్ల తీయని రసాల ఫలమ్ముల దెచ్చినట్లుగా
కనబడుచుంటివి క్రొత్త వస్త్రములు తెచ్చినావు నిత్య
భవనమగు గాదె సర్వజన వంద్యుడ వీవిల (శ్రీ) వసంతుడా”

అని వసంతమునకు అర్థమును చెప్పుచు అది ఈ కాలమునకు సార్థకముగా తోచునని చెప్పినాడు.

“అరుణారుణ పల్లవ వి
స్ఫురదురుతర నవలతాంత సుషమా సంప
ద్గరిమ వసంతంబని యం
దురు నీ కది సార్థకముగ దోచును మదిలో”

గ్రీష్మరాజు జనులపై చూపు ప్రభావము వర్ణన సహజ సిద్ధము. గ్రీష్మము వేడిమిని భరింపలేని కొందరు స్త్రీలు పైట యే వేయరట. రోజుకు మూడు పూటల స్నానము, పూటకు రెండు జతల దుస్తులు, నెలకు రెండు పర్యాయములు క్షౌర కర్మ సమయాను కూలముగ చేయించు కొందురట. గ్రీష్మరాజు ప్రతాపమును గుడువక మంచివారికి పైతము మతులు మారునట. వేసవిలో జనించు స్వేదము అలుమగల మధ్యన కలహము జనించునని వర్ణించుట స్వభావ సిద్ధము. నుదుట తిలకము పెట్ట లేదని భర్త తిట్టుటయు, వడ్డించినపుడు జారిపడు చెమట వలన తిట్లుబడుటయు, ఆలింగన మునకు ఆటంకము ఒనరించుట వంటి క్రియలతో స్వేదము దుందుడుకులు చూపును. వేసవిలో ఎండ వేడిమికి వస్త్రములు త్వరగా అరుట, పాదయుగళి బొబ్బలెత్తుట, వక్త్రబిలము ఎండిపోవుట, పొట్ట సకనకలాడుట, మేనెల్ల ఘర్మమయ మగుట జరుగును. పచ్చళ్లు దుప్పట్లు వంటి వస్త్రములు విడిచి సన్నని వస్త్రముల కోరెదరు. బావిలో నీళ్ళు ఇవిడి చేత్రాడు చాలకుండుట, భోజన సమయమున మరచెంబు నీరు చాల కుండుట, ఏరులయందు నీరులేక నావలు సాగకుండుట గ్రీష్మములో కనబడును. ఛాందసులు సందెవార్చు నెపమున నీటిని త్రాగవలెనని మాటిమాటికి ఆచమనము చేయుదురు. మడి అను మిషచేత తడిగుడ్డ కట్టుదురు. జంధ్యము సవరించు నెపమున వీపు గోకుకొనును. పైకి అమాయకముగ కనబడినను కిటుకులను నేర్చిన ఛాందసు హృదయ గత భావము ఎవరికిని తెలియదు.

తాడిపండ్ల ముంజల రసములను గైకొనదరు. ఇట్టి వేసవిలో జనులు పట్టె మంచమును విడిచి కటిక నేలపై పవళింప కోరెదరు. చన్నీటి స్నానము ముచ్చటగ నెంతురు. అరుబయట నిద్రించుట, తాటాకుల గుడిసెను కోరుట నిరాడంబరత్వమును సూచించును. శరీరముపై సెగగడ్డలు, చెమట పట్టి అనురోగ్యాని చేయును. పచ్చిక దొరకని పశువులు పాలివ్వవు. పొలము బీటలు వారును. ఎండమావులు నిండు వాహినుల వలెను, కార్చిచ్చు పొగ మొగులువలెను, నిద్దుర నీరసము వలెను, కనబడుట భ్రాంతి జనకము. గ్రీష్మ ప్రతాపమును జనులే కాదు విష్ణువు కూడ పైపగలేక పాల సముద్రముననను, శివుడు మంచుగడ్డలపైనను, బ్రహ్మ సత్యలోకమున ఉండునని వర్ణించుట హృదంముగ నున్నది.

అద్దేపల్లి లక్ష్మణస్వామి వసంత ర్తువందు వసంత లక్ష్మీ మాధవుల కల్యాణము వర్ణించిన విధముననే వర్షర్తువునందు శ్రావణ లక్ష్మీ వరుణుల వివాహ వర్ణన గావించి

నారు. ఇందు తెలుగు నాటగల వివాహ విధులను, తగు ఏర్పాటు విధములను తెలిపి నారు. నింగి పందిరిని వేసి, భూకళ్యాణ వేదికపై ప్రకృతి అందమును ఆభరణముగా జేసి, సమయ యాజ్ఞికునిచే నిఖిల కళ్యాణ విధులను నేర్పుమీఱ నిర్వహింప జేయుచు, ఉచిత తాళిబొట్టును కట్టించి, అమల జలబిందు సస్య ముత్యాల వాన పోసికలతో తలంబ్రాలు పోసికొనినారని వివాహ కార్యమును వర్ణించు విధము కవిగారి ప్రతిభకు నిదర్శనము. పెండ్లికి వచ్చిన అమ్మలక్కల ముచ్చట్లను ముచ్చటగా వర్ణించినారు.

దంపతు లిరువురు ఇంద్రధనుస్సు పల్లకి నెక్కి పురమేగు ఉత్సవమునందు, మెఱుపులే లైట్లట, పిడుగులే మేలి బొట్లట, ఉరుములు వాద్యములట, పులుంగు నట్టువలు నాట్యములట ఇట్లు రవి వీనికె కన్యాత్వమాలోచించి వివాహ వర్ణన గావించుట తెలుగు సంప్రదాయము ప్రతిబింబితము.

"వానకాళ్ళు" అను శీర్షికలో వర్షధారలను ఉత్ప్రేక్షించిన తీరు అత్యద్భుతము.

"నింగి బిందెకు మబ్బు నీలి వస్త్రముఁజుట్టి
అమృతంబు వడబోసి రమరు లనుచు"
"ప్రకృతి కాంత తలంటునకు నమృతము మించు
బొంలతులు గొనివచ్చి పోసిరనుచు"
"పానీయమే మాను పాదపమును తతి
పైన గురియు పూల వాన యట్లు"
"అంబరోద్యానంబు నందున్న మబ్బు పూ
బొదరిండ్లు రాల్చిన పూవులట్లు"
"ఆకాశ సరసిలో నబ్ద ఘటంబుల
ముంచి యెవ్వరో యట్లు వంచినట్లు"
"ఆకాశ పథము నందంబురేంద్ర రథంబు
వాకంబునకు లాగు మాకులట్లు"

వేసవిలో తపించు భూజనులకు గంగ వరముల నిచ్చినట్లు—దయామయుడు ఇచ్చిన దాన ధారలట్లు—ఆకాశరంగ మధ్యమమున నాట్యమొనర్చు శ్రావణ లక్ష్మి కట్టిన చీరలంచు లట్లు వర్ణింపబడినది.

'ఆంతర్యము' అను శీర్షిక యందు వధువు తండ్రి తన ఖర్చుతగ్గుట కొరకును, బంధువులు ఎక్కువగా రాకుండుటకును, పందిరి వేయునవసరము తగ్గుటను వానకాలపు మేలునే మదిలో కోరునట. కాని పైకి వచ్చెడు మాటలు వేఱుగా నుండునట.

వర్షకాలమున బావులు నిండుటయు, జల సంపన్నంబులగుటయు, వృక్షముల చేవలను పెంచుకొనుటయు, పల్లములలో నీరు నిండుటయు, నెమళ్ళు తీవిని పెంచుకొనుటయు జరుగునని వర్ణించుట సహజము.

పయోధరుని సంభావించు రీతి కడు హృద్యము

“అడిగిన గాని వేలువుఁ
దొడంకీయ దపెట్టి బత్తి త్రో వరికిని నీ
వడుగకయే జీవన మిటు
లిడుదువు నీ వంటి దాత యెవ్వఁడు ఘనుడా” ।

పేదలు భాగ్యవంతులను భేదము లేకుండా ఉన్న పయోధరుడు సర్వజన మాన్యుడను సత్యమిందు వర్ణితము.

సప్త వర్ణములు గల ఇంద్రధనుస్సు గగన భాండారమున ఘనవృగ రతను చేయుటకు వెలుపు తేటు ఎక్కుపెట్టు విల్లువలెను, ఆకాశ రమణి ధరించు రత్నాల హారము వలెను, అంబరోద్యానము నందు శ్రావణ లక్ష్మి దాగు పిత్నాల దోటి వలెను, శ్రావణేందిర జడ పూల వలెను సాక్షాత్కరించిన విధము కడు రమ్యము.

అద్దేపల్లి లక్ష్మణస్వామి శరత్కాలమందున్న ప్రకృతిని శారదగా సాక్షాత్కరింప చేసినారు. శరన్నవ శుభ్ర కౌముదిని పయోధరుల స్వచ్ఛ యశో విలాసముగను, చక్కని పంటి తోడి సుమ చాప విలాసముగను, శారద మోమున నొప్పు హాసము గను, ఉత్ప్రేక్షించుట సమంజసము, శారద రాత్రులు పాలకడలి, తెల్ల యాలపోతు, హంసవలె తెల్లని చంద్రికల పీఠము.

శరజ్జ్యోత్స్న

“శారదాదేవి మందహాస ప్రదీప్తి,
శారదాదేవి తేజ హంసంబు తేజు”

అనుచు ఊహించుట గలదు.

స్వచ్ఛ యశో విధాతవలె, శుభ్రకల్హార శోభతో వెలిచుక్క పట్టు చీరవలె, నీరాజనంబుల ధారిణివలె రాజవాడవి హృదయ వాత్సల్యరసము వలె నున్నదనుచు ఉత్ప్రేక్షించినారు.

హేమంత లక్ష్మి

"మంచు మేలి ముసుంగు క్రొమ్మించు తోడ
కలికి గుమ్మడి పూవు మొగమ్ము తోడ
శ్లాఘ్య హిమబిందు ముక్తాస్రజమ్ము తోడ
చెంత చెలువొందు బంతి చేబంతి తోడ
గొబ్బి చెలికత్తెతో నాహుకనుచు వచ్చి"

సంతసము గొల్పుచు వచ్చినదని వర్ణించుటలో కవి పరిశీలనా పాటవము స్పష్టము.

మంచు విశ్వ సౌధపు కిటికెకు గాజు బిగించినట్లు ఉషఃకాలమను కన్య కప్పు కొనిన మబ్బు ముసుగును నవగ ధరణి పగిలిన అంబుధముసట్లు మన్ను మిన్నును ఏకమై యున్న విధముగ కప్పబడినదట.

హేమంతపు చలి జనులకు భరింపరానిదిగ నుండుటను కవి ప్రకృతిని సహజ సిద్ధముగా వర్ణించినాడు. పొతి ముద్దలు మ్రింగుట, క్షౌరకర్మ మానుకొనుట, భార్య ముసుగులో దూరుట, ఎండపొడకు నుండుట, గడ్డకట్టిన కొబ్బరి నూనెను ఘృతమని పట్టించుట, ఎదుటనున్న భార్య తనను చూచి గడగడలాడుచున్నదని భర్త తలచుట, నిద్రలో కట్టు దోవతినే దుప్పటిగా కప్పుకొనుట, మంచు బిందువుల చూచి ముత్యాలని భ్రమపోవుట వంటి క్రియలు సాధారణములు.

చలి రాక్షసుని వలె వచ్చుచున్నదని వినిన జనులు భయముతో తమ తమ ఇండ్లలో దూరి, తలుపులు బిగియించి, దుప్పటములు ముసుగులు పెట్టుకొనుచుందురట.

ధనుర్మాస మహిమమున భక్తి హెచ్చుటయు, సాత్త్వికత్వము గలుగుటయు జరుగునట. చలిగాని ఎంత ఆగడములలోని ముసుగు పెట్టి నిద్రించుట, ఉడుపులు ధరించుట, పావలతో నడచుట వంటి క్రియలలో లోకవృత్తిమే తారుమారయినదని కవి వర్ణించినాడు. శౌచ విధులను సమయానుకూలముగను, ఆయురారోగ్య సౌభాగ్య

దాయకములుగను, హృద్యముగను, అనుభవేద్యములగు విధమున నిర్వర్తించు చంద వలయునను విషయమును వర్ణించుట కవిగారి సమయోచిత తత్త్వమును చాటును.

కవి చలిగానిని జగడగొండిగా పూర్చినాడు. చలికి వ్రేళ్ళు కొంకరపోవుటు ఉదయమే లేచి చదువని విద్యార్థిని ఉపాధ్యాయుడు కొట్టగా అతని తండ్రి తగవులాడ వచ్చుట ఇందు వర్ణితములు.

చలికాలమున చలిమంటలు, ఋరదలింకిన గుంటలు, క్రొత్త పంటలు, ఆలు మగల జంటలు, ముగ్గులు బొగ్గులు, రగ్గులు, చగ్గులు, చేమంతులు, బంతులు. రేగులు, గోగులును, వాకిళ్ళయందు కన్నుల పండువు సేయు బంతి పూ సొగసులు, వాసులను కలిగి ప్రకృతి లందముగ కనిపించును.

'సంక్రాంతి బాల' శీర్షికలో కవి భారతీయ సంప్రదాయముల నభివర్ణించినాడు.

"కనిపించు నీ రంగు గంగెద్దు పూజలోఁ
బండించు బసవని పట్ల భక్తి
తెలియనౌ నీ గొబ్బి దేవత పూజలో
మన భారతీయ గో మాతృ రక్తి
పొడగట్టు నీ పెట్టు బొమ్మల పంక్తిలో
నవ్య సృష్ట్యారాధన ప్రసక్తి
పచరించు నీ భోగి పండ్ల సంబరములో
భవదీయ దేశ సౌభాగ్య శక్తి
మొనయు నీ తీరుతీరుల ముగ్గులందు
భారత స్త్రీల శీల సంభావనోక్తి
కానవగు నీ యొసంగు భిక్షముల లోన
ప్రాచ్య పరమార్థ యుక్తి సంక్రాంతి బాల"।

హేమంత మందు సంక్రాంతి కాంత 'నోరు విప్పిన పొగవచ్చు' తీరును చూచు వారలకు చోద్యము కలిగించునట. అది ఆకాంతయొక్క జఠరాగ్ని పొగవలెను, మద నాగ్ని పొగవలెను, కోపాగ్ని, యుద్ధాగ్ని పొగవలెను ఎంచబడు వర్ణన నవ్యము,

మానవ జీవితమునందు వార్ధక్యములో భక్తి వైరాగ్యములు కలిగి మోక్ష పదవి నందు నిచ్ఛగించెదరు. అది సహజము. ఇట్టి భావములను కవిగారు ప్రకృతి యందు గల ఋతు స్వభావమునుబట్టి చక్కని పద్యము గావించినారు. శిశిరమును శిశిరర్తు శేఖరు నిగా ఒక తపస్వినిగా విరాగిగా చిత్రించినారు. ఇందు వైరాగ్య లక్షణములధి కములు.

మంచును, వానయును లెక్కచేయకుండుట, ఆకులలములుతినుట, యోగ సమాధి నిష్ఠ నిల్చుట, భోగ్యములైన వస్తువుల పొందక సుంతయు పోకుండుట, భక్తి వైరాగ్యములు ఒక్కచోట నివాస మొనర్చుట — వీని యన్నింటి యందు శ్రీ శిశిరర్తు శేఖరుడు నిష్ణాతుడని సన్నుతింపబడు యోగ్యత అతనిదేనని కవి వర్ణించినాడు.

విశిష్టమైన, చిత్రమైన శిశిర చరిత్రలో పత్ర, పుష్ప, ఫలములను భక్తితో సమర్పణ చేసి దైవ స్తోత్రము చేయుచు ఒక్కొకలి పవిత్ర మతితో చరించునట.

ఎన్నో సంవత్సరములు గడిచినను యౌవన భాగధేయుడై అభ్యుదయమును గాంచుచున్న తపస్వి యగు శిశిరుని చూచిన పుణ్యము కలుగునట.

లక్ష్మణస్వామి ఆరు ఋతు ధర్మములను వేరువేరుగా వర్ణించి, ఆ తరువాత వానినన్నిటిని ఒక్కసారిగ 'ఋతు షట్క' మను పేర వర్ణించినాడు.

షడ్గుణైశ్వర్యములలో షడృతువులు.

"ఐశ్వర్యంబె వసంతమహా, మహిత వీర్యంబే మహాగ్రీష్మహా,
శశ్వద్విశ్వ యశంబె వర్షమగు, స్వచ్ఛ శ్రీ శరత్తయ్యెడిన్,
విశ్వ ప్రస్తుతమైన జ్ఞానమిది, సృష్టిన్ రమ్య హేమంతమహా,
శిశ్వాస్వచ్ఛ విరాగమే శిశిర మొప్పన్" షడ్గుణైశ్వర్యముల్

జీవిత క్రమమున గల నాలుగు దశలను ఋతుషట్కముతో సమన్వయించినాడు.

"బాల్యోదాత్త వసంత బాల్య మటుపై నా గ్రీష్మ కౌమారమున్
ప్రమదాభోగ సరాగ యోగ సుషమా వర్షా శర ద్యౌవన
క్రమమున్, బిమ్మట హైమ నచ్ఛశిశిర వార్ధక్యమ్ము దీపించు, జి
త్రము, నీకే యపకర్ష లేదు నవ హర్షా! వర్ష వర్షీయుడా"!

కవిగారు 'మంజరీ ద్విపద' యను శీర్షిక యందు – ఋతుషట్కము జన సంతర్పణ ములో షడ్రసోపేత భోజనము వట్లును జీవిత పుష్ప మాక్షికమును గ్రోలు షట్పదము నట్లును, ద్విజాళికి ముఖ్యమగు యజనాది షట్కర్మల గ్రాలునట్లును, వేల్పు దళవాయి యగు షణ్ముఖుని యట్లు తోచుచున్నదని ఉత్ప్రేక్షించుట వాని ఔన్నత్యము వర్ణితము.

అద్దేపల్లి లక్ష్మణస్వామి 'ఋతు విలాసము'న భిన్నభిన్న ఋతువులయందు తెలుగుదేశమునందు జను లనుభవించు అనుభవములను జతపరుచుటయు, కొన్ని లక్షణములను ఉత్ప్రేక్షించుటయు జరిగినవి. అలంకారములన్నియు ఉపమాప్రాయోపేత ములు. రూపకములు పలుచోట్ల ప్రాచుర్యముగా నుపయోగించినారు. ఇందు ఉపమా స్వభావోక్త్యాది అర్థాలంకారములు మనోహరములై కవి ప్రతిభను చాటుచున్నవి. హేమంతమున శబ్దాలంకారములు ప్రాచుర్యము వహించినవి.

ఈ కావ్యము తేట తెనుగు తేట గీతులతోను, సీస పద్యములతోను, ఉత్పల చంపక మాలాది వృత్తములతోను, రసానుభూతులను కలిగించు కమ్మని కవిత్వముతో సాగినది.

అద్దేపల్లి కవిత్వపు పోకడలలో కొంతవరకు తెనాలి రామకృష్ణుని నిగమశర్మో పాఖ్యానము నందలి పద్యలక్షణములు కనిపించును. హేమంతమునందలి

"బడిగంట వినియు వెంబడినె లేవవు గాని,
గుడిగంట యది వినంబడక లేదు"

అను పద్యము

"ఉష్ణాని హోమాగ్ని నూదనోల్లవు గాని,
విరహాగ్ని జ్వరముల వెచ్చనోర్తు"

స్మరింప జేయుచున్నది.

హేమంత మందలి

"బుసి పోయెనో పంచభూతాత్మకంబైన
ప్రకృతి యంతయు నొక్క రాత్రిలోన"

అను సీస పద్యమున బుసి, ప్రసరించెనో, విసి, ఉసి అను పదములు ప్రాసలుగా వాడ

ఉదా|| ఆ పద్యమునకందము కూర్చునవి. పద్యములలో ఎచ్చటను చూడ భావ సంయు పదికి నింపు భావగర్భితములై కొనసాగినవి.

పద్యములందవతారికయందు శృంగార హాస్య కరుణ రస ప్రధానములయిన సన్నివేశము లభివర్ణితములు.

"చలికి గడ్డడలాడు స్వ కళత్రమును గాంచి
తన్ను జూచియ యంచు దలచు నొకడు"

"తళుకు సొమ్ములనెల్ల నొలిచి కొందఱు బట్టి
పూర్తిగా బూడిద బూసి వదలు"

"చలిగాలి సోకి.... .... ...." యను పద్యము హాస్య భరితమై ఒప్పుచున్నది.

ఇచ్చనట కొన్ని అలంకారముల నెత్తి చూపుట అవసరము. వస్త్రరుచున శ్రావణేందిరావరుణులను వధూవరుల నొక్క ఆసనమునందు కూర్చుండగా వారు

"సీతమ్మ శ్రీరాముడట్లు తోచె" ననియు
"తరుణి రుక్మిణి కృష్ణుడన్ దలపు గలిగె"
"ఆ సుభద్రయు నర్జునాహ్వయు డటన్న"

భావమొప్పారు నట్లనిపించినారని చక్కగా ఉత్ప్రేక్షించినారు.

వర్షధారలు భూమిపై పడు రీతిని —

"ప్రకృతికాంత తలంటునకు నమృతము మించు
బాలతులు గొని వచ్చి పోస రనుచు"—

"ఆకాశ సరసిలో నబ్ధ ఘటంబుల
ముంచి యెవ్వరో యిట్లు వంచినట్లు"గా ఊహించినారు.

"శ్రావణేందిర కబరీ భరంబుపైన,
ముచ్చటగ రంగు రంగుల పూలు దెచ్చి,
అనువుగా కూర్చి,
ముద్రించినట్టి చెందు కరణి నింద్ర ధనుస్సు సాక్షాత్కరించు"

అని ఉపమించిన విధము కడు రమణీయము. శరదృతువు నందు

"ప్రకృతియే శారదేందిరగ తోచె
'భావమందు' వంటి ఉత్ప్రేక్షలు కోకొల్లలు
శరదృతు వెన్నెలలు శారదా దేవి తేజ హంసంబు తేజు" అనుచు
"దిక్కుల గుల్పినట్టి రజనీకరుల స్వచ్ఛ యశో వికాసమో" !

అన్నట్లు వర్ణింపబడినవి.

స్వభావోక్తులు అడుగడుగున కనిపించును. హేమంతమున

"చలి పీకునని జంకి నల కేలు తడిసేసి
పాదాలు తుడిచి సాపడు నొకండు"

"మంచి విందని యెంత వంచివేసిన నేయి
పడనీదు బొట్టైన పాడు గిన్నె"

"పచరించు నీ భోగి పండ్ల సంబరములో
భవదీయ దేశ సౌభాగ్య శక్తి"

శిశిర ఋతు వర్ణనమున గల పద్యములలో స్వభావోక్త్యలంకారములు పెక్కులు వర్ణింప బడినవి.

అర్థాలంకారములతోపాటు శబ్దాలంకారములు కావ్యమునకు మిక్కిలి అందమును చేకూర్చినవి.

వసంతమున మధుమాస మహిమను తెలుపుచు

"పగలు పగలైన రేల దంపతుల నడుమ,
పగలు పగలొంచు క్షణములో పరిణమింప జేయు"

"మనోహర ఋతు వసంత మగుటను
సరిపోయెనే నీకు నీ వసంతాఖ్య యిటుల్"

శబ్ద ప్రయోగములలో కవిగారిమిడ్చిన చమత్కారము వారి పాండిత్యమునకు తార్కాణము.

హేమంత వర్ణనమున :

"అంగలు పంగలున్, గుహల యందున వేకువజ్రొత్త పొంగలుల్
తుంగలు, వంగలున్, నిశల పొంగతెరో విరహాగ్రజంబునన్
బెంగలు, పాన్పులన్ మాటిమాటివేయక యుగ్మలే పెం దుప్పటీ
లుంగలు, నిద్ర గుంగలును, లోచన పర్వము సేతు సర్వమున్"

"పగ్గులు, నిగ్గులున్, జలికి జాగులు వగ్గులు, తెల్లవారు కే
ప్రుగ్గులు, జగ్గు, లల్లులకు చేమల సగ్గులు, కేల బూన్కినుల్
బగ్గులు, ఊగ్గరించి చలి రావును నెనెరు నగ్గు తెల్లకన్
పగ్గులు, పాక్షి సీమలకు పంబెగు గోగ్గులు సీతు మొగ్గలన్"

వంటి శబ్దాలంకారములు అనేకములు కనిపించును,

సమకాలీన విషయాలు :

అద్దేపల్లి లక్ష్మణస్వామి ఋతు విలాస కావ్యము నందంతయు తెలుగునాట కనబడు సమకాలీన సమస్యలు ప్రతిబింబించుచునే యుండును. వివాహ సంప్రదాయమున పందిళ్ళు, కళ్యాణవేదికలు, ముత్తయిదువుల సంబరాలు, అమ్మలక్కల ముచ్చట్లు, ఋతు ప్రకృతి కనువగు భోజన సౌకర్యాదులు, పాటకచేరీలు మొదలగు పసందగు విందు లనేకములు ఈ కావ్యమున కానవగును. మధుమాసపు రాత్రుల విలాసములు, ఉభయ ఋతువుల యందు లభ్యములగు అమృతమై కమనీయములగు రసాల ఫలములను, వివిధ పరిమళపుష్పములను అందు కలుగు మదన తాపములు వర్ణింపబడినవి.

గ్రీష్మ ఋతువునందు పగటివేడిమి స్వేదము నోర్వని జనుల సమస్యలు కోకొల్లలు. చెమటచే నుదుటి తిలకము కరిగిపోగా భర్తచేత భార్య పడిన తిట్లు, వడ్డన సమయమున విస్తరులలోపడిన చెమట బిందువుల వల్ల పంక్తిజన దూషణము, ఆలింగనమునకు ఆలుమగలు పడు అగచాట్లు అనేకములు. అనువగు వస్త్రధారణము, సీటికై జనులు పడు బాధలు, కాలకృత్యములందు స్వల్ప మార్పులు తెలుపబడినవి.

వర్షర్తువున అల్ప, అధికవృష్టుల వలన కలుగు ప్రక్కల ఇక్కట్లు ఎడతెరిపి లేని వర్షమున, కూలి దొరకక ఆకలికి అలమటించు బీదజనుల బాధలందు వర్ణిత

ములు. వర్షము ధనిక, దరిద్ర కులమత భేదము లేక పడుటను సమతావాదిగా చిత్రీకరించినారు. వస్త్రములకై చాకితలో జగడము, తడిసిన కట్టెల వలన వంట ఆలస్యమగుటచే ఇంట కలుగు ఆరాటముల వానకారును ప్రోషగా మార్చివేసినది.

శరత్తున రాత్రులందు కలుగు మానసోల్లాసములను. మదనగ్రస్తులయిన వారి మానసిక వ్యథలు ఇందు పెక్కులు గలవు.

హేమంతమున ఆహార విహారాదులలో మార్పులు కలుగును. స్నానమాడుట, ఉదకస్పర్శవంటి పనులలో జనుల యందు మార్పు కనిపించును.

సంక్రాంతి పండుగ సందర్భములో గంగిరెద్దులు, గొబ్బిళ్ళు, ముగ్గులవంటి తెలుగు సంస్కృతి వర్ణింపబడినది. దీనితో దేశ సౌభాగ్య శక్తి, భారత స్త్రీల శీల సంభావనోక్తి బయలుపడుచున్నది.

వైదిక పరమగు భక్తి వైరాగ్యములు మానవుని ధన్యజీవుని గావించును. అట్టి భారతీయ సంస్కృతిని కవి శిశిరమున ప్రతిబింబింప జేసినాడు.

(భాషా-లోకోక్తులు, జాతీయాలు, సామెతలు, అన్యభాషా పదములు)

లచ్చేపల్లి ఋతు కావ్యమున కనిపించు భాష సర్వత్ర మధురమై, నిరుపమై, జాతీయమై ఇంపులొల్కుచుండును. ఇందలి వర్ణనము సులభ శైలిని గలిగి చదువుటకు, వినుటకు ఆనందమును కల్గించు చుండును. ఎంగిలి ముద్దలు, అంబరాంబరము వంటి పదములనేకములు ఇందు ప్రయోగింపబడుట మిక్కిలి ప్రశంసనీయము.

ఋతు విలాసము'న లోకోక్తులకు. జాతీయములకు, సామెతలకు కొదవ లేదు.

"ఎంత లభించు నంతె గాని తృప్తిపడం జను"

''గెస్తులన్ సుంతయు నొవ్వ జేయకుడు''

"హితోక్తులు వసంతుగ చెప్పుట"

"వూ పచ్చడి శుభ ప్రదం బియ్యది"

"వసంతు డెప్పుడు మేలొన గూర్పు దలంచి వచ్చు"

"మల్లెల పరిమళముల్ మలయానిలమ్ములో హాయి"

"నినువంటి మహాత్ముని మోము జూచినన్ పుణ్యము"

"సర్వజన సంస్తుత్య పవిల శ్రీ వసంతుడా" ।

గ్రీష్మము వలన

"మంచివారికి సైతంబు మతులు మారు"

౬ స్వేదమా !

"దుండగంపు జూపి ఖేద మొదవ జేయు చుండుదువు"

"ఘర్మ సమయ వ్రతి విచిత్రము నర్తించ వలవి యాగునె" ?

వేడి కోర్వలేని జనులు సముచిత ప్రార్థనము గావింపుదురు.

"మహోష్ణము శీష్ణము గ్రీష్మ మెప్పుడగున్"

"కన్నుల కనాయకుడెట్లు కానబడును"

"హృదయగతి భావంబు నెవ్వ డెఱుగు"

గతమును గూర్చి

"తెలియు పరిశీలన చేసిన యట్టి వారికిన్"

'గ్రీష్మము' భువి నిరాడంబరత్వంబు బోధసేయ వచ్చునది.

వర్ష వర్ణనమున - శ్రావణేంద్ర, వరుణుల వివాహ కార్యమునందు అమ్మ లక్కల సంభాషణమున వధూవరుల గుణ గణములు వివరింపబడినవి.

"వరుణుం డలుపైన సద్గుణ కరుణ ఘనుడు
సాటిలేనట్టి నెఱదాత, మేటి జోదు,
పురుషునకు రూపమేటికే ? బుద్ధి వలయు"

"ఒకనికన్ గంపు, అదియ వేఱొకని కింపు"

దేవతలు మొరల నాలకించి వరములిచ్చు సంప్రదాయ మిందు అభివర్ణితము.

"వేసవికి తపించునట్టి భూ జనులగాంచి వేడ్క శంభుని శిరాన
నున్న గంగమ్మ తానెనరూని మెల్ల వరము లిచ్చునటగా
నెంతొ వానకాళ్ళు" !

'పయోధరా' యని సంబోధించి

"జీవనము లిడుదువు నీ వంటి దాత మ్రుగ్గ్యడు ఘనుడా" !

యింత మంది మంచి మన్ను మిన్ను నేకమై యున్న విధముగానున్న సమయము :

"నేను నిల్చిన చోట గన్పింప బోదు" ।

"కన్నులుండీన లాభంబు గాంచనీని యట్టు కనుకట్టుకట్టెనో"

"కాల మహాంత్రికుండన నొప్పెరు మహిని"

"ఆలు సైతము గంగెద్దు లవును జూడ" ।

"మోసము దాగునే భువిన్"

"శౌచ విధులన్నియును సమయోచితములు

ఆయురారోగ్య సౌభాగ్య దాయికములు" —

సంక్రాంతి – దాని యందు

"గంగిరెద్దు పూజలో పండించు బసవని పట్ల భక్తి"

"ముగ్గులందు భారత స్త్రీల శీల సంభావనోక్తి కానవచ్చు"

"గొబ్బిదేవత పూజలో మన భారతీయ గో మాతృ భక్తి"

"బొమ్మల పంక్తిలో నవ్య సృష్ట్యారాధన ప్రసక్తి"

"భోగి పండ్ల సంబరములో భవదీయ దేశ సౌభాగ్య శక్తి"లు

కానవచ్చునని జాతీయతా భావము లనేకము లిందు వర్ణితము.

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వరిచయ వాక్యము లంటి మొదటి మూడు ఋతువుల వర్ణన సుకుమారములైన మెత్తని మాటలు పాడుకుంటి సాగినది. తక్కిన మూడు ఋతువుల వర్ణన భాగమంతయు పద్యరచనాగతమునై ప్రౌఢితో సాగినది. వీరు వ్రాసిన చివరి పద్యములలోని ఋతుషట్కము నందరి సంవత్సరైక్య దృష్టిని వెలయింపలేదు. సంవత్సరమే యొక పురుషుడు తద్భావము వేదము నందు గలదు. దానిని వీరు విస్పష్టపరచిరి.

మొత్తము గ్రంథమంతయు మిక్కిలి హృద్యముగా నున్నది. ఋతుధర్మముల బట్టి వర్ణన మిక్కిలి ఉచితముగా నున్నది. కావ్యమున భిన్న ఋతువుల యందలి. తత్తదుచిత లక్షణ వర్ణనము చేత నౌచిత్య సమృద్ధి కలదని చెప్పవలయును" అని కావ్య వైశిష్ట్యమును ఉగ్గడించిరి.

సహృదయ విమర్శకులుగను, విద్వత్కవులుగను అనేక శాస్త్రములలో పాండిత్యమును గడించిన సాహితీమూర్తులుగను యావదాంధ్ర దేశమును ప్రతిష్ఠను సంపాదించుకొనిన ఈ ఇరువురు పండితులమన్న నలవి పాత్రమైన ఈ "ఋతుషట్కము" ధన్యము ఋతు వర్తన మనగానే ఏవో పాత మూసలలో రచన సాగునన్న సామాన్యా ? ప్రాయమును యీ కావ్యము అబద్ధము చేయుచున్నది. ఋతు వర్ణన కావ్యము జాతీయ జీవిత వృత్తమునకు దర్పణమేల కాకూడదు ? కాలము ప్రకృతిని వర్ణించి, పశు పక్ష్యాదులను వర్ణించి తృప్తిపడువాడు సామాన్య రచయిత ఋతువర్ణనము నెపముగా గొని సమకాలిక ప్రజల బ్రతుకు బరువులను ఆకాంక్షలను హృద్యముగా వర్ణించవచ్చునన్న యదార్థ్యములను ఈ కావ్యము బయల్పరచుచున్నది.

దివాకర్ల వేంకటావధానిగారు "వర్ణన లన్నింటి కవిగారి ప్రకృతి పరిశీలనము మానవ జీవిత విధాన పరిశీలనము చక్కగా వ్యక్తమగుచున్నది. ఎడనెడవారు వర్ణించిన సాధారణ గృహ జీవిత మత్యంత హృద్యమై యలరారుచున్నది. పెక్కు జోట్ల శృంగార హాస్యములు ప్రస్ఫుటములై పఠితల నానంద పరవశులను గావించు చున్నది. భాష సర్వత్ర మధురమై, నిర్దుష్టమై జాతీయమై ఇంపులొలుచున్నది. పద్యములందెచ్చటను ధార కుంటువడక అవిచ్ఛిన్నముగా సాగిపోయినది. ఆధునిక కాలమున వెలువడిన చక్కని చిక్కని కావ్యములలో నిది యొకటి.

—o—

# కొండ చంద్రమౌళి శాస్త్రి

## ఋతుపవనం

బెల్లకొండ చంద్రమౌళి శాస్త్రిగారి 'ఋతుపవనం' ఆరు ఋతువుల అంగములను, అలంకారములను, పోకడలను వెంట నిడుకొని వచ్చిన అరుదైన కావ్యము. ఇందు కవి ఋతు లక్షణములను అనుభవైక వేద్యము గావించుకొని వర్ణించినారు. దృశ్యమాన జగత్తు నందలి చైతన్యమును, ప్రకృతి విలాస విలాపములను ఋతు విశిష్టత యందినిడ్చినారు. పూర్వకవుల ఋతు వర్ణనలు ఈ కావ్యము నందు క్రొత్త తీరు తెన్నులతో నడకను సాగించినది. ఆయా ఋతు ధర్మములు కలిగిన పవనముల నడకను బోలు పద్యవృత్తములో ఈ కావ్యము సాగుట ఒక ప్రత్యేకత. కావున ఇది సార్థకనామధేయమై ఒప్పినది. మానవ ప్రవృత్తిని ఋతు ప్రకృతి ధర్మ సంబంధముగా చెప్పుట మరొక విశిష్టత. ఈ కావ్యము నందలి విషయములు సహజ స్వభావములై ప్రతిచోట కనిపించునవే అయినను కవి స్వంత రచనా భావములే అధికముగా గోచరించును.

వెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి చిరకాలముగా రాజకీయ, సాహిత్య రంగములలో సేవ చేసినారు. ఆంధ్ర సాహిత్యమున పిల్లల పాటల నుండి మహాకావ్యముల పర్యంతము బహురచనలు గావించినారు. వీరి రచలన్నియు ఇప్పటి వరకు రేడియో, పత్రికలు, సభల ద్వారా ప్రసారమైనవి వీరి 'నమోవాకలు' 'కృష్ణవేణి' 'తరంగిణి' రచనలు ముద్రితములై సాహితీ ప్రపంచమున చోటు చేసికొనినవి. ఈ కృతి 1965లో రచింపబడినది. 1970 లో అచ్చయినది. కవితా ప్రియ ధర్మములగు శ్రీ పలివెల లక్ష్మీనారాయణరావు గారికి అంకితము.

"ఋతుపవనమ్మను కూల ని
రతగతి పీతెంచి రాగ రమణీయార్థ
ప్రతి పాదక శబ్ద రసా
కృతి మిమ్మలరించు గాక నీను కృపాప్తిన్"

వసంతోత్సవ భావరక్తిలో కవి వసంతమును వర్ణించిన తీరు నవ్యము కొమ్మలు పులకరించుటకు వన ప్రియులను కవ్వించుటకు, పూబోడులు రంగుల సరసములు చేయుటకు, చిగురు చిన్నారిపై వగరు పొంగించుటకు, కొంత ప్రణయ దేవిని సమ్మదపదాల పథములపై రథ మెక్కించుటకు, వసంతాలను చల్లిరట ప్రకృతి యందున్న కొన్ని అభేద సంబంధాలతో "తీగను కదిపితే డొంకంతా కదలు"నను నానుడితో చవి చూపినారు తేతకు పూలతోను పూలక భ్రమరాలతోను, భ్రమరాలకు గీతాలతోను భావ-జాతితోను. తెగదెంపు లేకుండా తేనెలు కురియునను బంధము "అమేయ ప్రకృతి మూల చైతన్య సుప్రణయ కణమొ" యను కవి వర్ణన అపూర్వము.

వసంతములో పూయు మల్లెమొగ్గలు విచ్చి మదనమహీపతి హృదయమున కల్లోలములు తెచ్చినవట. పథికుల మనములు మదన పెట్టుటకు చింత చిగుళ్ళు చేవురించినవట. ప్రణయుల మధుర స్వభావాలను మామిడి పిందెల గోము కొత్తలు చన్నినవట కోకిలస్వామి నందగోకులము నందు మువ్వగోపాలు పెదవుల మురళివోలె తెనుగు కొమ్మను పల్లవింప రాగోద్వేగ పదము పాడినదట. కూయక, కూయక కూసిన కోయిల, పూసిన వాయిలి, చూసిన ప్రియురాలు, ఆడిన భృంగములు క్రియలు మాధుర్యములు.

వసంత ఋతువులో తరువులు పల్లవించుట సహజము కాని మోడు బారిన కొమ్మలు కూడ హద్దును మీరి "చెడి బ్రతికిన వారి సిరి నిక్కినట్లు" తలపింప జేసి నదట. దురును పికము 'దేశాటనాంతరము ప్రియుడింటి కేనగా ప్రియురాలి తొందర రను' పోలియున్నదట. చెలుకుగడ 'వలపు పొంగిన వారి తలుపులూరిన యట్టు' రస

ముతో నిండినవట. లోభివలె మొగి దోల్చినదట శ్రామికులు పొట్టకొరకు పయనమై నట్లు చీమల బారు సాగినదట. ఋతుమహారాజు వెండి బెత్తము ఝళిపించి, పండు ద్రాక్ష రసము తొలకించుటకు విడిసినాడట "మలయ గవీ హేమ పదమాన కోష్ణ ధారలను దివ్యసుందర రాగ సురభిళ కాండ మాధురులను, పాలాశకుసుమ సురక్తో గ్రహతన హాక్షులను, మద వధూ పరిరంభ కిలికించితో రస్కా ఘాతలను విసిరినా, మురిసినా, కసిరినా, విరిసినా అటుండు' మనునట.

వసంత ఋ తు చివరన దిగజారు పరిస్థితులు, వర్ణితములు మోదుగుగున్న కొంగుకు నిప్పంటు కొనినను, వెఱ్ఱిబాగవలె ఊగులాడినదట. చెమటతో దిగజారినను, అందగించు భోగిని అబలవలె అద్దమును చూచినదట కాకమ్మ కడవలలో నీరెండగా కనల-కుంఠ వలె కంఠశోష పడినదట.

ఒక విరిబోణికి పాలు చేపునకు రాగా అమ్మవలె కమ్మగా పాడినదట. ఒక బీదరైతు ఆవు ఈమక పోయిన దనిన మాట విని దిగాలున కూలినాడట. బిచ్చగాండ్రు తంబురా శ్రుతి పాడుచు తిరిగినారట ఇవన్నియు ఆ యా ఋ తు ప్రధాన పరిస్థితిని తలపించును.

వసంత ఋ తు రాజునకు స్వాగతమును 'స్వాగత వృత్తము' లో రచించి కవి క్రొత్త పుంతలను త్రొక్కినాడు సఖులు వేణువు వంటి పెదవులను విప్పి, రాగ ప్రాణములను మధుర భావ తరాంగాంగీణమై గానము చేయగా నవధాత్రి తలెత్తినదట లాసవపాత్రలు చేకొనుటకు లత ప్రాకినదట విరుల నవ్వులు భ్రమరావళి గుండెల తాకగా మధువు పాకమునకు వచ్చి రెచ్చినదట. కోకిల కొమ్మకు కూసినదట. ఒక సుందరి సోకు తీపిన చూపినదట. ఒక అర్తుడు 'ఆకలి' యనుచు రోసినారు.

నయవంత వసంతుడు-'రసవంత హసంతుడం మూగ గొంతుకను మ్రోగెను దేవుడట" దిరిసెనలు, విరజాజులు విరియగా పూల పల్లకిపై రమ్మని కవి వసంతునకు స్వాగతము పలుకుచున్నాడు.

కవి 'రసాల వృత్తము' లో వసంతుని వర్ణన కడు రమ్యము.

"అంగరంగ విభవాలు జౌ్ౕరై
పొంగులెత్తి రసభోగి ! శృంగా
రాంగణాన అనురాగ దీప్తుల్
రంగ రించితిమిరా ! లతాంగా ! !

"స్వామివో ! మధుర సాలివో ! రా
గామృతోజ్జ్వల విహారివో ! నీ
ప్రేమలో మునిగి విశ్వమెల్లన్
రామణీయక విరావ మెల్కొన్"

"మహోత్సవం" అను శీర్షికలో నవప్రభ సుందరమూర్తి యైన వసంత మాధవుడు

"క్రొన్ననల్
తెచ్చిన స్నిగ్ధమంజ మసు
ధి మధుపర్క ధృతాసు మోచ సం
పచ్చతురంత శోభన స్వ
భాను మహా పరిణాహ కీర్తనై"

పి తెంచినాడని వర్ణించినాడు.

అట్టి వసంత మాధవునకు కలకంఠులు మధుర గాథలను గానము చేయుచూ స్వాగతము పలికినారట. స్వస్తివాచనము సలిపినారట. పుష్పిణీమణులు ప్రియముబుకగ పానకపు బిందెలను తెచ్చిరట. అత్తరులను పూసినారట మేజువాణులను వనితా జనతా ఘనతాప భాస్వధాలయ మధు శర్వరీ గురుకులంబుల చేసినారట.

ప్రకృతి సౌందర్య వర్ణనము ఇంక అత్యంత సుందరము నలుదెసలందు కళ్యాణ సువర్ణ కంకణ వసంత శ్రీలు చిమ్మగా.

"పూవుల గొడుగుల్లో మురిసి
పోయెను పెండ్లి కుమారు, డందపుస్
ద్రోవల పూల మాలికల
తో పులకించె వరుండ, చల్వ పూ
దోవతి కండువాల్ పరువు
తో గొని నవ్వెనవర్తు రాజు, స్వా
భావిక సర్వ పుష్ప సుకు
మార తనూజ్వలుడిట్లు పొంగెనుస్"

కవి యెద లోని పొంగు .......................... గాగ
పృషద భంగ తరంగ మృదంగ
వైభవము తోడ_పూవుల వాన కురిసి
పర్గ్లు పండెండు మోస్తరు పాటబాడి" నదట.

"మధుమాధవి" అను శీర్షికలో ఆ పద్య వృత్తములో భ్రమర మోహన మోహదాహమ్మాగించుటయు, ఉదయరాగ భోగమ్మాగింతురట...." అని వర్ణింప బడినది.

వసంతుడు మిగిల్చి ఇచ్చి వెళ్ళిన రత్న సింహాసనమును సాధికారముగ అధిష్ఠించుటకు గ్రీష్మకుడు వచ్చిన రీతి వర్ణితము పెట్టిన పందిళ్ళు, కట్టిన తోరణాలు, పూచిన పూవులు, తీసిన చెలమలు, చూత ఫలములు, శీత వల్లరులు కర్పూర భోగ ములు, తూర్పార ప్రపలును. కోయిలల పాటలు కోతుల గుంపులాటలు, మిగిల్చి ఇచ్చిన ప్రకృతి శోభ-"ఇచ్చి వెళ్ళుట రాజకీయ సంప్రదాయము.

కోయ దూరసాని "భూమి పండుగ" యని పొంగి దొరల ముందు నృత్యము చేసినదట. పొరుగూరి పేదలు ఇండ్లు కాలిపోగా సాయమింత చేయమని పొరలినారట రసము లేని మామిడి పండ్లు తోతాపురులు తెచ్చి అమ్మినారట. ఒక నీటుగత్తె ఏటిలో చెలమల నిటు, అటు చిమ్మి, నీరు తెచ్చినదట. తెల్లవారిన దనగానే ఒళ్ళు ఝల్లు మనగా మరల ప్రొద్దెట్లు గ్రుంకునో యనుచు 'ఎండదలుకుడు' సహింపరక మసలినే

పోయి ప్రాణములు చల్లదనమునకు పల్లటిల్లునను విషయము గ్రీష్మ ప్రతాపమును తెలుపుచున్నది. గాలి, దుమ్ము గమూలిగత్తెవలె ఒక్కసారే లేచినదట. ఒక్కొక్క సారి ఎండయు, వానయు ఏకముగా వచ్చుట సంభవించును. అది లేమి, కలుషముల నికిలించినట్లుగా వర్ణింపబడుట సహజము. వేసవిలో చంద్ర నిప్పుల పూలు చల్ల బడుటకై అప్పుడప్పుడు కొంత ఉపశమనము కొరకు చినుకులు పడును. విస్తరాకులు పంటల నుండి గాలికి లేచి, నీచజనులు వచ్చి పడిన రీతిగ వచ్చి పడినవట. ప్రజల రక్తము పీల్చువారి పన్గతి నల్లులవలె అవని చత్తురట పెక్కిరింపగ పోయి తొడల వలె సొక్కి వెలకిల బడుచురట వక్రమార్గము పట్టు వారలు పాములు నీరెండకారి పోయినట్లు చెడుదురట ! ఎప్పుడును మృష్టచింత సలుపు మానవులు దెబ్బలు తిన్న దొంగ గొడ్లవలె వంగి పారిపోవుచురట. "దిక్కు లేని వారికి దేవుడే దిక్కు" యనగ పక్షులు ఆకుల ఛాయన బ్రతికినవట. అయినను "గ్రీష్మకు డెంత కఠినుడో అంత కరుణుడు అని జనులు అనుకొనెదరట. రచ్చబండ నలంకరించిన గ్రామపెద్దలు నుంత ప్రొద్దెక్కగానే ఇంటికి పోవుచురట రైతులు, శోభనాగులు, పశుపక్షులు, పసిపిల్లలు కూడా సాయంత్రమగు దాక ఇంటనే యందురు. వేడిమిని భరింపజాలని జనుల అనుభవములు ఇాదభివర్ణిభములు పేగలేనివారు వటచ్ఛాయను నైదాఘశాంతి కొరకు ఏగిరట తాపమాగలేని వారు స్వచ్ఛ శీతలము లంచు జలముల త్రాగిరట కప్పురపు తాంబూలము వేసికొనిరట.

పెదవిపై రాలిన చినుకును పసివాడు నాలుక కొసను నాకినాడట. కాపు కాలి పగుళ్ళలో చేలగరిక మోళ్ళు గ్రుచ్చుకొనెనట మొగమున పెగగడ్డ లేవగా నేల గంధము తీసి రాసినారట దావాగ్నులు అడవులను దగ్ధ పరచుట, దాహశాంతికై షర్బతులు త్రాగుట, మనసు చల్లనిదైనను మాట రేగు మంటగ వచ్చుట ఈ ఋతు పభావ వశము వలననే.

గ్రీష్ముడు తన ప్రతాపమును వ్యంగ్యార్థమున చూపినాడు.

"ఛత్రమ్ము బట్టించె సన్యాసిచే గూడ
ఇతడెంత మతి మంతు డేమి యనునో !
స్నానాహితుల బట్టి జలకాల దేర్చుచు
ఇది యేమి రసవంతు డీతడగునా !

వలువ జారని దారి వస్త్రాలు విడిపించె
ఇతడెంత లజ్జా విహీనుడగునో !
బైట పండుగ జేసె భవనస్థలను నైన
ఇది యెట్టి సమద్భశాభ్యుదయుడగునో.

గ్రీష్మమందున జనులు పడు బాధలు సహజ వర్ణితములు ఇంటిలో ఉక్క బోయిట, బయట దుమ్ము లేచుట, చినుకులు చిలుకుట చేత రేయి యందు పడక ఒక సమస్యయగు చున్నది. ప్రతిదినము ఆవకాయ తినుట, నీళ్ళ మజ్జిగ త్రాగుట, పగటి వేళ వీధిన తిరుగలేకుండుట, త్రాగునీరు, కరుపోట, దుమ్మని సెగ కంటికి మనుజు లాహుతి యగుటచేత సాధుజనుల బ్రదుకు దుష్కరమగు విషయము వర్ణింపబడుట కని బీదజనుల పట్ల నున్న అహాగాహాన సానుభూతి అవగతము.

"గత కాలమె గొప్ప దనిన విషయము కవి చక్కగా వివరించినాడు. వసంతము కన్న జ్యేష్ఠము గడ్డుదని పోయిన శిశిరమే పుణ్యాత్మురాలని, చనినట్టి శారద చక్కని చుక్కయని, ఈ వడగాడ్పు దెబ్బలకు మనుట కష్టము కావున వెళ్ళిపోయిన వర్షఋతువే ఘనమగునట.

గ్రీష్మఋతు గమనమును 'భుజంగ ప్రయాంతం' అను వృత్త పద్యమున నడుపుట కవి ప్రతిభను చాటుచున్నది.

"నిదాఘంబిదే వచ్చెన్ ! సాధుమాచున్
నిదానంబు కోల్పోయెనే ! ప్రాణులెల్లన్"
నిశాంత ప్రశాంతంబు నే కోరి చూడన్
అశాంతే ! అశాంతే ! ఆహా ! లోకమెట్లో"

"భుజంగ ప్రయాతంబు పోలెన్, సు తీక్ష్ణ
ధ్వజంబెత్తి వచ్చెన్ రథ స్ఫూర్జ ధుశ్రీన్
ప్రజంబుల్ రజంబుల్ నిజంబుల్ త్యజించెన్
ప్రజామోదమే లేని రాజ్యంబదేలా !

కథల్ గాని - కావ్యాలు గానీ - కళల్గా
ని - ధూర్తంబులయ్యెన్ ! కనీసంబు నీళ్ళే

సుధా తృప్తి యయ్యెన్ ! పశుల్ నాల్కల్ జావెన్
పథాలల్కా జూవెన్ - తపంబొల్కి లేవెన్"

'ఘూర్ణ నైదాఘం' అను శీర్షిక యందు దేవునితో గ్రీష్మని నిరంకుశమును, దౌష్ట్యమును భరింపజాలకున్నామని ప్రార్థించుట కవి కాలజ్ఞతను ప్రవర్శించినాడు.

"ఆగలేమోయి దేవుడా ! వేగలేము
ఎంతయెండ ! ఎంతగాడ్పు ! ఎంత ఉమ్మ !
చెవులు మెలిపెట్టి - చెంపలు ఛెళ్లుమనగ
కొట్టి - వెళ్ళున నవ్వెడి కోపధారి
ప్రభుని నిప్పుల చూపుల బ్రతుకలేము" !

పిడుస కట్టిన నాలుక తడుపు కొనగ నీరు దొరకక జనులు అలమటించు చున్నారని, విసురుకొని - బైట పడుకొని - విరహవేదనను భరింపలేకున్నామని ప్రార్థించుట కలదు.

ధ్రువకోకిలా వృత్తములలో

"తొలి రంపు మహోదయంబిది,
తావిభారుణ రేఖికా
పరమ కాంతుల సంతరింపుచు -
ప్రాయణ ప్రణయాంజలి
భరము భావము లందు జించుచు
బాట తూగె నహో అహో !
మరి మరీ ధ్రువ కోకిలల్ ఇటు
పాట మ్రోగెఁ గుహూ కుహూ !!" లు వర్ణితములు.

వర్ష ఋతువు నందు

"మబ్బు కెరటాలు కెరలె వివాన వీధి
గుండె బగిలిన ప్రజలు కోల్కొండటంచు"

వలువ జారని దారి వస్త్రిలు విడిపించె
ఇతడెంత లజ్జా విహీనుడగునో !
బైట పండుగ జేసె భవనస్థలను నైన
ఇది యెట్టి సమదృశాభ్యుదయుడగునో.

గ్రీష్మమందున జనులు పడు బాధలు సహజ వర్ణితములు ఇంటిలో ఉక్క-బోయుట, బయట దుమ్ము లేచుట, చినుకులు చిలుకుట చేత రేయి యందు పడక ఒక సమస్యయగు చున్నది. ప్రతిదినము ఆవకాయ తినుట, నీళ్ళ మజ్జిగ త్రాగుట, పగటి వేళ వీధిన తిరుగలేకుండుట, త్రాగునీరు, కరుపోట, రుద్రుని సెగ కంటికి మనుజులాహుతి యగుటచేత సాధుజనుల బ్రదుకు దుష్కరమగు విషయము వర్ణింపబడుట కని బీదజనుల పట్ల నున్న అహంగాహన సానుభూతి అవగతము.

"గత కాలమె గొప్ప దనిన విషయము కవి చక్కగా వివరించినాడు. వసంతము కన్న జ్యేష్ఠము గడ్డుదని పోయిన శిశిరమే పుణ్యాత్మురాలని, చనినట్టి శారద చక్కని చుక్కయని, ఈ వడగాడ్పు దెబ్బలకు మనుట కష్టము కావున వెళ్ళిపోయిన వర్షఋతువే ఘనమగునట.

గ్రీష్మఋతు గమనమును 'భుజంగ ప్రయాంతం' అను వృత్త పద్యమున నడుపుట కవి ప్రతిభను చాటుచున్నది.

"నిదాఘుబిదే వచ్చెన్ ! సాధుమాచున్
నిదానంబు కోల్పోయెనే ! ప్రాణులెల్లన్"
నిశాంత ప్రశాంతంబు నే కోరి చూడన్
అశాంతే ! అశాంతే ! అహా ! లోకమెట్లో"

"భుజంగ ప్రయాంతంబు వోలెన్, సు తీక్ష్ణ
ధ్వజంబెత్తి వచ్చెన్ రథ స్ఫూర్జ ధుశ్రీన్
ప్రజంబుల్ రజంబుల్ నిజంబుల్ త్యజించెన్
ప్రజామోదమే లేని రాజ్యంబదేలా !

కథల్ గాని - కావ్యాలు గానీ - కళల్గా
ని - ధూర్తంబులయ్యెన్ ! కనీసంబు నీళ్ళే

సుధా తృప్తి యయ్యెన్ ! పశుల్ నాల్కల్ జాపెన్
పక్షాలల్క జూపెన్ - తపంబొల్కి లేపెన్"

'ఘూర్ణ సైదాఘం' అను శీర్షిక యందు దేవునితో గ్రీష్ముని నిరంకుశమును, దౌష్ట్యమును భరింపజాలకున్నామని ప్రార్థించుట కవి కాలజ్ఞతను ప్రదర్శించినాడు.

"ఆగలేమోయి దేవుడా ! వేగలేము
ఎంతయెండ ! ఎంతగాడ్పు ! ఎంత ఉమ్మ !
చెవులు మెలిపెట్టి - చెంపలు ఛెళ్లుమనగ
కొట్టి - వెళ్ళున నవ్వెడి కోపధారి
ప్రభుని నిప్పుల చూపుల బ్రతుకలేము" !

పిడుచ కట్టిన నాలుక తడుపు కొనగ నీరు దొరకక జనులు అలమటించు చున్నారని, విసురుకొని - బైట పడుకొని - విరహవేదనను భరింపలేకున్నామని ప్రార్థించుట కలదు.

ధ్రువకోకిలా వృత్తములలో

"తొలి రంగు మహోదయంబిది,
తావిధారుణ రేఖికా
పరమ కాంతుల సంతరింపుచు -
ప్రాయణ ప్రణయాంజల్
భరము భావము లందు జించుచు
చాటు తూగె నహో అహో !
మరి మరీ ధ్రువ కోకిలల్ ఇటు
పాట ప్రోగెఁ గుహూ కుహూ !!" లు వర్ణితములు.

వర్ష ఋతువు నందు

"మబ్బు కెరటాలు కెరలె వివాన వీధి
గుండె బగిలిన ప్రజలు కోలాహలమటంచు"

కవి గ్రీష్మ తాపము నోర్వ్వజాలని జనులకు ఊరట కలిగించు చున్నారు. వర్షాగమన సూచనలను గాలి పంచాంగము కనికాపులు ఊహించిన విధము వారి నమ్మకమును, అమాయకత్వమును సూచించు చున్నది. ఆషాఢ శుద్ధ పాడ్యమినాడు మేరువ ప్రొద్దు గ్రుంకుట. కొండపై గొఱ్ఱె ప్రొక్కుడు పట్టుట, గొల్లకంపు గాలి కొట్టుట, గట్టుపై మేఘము లావరించుట, బ్రహ్మమేడి, అశోకము ప్రబలి కాచుట, భూమిలో నొదగిన కప్పలు బెక బెకమని పెకల్చుకొని వచ్చుట, బొరియలలో విరవిరలాడిన చీమల బారులు చెట్ల ప్రాకుట, తూనీగలు బయటకు వచ్చుట, ఆకసమున మబ్బులు ప్రాకు లాడుట, మృగశిర కార్తె తొలకరి మేఘములు వచ్చునను రైతుల మనములు విఱుగుట మొదలగునవన్నియు వానలు కురియు ననుటకు నమ్మకము.

మేఘావృతమైనప్పుడు నేలయు, నింగియు, వినీల కాంతుల విరజిమ్మ అంద మొప్పును. మెఱపులతో పచ్చని వెలుగులు, ఉఱుములతో గుండెలదరు మ్రోత, వానలతో దిక్కులన్ని పొంగు వరదలు భయమును, అభయమును కలిగించుచు,

"శ్రవణ సుఖ శబ్ద సంయుజ్య ప్రవహాణ చణ
చరణ మణి కింకిణీ క్వణత్ ప్రణయ మూర్తి
శ్రావణాంబుద కీర్తి సాక్షాత్కరించె ! నట"

వర్షించిన పిదప మోడువారి వాడిన గడ్డి పరకలు యిగిర్చి పచ్చబడుట, నెఱ్ఱె లచే శోషిల్లు భూదేవి మొత్తము మేలి క్రొమ్మి సిమి నుసిముట, ఎండిన నదులు పరు గులు నురుగులెత్తుట, నవ్వే పువ్వు లేక అవసిపోయిన లత క్రొత్త తరువుతో తలెత్తి పొంగుట సహజములు.

మేఘముల కదలికలను ఎలుగుబంటుల పరుదుపలెను, గొంగళి ముసుగు వలెను, నల్ల షేర్వాని ధరించిన న్యాయవాది వలెను, చుట్టపొగ వలెను, నల్ల గొల్ల పిల్లవాడు వెళ్ళునట్లు

"గాఢ జీమూత దేవుడు కదలి వచ్చెనట"

ఆకాశమున మేఘములు కనబడు రీతిని కవి ప్రదర్శించినాడు. నవ కదంబము పూసినట్లు, మంజుల మాలతి కుంజాన విరిసినట్లు, కుకుభము సుకుమార గతి పల్ల వించినట్లు, రమణీయముగ కనిపించినవట. మేఘములు మానసోల్లాసమును కలిగించు

నట్లు తోచు వర్ణన నూతనము. నింగిమీద సకల కళ్యాణాలు అవిమేనన్నట్లుగాను, ఆకాశ వీధిలో ఒయ్యార మొలుక మదగజ యానము వలెను, ఉత్పల మాలికలు గదులుగా తోరణాలను గ్రుచ్చినట్లు గాను, నీలి శాలువావలె వాటు జారినట్లును, స్వామి గాను, కాల కంధరశ్యామి వగుచును, దీన రక్షణాగ్రగ మడగుచు, పరుగెత్తునట్లు గాను కనిపించునట.

“నూత్నమేఘం” అను శీర్షికలో ఆషాఢ మాసమున తొలకరి మేఘములు పెచ్చు పెరిగి వర్షించెననియు, కర్షకునికి మృగశిరకార్తె సిరిప్రదమయ్యెననియు, జల్లు కురియుగా సస్యాల తల్లి జలవరించెననియు, అడుగు బట్టిన జలలు ఉబికి, నెఱ్ఱలు నింపెననియు, రైతు పనిపాటలు ఇక సాగుటచేత వృష్టి దేవునకు స్వాగతము పలుకుట ఇందు వర్ణితము.

“మేఘ విలసితము”, “బాష్ప మేఘము” అను శీర్షికలలో లోకపు పోకడలను నింపినాడు.

“ఒక్కరు మదిన్
దుఃఖింప, వేరొక్కరెం
తో వహ్వాయను చంద్రు లోకమిది ఏ
దో లే ! సుఖంబుండరా !

కాళిదాస కృతి ‘మేఘ సందేశమ్ము’ను పేర ఒక శీర్షికలో మేఘము విఱ్ఱవీగి, క్రిందికి చూపును చూడకుండా పోకూడదను నగ్న సత్యము చూపబడినది. మేఘునితో కవి

“ఓయి ! శ్యామల కోమలాంగా మేఘ
తావకీన రసజ్ఞత దాన గుణము
జోడు వడిన లోకానికి నేడు జూపి
దాత్యమునకు చే చేయుము తరుణి యెడకు”

అని ప్రార్థించుట కాళిదాస భావనను తలపింపజేయును.

జలధార మూలా వృత్తములో సంబోధన సహ్యము.

“నీవన్నన్ నా హృదయము నింపున్ ! పంపున్ !
నీవే గహి ప్రజలకు నేత్రామోదం –

బో వారుణ్యాంగ ! కదలవోయీ ! రావో
యీ విశ్వ శ్రేయసము రసించన్ !! మించన్ -!"

శరత్కాల వెన్నెలలో

"విశ్వమెల్ల ఒక్క శాశ్వత పరిణాహ
దుగ్ధ సాగరమున తోణుకులాడె" నట
"రాజ హంసలు ఱెక్కలార్చి సభన్ దీర్చ
దివి నుండి భువి మీద దిగెనో యేమొ ! " యనుసట్లును,
"శారదా విలాస సర్వ సర్వం సహా
నిభృత శుభ్ర కీర్తి నిర్మలములు
కావ్య కంఠ మధుర గాన రసావధుల్
వెల్లి యెన్ను నెక్కి వెడలె నేమొ !"
"మంచు తెరను నేల దించినట్లు"
"పొట్ల పూవులు బీరపూవులు కలబోసి
జగతిపై నేసలు జల్లినట్లు"

రమ్య రూపమై శరత్తు వచ్చినదట.

దూది పింజల వంటి మబ్బులతు బంగరు కాంతి పదను పెట్టినట్లు మరిపురాని శరచ్చంద్రులు ప్రకాశమును భూమిపై ప్రసజేసినాయను కవి వర్ణన సౌందర్య భరితము. నీలి నింగిలో తెల్లని మేఘాల కదలికలు కొంగల బారు మాదిరిగాను, యోధుల శిబిరాల చాలుగను, చలువ ఖద్దరు మడతలు సర్దినట్లు కనిపించుట సహజము. వెండి నాగసాలు, పాల కెరటాలు, పచ్చ పూల విరులు, "సుమ శుద్ధ రజము పరె పండు వెన్నెలలో ఈ శరత్తు పోలిని పటమునల్లి దాని యందు చిక్కు కొనిపదను భావము.

"చిక్కనైన పద్యమున కావ్యాత్మగా పట్టునట్టుం చున్నదట"
"ఆశ్వయుజము, కార్తికమునను వెలుగుల
నెలలు సంగీత సాహిత్యములె యనంగ
వియ్యమునకు కయ్యమున కియ్య గొలుప
వచ్చె, తెచ్చెను శరదృతువ మృత కలశి" !

శరదృతు వర్ణనమును కవి పండు వెన్నెలలో జాలులను, అప్పుడప్పుడు కని పించు మూడి ఏంజల బోలు తెల్లని మేఘములను, రాత్రుల వెలుగులను మాత్రమే ప్రస్తింపబడినవి.

'క్రౌంచపదం' అను శీర్షికను కవి
"ఈ శరదాకాశంబున చాంద్రీ
హితము సతము రస కృతి యగునా ! దే
పీ శివరాత్రంబుల్ నవకశ్రీ
వినుతి నిరతి శయ విధి యగునా ! నా
యాశల క్రౌంచంబుల్ పదమెత్తెన్
అమృత గమనమున అతిసిత చూచన్
దోసిళులన్ ద్రావంగను రండో
తులత మతులు నుగతులు ధవళశ్రీల్" అని వర్ణించినారు.

చంద్రకళలు ప్రసరించిన రీతి అభివర్ణితము.

"శారదా రచన స్ఫారదంశా
నాదరముల్ తెలి వెల్లులై ।
నీరదాంక నిరస్త నిశాచాం
ద్రీ కరముల్ వెలి జిల్లులై ।
మీరెబో ! దివిపై, భువిపై స్వా
మిత్వ సమాదరణంబులై ।
పారెబో ! నరుపై, హరుపై, శు
భ్రాంశు పయస్తరుణంబులై ।

చందన చర్చలు, సాగర గానము, భావపు డోలలు, మలయ వీచికలు, కాశపేశల కౌముదులు, ఆకాశ దీపములు, సుఖాశా శలాకములు, విజయేచ్ఛా శాకునములు, ఫల పాక యోగాననాకరములు, నవ కామ క్రాంతి నితాంతర - తాంతములు, శ్రీ శివా మకుటాగ్ర సురత్న స్నిగ్ధములు మొదలగు శశి సత్కళలను కవి వర్ణించుట మనోహర ములు.

శాలినీ వృత్తములో శాలినిని ఆహ్వానించినాడు.

"అమ్మా ! రావమ్మా ! సుధాలింగసమ్మో
వమ్మా ! పుణ్యామ్మన్ మహాభావనాధీ
నమ్మో ! శావ్యమ్మింత నాకేల ! నా లా
పమ్మున్ జేతున్ నీ ఘృణాపీణ (మోగన్"

చంద్రమౌళి శాస్త్రి హేమంత ఋతువునందు ప్రకృతి పులకరింపులను, పలక రింపులను సంక్రాంతి పండుగ పబ్బములను, ఫల పుష్పాదులను, పంటలను, చలి ప్రభావ వర్ణనమును అత్యంత సహజ సుందరముగ వర్ణించినాడు.

ప్రకృతి మంచు దుప్పటిచే కప్పబడుట, తృణ శిరములు ముత్యములు చల్లబడి నట్లు మంచు తుంపరలచే నింపబడుట, తెల్లని పట్టు సెల్లా కప్పబడినట్లు గిరులు కని పించుట, నీళ్ళు తేళ్లై కడగళ్ళు పెట్టుట వంటి వర్ణనలే అధికములు కలవు. వరి కఱ్ఱు పూర్ణ గర్భవతి యట్లు గొలుసుల వంచి నిలుచుండెనట. పొలములో జలము నిండుగా పారుట, కలుపు పెరుగుట, చేలలో నక్క దోస, ఆకు-ఆకున, పూవు-పూవున దరిద్ర సంతానమట్లు కాచుట, జొన్నచేలు ఈనుట, ఆ ఋతువునందలి పంటచేలను గుర్తు చేయును.

హిమవంతుని ప్రభావ వర్ణన కవి కన్నులకు కట్టినట్లుగా వర్ణించినాడు. ఎంత ధైర్యవంతుని గూడ నిట్టే గడగడలాడజేయుట, లేనివారికి వస్త్రముల అవసరముల తెలుపుట, వృద్ధులు తలుపు తీయుటకు ఒప్పుకొనకుండుట, నరనరములు క్రుంగదీయుట, ఆలుమగ లెప్పుడు నెగడి వీడక యుండుట వంటి వనేకములు.

సంక్రాంతి పర్వవేళా విశేష వర్ణనము యీ కవి ప్రత్యేకత. గొబ్బిదేవత ముగ్గుల కొలువు దీరుటకు కావలసిన తంగేడు చెంగును ఒక ఈడేరిన అమ్మాయి, విచ్చిన గుమ్మడి పూలను కన్నె పేరంటాలు, ముద్దబంతి పూలను క్రొత్త పడుచులు, చిక్కుడు పూల గుత్తులను యువతులు, పెరటిలోని దోసపండ్లను అమ్మాయిలు, జిట్టిరేగుపండ్లను లంబాడి పడుచులు, ఊచ బియ్యమును పాలేరులు తెచ్చినారట.

క్రొత్త అల్లుడు సంక్రాంతికి అత్తవారింటికి వచ్చుననునది ఆచారము. ఆ అల్లుని రాకను చూచి బావమరది ఒక్క గంతువేసి అక్కతో చెప్పినదట. కాళ్లకు

నీళ్ళు యిచ్చి జావపై చినుకులు చిలికి నవ్వినదట. తొలి మమత ముగు తలుపు సందుల్లో నుంచి మగని చూడగా అత్తగారు యోగక్షేమములు తెలిసికొనినదట.

"సంక్రాంతి లక్ష్మి" రాకను గూర్చిన సంబరములు సహజములు.

"ఔనన్న కాదన్న నాడించుచును తల
సేలువ ద్దొల్చి వచ్చెను బసవన్న,
తాండ్ర పాపయ కత్తి గాండ్రింపులను గుప్ప
టలను గ్రమ్ముచు జంగమయ్య వచ్చె,
అక్షయ పాత్రలో సాపొత్తు వచ్చె సా
తాని జయ్యా సిరంగ ధాము పాట—।
వచ్చె పందేనికై విచ్చు కత్తిని పుంజు
కాలికి గట్టి మా కాపు కుర్ర
నెత్తిపై పాలముంతల నిల్పి పట్టు
కోనక నోముపుగ వచ్చెను గోప కాంత ।
ఏమి సంరంభమో యిది ! ఎంత సంబ
రమొ ! సుఖాస్థాని సంక్రాంతి లక్ష్మి రాక !"

'హరి నర్తన'మ్మను శీర్షిక యందు పార్వతీ పరమేశ్వరి ప్రణయివేళలో,

"ఘంటికల్ మొరసెన్ ఘణా
ఘణ రవోదక్షు ఘృణా క్వణ
మ్మంట మింట ! హారోం హారో
మ్మని భూతంబుల్ మరి ప్రమానె ము
క్కంటు వెల్గుల పాకె మం
గళ రంగాలంకరణాలుగా !
నంటె బో ! హిమద్రామ జా
నట రాట్పాదోన్నయ నాట్యముల్" అభివర్ణితములు.

'కవి హిమావగుంఠన మను శీర్షికయందు హేమంత కాంతను మోహనాంగిగా అభివర్ణించినాడు.

'నవనందిని' యని శీర్షికయందు హిమ-సార్వభౌముని కఠినతమభివర్ణితము.

"ఎవరోయి ! ఈ జడ మహిన్ మహిమటంచున్
శివమెత్తి పల్కెదురు ! చే దగునో టీపుల్
జవలేని జీవితము చావుకు సమానం
బివతాళి మొత్తులకు నేమగు మహూహాల్"

మాఘ, ఫాల్గుణ మాసములు వివాహ శుభకార్య ప్రయోజకములు. ఇవి శిశిర ఋతువులో వచ్చును. కావున ఆడపిల్లలను కనిన తల్లిదండ్రులు పెండ్లి బెంగను కలిగియుండుట సహజము. హేమంతపు చలి శివరాత్రితో పోవునను జనుల ఆశలు సన్నగిల్లినవట. వృక్షాలు జైనుని బొమ్మవలె నిల్చినవట. జనుము కోతకు వచ్చుట, మినుము తీతకు వచ్చునను ఆరాటము రైతులు కలిగియుండుట, విరహిణికి పూలపై తలపు వాలపై వలపు ఆశల కల్గియుండుట, శిశువులకు మామిడి పిందెలపై దేముడి అందెల మ్రోగుటపై ఆర్భాటము కలిగియుండుట, అందము ఆనందమునకై ఎదురు చూచుట శిశిర ఋతువునందు దురవగాహాలగునని కవి ఊహ ___

"ఎన్ని విధముల జూచిన నున్నితములు
కనబడని జీవితంబుల గడుపు నట్టి
మొండి వలె, బండ వలె, శిఖండి వలెను"

శిశిరము తీరెనను కవి భావన పేదజనుల పట్లగల సానుభూతి వ్యక్తము.

ఈ శిశిర ఋతువునందే కోటప్పకొండ, కొరవి వీరన్న తిరునాళ్ల జరుగును. రైతులకు జనుము, మిరప పంట చేతికి వచ్చును. శిశిరము హేమంత వసంతముల మధ్య ఋతువగుట చేత

"చలి ఎండ సమపాళ్ల నోలక బోయు"
"పొంగు క్రుంగుల భావముల్లను రాయు,
విరాగ సరాగము లుండును ఎదురగు ననియు"
"పాపమా ! ఇయ్యది పరమ పుణ్యామ యిది
కాకులు కోకిలల్ కలత రోయు"

"రుద్రు సెగకంట మాడిన ఛిద్ర ఋతువు
పార్వతీ పరిణయోచ్ఛ్వాస పర్వఋతువు' కాన

శిశిరము ద్వంద్వ సమాసమగుచు వచ్చెననుట కవి ఆలోచనా రీతి నవ్యము.

శిశిరుడు మిధున విడియములందు విధమెఱిగిన జాణలకు దరిద్రాణమూర్తి యట. పత్ర పుష్ప ఫలార్వ్రి పథ విశ్లథా భోగి భావముల తృప్త బుద్ధ విభుడటగాన విద్యార్థులకు సహకార శీలియట, శిథిల భావము వాడట. భూతిదేహము వాడట, ధీరశాంతుడట. 'శిశిర మందరి'' యను శీర్షికన మ్రోడు బారిన బ్రతుకున మళ్లీ చిగురించు ఆశలు మొలకెత్తునను విషయము అభివర్ణితము

"అలసగతి" వృత్తము నందు కవి శిశిరమును
"నిజమునకు నీ మనసు నిండు నవనీతం
బె! జన మవిచారత శపించు నినున్! భా
వజ సుమ శరాసన వివాదముల త్రోవల్
సృజన గతి యంచెరిగి చీరుదువు గోరన్-" ॥
"ప్రజల బ్రతుకుల్ బరువు భారముల గ్రుంగన్
విజయమది గాదనుచు విస్తురెవరో! వా
రె, జగతికి స్నేహితులు! రిక్తులు-విరక్తుల్
గుజగుజల పోయినను కూడునొ సుఖంబుల్

అని సంభోధించినాడు. మరియు ఆమని ధ్వనింపుటకు జడ వీధిన అలసగతులే తగునను భావన ఇందు వర్ణితము.

'ఋతువవనము' శబ్దార్థాలంకార భరితములు. కవి సమయోచితముగ కావ్య మందంతట అలంకారముల గుప్పించినాడు. నేనిట కొన్నింటిని పేర్కొందును.

వసంతమున "తేనె దెచ్చితి నంచను తెనుగు కొమ్మ
పల్లవింప రాగోద్వేగ పదము పాడె

కోకిల స్వామి ! నంద గోకులము నందు
మువ్వ గోపాలు పెదవుల మురళి వోలె !"
"చెడి బ్రతికిన వారి సిరి నిక్కినట్లుగా
మొద్దు కొమ్మలు గూడ పొద్దువిరారె నను"

ఉపమానములు కడు రమ్యములు.

"మల్లె మొగ్గలు విచ్చి కల్లోలములు దెచ్చె
మదన మహీపతి హృదయమునను"
"భ్రమరులకున్ గీతలకును ఏ బంధమో
విసువక పాడును విధుర వీణ"

లతలకు పూలకు, పూలకు భ్రమరాలకు, అవినాభావ సంబంధ వర్ణనలు అత్యంత సహజ అలంకార భరితములు.

గ్రీష్మమున లేచిన దుమ్ము—
"ఉన్నటులుండి తానొక్కసారే లేచె
గాలి దుమ్ము గయాలి గత్తెవోలె"
"ఎండయు, వానయు నేకమై వచ్చెను
లేమి కలుములు నికిలించినట్లు" వంటి ఉపమాలు,
"ప్రజల రక్తము పీల్చువారి దుర్గతులిట్టు
లన్నట్లు నల్లులు నవసి చచ్చె"
"వక్రమార్గము బట్టువారలు చెడుదుర
న్నట్లు పాములు నొడ్డ కారిపోయి" వంటి ఉత్ప్రేక్షలు
"చెదరు వానకు చినుకు పైదవిపై రాలిన
పసివాడు నాలుక కొసను సాగె"

దాహా మెంతకు దీరక ద్రావి త్రావి
పర్భతులు కడుపుబ్బుచు చాలివచ్చె" వంటి
స్వభావోక్తులు

వర్షఋతువు నందు మేఘములు
పారి కిరాతుడు జుంజుమును ద్రిప్పవనము వె
ల్వడి యెల్గుబంబులు పరుగునట్లు !"
"నడ్డ గేదెపై గూర్చుని నల్లగొల్ల
పిల్లడొక బూరఁ బాడుచు వెళ్లునట్లు" కదలినవను

ఉపమలు, శరత్ వెన్నెలలు, "రాజహంసలు రెక్కలార్చి నభన్ దీర్చ దివి నుండి భువి మీద దిగెనా యేమొ !"

"పొట్ల పూవులు బీరపూవులు కలబోసి
జగతిపై సేసలు జల్లినట్లు'' కురిసినవను ఉత్ప్రేక్షలు,

హేమంతమున చేమంతి పూలు

"పసుపు పూతల ముఖమ్ము సలారు కొమ్మలా" అందగించినవట
"నీళ్ళు తేళ్లాయి కడగళ్లు పెట్టినవట."

కాపు "మేడమె దిగిరాని మినురాచబిడ్డలా' దిగిరాడట పూల మధ్యగల అవినాభావ సంబంధము లిందభివర్ణితములు

'బంతి పూవులు రెచ్చి పంతాల నాడెనా !
గోరంట పసిచెడి కుమిలె తాసు"
మంచి గుమ్మడి పూలు మనసిచ్చి మెచ్చెనో
కొండగోగు మిగుల బండె తాసు"

ప్రకృతి వర్ణనమున ఉత్ప్రేక్షలు కురిపించినాడు.

"ఒత్తుగా దుప్పటి కప్పుకొన్నట్లు" మంచు గుప్పినది
శిశిర ఋతుపునందు

"కొాతివేరి పూతయి ఘుమఘుమ విసరెను
బీదవాని సిరులు బాదినట్లు"
"చెదురు వాన పొగాకును చెడగజేసె
దాపుడు ధనంబు దొంగలు లేపినట్లు" వంటి

అలంకారములు సందర్భోచితములు.
కావ్యరస పుష్టి వర్షఋతువులో శృంగార భరితము.

"చూలాలి చనుముక్కు నీలాల సొగసంటి
చక్కని దొర యిటు సాగుదెంచె"
"ప్రణయిని కౌగిలి బాహుమూలము లంటి
గడుసు గుండెవాడు కదలి వచ్చినాడట"

శాస్త్రిగారి 'ఋతుపవనము' న వర్ణనలు సీసపద్యములతో సాగినవి, ప్రతి ఋతువు చివర ఆ ఋతు గమనము ననుసరించి తగు వృత్తముల నింపినాడు. కవి ప్రతిభ వసంతము నందు 'స్వాగత వృత్తము' ప్రతి పాదము నందలి 16 మాత్రలలో ఎనిమిదేసి మాత్రలకొక విరుపు, యతి కలిగి యుండినది.

"కోకిలమ్మ ఒక కొమ్మను కూసెన్ !
సోకు తీపి నొక సుందరి చూసెన్
ఆకలంచు నొక ఆర్తుడు రోసెన్
రాక పోక లెటురా ! ఋతు రాజా !!

'రసాలి వృత్తము'లో 4 పాదములు, ప్రతి పాదమున 14 మాత్రలు ఏడేసి మాత్రలకు యతిస్థానము కలదు.

మూాక మామిడుల మోహామేమో !
కోకిలా గళ నిగూఢమేమో !
వాక తా కుసుమ వాంఛలేమో !
శ్రీకరా తెలియ జెప్పలేవా !"

'మఘ మాధవి వృత్తము 21 మాత్రల పాద పద్యము.

సౌందర్య భావ వివశాంతర హృత్సరోజా !"

గ్రీష్మఋతువున భుజంగ ప్రయాత వృత్తమునందు గల చతుష్పాదములలో ఒక్కొక్క పాదము 20 మాత్రలను కలిగి యుండును. "అసహ్యంబు లయ్యెన్ ధ్రువకోకిల వృత్తమున మొదటిపాదము 14, 11 మాత్రలు కలిగినవి. "ప్రగతి వాదులు వత్తురా ! రసవంత వృత్తము తెత్తురా !"

వర్షఋతువున 'మేఘ విలసిత' మను వృత్తము నందు ప్రతి పాదము 16 మాత్రలను కలిగి యుండి 9వ మాత్ర యతి స్థానమలకకరించును.

సస్యశ్యామల సదన వసుధ నీ
లాస్యాంతంబున రతనము లొసగున్''

'జలధరమాల వృత్తము' లో ప్రతి పాదము 20 మాత్రలను కలిగి 13వ మాత్ర యతి స్థానమును పొందినది.

నీవే గదా ప్రజలకు నేత్రామోదం''

శరత్తున క్రౌంచ పద వృత్తములో 8వ పాదములు, ఒక్కొక్క పాదము 16 మాత్రలు కలిగి 9వ మాత్ర యతి స్థానమలంకరించును.

"చంద్రిక వచ్చెన్ ! చంద్రిక వచ్చెన్ !
చలువలు కలువలు చలులను దెచ్చెన్ !"

చంద్ర కళావృత్తము' నందు ప్రతి పాదము 28 మాత్రలు "శారదారదన స్ఫురదంశా సాదరముల్ తెలివెల్గులై ! 'శాలినీ వృత్తము ప్రతి పాదము 20 మాత్రల గూడి 12వ మాత్ర యతి స్థానమున్నది.

"దేవీ రావే ! కౌముదీహ్లాద రేఖా
నీవారాలంకారివి. ! శాలిసీ ! రా"

హేమంతర్తు వర్ణనమున 27 మాత్రలు (12+15) కలిగి 15వ మాత్ర యతిని కలిగి యున్న 'హరినర్తన' మను వృత్తములోను, 19 మాత్రలను నడచు 'నవనందినీ' వృత్తములోను సాగినది. శిశిర ఋతు వర్ణనము 26 మాత్రలు (15+11) ల కలిగి 16వ మాత్ర యతిని కలిగియున్న 'మందాక్రాంత' వృత్తమునందును. 19 మాత్ర లలో నడచు 'అలసగతి' వృత్తమునందును సాగినది.

ఈ కావ్య రచనా శైలి కొంత కఠినము గనే యున్నను, భావ గాంభీర్యము గలది. తెలుగుదేశమందలి ఆచార వ్యవహారములందు పండుగ, పబ్బములు జనులపై ఋతువుల ప్రభావము, ప్రకృతి వర్ణనము సహజములు. ఈతని కావ్యమున తెలంగాణ ప్రాంతమునందు మెదలుచున్న లోకోక్తులు సామెతలు, జాతీయము లనేకములు

వసంతములోని లతలకు పూలకు, భ్రమరాలకు, గీతాలకు, భావజాతికి గల అభేధ సంబంధాలలో "తీగ కదలిన డొంకంతా సాగి కదలు" నను సామెతలో కవి ప్రతిభ వ్యక్తము,

"చెడి బ్రతికిన వారి సిరి సిక్కినట్లుగా
మొద్దు కొమ్మలు కూడమొద్దు మీరె'' నట
"దేశాలపై బోయి తిరిగి వచ్చిన ప్రియు
తొందరవలె, దురుసు పికము పాడె'' నట
"దాచుకొన్న ధనంబు చూచుకొనెడ లోభి
ఆశగా ఉడుత మొగితొల్చినదట"

"కట్టు గట్టుగ శ్రామికుల్ పొట్ట కొరకు
పయనమైనట్లు" చీమల బారు సాగినదట.

గ్రీష్మమున "వెక్కిరింపగ బోయి వెలకిల బడ్డట్లు
సొక్కి తొండలు ఇంట నక్కె మూల''
వక్రమార్గము బట్టి వారలు చెడుదురు" అన్నట్లు
పాములు నెండ కారి పోయె"
దిక్కు లేని వారికి నగు దేవుడొక్కడే యనగ
పక్షులు ఆకుల ఛాయన బ్రతికినవట.

వర్ష ఋతువు నందు

నల్లనివన్నియు నీళ్లని, తెల్లనివన్ని పాలటంచు,''
"కర్షకుని సిరి మృగశిర కార్తి"
"ఉన్న వానికె ఉన్నవాడిన్ని పెట్టు"
"లేని వాడును భాగ్యశాలికె యొసంగు''
పేదలోకము గాంచు వస్త్రాదులేడి !"
"స్వామి వరమివ్వ గుడిని పూజారి యివ్వడు"

"నిజమాడ నిష్ఠురంబు" అని మేఘుని సంభావించిన సందర్భమున కవి సమయోచిత భాషోపయోగ మద్భుతము. శిశిరమున "శివరాత్రికిని పోవు శివ శివా-యని చలి" అవిన ఆశలు పోయినవట.

హేమంతమున చలి "ఇష్టులే తరి దప్పి కష్టులైనట్లు నీళ్లు తేళ్లయి కడగళ్లు పెట్టినవట శాస్త్రిగారి రచన 1945-65 వరకు సాగినను, ప్రకృతి వర్ణనతో పాటు సమకాలిన సమస్యలను కూడ పేర్కొనుట కలదు. మానవులు, పశు పక్ష్యాదులు పడు సుఖ దుఃఖాదులను ఆ, యా ఋ తు ప్రభావముల ననుసరించి వర్ణించినాడు.

వసంతము వివాహాది శుభకార్యములకు అనువైనదిగను," కళ్యాణ సువర్ణ కంకణ వసంత శ్రీలు దిశల్" చిమ్ముట నిత్యమను విషయము వర్ణితము. గ్రీష్మ మున రచ్చబండను వీడిరాని పెద్దలు కొంచ పొద్దెక్కగనే ఇండ్లకు మరలుదురు. ఇంటిలో ఉక్కబోయుట, బయట దుమ్ము ఎగనుట, పడక సమస్యలు ఏర్పడును. ఆవకాయ నీళ్ల మజ్జిగలే నిత్య ఆహార వస్తువులైనవి. త్రాగునీరు కారువౌట, గ్రీష్మ తాపము ఉడికించి వేయుట వడగాడ్పు దెబ్బలకు మన లేకుండుట ఈ కాలపు సమస్యలు తొలకరి వర్షము కురియగనే రైతుల మనములు పొంగుట సహజము. వరదలు వచ్చి నదులు ఉప్పొంగుట కలుగును.

శారద రాత్రులు పండు వెన్నెలలు కురిపించి మానసోల్లాసమును చెకూర్చును. హేమంతమున సంక్రాంతి పండుగకు క్రొత్త పంట, క్రొత్త అల్లుని గురించి సమ కాలిక విషయములు వర్ణితములు.

శిశిరము నందు మాఘ, ఫాల్గుణ మాసములలో పెండ్లిళ్లు చేయుట, జనుము, అనుము పంటలు చేతికి వచ్చుట, కోటప్పకొండ, కొరివి వీరన్న తీర్థములకు వెళ్లుట మొదలగు విషయములు ఇందు వివరింపబడినవి.

బెల్లంకొండ చంద్రమౌళీ శాస్త్రి 'ఋతుపవనం' తెలుగునాట వీచి, తెలుగు జాతి సంస్కృతిని ఉట్టి పడ జేసిన వర్ణనా కావ్యము. సంస్కృత పదజాలము అధి కముగా వాడినను, కొంతవరకు సులభ శైలినే కలిగి యున్నది. ఇందలి వర్ణనలు ఆ, యా ఋతువుల అనుకూల పవనవీచికా వృత్తములలో సాగి ప్రత్యేకతను సంతరించుకొనినవి.

—o—

# "తమసోమా" (ఋతుకృతి)

ఓగేటి పశుపతి

ఓగేటి పశుపతిగారి ఋతుకృతి 'తమసోమా' ఆరుఋతువులను రెండు భాగములందు వర్ణింపబడిన తెలుగు కావ్యము. వసంత గ్రీష్మ వర్షఋతువులు తమో భాగమునను శరత్ హేమంత శిశిరములు జ్యోతిర్భాగమునను వర్ణింపబడినవి.

"తమసోమా జ్యోతిర్గమయ" అనునది ఉపనిషద్వాక్యము. చీకటినుండి వెలుగులోనికి నడిపింపుమనియే దీని అర్థము. ప్రతిజీవుడు రసస్వరూపుడైన భగవంతుని చేరుటకై తెలిసియో, తెలియకనో పరితపించుచుండును, ప్రపంచము నుండి పరమాత్మవైపు నడచి మోక్షమార్గము నభిలషించును. దానినే దృష్టియందుంచుకొని పశుపతిగారు దక్షిణ ఉత్తరాయనములలో కృష్ణ శుక్ల గతులకు ప్రతీకలుగ నెంచి, కావ్యమును రెండు భాగములుగ విభజించి రచించినారు.

వసంత గ్రీష్మ, వర్ష ఋతువులు హాయిని కలిగించే ప్రకృతిని అందించే ప్రాపంచిక క్షణిక సుఖమున అశాశ్వతానందమును పొందజేయును. కావున ఇవి తమోభాగమున వర్ణితములు. ఇవి మనస్సుకు సంబంధించినవి.

రెండవభాగమునందు పరమాత్మను జ్యోతిస్స్వరూపునిగా దర్శించి, శాశ్వతానందమును పొందగోరుట కవి హృదయము. ప్రసన్నతా గంభీరమైన శరత్తు, ఆకులు, కోర్కెలు రాల్చేశిశిరం ఇందు వర్ణింపబడుట కడుసమంజసము. ఆర్యధర్మము ఇందు ప్రస్ఫుటము

'వసంతము' భోగఋతువు. కావుననే దక్షిణాయనమునను, 'శిశిరము' త్యాగ ఋతువైనందున ఉత్తరాయనమున చేర్చబడుట మిక్కిలి ప్రశంసనీయము.

శ్రీ పశుపతి విద్వత్సంపన్నుడు. జీవిత సత్యమును 'ఋతుకృతి' ద్వారా సాహితీ లోకమున కందించిన కవివరేణ్యుడు. కర్షక వృత్తిలో హలమును, కావ్యక వృత్తిలో కలమును చేపట్టి కావ్యక్షేత్రములను పండించిన ఉభయ ప్రవీణుడు.

కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణగారి 'తెలుగు ఋతువు'ల ప్రభావము ఈతనిపై బడి ఋతు కావ్యమును వ్రాయనుద్యుక్తుని చేసినవి.

అందలి విభావములు, పద్యముల నడక, శిల్పము కవిని ముగ్ధుని గావించి, జీవధర్మము ప్రతిబింబింపజేసి, చక్కని కావ్యమును వ్రాయింపజేసినవి. ప్రతి ఋతువున కేవలము పదేసి సీసపద్యముల చొప్పున అరువది పద్యముల కావ్యముగ వెలసినది. అధ్యాత్మికముగా ఆలోచనలను కలిగించి, ఆత్మాశ్రయ కవిత్వముగా వెలసినదీ కావ్యము.

'తమసోమా' ఋతుకృతి యందు కాముని చిత్రవిచిత్ర ప్రవృత్తులను వెలార్చుటతో వసంతఋతు ప్రవేశము జరిగినది. పచ్చడి మామిడి కొమ్మల తోరణములను గుమ్మములకు కట్టబడుట, చవులూరించు పచ్చళ్ల రుచి చూపి రెచ్చగొట్టుట, పంచాంగములను చూపి జాతకములను బయట పెట్టుట వంటి క్రియలను చేసినాడట.

మాధవుడు ఒక మహేంద్రజాలియట, మోడుబారిన చెట్లు కిసలయశ్రీ సముల్లసితములై మొగ్గలచే నిండిపోయి, వికసించి, పిందలచే, కాయలచే ఫలములచే మిక్కిలి అందగింపజేసినాడట.

వసంతుడు శివునిపై నున్న కక్షను తీర్చుకొనుటకేమో ! మన్మథుని సృష్టించి సత్కరించినాడట, కొదమ కోయిల కూత బాకాలతో హాళాహాళిగను తోడి తెచ్చినాడట. తోరణాల నిండు పందిట కూర్చుండబెట్టి, సువాసనల పూలమాలలు వేసి, పేద దీర్చు చల్లని పిల్ల తెమ్మెరలు వీయించి, పుప్పొడుల 'బుక్క' ను చల్లించినాడట. ఇందు అతిథుల సత్కారములు వర్ణితములు.

మన్మథుడు వసంతునకు వంతను పాడిన విధము హృద్యము. చెట్ల .కొమ్మల రెమ్మల యందు చిగురులు తొడిగి వన్నెచిన్నెలు ననసన్నగా దిద్దినాడట. వయసు చెల్లిన ఐదవకు కొప్పున మల్లెమొగ్గలు తురిమినాడట. చల్లని పిల్లగాడ్పులు వృద్ధ దాంపత్యములకు కవ్వించి ఉసిగొల్పినవట.

వసంతవైభవము వెనుక దాగిన విషయములను వర్ణించుటలో సుఖము వెనుక దాగిన కష్టములను తలపించును. ఇది కవి పరిశీలనాదృష్టికి తార్కాణము.

"పయిఁబైరగాలుల పరవళ్లు మేల్మేలు !
లోలోన విరహాగ్ని కీలలెట్లు ?
పూగొమ్మ సొంపులు బాగు బాగెగఁబడు
మధు పాపు గుంపుల మాట యేమి ?
మఱి మఱి భోగమ్ము సరిసరి ! చిగురించుఁ
బ్రాత రోగము దాని పనియదెట్లు ?
చివురాకు తళతళలవునవు ! రాలిన
యొండాకు గల గల లేమనవలె ?
ఇంట సీగల మోఁతయు నింటబైట
బల్లకీ మోఁత లన్నట్లు బారుబూరు"

వసంతఋతు ప్రభావము ప్రాణులపై పడిన విధము సహజ వర్ణితము. ఆలుమగలు మధుమాస మోహాంధ తిమిరభర. నిశీధ సమయములందు స్వల్ప సుఖమును మాత్రమే పొందగలిగినారట. వాకిట పడిన పడకలు సన్నజాజి పందిళ్ల సరసన ఉండుటచేత బిగికౌగిటగల ఆలుమగలు పిల్లగాలుల చేత సొమ్మసిల్లి నిద్రించినారట.

తీరని కోర్కెలను రేపి వసంతుడు కష్టముల తెచ్చిపెట్టునట. "ఊరకరారు మహాత్ములు" అన్నట్లు వచ్చి తెంపులేకుండ పెండ్లిండ్లు తెచ్చిపెట్టినాడట.

ఆ పెండ్లిండ్లలో బ్రాహ్మణులకు బియ్యపు మూటలను, బంధువులకు విందులు, మందులును, వెలదుకలకు వివిధ భూషణములను చేయించుటతో అయ్యలకు అప్పుల కటగండ్లే చివరికి మిగిలినవను విషయము సహజ వర్ణితము.

ఇందు వసంతము కామునితో ప్రవేశపెట్టి క్షణిక సుఖమునిచ్చే కోర్కెలను శృంగార, ఆనందమును, వివాహకార్యభారములు, వాని వెనుకనున్న కష్టములు వర్ణింపబడినవి.

గ్రీష్మమున తీవ్రమైన ఎండవేడిమికి తాళజాలని జీవజాలము అభివర్ణితము. మహిషము బురదగుంట లందు పొరలుట, కాలభైరవుడు ఒక మూలన కూర్చొని నాలుక తెరచి రొప్పుట, పన్నులన్నియు విఘ్నములగుట, జరుగును. గ్రీష్ముడు మధ్యాహ్నసమయమున అందరిమీద నిప్పులు చెరగుచు కారాలు మిర్యాలు నూరుటచేత అతడు “పచ్చి గయ్యాలి గంప” గను, “పరుల సుఖపడనీక, తానును సుఖ పడ డనియు నిందింపబడినాడు.”

గ్రీష్మమునకు ప్రాణులు మలమల మాడినవి. బడుగు పేదల పూరి గుడిసెల పైన, తమ ప్రతాపములు చూపి, లోకములో గొప్పవారును అప్పుడప్పుడు అల్పముగా ప్రవర్తింతురను విషయము సార్థకము చేసినది.

వేసవి యందు జనుల ప్రవర్తనల యందు కలుగు మార్పులను వర్ణించిన తీరు నవ్యము.

“కమాలన్న మధుర భక్ష్యముల కంటెను, వట్టి
సేరే సమాదరణీయమయ్యె,
కరము మెత్తని దూది పఱుపుల కంటె, స
రిత్సైకతమ్ములె ప్రియములయ్యె;
విలువైన చలువైన వలువల కంటెను,
జలుత గాదంచలే మెఱుగులయ్యె,
పాలగచ్చు మేలి ప్రాసాదముల కంటే
పర్ణశాలలె సుఖప్రదములయ్యె” ననినారు

వర్షఋతువున రైతులు పడు బాధలు వర్ణితములు. ఒక పయోధర లలితాంగి గిరిరాజు మూపుపై నొరిగి శృంగార మొలకబోసినదట. ఉరుములు, మెఱుపులతో రౌద్రము చూపినదట. నిఱుపేద గుడిసె వరద నీటిలో కొట్టుకొని పోవుచున్నదట. ఝంఝూనిలము చెట్ల కొమ్మలను, రెమ్మలను విరుగవీచినదట.

'శరదృతువ'ను మహాపురుషుని రాకచే చింత చీకులన్నియు తగ్గి ప్రతిచోట నవననివో త్తేజ భాజనమగుచు తనరినవట. శరత్పయోదములు యతీంద్రుని మనో హంసల వలెను, వ్యోమకేశుడు మేనబూసిన విభూతి వలె నున్నవట.

శారద రాత్రులందు గుబురు చెట్ల సందులలో నుండి పడే వెన్నెలలు ముగ్గులు పెట్టినట్లుగను, కవి భావనా వల్లికలకు ప్రాణము పోసినట్లుగను, ఉండునను వర్ణనలు సహజ సుందరములు.

చంద్రుడు మహా కళానికేతనుడుగా, అమృత తనుడుగా, భువన మోహనుడుగా వర్ణింపబడినాడు.

శరదృతువున వచ్చు పర్వదినములభివర్ణితములు.

"దశమి పండుగనాడు ధరసింహపీఠిగ
నిడి, జారికి నభంబు గొడుగు పట్టి,
దీపావళీ పర్వదినమునఁ బట్టి గి
రాగిర విష్ణు చక్రములు ద్రిప్పి,
కార్తిక పూర్ణిమ కదలి తానాలలో
గొంతెత్తు కెరటాల కొసల కెగిరి,
యట్లు తదియ నాశలంటగ నాశల
నవలకుఁ దన్ను చుయ్యాల లూగి;
తెలుగు పల్లెల పిల్లలు, తీవసేవ
నప్రచాలన ప్రవిలంఘున ప్రతాడ
న ప్రవణ శీలురైరి. కనద్ఘనసిత
శాత హేతి దీధితి ధురా శరదృతువున"

మరియు వనభోజనములు, నదీ స్నానములు, దేవాలయ శివార్చనలు, కార్తీక మాసము నందు ప్రతి దినమున జరుగునను విషయము తెలుపబడినది. పండు వెన్నెలలు, హృదయ బృందావనమున శ్రీకృష్ణుని చేష్టలను తలపింప జేసినవట. జిట్టి తమ్మి పువ్వు

మహాదేవుని శిరస్సుపైకెక్కుట, ఉసిరి మొక్క సకల నారీజన సంపూజితమగుట ప్రత్తి దీపాలలో వత్తులగుట, బిల్వదళము భక్తునకు కర్ణావతంసంబగుటచేత శరత్తు చెట్టు చేమలకు విభవము కలిగించినది.

హేమంతమున 'సంక్రాంతి' ఒక విశిష్ట పర్వదినము, ఈనాడు తెలిగింటి ఆడ పడుచు ఇంటి పెత్తమును తలదాల్చుట చేత తన తల్లికి సంసార బంధము వదలించిన దట. రకరకముల బొమ్మలాటల చేత లోకపు బొమ్మలాటలను చూపించినదట. భోగి పండ్లను పోసికోనుటచే బోసినవ్వల పాప జనన సాఫల్య మూర్తిని సృజించునట. కావున ముగ్ధ సంక్రాంతిని "పరమ వైదికాచార ధర్మరమ" గా వర్ణింపబడినది. సంక్రాంతి పండుగ నాడు జరుపుకొను కృత్యములన్నియు వర్ణితములు. బ్రాహ్మీ ముహూర్తమందు లేచి, స్నానమాడి, భక్తి గీతముల నాలపించు హరిదాసు, ఇంటి ముంగిట ముత్యాల ముగ్గు మధ్యలో గొబ్బిళ్లతో కళకళలాడునట్లు అమర్చిన కన్నె పిల్లలు వర్ణింపబడినారు. గంగెద్దు బసవడు బుద్ధావతారముగా పోల్చబడుట ఏది చెప్పి నను తల ఊపునే కాని కాదనడట.

హేమంతమున కురిసిన తుహిన బిందువులు రాత్రి తమ తమోమయ జీవి తమునకు రోసి, ఏడ్చికార్చిన కన్నీటి కణములట్లు వర్ణింపబడుట కవి భావనా శక్తి అపూర్వము.

సంక్రాంతి పర్వదినమున వచ్చిన విష్ణు స్వరూపుడైన క్రొత్తల్లుడు పట్టె మంచముపై నుండగా "

"రంగన్మహాభోగి రంగశాయి" వలె నున్నాడట. అల్లుళ్లకు చేయు సత్కా రములంను వర్ణితములు.

శిశిరమున శివరాత్రి పర్వదిన మభివర్ణితము. మావి పిందెలు శివలింగముల వలె అందగించునట. పైరులు మేసిన బసవన్న వెండికొండ వలె కన్నుల పండువుగ అగుపించునట. వనములు ఆకులరాల్చి దిగంబరత్వము వహించునట. లంకలోనున్న సీతమ్మ, దిగంబర వేమన్న త్యాగయ్య స్మృతికి వచ్చునట. శివరాత్రి నాడు శివమహా క్షేత్రములకు భక్తులు వెడలిన వర్ణన కడు హృద్యము.

శిశిర రాత్రులందు చలినోర్వజాలని వారి అనివస్థలు

"పిల్లలు చక్కగా తల్లుల డొక్కలం

దొడిగి, యొదిగి, నిద్ర కొగ్గునపుడు

సరికొ్రొత్త దంపతుల్ మఱి మఱి గాఢప

రీరంభముల (బ్రవర్తిల్లునపుడు,

ముందు సీళ్ల బొంతలు ముసుగిడి (బ్రాంగుకుక్క-

లం దొడ్డిగిలి జోగాడు నపుడు,

కల గృహస్థులు తూలికా తల్పముల నంతి

పురముల నడుమ్మ మఱచినపుడు,

శిశిరమునను జేలి విదలించు నిశలయందు

గదియు వెచ్చని సుఖము సుఖంబు గాక,

తుదకు శిశ్వాది (బ్రొద్దు-(బ్రొద్దున లేచి,

మనసు పఱె జగద్బంధు దర్శనము కొఱకు,

శరత్, హేమంత, శిశిరములందు కవి మోక్షమార్గమును చూపినాడు.

ఋతుకృతి యందు తెలుగునాట (ప్రతిబింబించు సంస్కృతి కన్నుల ముందున్నట్లుగా వర్ణింపబడినది. ఇందులోని (ప్రతి విషయమున సమకాలిక సమస్యలు (ప్రతిఫలించు చుండును. అన్ని కాలములలోను, ఆయా ఋతుధర్మములు, (ప్రకృతిరమణీయకతను, (ప్రాణులపై బడు (ప్రభావములు, సుస్పష్టములు. ఈ కావ్యమున తెలంగాణము నందంతటను, వినిపించు సామెతలు, జాతీయములు నుడికారములధికములు. వసంతమున మాధవుడు (ప్రకృతిని పులకరింపజేసి,

"స్వర్గమూడిపడిన ఛాయలు చూపించి,

జనుల నెల్ల మోహ జలధి ముంచె" నట

వసంత వైభవము నల్గడల సాగినపుడు పైన పైరగాలుల పరవళ్లు, కాని, లోన విరహాగ్ని కీలలు కలుగుచున్న సందర్భమున కవి "ఇంటనీగల (మోతయు, నింటిబైట పల్లకీ (మోతలన్నట్లు" అను సామెతలో ఉపమించినాడు.

"వసంతునకు కవీంద్రులు పడిచచ్చిరహహ!" అనునది స్వనావోక్తి. మధుడు ఒక విస్మాత్మ సమసమాజ వాదిగా పేర్కొనబడినాడు".

"నోరు వాయి లేని వాని మేదను నీప్రతాపంబు" అనుటలో బలహీనుల పైన బలవంతుల ఆధిపత్యము వ్యక్తము. వసంతఋతు చక్రవర్తి "ఊరకరారు మహాత్ము లనిన సరణి" వచ్చినాడని అలంకరింపబడినాడు.

గ్రీష్మని ప్రతాపము "చింతచచ్చియును బులుసు చావదన్నట్లున్నదనియు",
"మార్జాల ఖేలనమ్ము గ్రీష్మ పాలనమ్ము" అనియు
"పచ్చి గయ్యాళి గంప" అనియు,
"పరుల సుఖపడనీయక తానును సుఖపడక
ఊరకెప్పుడుండినట్లుడికిపోయె" ననియు
ఒక జిజ్ఞాసువునకు గ్రీష్మ సమయము
"బ్రతుకు మీద నొక విరక్తి వెలార్చినదట"

అనియు వర్ణితములు.

"రాలమూర్తి మూడు చెరువుల నీళ్ల పుబ్రొద్దులందు" కవిని త్రాగించినాడట
"గొప్పగొప్పగ లోకంబు మెప్పునొందు
వారలను బ్రవర్తింతు రల్పముగ మిగుల
నొక్కొక్కప్పుడోర! గ్రీష్మమునకు
జెలువు లెండి, బయల్పడెఁ జేపలట్లు"
గ్రీష్మ తాపము మిక్కిలి భరింపరానిదయ్యెను,
"దేహమునను తీపి తెగను లేదట"
సంసార వాంఛ సడలినప్పుడు కలుగు భావనాపటిమను
"ఇంటికంటె పదిలమయ్యెను గుడి!" యనుట తేటతెల్లము వర్షఋతువు నందు కృషీవలుడు చేలనుండి ఇంటికి వెడలునపుడు వర్ణించిన విధము నవ్యము.

పంట భూములలో కలుపు మొక్కలు పెరుగుటను,
"మంచి కంటెను చెడు మించునట్లును",
పుట్టగొడుగులు పెరుగుటను,
పిదప బుద్ధులు పుట్టునట్లుగను".

కొంగులు త్రొక్కుటను,

"సంసార చింతార్త సరణి" యని ఉపమించుట కలదు. మరియు "కోటి కలలు పొట్ట కూటికన్నట్లు"

"పరార్థమునకు గాక స్వార్థమునకు" చెప్పబడినవి. వానకారు రాక

"వట్టి త్రాగుబోతు వైఖరి నుఱుములు ధామధామునుగ" ననుట చక్కని ఉపమానము.

ప్రకృతి "తాను మునిగినది గంగగా,
వలచినది రంభగా........కులికినదట.

శరద్వర్ణనమున, "గుమ్మాన నిలిచిన వనితఁజూచి
ముగ్ధుడయ్యెను గృహమేధి."

హేమంతమున,

"ఏది చెప్పినను కాదు కాదనక చేయు ఐసవడు."

శిశిరమున "శివరాత్రికిని చలి శివశివయనె" వంటి సామెతలు అనేకములు కలవు.

కావ్య ప్రశస్తిని గూర్చి బి. ఏ. కుటుంబరావుగారి "మున్నుడి" యందు ఈతని 'ఋతుకృతి' ఉత్తమ గ్రంథముగా పేర్కొనబడినది. శ్రీ తుమ్మల వారు "పశుపతి కలం ఎట్లా త్రిప్పినా అంతరాంతికా విశసన కౌశలం" కనబడుతుందని అన్నారు. సత్యవాణి శీర్షికలో కావ్యప్రశస్తి పేర్కొనబడినది.

....o....

# ఋతురాగం

జె. బాపురెడ్డి

శ్రవ్యకావ్య కావ్యములందలి ఋతువర్ణనలను దృశ్య కావ్యముల లోనికి మలచి, సర్వజన శ్రవణనయనానందకరము కలిగించిన కవులలో జె. బాపురెడ్డిగారు, ముఖ్యులు. "బాపురెడ్డి గేయనాటికలు" అను సంపుటి యందు గల ప్రథమ నాటిక "ఋతురాగం" ఇది వర్ష, శరత్ హేమంత, శిశిర, వసంత, గ్రీష్మ ఋతు క్రమములో సజీవ పాత్రములై కాలస్వరూపమును తెలుపు గేయ కావ్యము.

బాపురెడ్డి ఆధునిక సాహిత్య ప్రక్రియల యందారి తేరిన కవి. గేయములు, నాటికలు, వచన సంభాషణలు సాఫీగా నడిపించగల మేధావి. రచన ప్రయోజనాత్మకముగా ఉండాలనే అభ్యుదయ దృష్టి కలవాడు. కనుకనే ఊహాలోకములో కాకుండా దైనందిన సమస్యలను తీసికొని వాటిలో కవితను పొదిగి చక్కని కళాఖండముగా రూపొందించినాడు. అప్పుడప్పుడు తాను వ్రాసికొనిన ఈ నాటికలన్నియు ఏదో ఒక విలక్షణమైన, మౌలికమైన భావనో ద్వేగములో పరవశించి పాడుకొనినట్లుగనే తలపించి, ఆత్మానుభూతిని కలిగించును. ఈతని రచనలు అసంఖ్యాకమైన సాహితీ బంధువుల రసజ్ఞతా, సింధువుల మన్ననలందుకొనినవి. సౌందర్యతా, సమతా సమన్వయ దృష్టితో ప్రతివస్తువును దర్శించి అనుభూతులను రసాత్మకముగా పాడుకొనుచు అభ్యుదయోన్ముఖముగా సాగిపోవుట ఈ కవి ధ్యేయమని ఈ 'ఋతురాగము' వలన స్పష్టమగుచున్నది.

'ఋతురాగము' మొదట ఆంధ్రప్రదేశ్ పత్రికలలో ప్రచురింపబడి, ఆకాశవాణి ద్వారా ప్రసారము కావింపబడి శ్రోతల మన్ననలందుకొనినది. డా. డి. కృష్ణమూర్తిగారు ఈ గేయనాటికను తొలిసారి విశాఖ వైద్య విద్యార్థులచే సంగీత దృశ్య నాటికగా విజయవంతముగా ప్రదర్శింపజేసి ఈ నాటికకు కీర్తి తెచ్చినాడు. తరువాత ఇది ఆకాశవాణి వీణాతంత్రులపై విశ్వనాథంగారి సుమధుర సంగీతంతో ఆలపింపబడి అశేష ప్రజానీకము నాకట్టుకొనినది.

బాపురెడ్డి ఈ కావ్యమును 'నటవిరాట్' 'రసజ్ఞ సమ్రాట్' అయిన గుమ్మడి వేంకటేశ్వరరావుగారికి అంకిత మొనర్చినాడు. ఈ విషయమును 'అక్షరాక్షతలు' అను శీర్షికన కావ్యకన్య, భావసఖి, కావ్యకర్తలు, పాత్రలచేసి గేయనాటికను ప్రారంభించి నాడు.

భావసఖి, కావ్యకన్య సంబరమును గని,
"అంత ఇంత విశేషమేమో !
ఇంతలో నే వింతనైనది.
ఈడు వచ్చిన కావ్య కన్యా !
వ్రీడ వీడి తెలుపుమమ్మా" అని ప్రశ్నింపగా,

కావ్యకన్య ఆరు ఋతువులు కలయవెదకి
అవని చంద్రావనిని వెదకి
చేరితిని నా భావ జీవన
జీవితేశ్వరుని........." అని సిగ్గుతో చెప్పెను

అంతనాభావ సఖి

"పాటల కన్నియవౌ నీ చక్కని
మాటల కందని మేటి
రసజగాలె పరవశమొందెడి నీ
రాగము గెల్చిన కోటి... ...ఎవరని ఆతురతతో

ప్రశ్నించగా "తారాపథ సంచారి నా బ్రతుకు
దారుల విరిసిన ఆమని
కళాధరుడు గుమ్మడు నా మదిలో
కాంక్షలు కురిసిన నభోమణి

ఆ గుమ్మడికే అంకితమయ్యెను
నాగానము, నా భావము
ఆ రసరాట్టుకు, ఆ స్వరాట్టుకే
అర్పితమయ్యెను ప్రాణము” అని

కావ్యకన్య సమాధానము చెప్పుచూ

“ఆతనికి గుణమున మాత్రము
అతనుడు సరిరాడే !......
మితభాషి మనోజ్ఞ ధర
స్మిత వదన రసపిపాసువు
చిత్ర చిత్ర జగత్తులకు

చిన్మాత్రము దయాళువు” అని వరుని గూర్చి పొగడినది.
అంతనా కావ్యకర్త “నా కవితా కేదారము
లో కనువిప్పిన సుమమా !
రాగ వసంతుని పరాగ
రాజ్యమేలు కొనుమా ! అని

కవులు, పండితులు, వక్తలు, గాయకులు, కళాకారులు, సహృదయులు, రసజ్ఞులు, ముందు తన కావ్యకుమారిని కృతికర్త కృతిభర్తకు అంకితమివ్వగా ....

“నరులే నారాయణులై
హితులే దేవతలై
దీవించిరి సహృదయులే
భావాంబర విహారులై

పొంగి పొంగి దీవించిరి."
భీమన్నలు రామన్నలు
విద్యాధర సంపన్నులు
అశీరక్షతలు ఆనందమ్మున చల్లిరి." అను

భావన నిత్యనూతనము.

కాల చక్రములో ఆరు ఋతువులు ఆరు అరల వంటివి. ప్రతి ఋతువునకు ప్రకృతి జీవన వీక్షాప్రతులలో, మానవ జీవితానుభూతులతో ప్రత్యేక ప్రాముఖ్యమున్నది. అయినా ఋతుకాంతలు ఒకరిని మించి ఒకరు, ఒకరిని త్రోసి ఒకరు, జగద్రంగ స్థలము మీద విహారము చేయుచున్నట్లు భాసించుచున్నది. స్త్రీకి సహజముగా అన్యకాంతలయందుండు ఈర్ష్యా ప్రవృత్తిని, జీవితములోని సహజ సంఘర్షణలను, సమన్వయములను కళాత్మకముగా చిత్రించుటయే ఈ గేయ రూపకములో కవి చేసిన ప్రయత్నము. ఇందులో ఆయాఋతువుల లక్షణములు ఆయా స్త్రీ పాత్రల యందారోపింపబడి కన్నులకు కట్టినట్లుగా ప్రదర్శింపబడినది. వర్షాసుందరి శరద్బాల, హేమంతకాంత, శిశిరభామిని, వసంతకుమారి, గ్రీష్మరాగిణి, కాలపురుషుడు ఇందలి సజీవపాత్రలు. రంగస్థలమున కాలౌచిత్యమును పాటించి వర్షఋతువున కనుకూలముగ నలంకరింపబడినది.

వర్షాసుందరి రంగస్థలమున ప్రవేశించి, ఋతు సహజ స్వభావమును గొప్పగా చెప్పును.

"కడలి లోని నీరు మబ్బు
కడవలలో మోసి తెచ్చి
మండిపోవు పుడమి తల్లి
గుండె సేద తీర్చినాను..."

కర్షక లోకానందమును చేకూర్చినాను"
చరాచరలకు నవజీవన సంధాయిని నేను."

"ఆకసమ్ములో సింగిణుల విగో
నాకు స్వాగత పతాకలు కట్టెను.
మెరపు కన్నియలు పులకితాంగులై
మురిపముతో హారతులను పట్టెను.

వర్షాసుందరి "కనుచూపులు సోకినచో నదీనదములు పొంగుట" పదపుదర్బలు తాకినచో సస్యశ్యామల సీమలుగా మారుట" జలపాతములు కలుగుట, "సంభవము లేనిచో ఎడారులేర్పడి, జనులు నరకయాతన ననుభవించెదరు.

వర్షఋతువున కలుగు ఉపద్రవములు శరద్బాల, పాత్ర ద్వార కవి ప్రదర్శింప జేసినాడు.

"చీటి మాటి కలిగిపోయి
కాటకాలు తెస్తావు
వచ్చావో దేశమంత
వరదలు పారిస్తావు
నిండు బ్రతుకు లెన్నెన్నో
నీళ్ల పాలు చేయలేదె !"

శరదృతువున గలుగు మేలును గూర్చి శరద్బాల తనగొప్ప

దనముగా భావించి, "చల్లనైన వెన్నెల
చానపి చల్లాను
తెల్లనైన అంబుదాల
తెరలు కట్టినాను."

వింత వింత చిరుగాలుల
వీవనలను వీచాను

లోకమెల్ల కళానంద
లోకములో తేల్చాను''

"పేద గుండెలు విరియుట''
నీటిలోని కలువలను,
నింగిలోని నెలరాజును,
వలపు కౌగిలింతలలో
మలచిన ప్రణయాత్మనేను."
నారాకే లోకానికి
నవభావన నాకము
నా పాటే జనావళికి
దీపావళి పర్వము" అని చెప్ప

కోనుసంతలో విని అసూయ చెందిన హేమంత కాంత జలసింకిన జలజాలు, గంధములేని గంధవాహములు నెలలో నగరాత్రిలలో నిశీధములతో సంబరమేమీ లేదని శరద్వాల పై విరుచుక పడినదట. హేమంతకాంత మంచుపైటను సవరించు కొని, పంటలు పండించిన కాంతిగను, హిమబిందువులను మహీతలమున చల్లని చల్లని తల్లిగను, గుమ్మడి సెనగపూలు విరియబూయించి, అందమొలికించిన దానిగను జవరాండ్రకు, చెలికాండ్రకు ఎదలలో వెచ్చదనము నిండగా గాఢ పరిష్వంగములో చిరకాలపు తీయని కలలను పండింపజేసిన తన గొప్పదనమును చెప్పుచుండగా శిశిరభామిని ప్రవేశించి, హేమంతిని ఎదిరించి,

"ఎంత కర్కశ హృదయ
వే నీవు హేమంతి ?
ఇలను శీతలపు సం
కెళుల బంధించితివి ?

"వయసు బరువున నడుము
వంగిన ముసలుల
ముసుగు మాటలలోన
ముద్ద గట్టించితివి"

"పసిపాపల గజగజ వడకించితివి,"
చలి కంపమున కుత్తు
కలు కోయుటలు మాని
తొలగిపో నేసాగు
త్రోవకడ్డము రాకు !! చికితురాలను చేసి

పంపించి తన గొప్పదనమును....

"ప్రేమ భావము పెంచుదానను
మంచి యెడ తల వంచుదానను."

"త్యాగ శీలము, దయాధర్మము
సహృదయత్వము, శాంతి సహనము
వెన్నతోనే నాకు పెట్టిన విద్యలు
ఎన్నటికి విడిపోని ఉన్నత బుద్ధులు" అని

చెప్పుకొనుచుండగా వసంతకుమారి ప్రవేశించి,
శిశిరభామినిని నిరసించి, "అడవి పడతి మాన ధనం
దోచుకొన్న దొంగ వీవు"

అని నిందించి వెడలగొట్టి తన వైభవమును వర్ణించుకొనును

కోకిలపాటలు, పూవుల తోటలు, మామిడి ఫలములు, మధుకర
ప్రమోదుబారిన తరులతల చివురులు, కవితకు కళలకు ఉగాదులు, నవతకు

నవజీవన పరువములు, కన్నెల మనసులలో కమ్మని తలపుల మల్లెలు. అందము, ఆనందముల జగమంతట పరచిన ఆమని వసంతాలు.

గ్రీష్మరాణి "శిరముపై చండరవి
భాండమును వహించి
శివుని ఫాలాగ్నికి
లావాలలు ధరించి'' వచ్చినదట.

చలివేంద్రములు చంద్రనివ్వాలు అర్పగ లేవట.

"అంబుధీ హృదయమ్ము
ఆవిరై పై కెగసి
నా జగత్తున జీవ
నా మృతమ్మై కురిసి
మట్టిలో భాగ్యాల
మణులు మేల్కొల్పాలి
అప్పుడే నాదు క్షుభి
తాత్మ శాంతిల్లాలి''

అని తన ఆకాంక్షను వెల్లడిచేయుట కవి ప్రతిభకు నిదర్శనము.

కాల పురుషుడు తన ఆధీనములోని ఆరు ఋతు కాంతల పరస్పర సంఘర్షణలతో ఆందోళితుడై వారి నోదార్చు రీతి సహజ సుందరము.

"ఓహూో ! షట్ ఋతువులార !
నా హృదయ జ్యోతులార !" అని సంబోధించి
"మాలో మీరిట్లు హద్దు
మీరి పోరు పడకండి !
ఈ కాల పురుషుని బ్రతుకు
లో తుఫాను రేపకండి !

"లోకమునకు మీరందరు
ఏకరీతి ప్రియతమాలు
నా అనంత జీవన గంగా
గా చలత్తరంగాలు"

"ఒకరు లేక ఒకరు లేరు
సకలమ్మెవ్వరు కారు
యుగ యుగాల నా వెంబడి
ప్రగతిని సాధించరండి !"

"కలహమ్ములు మానండి !
కలసి మెలసి మెలగండి !
కల కాలము నాట్యగాన
కళల తోడ వెలగండి !"

అను జీవిత నిత్య సత్యాల వర్ణన అత్యంత ప్రయోజనకరములు. కాల పురుషుని సూక్తులను వినిన ఋతుకాంతలకు కనువిప్పు కలిగి ఆనందహాసన్ముఖులై నృత్యగానముల చేయుదురు.

"ఋతురాణులము
ప్రకృతి వీణలము
ఒకరి నొకరు ప్రేమించెదము
ఒకరి వెంట ఒకరము భూగోళము
చుట్టు ముట్టి నర్తించెదము.

నవరసమ్ములను
నవ చైతన్యము
ప్రాణి జగత్తుకు పంచెదము
కాల దేవునకు కన్నుల పండువ
గా సత్యము జీవించెదము"

అను భావనలో ఋతువులు తమ కర్తవ్యములను వ్యక్తము చేయుట అత్యంత సుందర సందేశాత్మక వర్ణనము.

బాపురెడ్డి 'ఋతురాగం' శబ్దార్థాలంకారములు ప్రతిపాదమున కలిగి కావ్య రమ్యతను చాటుచున్నవి.

శబ్దాలంకారములు, స్వభావోక్తులు సందర్భోచితములై ప్రయోగింపబడినవి.

వర్షాసుందరి "మదీయ జీవనరాగములో, కల
మయూర బాలలు నాట్యము చేసి
మదీయ క్రీడా జలపాతమ్ముల
మహాత్వ విన్యాసాలలు పూచే"

శరద్బాల "దివి నుండి దిగి వచ్చిన
నవ శారద లక్ష్మిని
"నారాకే లోకానికి
నవ భావన నాకము"
"నాపాటే జనావళికి
దీపావళి పర్వము"

హేమంతకాంత "పొలాలన్ని పంటలు పండించిన కాంతినే సంక్రాంతిని నేను" వంటి స్వభావోక్తులు అనేకములు.

శరద్కాల వర్ష ఋతువును గూర్చి చెప్పు సందర్భమున

"గుండెలన్ని సెరు చేయు
కొండమబ్బు దండలన్ని
కంపము కలిగించెడి నీ
శంపా సర్పమ్ము లన్ని"

పారిపోవునని కవి వర్ణించుటలో భావకుడైన కవికి శంపలు సర్పములవలె కనిపించుట సహజము.

జలజల, గలగల, చరచర, మెరపు, మురిపె, కడలి-కడవ, వంటి శబ్దాలంకారములనేకములు.

ఛందస్సు : బాపురెడ్డి 'ఋతురాగం' ఆధునిక సాహిత్య వచన ప్రక్రియా రూప గేయ కావ్యము. ఇందు వివిధ ఛందోరీతులలో, యతిప్రాస నియమ పద్ధతిలో రచన కాననగును. కొన్ని పాదములు 12 మాత్రలతోను, 14 మాత్రలతోను, 16, 20 మాత్రా ఛందస్సులతో సాగినది. కాని భావ ప్రబలతకు, భావసారళ్యమునకు భంగము కలుగకుండా ఉంచుటకు అక్కడక్కడ యతిప్రాస నియమములను అధిగమించుట గలదు. అయినను కావ్యరమ్యత కెట్టి నష్టము వాటిల్ల కుండునట్లు చేయుట కవి భావ రచనా పాటవము వ్యక్తము.

'ఋతు రాగము' సులభశైలిలో సాగి పండిత పామరుల మన్ననలందుకొన్నది. సంఘములో గల ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ యను భావములను తొలగించి, మానవులంతా ఒకటేనను భావమును, ఒకరులేక మరొకరు లేరను సత్యమును, కలహము, అనర్థములకు దారి తీయునను సూక్తిని చాటిచెప్పుట కావ్య ప్రతిభకు నిదర్శనములు.

ఇందలి ప్రతివిషయము లోకోక్తులను, జాతీయములను సామెతలను తలపింప జేయును. వీరి చెప్పుట ఏటి కేతము దేసినట్లగును. అయినను నేను యిచ్చుట కొన్నింటిని ఉదహరింప సాహసించెదను.

"ఎవరెవ్వరు లేరనుకొని
ఏమేమో వాగుతావు"
"అంతా నేనే యనుకొని
ఎంత మిడిసి పడతావు"

శిశిర భామిని

"వయసు బరువున నడుము
వంగిన ముదుసళుల
ముసుగు మాటలలోన
ముద్దు గట్టించితివి!"

"ప్రేమ భావము పెంచుట,
మంచి యెడ తల వంచుట"

"త్యాగ శీలము, దయాధర్మము
సహృదయత్వము, శాంతి సహనము"

వెన్నతోనే పెట్టిన విద్దెలు
ఎన్నటికి విడిపోని ఉన్నత బుద్ధులు"

"కోపతాపాగ్నిలో దగ్ధమై పోకముందే వెడలిపో"

"పిల్లి పాలు పితుకునంటే
పిల్లలైన నమ్మగలరె"

వంటి వనేకములు కావ్య విశిష్ఠతను గూర్చి, డా. దాశరథి "గేయనాటికలు-కావ్య వాటికలు" అను తన అభిప్రాయములో "నాటికలోని పాత్రలు సహజంగా పాడుకోవడం దైనందిన జీవితాల్లో మాటల్లాంటిదే నన్నాడు.

"గేయనాటిక సజీవమైన ప్రక్రియయే" నన్నాడు.

"కళాత్మకములై సామరస్య బోధకములైన నాటికలలో 'ఋతురాగము' ఒకటి".

"ఒకరు లేక ఒకరు లేరు, సకలమ్మెవ్వరు కారు" కాలపురుషుడనిన మాట అన్ని విధముల గొప్పసూక్తి. ఒకటి గొప్పది, ఒకటి తక్కువది కాదు. అదే విధముగా మానవులంతా కావలసినవారే ! ఏకతాభావమున్న మానవులు శోభిస్తారు". అది లేని నాడు క్షోభిస్తారు. ప్రతి ఋతువు తన ఘనతను చెప్పుకోవడాన్ని బాపురెడ్డి ఎంతో రమణీయముగా ఈ గేయ నాటికలో పొందుపఱచినాడు.

"తరంగాలు వేరైనా గంగ ఒక్కటే, అలాగే
ఋతువులు వేరైనినా కలల ప్రవాహ మొక్కటే గదా!"

అని చెప్పి కావ్య ప్రతిభను చాటినారు.

—o—

# వసంతము

—పెమ్మరాజు లక్ష్మీపతి

'వసంతము' పెమ్మరాజు లక్ష్మీపతి ఋతువర్ణనా కావ్యము. ఇందు ఋతు రాజమైన వసంతమును మాత్రమే దిఙ్మాత్రముగా గొని వర్ణింపబడినది. వసంతము కవి కుమారుల ఉపాస్యదేవత. ఈ దేవత మధుస్వరూపిణి విశ్వమయి. ఇది స్థూల సూక్ష్మ ప్రకృతి యందంతట పలురంగుల క్రీడింపుచున్నది. నానా దేశముల నానా కాలముల కవి వతంసులు ఈ అమృత మూర్తిని యథాతథముగ నుపాసించి, దర్శించి, కీర్తించి. కృతకృత్యులైనారు. కాళిదాసు, శ్రీనాథుడు, ఓమార్, కీట్సు, షెల్లీ, రవీంద్రుడు, హరీంద్రుడు మున్నగు కవి కోకిలములు అమర గానము చేతనే యీ జగత్తు అంతు పొంతులేని పాడు ఎడారి కాక, నిత్యవాసంతిక జ్యోత్స్నామయమగు నందనోద్యానమై "ఈశావాస్య మిదమ్ సర్వం యత్కించ జగత్యాం జగత్" అని తలపింపజేయబడుచున్నది. విశ్వవసంత వేశమున ఆంధ్రలక్ష్మి కూడ తన ప్రత్యేకతను కలిగి యున్నది. ఇట్టి వసంతవేళ ఎందరో కవి కోకిలములు తమ అవ్యక్త కలస్వనము లెత్తి గానము చేయుటలో ఆశ్చర్యము లేదు. అట్టి గాన కృతియే యీ 'వసంతము'.

పెమ్మరాజు లక్ష్మీపతిగారిని గూర్చిన విశేషములు 'పరిచయ వాక్కులలో' మంగిపూడి పురుషోత్తమ శర్మగారు తెలిపియున్నారు.

"లోకము కంటబడక, తాత్కాలికమగు ధనకీర్తుల పొంతఁబోక, వినీత మయ్యును, పునీతమగు పల్లెటూరి ఉపాధ్యాయ వృత్తిచే దేహయాత్ర సేయుచు శ్రీభారతి కృపాలబ్ధమగు సువర్ణ కవితా విమానమున నిత్యవసంత విహారియై సొక్కుచు ఆనంద గీతముల నర్గళముగ నల్లుకొనుచు, ముగ్ధబాలునివలె సర్వదా పాడుచు, ఆడుచు, లలిత వసంత గీతికా సదృశమగు ఆత్మజీవితముచే లోకమును మాధురీ భరిత మొనరించు కవి".

'ఈ కావ్యము అద్దేపల్లి నాగ గోపాలరాయ కవి మిత్రులకు 'పరిణయోప హారము'గా ఈశ్వరనామ సంవత్సర వైశాఖ శు౽ (21-5-1937) న సమర్పించు కొనినాడు. ఆ సందర్భమున .... .... ....

"ఈశ్వర వత్సరంబున వసేందిర పెండ్లి దినాల, హేమ దు
ర్గేశ్వరి వీట, కృష్ణ నటియించెడి చోట, మనోహరాంగి బ్ర
హ్మేశ్వరి పాణి పద్మము గ్రహించి, తిరంబగు ప్రేమసాహితీ
విశ్వము లేలు కొమ్మికకవీ! సుకవీంద్రులు సేసలొల్కగాన్"

"సుమములు గ్రుచ్చి, కెంజిగురు జొంపములన్ బరపించి, యెల్ల లో
కము పయి పెండ్లి పందిరుల గప్పి, వసంతుని పెండ్లికూతురై
సుమధుర మంగళ ప్రణయ సూత్రములన్ రచియించి, మీ వివాహ
మునకు రాయబారముల నామని యేమని పాడుచున్నదో !"

యను పద్యములను బట్టి 'వసంత' శోభ వ్యక్తము.

మొదట వసంతశోభ వర్ణింపబడి, ఆ పిదప తన చెలియకు లేఖలో ప్రణయ త్వమునకు వసంతర్తు ప్రభావము వివరింపబడుటచే కావ్యమునకు వన్నె చేకూరినది.

పెమ్మరాజు కవి వసంతమునకు స్వాగతము పలుకు రీతి అత్యంత సహజ సుందరము.

"వినూత్న పల్లవారుణంబైన దేహము మెఱయగా, రాజిత పుష్పమయ కిరీట ద్యుతులు అలసి యాడగా, ఓ వసంతమా దయసేయుము! దక్షిణ మంద మారుత ప్రకట విమానము నెక్కి వేవేగ విచ్చేయుము. కోకిలా లాపముల తోడను, కుసుమ సౌరభముల తోడను, భృంగ గీతముల తోడను, సుమ పరాగముల తోడను, విశుద్ధ కాంతులడరునట్లుగా చనుదెంచుము."

అట్లు వచ్చిన వసంతునకు చెఱకు గడలను పాద్యముగను, సమగుచ్ఛములందు నవించు తేనె అర్ఘ్యముగను, నవకోమల పల్లవితములైనవి మధుపర్కముగను, కమజాజ విరాజితము చంద్రనార్ద్రిముగను సమర్పించి గౌరవించుట అతిధి మర్యాదల కలవింపజేయును.

వసంత శుభోదయవేళ "క్రొత్త మోడులు కూడ క్రొత్త మనుమోసులు రాచిగిరించినవట. కోకిలలు హాయిగా పాడబొడంగినవట. క్రొత్త క్రొత్తలా జాడలు తోచినవట. కవి భావనా హృదయమున వసంతమే స్వర్గమట.

"కోయిల పాటలో నెచటికో జనుచున్నది నాదు డెంద మీ
వాయు తరంగ డోలికలపై బడి విశ్వము దన్ని భావమై
హాయస వాహినీ తట విహార విలోలత జొక్కి చొక్కియుం
పోయిన పోకగా నెగిరి పోయెడి హాయి కరంగ లోకముల్"

"లలిత కళా వికాసము లిలాతలమెల్ల నలంకరింపం బు
వ్వులు వికసించెం జిత్రములు వోలె శకుంత సతీపితాన కో
యిల కలగానమొప్ప సుకుమార సమీరుడు లాస్యమాడు నీ
యిల పయిగాక స్వర్గమిక నెచ్చటనున్నది ? శూన్యసీమలన్"

దక్షిణానిలము సురభిళమై శోభిల్లుచున్న రసాలవాటి కాంతరమున నీడ లందు కుసుమ తల్పము శయనించ కవి తన సుందరికి వసంత బంభారములు పాడి చెప్పునని ఆమెకొక లేఖ వ్రాసినాడట. ఆ లేఖ వసంతశోభ వర్ణితము.

"చిక్కని యీ సువాసన మషీరసముం గొని ముంచి వ్రాసినా
నిక్కమ లాచ్చు పత్రమున నీవిరి కేసరమే కలంబుగా
నక్కరముల్ కడున్ మెరయునట్లుగ పుప్పొడి పైన జల్లినా
నక్కమలాక్షి యందుకొనునా? కడుమోటని త్రిప్పివేయునా"

కవి భావనా పటిమ ప్రకృతి కాంతను తలపించుటలో కాననగును.

"ఏ మనోరథ సిద్ధియో యిది తలంప
బుడమి నొక సముద్రపు పోటువోలె బొడిచెన్
బూల చివురుల నిలువెల్ల పులకరించి
పగలబడి నవ్వుచున్నది ప్రకృతికాంత!"

"నేటికది సత్యమగుచు ఘనీభవించె
నవ్య యౌవన ప్రణయ సన్నాహవేళ
భావములు పూయ మన్మనః ఫలకమందు
నెన్నడో నేను చిత్రించుకొన్న ప్రతిమ!"

అవయవములు, ఇంద్రియములు వివశములై స్తంభించినప్పటికిని, అద్భుతగతితో యీ భువనములో నొక చిత్రకళా భవనమై ముంచివేసిన దట తన ప్రేమమూర్తిని కలిసికొని అనిర్వాచ్యమైన ప్రేమలో కరిగి పోవునట. అట్టి మహానంద సంరంభమును తన స్వాంతమందు ధరింపజాల కున్నాడట. ప్రకృతి అంతయు పూలతో, చివుళ్లతో రమణీయ మృదు ప్రభమైక బాంధవంబై కళలూరుచున్నదట. శుభముహూర్త మాసన్నమగుటచేత ఆలసిం పక వచ్చి యిద్దరిని ముడివేసిన ప్రకృతి అపూర్వ సౌందర్యమును చూడు మనును ఒక మాలతీలత చూతమును చుట్టుకొని ఒయ్యారముగా నూగుచున్నట్లు ముఖాంబుజముపై నర్తించు వక్రాలంబని తర మానస వీధిలో ప్రాకినదట. వసంతమున-

"ఎవడాగంగలడీ వసంతమున దేవీ! త్రాగుబోతుల్, మనో
భవ పుష్పాయుధ పీడితుల్ సుకవితా వ్యామోహతాత్మలీ
భువిపై నీదు విభూతులన్ గనుచు బూజించునున్మత్తులం
దెవడనుగ్రహశాలి ? నీ మధురిమూర్తిన్నేను బంధించదే !"

విరహము నెవరు భరింపలేరనుట, ఆమె రాకయున్నచో భావ సమాధియే జరుగునట. పూవులు పూయు వసంతము వృథయై పోవునట.

"అలరుల్ తేనియల్ చివురులాపయి గోకిల కాకలీ స్వనం
బులు నునుగాలి పీవలు, పుష్పొడి తిన్నెలు, జాదజాడని
ద్దుల గతి బొల్చు నీ ప్రకృతి శోభ లివన్నియు నీవురామి, ని
ష్ఫలమవిపింతె దేవి తెలువా? తెరువేది జగంబు నందికన్".

"క్రొంబిగి సోయగంబు తళుకొత్త జిగిర్చిన గున్నమావిపై
గెంజిగురాకు నోట గొరికెన్, చిలికెన్ పికమీ జగంబులె
ల్లం జెరపెట్టు గాన కళలన్, సుమహార్తము లెంచి చూచిప్పు
షాంజలి పట్టి నీ కొరకునై యిటు వచ్చితిఁ బేరుటామనిన్"

రసాల తరుబృందము పూచిన పూలలో పురుడుపోసిన పిండెలు, వీచెడు చల్లగాలులకు ఊయల లూగుచున్నవట.

"నీ యౌవందము పూవులై చివురులై నిర్వేల సమ్మోహన
శ్రీయై యేల, వసంత పుష్పమయ సింహాసనంబిందు నీ
కై యేర్పడ్డది కొల్వుదీరుమిదె నీకర్పించు చున్నాడ రా
జ్ని ! యీ నా ప్రణయైక జీవితము నన్నేలం దగున్ నీకికన్."

"అద్దము వోలెనైన హృదయంబున నీ రమణీయ రూపమే నద్దితి" యని ప్రణయమూర్తిని తృచి చివరకు-

"అలరుల చేరుగాత నవ యౌవనమంతయు ; నీ పికాంగనా
కలరవ మస్మదీయమగు గానము జేకొనుగాత ! మారుతా
వళి కొను గాతకైత ! రసాబ్ధి మునింగి యనంగ వైఖరి
నిలిచెద మింక శేషమయి నేపునునేను సనంత లీలలన్".

తన శేషజీవిత కాంక్షను తెలిపి కావ్యమును ముగించినాడు.

పెమ్మరాజు 'వసంతము'న ప్రకృతి వర్ణన అలంకార శోభితమై ఒప్పు చున్నదనుట అతిశయోక్తి కాదు.

"మేన గులాబి నీరముల్ చల్లినట్లు, పూలు వెదజల్లినట్లు"

సుధాతరంగ సంపుల్ల పిలాసములు భువన మోహన లీలల ప్రాకినట్లుగ, తన ప్రాణము జలదరించినదని ఉత్ప్రేక్షించుట సమయోచితము.

కవి తన సుందరికి వ్రాసిన లేఖ రూపకాలంకార శోభితమై యొప్పు చున్నది. సువాసన మషీరసము - సిరాగను, నిక్కిమలాచ్ఛము పత్రముగను, విరికేసరము కలముగను, అక్షరముల మెఱపునకు పుప్పొడి రేణువులను చల్లినాడట.

"ఏ మనోరథ సిద్ధియో యిది తలప
బుడమి నొక సముద్రపు పోటువోలె బొడిచె"
"పూల చివురుల నిలువెల్ల పులకరించి
పగలబడి నవ్వుచున్నదీ ప్రకృతి కాంత"!

"కష్ట సుఖములు పడుగు పేకలుగ, జనన
మరణములె యంచులుగ నేయు మర్త్య జీవి
తాంబరమున నను సంపుతాత్మ జేసి
నీవమర్త్యత నిల్చులే నియతి చెపుమ"! యందు

ఉపమల నింపినాడు.

"ఒక విద్యుత్స్ఫురి ఘట్టనంబు బలె" నన్నూగించె ఆపాద మస్తకమున్ ఝల్లున పులకరించినది.

"మోక్కపోయిన యోగసాధకుడు వోలె" వసంతహాస శోభాయుతమైన జగత్తు కలదనుటలో ఉపమ కనబడును.

ఈ కావ్యము సంప్రదాయ సిద్ధములైన ఛందములలో సాగిన పద్యరచన. పదగుంఫనములోను, భావ సౌందర్యము నందును తీసిపోని కావ్యము. ప్రణయ విరహ చింతాత్మక భావనలతో వసంత శోభ వర్ణితము.

ఇందు జాతీయములు, నుడికారములు, సామెతలు కోకొల్లలు. "శరీరమే మరచి పోవుట కంతెను మోక్షమున్నె"?

"నేలను వీడి సాములను నింగికి విచ్చేనలున్ ఘటింపగా బోలదే"?

"దైవమునకైన నచట పెత్తనము లేదు"

"దేశ కాలంబులును విడదీయలేవు"

"వెన్క విలపింతువేమొ! ఫలమున్న యప్పుడావంతయున్"

ప్రకృతి వర్ణనముతో పాటు కొంత తాత్త్వికభావనాస్పర్శతో శ్రీ పెమ్మరాజు రచన సాగినది. ఋతువర్ణనము కాల మహాత్మ్యమును త్రోసిరాజనదు, కాలపురుషుని మహానుభావత్వమునకు అంజలి ఘటించును. భారతీయ దర్శన శాస్త్రములందు ప్రత్యయమున్న ఏకవియు ఋతు వర్ణనము చేయునప్పుడు జీవిత సత్యములను, ఐహికాముష్మిక ధర్మములను జ్ఞప్తియందుంచుకొనక పోడు. ఈ కావ్యమును అతి ప్రచురముగా కాకపోయినా ఈ భావము నీడవలె వెన్నాడుచున్నది.



# "ఈజంట నగరాలు - హేమంత శిశిరాలు"
## - ఉత్పల సత్యనారాయణాచార్య

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య "ఈ జంటనగరాలు – హేమంత శిశిరాలు". ఆరాశ్వాసములు కలిగిన వ్యంగ్య ప్రధానకావ్యము. జంటనగరాల లోని దీనజనావళి వేదనకు ప్రతీకలే యీ హేమంత శిశిరాలు" ఒంటి వానికి దుఃఖాంతాలు, జంటగూడిన వానికి సుఖాంతాలు. ఈ రెంటిని ఈ కావ్యమున గ్రథనము చేశారు శ్రీ ఉత్పల. కవి కాంక్షించే వసంతం ప్రజామోదమును సాధించే ఉజ్జ్వల భవిష్యత్తు హేమంతమును గూర్చి

హసంతీం వా హసంతీం వాహసంతీం వామలోచనామ్
హేమంతే యేన సేవంతే తేనూనం దైవ వంచితాః"
"దూరాశేవ దరిద్రస్య తృష్ణేవ కృపణస్యచ
అహో! నవిరమత్యేషా హంత హేమంత యామినీ"

అని పూర్వులు చెప్పినారు.

"హిమేన హంతీతి హేమంతః"
చలితో చంపేది హేమంతము

శినోత్కంపం శీతేన శిశిరం"
చలితో దేహమును కుంచింప చేసేది శిశిరం

వసంతంలో ప్రజలు సుఖజీవనమును గడుపుదురని "వసంతి సుఖం యథాతథా అస్మిన్నితి వసంతః" యను విషయమున విదితము.

హేమంతము తరువాత శిశిరము. ఆ తరువాత వసంతం. దీనజనావళి ఆశలు పండే సుఖమునందించే సమయం. అందుకే కవి వసంతాన్ని ఆహ్వానిస్తున్నాడు.

"శ్రమపడినట్టి డొక్క తరుజాలమె కాదు, చరాచర ప్రపంచము శిశిరమ్ము నందు నగుచాటులు పడ్డది, రమ్మహోవసంతమ! సుమనో మనోజ్ఞ హరిదంతమ! చెట్ల మొగాలపైని, ముచ్చైమటలువోని యీయివము చెమ్మలనద్ది సమాశ్వసింపుమా

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య ఆధునికాంధ్ర కవిత్వ పటుత్వ సంపన్నుడు. విద్వత్కవివరేణ్యుడు. సాహిత్య ప్రక్రియల సారమెరింగిన సాహితీమూర్తి.

'శతరూప, స్వప్నాల దువ్వటి, శరణాగతి' వంటి రసవత్తర కావ్యముల రచించి, విశ్వనాథవంటి మహాకవులచే ప్రశంసలందుకొనిన కవివతంసుడు సాహిత్యముద్వారా సమాజములో పేరుకుపోయిన దురాగతములను, అన్యాయ అక్రమాలను ఎత్తిచూపి, రూపుమాప యత్నించిన సంఘసంస్కర్త.

జంటనగరాలలోని సామాన్యుల జీవితస్థితిగతులను, సంపన్నుల, అధికారులపట్ల వారు ఎదుర్కొనే కష్టనష్టాలను ఈ కావ్యమున కనులముందుంచి పరిష్కారమును కోరిన నవసమాజవాది.

ఈ కావ్యమున కవిగారే నాయకుడు, భావుకుడు, రసార్ద్రిసిత్తుడు, మేధావి అగుటవలన ఆత్మాశ్రయ నాయకత్వమే కనబడును. కవి మేధాసంపన్నుడు కాని ధనసంపన్నుడు కాడు. కావున కవి ఈ నాటికలో ఒక పాత్రధారుడుగ నుండి, సమకాలీన సామాజిక స్వరూపమును దర్శిస్తున్నట్లుగను, దుఃఖిస్తున్నట్లుగను కనబడును. శ్రీనాథుని క్రీడాభిరామమును తలపింపజేయు వీధి నాటకముగ కవిగారి రచన కొంతవరకు సాగినది, క్రీడాభిరామమున ఓరుగల్లు నగర రూప కల్పనముకాగా ఈకావ్యమున జంటనగరాలపౌరుల జీవన సమస్యలభివర్ణితములు

కవి 'మంగళాచరణము'న కృతిపతియగు కె. వి. రాజారావుగారిని

శ్రీ శేషాచలవాసి భద్రగిరి లో

చిష్ణుండు యాదాద్రిల -

క్ష్మీశుండున్ గృహసేద్యు గాత" యని కోరినాడు.

సంప్రదాయ భావాభ్యుదయ విప్లవ కవులను శ్లాఘించుట, సంభావించి, ఆదరించి, అభినందించుట, హాస్యరసప్రాయముగను, నగర విశేష వర్ణనాకర్మనీయముగను, నృత్యపూర్వమగు ఇతివృత్తమును కల్పించుకొని ఆత్మాశ్రయముగా చెప్పబూనుచున్నాడని కావ్యప్రస్తావన కావించినాడు.

కవి నిరుపేద. పుస్తక ప్రపంచమనిన ప్రాణము, కావున క్రొత్త పుస్తకముల కొనలేక ప్రాత పుస్తకములు దొరుకు కాలి రథ్యల వద్దకు వచ్చి అల్లసానిలాంటి పెద్ద పెద్ద కవుల రచనలను అచ్చట చూచినాడు. అడిగిన ధరకు నిచ్చుటను కని పుస్తక విలువను తెలిసికొనలేక ఆ విక్రేతను చూచి జాలిగొని బాధపడినాడు.

గుడిలోని దేవునకు ఏమీ యివ్వలేక కుమిలినాడు. తెగిన చెప్పును బాగు చేయించుకొనే స్తోమత లేనివాడై చెప్పులవానిచే కనీసం 20 పైసలైనా ఉంచుకోవాలని ఉపదేశం పొందినాడు. పైరవీ సుందరిని తన బదిలీకై ఆశ్రయించినాడు. కాని కారుటాక్సీ. త్రోవలో ద్రాక్షపండ్లు, ఆయన వద్దనున్న 'ఐదు' రూప్యములు సరిపోవన్న భయముతో "కారులోన కూర్చున్నను దాని క్రిందబడి రూపటి ఏపటినట్లు" కుందినాడు. బదిలీ కోరిక ఏల పుట్టినదని వాపోయినాడు. "సామాన్యుండు నిచ్చోటికిన్ రాదగునె" యని చింతించినాడు. కూరగాయలకు తెచ్చినడబ్బు పుస్తకమునకు పోగా భార్య ఎంత తిట్టునో" యని తలపోయుచు వీధి వెంబడి నడచుచుండెను. పుస్తకావిష్కరణ మహోత్సవమును తిలకించి, ఆ తర్వాత వానిని తూకమునకు అమ్మబడుటను చూచి, మనోవ్యథ చెందినాడు. తాను వ్రాయబూనిన పుస్తకమునకు పీఠిక వ్రాయనెంచి,

"అచ్చువేసిన పిమ్మట నదియుగూడ
అమ్ముకోవలెనేమొ ! తూకమ్మునకును" అనుకొని

తన నిర్ణయమును మార్చుకొనినాడు.

కవిగారి మనస్సులో బీదవాని జీవితము :-

చిన్నప్పుడెంతయో శిక్షగా జదివించి
అమ్మ నాయనలు కాపాడినారు
పెద్దైన పిమ్మటం బెండ్లాము కట్టడి
తప్పుదయ్యెను నాకు నిప్పటికిని,

ఇకనుండి బిడ్డల యేల్బడిలో నుండి
　　మనెడి కాలమ్ము సంప్రాప్తమయ్యె
తరువాత మనుమల తళ్ళకు దాఁ రొగ్గి
　　తాతనై జీవించు దశయు గలదు

రామ రామ ! నాకిక స్వతంత్రమ్ము దేది ?
లోని కోరిక లెట్లు తీర్చుకోగలను"?
అని విచారింప నా యంతరాత్మ యపుడు
అదియె జీవిత పరమార్థమని వచించె"?

నెలాఖరు దినములు మిత్రసమాగమ సౌఖ్యంబునకు సైతము వైముఖ్యము కలిగించునట. నూకపతి మిత్రుడు 'పెన్సు' కథలు వ్రాయుమనిసలహా నివ్వగా కవి అతనిని గూర్చి "సర్వగుణహీనుడవౌట సెబుంగ మిత్రమా"! యని నిరసించినాడు. ఇట్టి వాక్యము తెనాలి రామకృష్ణుని భావము తలపించును.

"ఇల్లు కట్టుకున్నావా"? యని మిత్రుడు ప్రశ్నింప కవిగారి సమాధానము సమయోచిత మనిపించును.

　　రసికాంధ్ర జనుల యెడద
　　నిల్లు కట్టుట యద్ది నా వల్లకాదు"
అని తన అశక్తతను చాటుకొనినాడు.

ఒకనాటి ప్రభాత సమయమున కవి
　"ఈ వెను మంచులోన నిలు
　　వెల్లను దోగి పరిభ్రమింప నీ
　పాపట మీద కూకటుల
　　పైన రహించెను; మంచుబొట్లు ! ము

క్షాఫల రాశి మున్ని కల
ధాతపు దీవిని దేలి ముందుగా
మా పురికీవు వచ్చితివ ?
మౌక్తికముల్ వెదజల్లి పోవగన్.

నీదు తుహినాంబరాంచలా చ్ఛాదనమున
నగ్రసు పూర్ణ మాధుర్యంబు ననుభవింతు
మంచి ముత్యాల తలంబ్రాలు మామకీన
శీర్షమందున గూడ వర్షించు మమ్మ". యని

ప్రార్థించినాడు. కవి ఉపదేశము సర్వజన సమ్మతము.

“త్రాగిన వాని తిట్లకు కలంగకు, బట్టల కొట్లవెంట నూ
రేగు మిఠారి కత్తెల వరింపకు, వారలతోడ పిచ్చిగా
వాగకు, నోరు జారకుమి, వారు బనారసు పట్టుచీర నీ
చే గొనిపించుకోగలరు! చిర్నగవుమాత్రమె కాన్కపెట్టుచున్”

అనుచు ఆ మిత్రుని భాగ్యనగరమందలి ఉస్మానియా విశ్వవిద్యాలయమును, ఆంధ్రశాఖను చూపించినాడట.

ధూమ శకటాలయ ప్రాంగణమున కూలీవాడు
“దొరలకారుల వెనుక పరుగెత్తెడివాడు
బేరమాడకమును పెట్టెత్తుకొనువాడు
దొరసాని యొక్క పైస దరుగుచేసి యొసంగ
బలుసార్లు చూచుకొని పలుకజాలని వాడు
ఒరుల బరువుల దొంత్ర నొడ్డుచేర్చెడివాడు
తన బరువునకు క్రుంగి వెనుక జిక్కినవాడు,
గా కనిపించును.

భోజన సమయమున పంక్తిక్రిందకు వచ్చిన రాయని చూచి తన జీవితము

"రాళ్ళు దిగమ్రింగి దుఃఖ భారమున గ్రుంగి
స్వామి ! అక్కు-పక్షుల మయినాము చూడు !

మని బాలాజి పటమువైపు చూచి సజలనయనులైనాడట.

పురోద్యాన వనమున కోకిలారావము వినిపింపకుండుటచే శ్రామికులపట్ల జాలిగొనినదేమో ! నని కవి వర్ణించుట, ఆతని హృదయము గ్రాహ్యము.

"కటువుబత్తెము గోరి పరువు గోల్పోయిన
బడిపంతులను జూచి బాధపడెనో !
కవులు పండితులును గౌరవానర్హులై
పడి యుండుటకు సిగ్గు పడినదేమొ
రాళ్ళన్నమును దిను రాతి గుండెలకేల
మృదు గీతులని నోరు మెదపదేమొ !
పిడికెడన్నము లేక కడుపుమండిన వాని
పెనుకేక విని మూర్ఛ మునిగెనేమొ !

శ్రామికుని యెల్గు, పేద కర్షకుని మ్రోల్గు
అతి కఠోరములగు నపశ్రుతులు గాగ
పాడ మానినదేమొ ! అపరభృతంబు
ఇట వసింపక వలసపోయినది యేమొ''!!

కావ్యాంతమున 'హేమంత శిశిరములు' మనోజ్ఞములైనవి. ఈ చలిని మాత్రము భరింపజాలక, ఎటకైన పోదమని మిత్రుడు పలుకగా

"రచ్చల గ్రాలు జంట నగరాలు హిమావృత శీతశైల సా
మ్యచ్ఛవి నొంది ముంపుగొని నప్పుడు యౌవన మత్తకాశి నీ
ప్రోచ్చ కుచద్వయోపరి కవోష్ణము దక్క మఱొక్క తావునన్
వెచ్చదనం బొకింతయు లభింపదు సూవె! భవాదృశాళికిన్"

అని చెప్పి వసంతమును

"అతి గహనమ్ములౌ శతశతాబ్ది పథాల నతిక్రమించి యీ
ఋతువు మొయిళ్ళలో పరుగులెత్తెడి పూలరథంబుమీద సు
స్మిత సుమనోజ్ఞవై అధివసించిన ఓ ఋతురాజ్ఞి! నీవ సా
గత మరుదెమ్ము-రమ్ము సనకారుల గుంకుమ పొళ్ళదారులన్"

అని ఆహ్వానించుటలో జీవితమున ఆనందోత్సాహముల నందించ ఆదరించినాడు.

'ఈ జంట నగరాలు-హేమంత శిశిరాలు' కావ్యమున శబ్దాలంకారములు అడుగడుగున కానవగును. పైరవీ సుందరి ఆఫీసరుతో మాట్లాడునప్పుడు విన బడిన నవ్వులు

"గుఱ్ఱము సకిలించినట్లులు,
ఖరమ్ములు గొంతిన యట్లుదనుట హీనోపమ

"కవీశ్వరుండంత దీర్ఘనిశ్వాసము పుచ్చె వాఙ్మయ విశాల వనస్పతి వాడిపోవదన్"

సుభాష్ చంద్రుని ప్రతిమా రూపమును చూచి ఆతనిని

"అడవుల వడి వడి నడచిపోయిన నీవు
కనిపింతు వల్ల శాక్యముని వోలె
గుండె దిట్టమొనర్చి కొండలెక్కిన నీవు
పొడగట్టె దొక యగస్త్యుడవు వోలె

సాగర తీరాన సాగిపోయిన నీవు
అగుపింతువు పరమ హంసవో
అలుగు దాల్చిన నీవు వలస పాలకులకు
లోతెంతు వొక ధూమకేతువోలె” నని

ఉపమించినాడు. నర్తకి “గాఢతమము చెదరినట్టి తదీయ కైశికము నుండి రాలిన సుమమ్ము లట్లు దీపాలు తోచె” నని ఉత్ప్రేక్షించుట కవి ఊహ అనన్య సామాన్యము.

“పాపటమీద కూకటులమీద రహించెను మంచుబొట్లు”

నెహ్రూ వర్ణనలో “పసివాని నవ్వుల పాలవెల్లువలందు చందమామై తోచు నందగాడు.

“తాజమహాలు కంటె చల్లదనము వాడు
కుతుబుమినారు కంటెను గొప్పవాడు”

అని అతిశయించినాడు.

వాన పడగానే విడిసిపడే మురుగు కాల్వలు
కెడవగు సలజడుల దుండగీంద్రను బోలెన్”

ఉన్నవని ఉపమానించినాడు.

ఇదివరకు ఎవ్వరుచేయని మరికొన్ని చక్కని ఉత్ప్రేక్షలు కవిత్వమును నిరూపించుచున్నది.

“పడమటి వెస కనిపించిన సంధ్యారాగము
పగలు రేయియు నొరసికొనగా పుట్టిన అగ్నిహోత్రమువలె నున్న”దట.

“బంగారు కొండమీద సూర్యుని గుఱ్ఱాల గిట్టల తాకిడివలన బంగారు ధూళి లేచినట్లున్నదట”

ఈ కావ్యమున సమకాలిక సమస్యల ప్రతిబింబముతోపాటు లోకోక్తులు, జాతీయములు అనేకములు.

"విలువ లేనిది పుస్తక మొక్కటే గదా!

చెప్పులవాడు "ఇంటికేగువరకు నిర్వది పైసలు ఉంచుకొనుట చాల మంచిదనుచు" ఉపదేశ మిచ్చినాడు.

కవి ఆత్మగతమున "క్రొవ్విరా దగునే సామాన్యం డిచ్చోటికిన్"
"నరకంబంతయు దెచ్చి నా బ్రతుకులోనన్ దాచినావా ప్రభూ"

శక్తి హీనత్వమందున శాంతిలేదు
కర్మహీనతయందు మంగళము లేదు"

"నెలాఖరు దినంబుల మిత్ర సమాగమున సౌఖ్యంబునకు సైతము వైముఖ్యంబు కలిగించును"

"నెలాఖరు లేని పదంబొసంగవే"

"మొదుకువాని బండి తురగమ్మె కంటెను,
దుష్ట విటుని పాలి భ్రష్టమేలు"

"హాయిజాతి యభివృద్ధి దెబ్బతిన్నదిపుడు దేశమందు"

"దేశభక్తి పూరిత జాతీయములు, మహాకవుల వర్ణనలయందును, మహా పురుషులు, జాతీయ నాయకులు స్వాతంత్ర్య సమరవీరుల వర్ణనలిందు సంపూర్ణములు.

"కలసిన పాలను నీళ్ళను, వెలసిన మిత్రుత్వములను వేర్పరుచు వారిద్ద రట - ఒకడు కలహంసము, మరియొకడు ఖలుడు"

'కామినియును మానినియును
కమని చెలి రాజ్యమందు అపరాధినులే"

"ఇంటం గల వైద్యంబును
కవి; తాజూడని యట్టిదిలేదు"

"ఈ జంట నగరాలు - హేమంత శిశిరాలు" హాస్యరస ప్రధాన కావ్యము 'హాసం' స్థాయీ భావము. అలంకారికుల దృష్టిలో హాస్యం సితవర్ణము కలదని హేమంత శిశిరాలు తెల్లనివనియు, కావున ఈ కావ్యము హాస్యరస ప్రధానమగుట కవి భావనాకల్పన అత్యంత ప్రశంసనీయము. విపరీతమైన వేషరచన, వికృతాచారములు, విచిత్రమైన పేర్లు హాస్యప్రదములు.

ఈ కావ్యమునందలి కథానాయిక కతిపస్తప ఋషునద్దైన శ్రీ హాస్య శృంగార రసపయోనిధిగను, వేషధారణచే 'గడుసు తెలుగు పడుచు' గను పైరవీ సుందరి రూపమున కాననగును.

కావ్యము చంపూ పద్ధతిలో కొనసాగినది. సులభశైలి, భావార్ధ గాంభీర్యత. ఆధునిక నాగరికతా తత్త్వము గలిగి పఠితుల మనస్సుల నాలోచనా పరుల కావించును.

"ఉత్పలా మోదం" లో డా॥ దాశరథిగారు ఇది వ్యంగ్య ప్రధాన కావ్యం. ఇందులోని హేమంత శిశిరాలు దీనజనావళి వేదనకు ప్రతీకలు. కవి కాంక్షించే వసంతం ప్రజామోదాన్ని సాధించే ఉజ్జ్వల భవిష్యత్తు వసంతంలో ప్రజలు సుఖంగా ఉంటారు. ఆర్థిక వ్యత్యాసాలు అంతరించిన సమాజ వసంతానికై కవి ఎదిరిచూస్తూన్నాడని నేననుకొంటాను.

హేమంతం రావడమే జరిగితే ఇక వసంతం రావడం ఎంతసేపు? ప్రజల ఆశలు పండే భవిష్యత్తు సమీపంలోనే వుంది. అది రాక తప్పదు. అను ఆకాంక్షను వెలిబుచ్చినారు.

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు 'కావ్యాలోకనము' గావించి కావ్య ప్రశస్తిని పొగడినారు.

( 0-0 )

# ఋతువుల రాణి

## — డా॥ సి. నారాయణరెడ్డి

డా॥ సి. నారాయణరెడ్డిగారి 'అజంతా సుందరి' యను గేయనాటికా సంపుటిలో మూడవనాటిక 'ఋతువుల రాణి' ఈ గేయ నాటికను రెండు రంగములు. ఇందు వసంత, శిశిర ఋతు వర్ణనములు కలవు. మాధవుడు, ఋతువుల రాణి, శిశిరుడు, యిందలి పాత్రలు. ఋతురాజు వసంతుడే అయినప్పటికిని వసంత ఋతువునకు ప్రతినిధి మాధవుడు. కావున మాధవుని నాయకునిగాను, కృతిని నాయికగను, శిశిరుని ప్రతి నాయకునిగాను సృజించినాడు. ప్రతినాయకుని బారినుండి నాయికను నాయకుడు కాపాడే సంప్రదాయ సిద్ధమైన ఇతివృత్తమును అల్లి, వ్యైరమ్యతను చాటినాడు.

డా॥ సి. నారాయణరెడ్డి ఆధునికాంధ్ర కవితాలోకములో అందెవేసినచేయి సాహితీమూర్తి, పలుకు పలుకున రాగశీకరము లొలికించు కవిచంద్రుడు. ప్రకృతి సౌందర్య పిపాసి. బహుముఖ ప్రజ్ఞాశాలి, ఇతడు సహృదయ లోకమునకు అందించిన రెండవ గేయనాటికల సంపుటి "అజంతా సుందరి"

'ఋతువుల రాణి' నాటికలో మధుమాసవర్ణన అత్యంత మనోహరము.

> శిశిర నగ్న లతావళికి
> ఘుసృణాంబర విన్యాసం'
> "చిలికిన రస హృదయాలకు
> నవ యౌవన సందేశం"

వసంతరాణి సౌందర్యము నభివర్ణించిన బృందగీతి మాధవునిలో మకరంద రసమునందించినదట. వసంత భామినికి మాధవుడు,

> ఓ విలాస గామినీ
> రావే ! నా నీల నిశాజీవిత సౌధామని" యని

ఆహ్వానించిన తీరు నవ్యము.

తుమ్మెదలు కమ్మని 'ఝుమ్మను' రాగముల నాలపించుట, కోకిలలు తమ పంచదార గొంతులను పలికించుట, మావి మ్రోవి క్రొత్తతేనియల కురిపించుట, వసంత ఋతు కాలమున సహజములు, అవి ఎంతకును రాకుండుటచేత మాధవుడు

"ఏది నా వసంత రాణి
ఇంతవరకు రాదేలా ? యని

ఎదిరిచూచు చుండుట ప్రథమ దృశ్యమున వర్ణింపబడినది,

రెండవ రంగమున ఋతువుల రాణి,

ఆకు వన్నియ జిలుగు
కోక సవరించి
కొప్పులో మందార
కుసుమాలు ముడిచి
పండు మోదుగు పూల
దండ లల్లేవరకు

ఆలస్యమగుటచేత తన ప్రియుడు

'ఎదురు తెన్నులు చూచి
ఎంతగా వగచెనో' యని

విచారించి తన రాకను

'నీ కనుల వర్తింప
నీ ప్రోల నర్తింప
నీలో ప్రణయకింకిణీ
నినదములు నింప
కానలను కోనలను
గడచి వస్తున్నాను'

అని తెలుపుట సహజము.

అంతలో ప్రతినాయకుడైన శిశిరుడు నాయిక ఋతురాణి సౌందర్యమును చూచి మోహితుడై

"కొలనులోని అం
చలా......
మొయిలులోని మిం
చులా......
అయ్యారె ! ఒయార
మవర్ణనీయం
వసంత లతాంగి
వరాలప్రాయం''

కొలనులోని అంచను, మొయిలులోని మించును. ఋతురాజీని ఉప మించుట కవి అపారకవితాశక్తికి నిదర్శనము.

ఎదురుగా నిలుచున్న శిశిరుని స్వరూపమును ఋతువుల రాణి ప్రశ్నించిన తీరు హృద్యము.

ఆకురాలిన వృక్ష
మటులున్న తనువులో
ఊడల విధాన పా
రాడేటి జడలతో
ఎవరయ్యా నీవు
ఎదురుగా నిల్చేవు
ఖేదు చూపులతో వె
గాదిగా చూచేవు ? అన విని

శిశిరుడు :

నీ నులివెచ్చని కౌగిలలో బం
దీ నౌదును అలివేణీ

అని తన కోర్కెను తెలియజేసెను.

అంత ఆ ఋతువుల రాణి సమాధానము పాతివ్రత్య ధర్మమునకు భంగము వాటిల్లకుండ వర్ణింపబడినది.

"అన్ననా! ఎంత మాట
లాపినావు శిశిరా!
వినలేకున్నాను నీవు
విష వాక్కులు విసర!
మాధవుడే నా జీవిత
మార్గాంతర సహగామి!
ఋతు రాజే నా యెదలో
అతికిన భాగస్వామి!
అన్యులకే ప్రేమ పాత్ర
నందించగ లేను
తొలగి పొమ్ము నిమిషమ్మిట
నిలువ జాల లేను అని తెలుపగా

శిశిరుడు వికటముగా నవ్వి!

"దాట లేవు నా ఘన హ
స్తాల పంజరాల
ఈ నిశీధ నాతోనే
ఊగుము సుఖ డోల!"

అని బలవంతము చేయబోయినాడట.

అంతట నిస్సహాయ స్థితిలో నున్న ఋతువులరాణి సమీరణునితో మాధవునకు సందేశము పంపిదట ఈ సందేశవర్ణన కవి సమయ స్ఫూర్తికి ఔచిత్యమునకు నిదర్శనము.

మాధవుడు తన వసంతభామిని పలుకులను విని,

'ఎందున్నావే మరాళ
మంద మంద గామినీ' యని ప్రశ్నించును.

అంత ఆ వసంతరాణి తాను శిశిర హస్తాలలొ చిక్కుపడి అసహాయ స్థితిలో అలమటించు చున్నాననియు,

"గడియలో బ్రతుకు పం
కమ్ములో దిగునయ్యా
తడవుసేయక వచ్చి
విడిపించి పోవయ్యా!"

అని ఆర్తనాదముచేయును. మాధవుడు వెంటనే

"నీ కొరకు పక్షాల
పై కదలి వస్తాను"

అని చెప్పి ఆమెను చేరుకొని, శిశిరుని సమీపించి,

"శిశిరుడా! నీ యాట
చెల్ల బోదిక పైన
అగ్ని బాణాలు సం
దించితిని హస్తాన"

అనగానే శిశిరుడు పారిపోవును.

అంత ఆ ఋతువుల రాణిని చేరదీసి, మాధవుడు

ప్రతి పదాన రస వీణలు
పలికించే మధుబాలా!"
"పూలచేల మొకసారిగ
కేల నంటుదును రావే!"

అని తన ప్రేమను ఒలకబోయిగా, ఋతురాణి

"నీతో చిరకాలము రా
ణింతు ననల తేజా !" యని బదులిచ్చును.

గేయనాటిక చివరగా మధుమాసములో వసంతకాల విశేష వర్ణనము అత్యంత రమణీయము.

"యుగ యుగాలు తీరినా
జగతి యెంత మారినా
సర్వ ఋతువులల్లో వా
సంత కాలమె విశేషం"

ఋతువుల రాణి ఆధునిక సాహిత్య ప్రక్రియలో సులభశైలిలో సాగిన గేయనాటిక, రమణీయ పద బంధములు. అంత్యప్రాసల అందములు, మధుర భావ సుగంధములు, కావ్యమునందంతట నిండియున్నవి.

నాటికకు ఆద్యంతములలో ఉన్న 'బృందగీతి' వసంత ఋతు మధుమాస శోభలను కలిగియున్నది. శృంగార రస భరిత కావ్యమిది.

సమకాలిక కథా సంప్రదాయమిందు కాననగును. మంచీ చెడులను చూపి మంచిని గ్రహింపజేయు నుద్దేశ్యమందు అభివర్ణితము. ప్రేమ పవిత్రమని, దేనికిని లొంగదను సత్యమును, పాతివ్రత్య ధర్మమును, వివరించుట కావ్య ప్రయోజకము. ఆపద కలిగినవేళ ఆప్తులవద్దకు సందేశములు పంపుట పూర్వాచారమే".

శిశిరుడు ఋతురాణి సౌందర్యమును చూసి మోహితుడై వర్ణించిన సందర్భములో,

"కొలనులోని అం
చలా..."

మొయిలులోని మిం
చులా...

అను పాదములు త్రిస్రగతిలో సాగగా

"అయారె ! ఒయార
మవర్ణనీయం
వసంత లతాంగి
వరాలప్రాయం"

అను నాలుగు చరణములు చతురస్రగతిలో నడిచినవి గతిలోని యీ మార్పు శిశిరుని మనస్సులో ప్రవర్ధమానమగుచున్న మోహస్థితిని పరివర్తించిన గతి స్ఫురించును.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య నాటిక ప్రత్యేకతను గూర్చి "అంత్య ప్రాసల అందాలతో, మధుర భావ సుగంధాలతో సాగిన యీ నాటికలోని గేయాలు నాటికను కవితా సంవాసితము చేస్తున్నవి.

దృశ్య కళారూపమైన గేయ నాటికా ప్రక్రియలో ఋతువులను పాత్రలుగా సృష్టించి. కథా సంభాషణాంతర్భాగములగా ఋతువుల స్వభావ విశేషములను సంక్షిప్తముగా. ఔచితీదృష్టితో వర్ణించే సంవిధానమునకు ఆద్యుడు నారాయణరెడ్డి. అతని ఈ కావ్యము ఆ ధోరణిలో సాగిన ప్రథమ గేయనాటిక. ఇందులో ఋతువులన్నీగాక, శిశిర వసంతర్తువులు మాత్రమే పాత్రలుగానూ, హేమంతం నామ మాత్రంగానూ పేర్కొనబడినవి" అని తన "నారాయణరెడ్డి సాహితీమూర్తి" యను గ్రంథమున పేర్కొనినాడు.

# ఋతు నర్తనం

— సాంధ్యశ్రీ

సాంధ్య శ్రీ 'ఋతునర్తనం' కాలచక్రములోని షడృతు వైభవములను వర్ణించు దృశ్యరూప గేయ కావ్యము. ఇందు ప్రయోక్త, కవి, వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత శిశిరములు పాత్రలు. ప్రయోక్త రాబోవు ఋతు ధర్మములను పరిచయము చేయగా కవి ఆరు ఋతువర్ణనల చేయును. ఋతువు స్వీయముగా తన వైభవమును తానే వర్ణించుకొనును. మరల కవి ఆ ఋతుకాలము పూర్తి అయిన విషయమును తెలుపుటతో ఒక ఋతు స్వరూప స్వభావములు వెల్లడి యగును. ఇది ఆరు భాగములు కలిగి చివరికి మంగళా శాసనముతో పూర్తి చేయబడినది.

సాంధ్యశ్రీ ఆధునిక కవితా తత్వమును ప్రకృతియందు పరిశీలించిన కవి.

వసంత ఋతువు ఆగమనముతో ఆమనిలో అవని పులకించి పోవుచున్న దనియు, విరిసిన వనకాంత హృద్వీధిలో భృంగతతి ఝంకారములు, కోకిల కల రావములు, మలయ పవనముతో కలిసి వినవచ్చుచున్నవనియు, కలసి వినవచ్చు చున్నవనియు, కవి ప్రయోక్త ద్వారా ప్రస్తావన గావించి వర్ణించినాడు.

"కాలములోన హాసమును కానుకపెట్టిన ఓ వసంతమా
నీలి లతాకృతీ విభవ నీల విశేష విలాసితావళుల్
మాలగ కట్టి నా మహిత మంగళ మానినికిన్ మనోజ్ఞతా
మాలతికిన్ గళమ్మున సమాహిత రీతినివై చెదో సఖీ"

అంత వసంత పాత్రధారిణి తన పేరు ఆమనియనియు, తన ఊరు అవని యనియు, చిరుగాలి హసనాలతో, సుమధూళి వసనాలతో నటియించే భామననియు, ప్రకృతి శోభామయ మొనర్చు చిగురుటందెలు గల దానిననియు, ఆశల తొలి నెలగా తన వైభవమును చాటుకొనినది. ఆ తరువాత కవి "ఆమని నీడలో ధారుణి దొంగలించుట, వసంత శీకర రవములు రాగరంజిత కాంక్షలు మదిని

ఆవహించి రసమాధురులు అంతరంగ విలేపనముల తీర్చుట, విరుల సౌరభము లందు మునుగుట వంటి చక్కని వర్ణనలగావించి తన భావనా పటిమను చాటు కొనినాడు

గ్రీష్మ ఋతు ప్రవేశమున ప్రయో క్త స్తావన మిక్కిలి హృద్యము.

"ఆవనికి జరిగిన సీమంతానికి అర్కుడెందుకో అలిగి నట్లున్నాడు. చైత్ర మాసాదు రక్తి చిత్తమింకా లీవడనేలేదు. ఇంతలో వెచ్చని వాయువుల అహస్కరుడు తూర్పునుండే సము(ద్యల్లో(క) ధార్మ తాక్షుడైనట్లు"

వేసవి కాలము :-

"పూలను చూచి కంటకప్ర పుంజము మర్త్యజనాళికిన్ - ఇదో
వేళకు నేనటంచు దిగె ! వేసవి ! చల్లని రోజు లింక చె
ల్లెన్ లత కూనమై వడలె ! లేత వెలుంగుల తోడ వచ్చి, ఆ
భీల దవాగ్నితో కఠిన భీకర ఊష్మక రూపమొందగా"

భూమికి దిగినదట. గ్రీష్మము మధుమాసపు సుధ త్రాగిన జనతకు, పుడమి పులకరింతలకు, అవరోధము కల్పించుటకును. తన శక్తి అతులిత మైనదని, దీపింపగ తీరెండల కురిపించుటకును, హాలాహల వహ్నిజ్వాల కాల మును గుర్తింపజేయుటకు వర్తించునట.

గ్రీష్మాతప ప్రభావము తగ్గిన వేళను కవి "వేసవి డిండిమమునకు వేసట కల్గినదేమొ ! గాడ్పుల ఆవేశము తగ్గినదట"

"మానవ నివేదిత తాపము లాలకించెనేమో ! జనులందరి సేవలు తీర్చు టకు చల్లని వాయువులు వీచినవట"

వర్షాగమమున గాడ్పులు తగ్గి, వానమబ్బులు గగన వీధిలో శోభను వెదజల్లుచున్నవను సహజ వర్ణన ప్రయోక్త ద్వారా చేయించి, కవి జలదామృత మును కురిపించుమని మేఘ రాసములను కోరినాడు. అంత వర్షా సుందరి "ఉరుము మెరపులతోడ, ఉత్సాహరవళితోడ, శక్రచాపముపైని చిందులు

త్రొక్కుచు వచ్చి ఇలకు చినుకు చినుకుగ చేరెదననియు. పుడమిని చిగురింప చేయుటకు, కర్షకావళి ఎడద హర్ష ముదయింపజేయుటకు వచ్చి చేరెద" నను సంతోషగీతము అభివర్ణితము.

వర్షఋతువు విశ్రమించువేళ కాలమేఘములు కురిసి, తేలిపోయి, ఆకసమున చల్లని గాలుల తాకిడికి తూలి పోవుచున్నవట.

తెల్లని వెన్నెల గంధమును శరీరమునకు పూసికొనునట్లు శారద వచ్చినదట.

"ముగ్ధమోహన శారదాశితి పూతవైభవ శ్రేణులు దిగ్దిశాంతములయందు శోభలు దీర్చినవట"

శరత్తు చలిగాలి చెలిమితో

"విరహ జీవుల లోన విరజాజి పూవులో
వలపు వెన్నెల పాలు ఒలక బోసినది"
నీలి గగనపు యేటి నీలాటి రేవులో
తెలి మబ్బు వలువలే ఆరవేయగ" ఇలకు అరుదెంచినదట

తిరిగి వెళ్ళునప్పుడు.

"శరదిందు చంద్రికలలో సిరిగంధ సుమచయ చారు శిల్ప ముడిగినదట" మంచును మేలిముసుగుగా వేసికొని హేమమాలిని ధరకు అరుగుదెంచినదని ప్రయోక్త తెలుపగా కవి

"తుహిన తుషార పుష్పముల తూర్యము హేమకు స్వాగతమ్మునన్
విహరణ సేయవచ్చె వినువీధుల నుండి ఇలా తలమ్ముకున్
మహిత శుభాంగినీ ధవళ మంగళ రసాగమ పాళియై విలా
సహిమిక బాలగా, మకర సంక్రమణోత్సవ దివ్య వేళకున్"

అని స్వాగతము పలికినాడు.

అంతట హేమంతి "చిగురించు చెత్తాన చలిగాలి నేతతో తెలిమంచు వలిపాల వలె పాటు ధరియించి"

"కొందమ వెలుగుల చిదిమి
మంచుకుంచెల తోడ
తేనె వాకలు పారు తెలుగు నేలల పొంగి
గొబ్బిళ్ళలో, గుమ్మడి విరిమొగ్గల్లో
రమ్య విహృతి కేళిలో పృధివిన నర్తించునట"

హేమంత వెడలిపోవుచు ఈ ధరను శిశిరమునకు అప్పగించినదట.
వృక్షములు శీతల వాయువుల బడి మూగపత్రము జీర్ణమై పసలను కోల్పోయి ధరాతలమున రాలిపోవుట సహజకృత్యము. ఇది చిత్తక్షోభకు సంకేతాక్షరము. మోడుబారిన వృక్షము, "సిరిసర్వము వీడ తానొక సీడలేని నిరాశగా" కసిగినదట. శిశిరము "ఆకు పచ్చని మాకుల ఆకు కోకలను ఒలచి వేసి నగ్న దృశ్యమును కాంచుటకును, పెత్తనమును చేయుటకును, కలలు కల్లలు నియుటకును వచ్చినదట.

మరల జనులు

"శిశిరమునకు అప్పగింతల పాటల నాలపించి జీవన వీణ తీగెలను సవరించి స్వర్ణభావిని తలచి వసంతాగమనమునకై" చేయెత్తి పిలిచినారట. చివర మంగళాశాసనమున కవి ఋతువైభవశ్రేణి దీప్తిలో జీవనపథము మలచుట అత్యంత ప్రయోజనకరము.

"కాలమనియెడు చిత్రకారుండు గీచినవి
ఆరు ఋతువుల శబల చిత్రాల నృత్త
నర్తనమ్మది ఋతువైభవ శ్రేణి దీప్త
లలర చక్రమాగక నిరతము తిరుగుచుండు"

"పరమ మహితాత్మ జీవిత సరళియగుచు,
ప్రతిమలోదాత్త జీవన పథము మాలచొ

క్రుమ్మరి మనము కాలసైకతము నందు
మహిత చిహ్నములు నిలిపి మరల తగును"

సాంధ్యశ్రీ 'ఋతువర్తనం' పద్య గద్య గేయమాత్రా ఛందస్సులతో యున్న లఘు వర్ణనా కావ్యము. ఋతువర్తనము ననుసరించి ఆ ఋతువుచే గానముచేయబడిన గేయవర్తనము కలుగుట కావ్య ప్రత్యేకత.

'ఋతు వర్తనము' శబ్దార్థాలంకార భరితము.

వర్షఋతు వర్ణనమున

విరహిత నాయకోన్మదపు వీకిన జారెడు పైటలట్లుగా
తెరలుచు మబ్బు తూలినద"ను ఉపమ శృంగారసహితము
"శ్రుత పడి మేఘ రాజములు కామినీ ఘనవాలన కుంభికా
కృతిగ నభమ్ము నందవిగో కూడుచున్నవి"

వంటి శరత్తున" తెల్లనివెన్నెల గంధము, తెలిమంచు వలిపాల హృద్వీధి తేనె వాకలు పారుట" వంది రూపకములు, అవనికి జరిగి సీమంతానికి అర్కు-డెందుకో అలిగినట్లున్నాడు" వసంతాగమనముతో అవని పులకించినపోతోంది." వంటి స్వభావోక్తులు ఈ కావ్యమున కాననగును.

శిశిరమున వృక్షములు ఆకులు రాల్చుకొని, 'సిరి సర్వము వేడ తానొక వీడలేని నిరాశగా కసిగె మోడుగ" శిశిర కాలము గతించువేళ

"అప్పగింతల పాట లాలపించె నట వంటి లోకోక్తులు కూడ యిందు చోటు చేసికొనినవి.

ఈ కావ్యమున మానవ జీవిత లక్ష్యము సూచ్యము ఋతు చక్రము వలెనే ఈ కాలసైకతము నందు మహిత చిహ్నములు నిలిపి మనము మరలెదమను జీవిత సత్యము మరువ లేనిది.

---

సాంధ్యశ్రీ 'ఋతువర్తనం' తెలుగు సాహిత్య మాస పత్రిక "భారతి" - జూలై 1977 లో 32, 33 పేజీల యందు ప్రచురితము.

# "చైత్ర లక్ష్మి"

నాయని కృష్ణకుమారి

వసంత ఋతుశోభా విలసితమైన ప్రకృతి వర్ణనాకావ్యము "చైత్ర లక్ష్మి" నాయని కృష్ణకుమారి గారిది. వసంత ఋతు కాలపు శుభవేళలలో వికసించే గడ్డి పువ్వులు, వీచే గాలిపిల్లలు, పాడే తుమ్మెదలు, విరిసే గులాబీ మల్లెలు, నోరు విప్పి మాట్లాడితే ఎలా ఉంటుందో తెలిసికొనవలయునని భావించి, వానిని పాత్రలుగా చేసి, భావరూపకములో తమ ప్రతిభా పాటవములను ప్రదర్శించుకొనినారు. ఇందలి వర్ణనలు సహజ సిద్ధములు. అనుభవైకవేద్యములు. భావనా కల్పితములు. కవయిత్రి స్వతంత్రములు. పలికెడివి పాత్రలే అయినను పలికించెడిది కవయిత్రి మనస్సు. ప్రకృతి సౌందర్యానుభూతి ఒక్క మానవజాతికే కాదని సకల చరాచర ప్రాణికోటికంతటికిని అనుభవైక వేద్యమని నిరూపించుటకు కాబోలు కవయిత్రి ప్రకృతినే పాత్రలుగా చేసినారు. ఈ నాటికలో నేపథ్యములో మనసునకు హాయిని కలిగించే పూల పరిమళములు, అంతు తెలియని సుఖానుభూతులను కలిగించు పవన తరంగ తరళితములు, మధుప భ్రమర సంగీత నాదముల వర్ణన అత్యంత మనోహరములు. ఇవి సోకిన వెంటనే 'గడ్డిపూలు' ఆనంద పరవశులను జేసే ఆ పరిమళములు తమవి కావని, ఎక్కడి నుండియో వచ్చుచున్నవని దిక్కులు చూచుచుండగా నాలుగవ గడ్డిపూవు "ఆకుపచ్చని రంగుపైన తెల్లని కోసులు, తీరిన చిన్న ఆకారం పొంకమైన రేకులు కలిసి ఎవరో" అని ఒక మల్లికను చూపినదట

అంత ఆ మల్లిక గుండె పులకించే ఆమని సౌందర్యమును వర్ణించినది. "దూరంగా కోయిల కూత, పచ్చని ముఖాలు శోభించే పూల చిఱునవ్వులతో సప్త సౌందర్యాన్ని వెదజల్లే మామిడి చెట్టు యీ సృష్టి సంపద." అని వివరించినది.

ఈ మాటలు వినిన గులాబి 'కాలము చెల్లినవారి జీవన సంధ్యలో ఆమని మరల వచ్చి ఆశలు చిగురింపజేయునను సత్యములను కవయిత్రి ప్రకటింపజేసినారు. అట్టి చైత్ర లక్ష్మికి పూజ చేయవలయునని అందరు గొంతులు కలిపి,

---

'చైత్ర లక్ష్మి' భావరూపకము "స్రవంతి" మాసపత్రిక 16పే. – 23పే. వరకు ప్రచురింపబడినది.

"ఓ చైత్ర లక్ష్మీ ! ఓ చైత్ర లక్ష్మీ !!
హృత్కమల వికసనాయత సూర్యరశ్మీ !!
.... ... .... .... ....
కాచియున్నామమ్మ, వేచియున్నాము
నే కొరకు మా తనువు లిచ్చి యున్నాము !"

అని పిలువగా ఆ పలుకులు విని చల్లని గాలి పిల్లలు "సాగర తీరాన్ని ముద్దు పెట్టుకొనే జలతరంగాల్లా" గడ్డిపూలను, మల్లె గులాబీలను సోకినవట. గడ్డిపూలు చలించినవట. గులాబీలు ఒయారాలు ఒలికే నాట్యకత్తెలా అటు ఇటు ఊగినవట. ఆ గాలితో సంస్పృష్టమైన ఆమని అణువణువున నిండినదట. పాటయే బ్రతుకుగా గల తుమ్మెదల రొద సంగీతమై పరవశింపజేయుచున్నదట. పిల్లగాలులు చైత్ర లక్ష్మిని ఆహ్వానించువేళ వసంతము

"గుప్త విరహ బాధాకుల
దీప్త మధుర హృదయాశయ
ఓ దేవీ ! మాధవ వధూ !
ఓ వసంత హృదయ మధూ !!"

అని సంబోధింపబడుట హృద్యము.

తుమ్మెదలు ఆమని వేళను

"కలకలపాడే కోకిలగా, నిగనిగలాడే వెన్నెలగా
ధగద్ధగిత విద్యుల్లతగా నవనవోల్లసిత మేఘావళిగా
కదలెడి ఆమని కానిమెలపులో కోటికోటి స్వప్నాలు చిటిలెనో,
తేనె వాకలే తెరలి పారెనో, తేటి గాండియలు పొంగిపొరలెనో"

వాని నడుకను గూర్చి,

"తొలిమొయిలు కన్నెలా తెలిదమ్మి రేకులా
మధు మత్త భృంగ మంజుల గీత సరణిలా
కదలిందహో దేవి !" అనియు,

ఒక రాజసాంసలా ! ఒక మత్త గజములా
సాగిందహో దేవి ! అనియు
"నలుదిశల విజయ కాహళి పట్టి యూదగా
నడచిందహో దేవి !"

అని కవయిత్రి చైత్ర లక్ష్మి రాకను తుమ్మెదలచేత వర్ణింపజేయుట కడు సమంజసము.

చైత్ర లక్ష్మిని వర్ణించిన తీరు మనోహరము.

చిఱుత చరణములు ముద్రించు కెంజీరలో
అరుణాధరమ్ము చిత్రించు రాగమ్ము లో
తళుకులై, మెఱపులై అలరినవి, మెరసినవి
ఆమె పదముల శోభ అచటి ప్రకృతికి శోభ
ఆమె పెదవుల నవ్వు అచటి పువ్వుల నవ్వు
ఆమె గొంతుక పాట అచటి పికముల పాట
కాంతమై ఏకమై కలసినవి మెలసినవి

ఆ విధముగా వచ్చిన చైత్ర లక్ష్మి ప్రతి జీవకణములో ఉత్సాహమును నింపినది. కాని అది రెండు నెలల కాలపరిమితిని కలిగియుండుటచేత ఏదియును శాశ్వతము కాదను విషయము సుబోధితము.

నాయని కృష్ణకుమారి గారి "చైత్ర లక్ష్మి" భావరూపకము సులభశైలిని కలిగి అత్యంత రమణీయకమై ఒప్పినది. ఇందలి శబ్ద జాలములు సుమధుర భావ వ్యక్తములు. చైత్ర లక్ష్మిని గురించిన పలుకరింపులు, పులకరింపులు, వర్ణనలు సుమనోహరములు. పాత్రలమధ్య సాగిన సంభాషణము సాధారణము.

ఈ భావరూపకమునందు జాతీయములు, సామెతలు, నుడికారములనేకములు.

గడ్డిపూలు చైత్ర లక్ష్మిని ఆహ్వానించుటకు తగినవారము కామని, అల్పులమని భావించి,

"మా అల్పత్వాన్ని మన్నించి మేం పిలిస్తే ఆవిడ రాదేమో"

అనగానే గులాబి,

"తమశక్తి తమకెరుక పడని జీవితం ధన్యం;
అశాంతి తృష్ణకూ ఆస్కారం లేని జీవితం ధన్యం"
"అమాయికత్వానికి లోకంలో విలువ చాలా ఎక్కువ సుమా!"

అను సత్యములను, లోకజ్ఞానమును కవయిత్రి పాత్రలద్వార తెలియజేసినారు.

అసూయాద్వేషాలకు తావులేని విషయమును గాలిపిల్లలు అడుగగా మల్లిక

"పిలుపు వింటూ కూడా పరవశించే హృదయస్థితి మాది"

అని సమాధానమిచ్చి, గాంభీర్యతను ప్రదర్శింపకొనినది.

గులాబి "హృదయస్థితి ఆవేశానికి లొంగినప్పుడు
హెచ్చు తగ్గుల తారతమ్యం ఉండదు"

అను లోకోక్తిని చాటి చెప్పినది.

"లోకం పోకడకు ఎప్పుడూ వార్తలను క్రొత్తగా సృష్టించే
ధోరణికాదు, అల్పంగా ఉన్న వాటిని పెంచే ధోరణి"
"గాలి వార్తలన్నీ సత్య శూన్యాలు కావు"
"వస్తూ పోతూ ఉండే వాటిమీద మమకారం
వ్యక్తులకు చావనూచావదు !"

అనే నగ్నసత్యాలు, లోకోక్తులు, ఈ భావరూపకమున వర్ణితములు,

"చైత్ర లక్ష్మి" వసంతోత్సవ శుభ వేళా విశేషముల భావరూపకము. వసంతము శృంగార రస ప్రాధాన్య ఋతువు.

ఇందు వసంతుని గూర్చి మల్లిక

"మన్మథుడి కుడిభుజం అగ్నికి వాయువు వలె
అతికే సఖ్యానికి ఆకారం"

అని వివరించినది.

అలంకారములకు కూడా యీరూపకము నిలయము. శబ్దాలంకారములు కోకొల్లలు. అర్థాలంకారములు అచ్చటచ్చట చోటు చేసికొనినవి. మల్లిక

"పసివాడు పెదవులు కదిపినట్లే రేకులు విప్పుతోందట"

అని ఉత్ప్రేక్షించుట హృద్యమము. ఆమని రాక

"సాగర తీరాన్ని ముద్దుపెట్టుకునే జల తరంగాల్లా
మందాతిమందంగా మనల నలుము కుంటున్నదట"

అను ఉపమ సమయోచితము.

చైత్ర లక్ష్మి "ఒక రాజహంస వలెను, ఒక మత్తగజము వలెను, సాగి వచ్చినదట".

"తొలి మొయిలు కన్నెలా!
తెలిదమ్మి రేకులా!
మధు మత్త భృంగ మంజుల గీత సరణిలో కదలివచ్చినది"

అనుటను ఉపమాలంకార శోభితములు. స్వభావోక్త్యలంకారములనేకములు.

—o—

29)

# "వ స ం తో ద య ం"

## వడ్డేపల్లి కృష్ణ

వడ్డేపల్లి కృష్ణ 'వసంతోదయం' అను ఋతు వర్ణనలతో సాగిన ఒక చక్కని గేయ కావ్యము. ఒక ఏటి వసంతముతో మొదలై మరో ఏటి వసంతోదయముతో కథా కావ్యము సుఖాంతమగుచున్నది. అందుకే ఈ కావ్యము 'వసంతోదయము'ను పేరును సార్థకమొనర్చుకొనినది. చెరకు వింటివాని వర్ణనతో మొదలై గున్నమావిపైన పికము పాడిన మంగళ గీతముతో ముగియుట కావ్యప్రతిభను చాటుకొనినది. సంఘములో పేరుకొనిన కులమత తత్వాలు, పేద ధనిక తారతమ్యాలు, వరకట్న దురాచారము అంతము చేయాలనే సత్సంకల్పముతో, ఈ కావ్యము రచియింపబడినది. మానవ కళ్యాణమునకై వెలసిన యీ ఋతువర్ణనా కావ్యమెంతో ప్రశంసనీయము.

శ్రీ వడ్డేపల్లి కృష్ణ తెలంగాణ మండలమువారు. ఎదలో స్వచ్ఛంద భావ తరంగాలు స్వేచ్ఛా గీతాలుగా ఉదయిస్తున్న తరుణ దశలో నిజాం కళాశాలలో విద్యార్థి దశలో, ప్రముఖ కవి డా॥ సి. నారాయణరెడ్డిగారి నవనవ సాహిత్యోపన్యాసములు ప్రేరణను కలిగించి, వారి ఆశీస్సులు ప్రోత్సాహాన్నందించినాయి.

ఈ గేయ కావ్యము ఆగస్టు 1978 లో ముద్రితము. శ్రీ దాసరి నారాయణరావు గారికి అంకితము.

వీరి 'వసంతోదయము' నందలి కథా విషయము కవి అనుభూతిని చాటి చెప్పుట వలన ఇది ఆత్మాశ్రయ కవిత్వమే యనిపించుకొనును. పల్లెటూరి పాఠశాల పట్నంలో పై చదువులు చదువుచుండెను. సెలవులలో పల్లెకు వచ్చెను. ఓ పిల్లను చూచును. శీలహరణం, ఋతుచక్ర పరివర్తనము-మళ్ళీ వచ్చెను, మరో పిల్లను చూచును. పసి బాబును చూచును-ఆ పిల్ల మొదటి పిల్ల చెల్లి. ఆ బాబు తనదాని. పశ్చాత్తాపము, తండ్రికి ఎదురు తిరిగి ఆమెను వివాహమాడుటతో కథ సుఖాంతము.

'వసంతోదయం' చెఱకు విలుకాడు కుసుమాస్త్రములను పుడమిపైకి వదలుటతో కలిగినదట. ప్రతి రెమ్మలలో, కొమ్మలలో, కొప్పులలో పూలు నిండినవట.

"గున్న మామిడి గుబురులకు జని
సన్న సన్నగ కోకిలమ్మలు
సన్నయీ స్వరాల నెత్తగ
చెట్ల ఆకులు చెవులు నిక్కగ
వనములన్ని వన్నె కెక్కగ
మనములో మాధురిమలు పండెను"

అను వసంత ఋతు స్వభావమును కవి కన్నులకు కట్టినట్లు వర్ణించినాడు.

"కాలచక్రము త్వరితగతినే
కదలిపోవుచు తిరుగసాగగా గ్రీష్మమే తెంచినదట
"అంతకంతకు తీవ్రమైన రవి
చింతనిప్పులు చెరిగి పోసెను"

ఏరులు, చెరువులు, ఎండిపోయినను, మల్లెలు మెండుగా వికసించినవట.

మధురముగ మామిడి ఫలమ్ములు
ముదుర మాగుచు తీపి పంచెను"

ఉదయమే ఎండలు ఉధృతమై ఉర్విని ఉడికించివేసినవట. గడియకో వడగాల్పు వీచెనట.

"లేప తేపకు నీరు త్రాగిన
తాప మసలే తీరదాయెను
చంద్రోదయ వేళ ఆయినా
చెమట మాత్రము ఆరదాయెను"

తనువున చెమటకాయలు కలిగి ఓర్వజాల కుండెనట.

వర్ష ఋతువు ఆరంభమున కవి వినూత్న ప్రయోగము చేసినారు.

"బీటవారిన యట్టినేలను
బిడ్డలా లాలించ నెంచిన

హేమంత ఋతు ప్రవేశమున ప్రకృతిలో కలుగు మార్పు [illegible]

కాలరమణి "జామకాయలు తిన్న రోగిగాను
జలుబు చేసెను చలువ చేసెను" ! !

మంచు కురియుట, వణుకు హెచ్చుట, పగలు కురచయగుట, [illegible] లను బాపలేకుండుట, రాత్రులు పెరుగుట, గుమ్మడి, సొరకాయ, [illegible] లధికముగా దొరుకుట, పంటలు ఇళ్ళను చేరుట, రేగుపండ్లు [illegible] హేమంత ఋతు లక్షణములు.

"ముద్దబంతుల బోలు ఇంతులు
ముగ్గులను ముంగిళ్లు తీర్చగ
సంక్రాంతి సంతోష క్రాంతి
సరదాల ఉయ్యాల లూగెనట"

అట్టి సమయమున కుత్సితమతితో శిశిర భామిని వడివడిగ వచ్చి వలస ప్ర[illegible] చేసినదట. అధరములు, బుగ్గలు పగులుట, వృక్షములు ఆకులను రాల్చుట, ఎం[illegible] టాకుల గలగలలు శిశిర ఋతు ప్రభావితములు. ఆ వివిధ రీతిగ వసంతుడు [illegible] రథముపై వచ్చి తీపి తలపులను తెచ్చును.

సాంఘిక దురాచార నిర్మూలనచేసి, సంఘములో వసంతోదయమును [illegible] చుటయే ఈ కావ్యమునందలి కథా వస్తువు.

ఒకనాటి సాయం సమయములో పల్లెటూరి [illegible] తన పల్లెలో విలాసంగా విహరిస్తుండగా,

"లేని నడుము చంచలింప
లేడి వలెను గంతులిడుచు"

వచ్చు ఒక గొల్లపిల్ల ఆయన కంటబడినది. పాలమీగడలవంటి బుగ్గలు, పగడముల వంటి అధరములు, మనోహరములైన కనుదోయిలు మోహమును రేకెత్తించినవి. ఆమె ఫోటోను తీసికొనినాడు. అప్పుడా అమాయిక స్త్రీ

"ఏంది దొరా! ఏమంటివి!
నా ఫోటువ దీసినావు
ఎప్పుడు దీస్తి వెట్లదీస్తి
వేదేదీ సూడనియ్యి"

అనిన పలుకులలోని మెత్తదనము ఆ బాలుని మైమరపించజేసెను. అంత నాడు ఆ ఫోటువను ఒంటిగంట రాత్రి ఒంటరిగా వచ్చి దీసికొని పొమ్మనగా, 'కల్లాకపటము ఎరుగని పల్లెపడుచుకేమి తెలుసు'? అని మాటను సమ్మతించి అట్లే వచ్చెను.

"ఫోటోలో తన రూపం
చూచుకొనుచు ఆ సుందరి
పరిసరాల నెల్ల మరచి
పారవశ్యమున మునిగెను"

ఆమె అందచందముల ననుభవించినాడు. ఊహించని సంఘటనకు ఆ సుందరి ఉన్మాదియై నిలిచెను. బాలు అన్యాయమని తెలిసియు అబల శీలహరణము చేసెను.

ఒక ఏడాది కాలచక్రము గిఱ్ఱున తిరిగెను. చిన్నవాడు చదువు ముగించుకొని, తన ఊరికి తిరిగివచ్చె. ఏటి ఒడ్డుననున్న ఒంటి గుడిసెలోనున్న సుందరిని పోలిన కాంతను చూచెను. పూర్వపు మధుర స్మృతులు లేచెను. "నాటి మధురాత్రే 'రాణి' అనుకొని చనువుతో కపోలమును చుంబించుకొనగా ఆమె "ఒక లెంపకాయ తాస్తిగాను తగిలించెను". ఆమె తావలచిన సుందరి కాదని తలచి తలవంచి నిలిచెను. కొంత సేపటికి ఆమె ముందునకు అడుగు వేయబోగా జడను అందుకొని వెనుకకు లాగెను. అందుకామె ఆగ్రహించగా, ఆ చినవాడు,

"నా తప్పిదమేమి లేదు
నాగుబాము కలదు ముందు
నీ ప్రాణము కాపాడగ
నేనీ విధి చేసినాడ"!

అని తెలుపగా పాముసు చూచి ఆమె భయభీతితో అతనిని పెనవేసికొనెను. అంత

"కన్నెపిల్ల పరువమ్మున
కదలాడెను ఏదో తలపు

నులివెచ్చని కౌగిలిలో
నూగారుయు పులకించెను"

ప్రేమ జ్వరముతో వారిరువురు ఇల్లు చేరిరి.

మరునాడు పశుపులకాపరి బారినుండి చిన్నబాబు ఆమెను కాపాడి తన ప్రేమను తెలిపి భయమును తీర్చెను. రాధామాధవుల వలె రమ్యముగా గడపినారు. చిన్నబాబును చూచి తాను ముందు ప్రేమించిన ప్రేయసి కుమారుడని తెలిసికొని సంతసించినాడు కాని పురుటిలోనే ఆమె చనిపోయినదని విని బాధపడి పశ్చాత్తాప పడినాడు. ఆమె రూపురేఖలన్నీ ఈమెలోనే చూచుకొని, ఇల్లాలుగ చేసికొని ఇంటికి కొనిపోయెను. కాని ఆ చిన్నబాబు నాన్నగారు అనాదిగా వచ్చే ఆచారము చెడిపోవుటను సహించక "ఆ పడతికి ఈ ఇంటను చోటు లేవన్నాడు". అంతట ఆ చిన్నబాబు

"ఆచారం పేర మీద అత్యాచారాల జరుపు
హీన చిత్తుల కంటె నా హీనజాతి వారెనయం"

అని చంద్రికి తెలుపగా

"కాని పనులు నీవు చేయ
కాదా తలవంపు నాకు !
లక్షలతో బాటు నీకు
లక్షణ మగు వధువు తెచ్చి
పరమానందమ్ము కలుగ
పరిణయమ్ము జరిపింతును"

చెప్పినట్లు విననెంచుమని తండ్రి యనగా....

"ఊరు పెద్దలయిన మీరు
పేరుకు 'ధర్మా రావు'లు
కాని మీదు ప్రతి పలుకున
కదలాడెను అధర్మమ్మె !
నాన్నా ! యని పిలువ నాకె
నగుబాటుగ తోస్తున్నది"

అని చిన్నబాబు ఎదిరించి

"కట్నము కావలెనని యీ
కన్యకు నేసన్యాయము తలపోయనని"

అని నిశ్చయమును తెలిపినాడు.

వరకట్నమంటే

"పతనమైన సమాజమ్ము
పసునిని ధర కట్టడమే!
ఘనబాహాపు నీచాత్ములు
వనితల కుతి పెట్టడమే"
"కులంపేర మతంపేర
కుళ్ళిపోవు యీ సంఘం
కుటిలబుద్ధి అవివేకులు
సాగుకొన్న రణరంగం"

అని చెప్పి వెడలిపోవ ప్రయత్నింపగా, తండ్రికి కనువిప్పు కలిగి అంగీకరించెను.

"శివమెత్తిన శిశిరంలో
నవ వసంత ముదయించగ
వసంతమ్ము వోలె పూచి
వలపు గూడ ఫలియించగ
కలిగిన పుత్రుని చేకొని
కాబోయే సతి దోర్కొని
చిన్నబాబు కదలి రాగ
గున్న మావిపైన పికము
మంగళ గీతమ్ము పాడె
మహదానందమ్ము నాడె!

వసంతోదయం త్రిస్రగతితో పాదమునకు పన్నెండు మాత్రా ఛందస్సులో నడిచినది. గతి వైవిధ్యమునకు అక్కడక్కడ 3, 4 మాత్రా విరుపులతో మిశ్రగతిలో సాగును. కావ్యము నందలి భాష తెలంగాణా ప్రాంతపు నుడువు 'పోరల బిండ్లమందు సాతేడులు

పరుగెత్తుట, ఎదురుగా ఎవరు వెళ్ళకుండుట, సరదా, సమాతిక్రమము, గొల్లపిల్ల మాటలు, పోటుప. అబద్ధము వంటి మొదలగు పదములు ఉపయోగింపబడినవి.

భావ సరళతకై మరియు మాండలిక వ్యవహారిక పదప్రయోగమునకై భాషా విషయములో కవి స్వాతంత్ర్యము కానవచ్చును. పౌడరు, స్నోలాంటి ఆంగ్లపదము లిందు చోటు చేసికొనినవి.

ఈ కావ్యము మాత్రా ఛందస్సులో సాగినను, అలంకార సహితములు.

"ఏరులన్ని లేళ్ళ మాదిరి
ఎగిరి పడుతూ పొంగి పారెను"
"సిరి వెన్నెల నిగ్గుదేరుచు
పాల వన్నెగ ప్రకాశించెను"
"హేమంత సతి తలంబ్రాలుగ
రేగుపండ్లే యిలను మారగ"
"వృక్షములు వస్త్రాలు విడిచిన
వృద్ధురాండ్రనగాను నిలిచెను"
"వదవి పోయిన నాయకుల్లా
పడిన ఆకులు పరితపించగ"
"ఎల జవ్వని పలు వరుసలు
మల్లెమొగ్గ పంక్తులుగా కనిపించెను"
"దోరవయసు అధరమ్ములు
దొండపండు లనిపించెను"

ఈ కావ్య కథాభాగము నందంతయు శృంగార రస ప్రాధాన్యమును వరిగణించు దనుటలో అతిశయోక్తి లేదు.

కావ్య విశిష్టతను గూర్చి డా॥ సి. నారాయణరెడ్డిగారు తమ ఆశీస్సుల సందర్భ జేస్తూ "ఈ కావ్యం చెరకు వింటి వానితో మొదలై గున్నమామిడిపైన పికము పాడిన మంగళ గీతముతో ముగుస్తుంది. వసంత ఋతువు శృంగార రస పోషకం – ఇందులో ఉన్నది శృంగారమే. అందుకే యీ ఆద్యంతాలు ఔచితీమంతాలు".

ప్రముఖ కవి బోయి భీమన్నగారు తమ అభిప్రాయములో, అభినవ పోతన డా॥ వానమామలై 'పీఠిక' యందు కావ్య విశిష్టతను తెలిపినారు.

—o—

# "ఋతు మంగళము"

గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యం

శ్రీ గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యంగారి 'ఋతు మంగళము' వాల్మీకి రామాయణముతో నిక్షేపించిన ఋతు వర్ణనములకు తెలుగు సేత. ఇందు రామాయణమున ప్రధాన గుణముగా వర్ణింపబడిన హేమంత, వసంత, వర్ష, శరదృతులను నాలుగు ఋతువులు అనువదింపబడినవి. హేమంత ఋతువు లక్ష్మణుని చేతను, వసంత, వర్ష, శరదృతువులు శ్రీరాముని చేతను వర్ణితములు. ఇవి కేవలము వర్ణనాత్మకములు కాకయు, ఆత్మాశ్రయ, పరాశ్రయ కవితాగర్భితములు. శ్రీరాముని విరహావస్థ హృదయ వర్ణనమధికముగా నుండుటచేత ఇందు ఆత్మాశ్రయత్వము అధికముగా కనిపించును.

శ్రీ సుబ్రహ్మణ్యంగారు సంస్కృతాంధ్రాంగ్ల భాషా పండితవరేణ్యులు. కాళిదాసకృతులను తెనుగుచేసి ఆంధ్రభాషామ తల్లికి అపారమైన సాహిత్యసేవ గావించినాడు. కాళిదాస ఋతు సంహారమున కనువాదము శాకుంతలము, రఘువంశము, మేఘదూతము, అమరుకావ్యము, ఇందుమతీ పరిణయము, ఖండకావ్య కవితా సందోహము. దిలీపనాటక మొదలగునవి ఈతని రచనలు. ప్రకృతి వర్ణన యందు ఇతనికి అపారమైన ప్రీతి. కావుననే ఆ కావ్యమున తత్సంబంధిత వర్ణన ప్రత్యేకమగును.

కవికి ఏకసర్గ పారాయణము నిత్యవిధిగా చేయుచు వచ్చుట అలవాటు. ఆ సమయములో ఒక్కొక్కప్పుడు ఆయా సర్గ విషయము మనసును కదిలించ, అనాడే విరామవేళలో కవిగారిచేత అనువాద పద్యములు వ్రాయింపజేసినవి. ఎంతైన వాల్మీకి భావావేశమునందు కవివశుడై అవశముగా ఈ 'ఋతు మంగళము'ను వ్రాసినారు.

ఈ కావ్యము కవి ఆత్మాశ్రయ రీతిలో వ్రాసినారనుటకు 'వ్రేటుపడ్డ వ్యోమము', 'బాధాయత్తంబైన' రాముని చిత్తముల వర్ణించు

"పుత్తడి కొరడాలగు వి
ద్యుత్తులచే వ్రేటువడ్డ వ్యోమము బాధా
యత్తంబై యంతః స్తని
తోత్తరమై మొసగుచున్న మొప్పొంగంగన్."

అను పద్యమొక్కటి చాలును.

వాల్మీకి రామాయణములో హేమంత, వసంత, వర్షశరత్తులను నాలుగు ఋతువులను సంబంధించి వర్ణింపబడినవి. హేమంతము, పంచవటిలో నివసించుచుండిన శ్రీరాముడు సీతతో కూడి ఒకనాటి చలికాలపు వేకువజామున గోదావరికి స్నానార్థమై పోవునప్పుడు లక్ష్మణునిచే 28 శ్లోకములలో వర్ణింపబడినది. ఇందు చల్లదనము విచ్చు మంచు తుంపరలు, లేయెండ మొదలగు సహజస్థిత లక్షణములు వర్ణింపబడినవి. ఇందు లక్ష్మణుడు శ్రీరాముని గురించిగాని, తనను గురించిగాని బాధపడక భరతుని గురించి,

"సుకుమారుడైన భరతుడపర రాత్రుల
వెడలి సరయు జలముఁ గ్రోచ్చు విధి ఎట్టిదియో"

యని బాధపడును. ఇందున వైశిష్ట్యము కలదు. శ్రీరాముడు పితృవాక్య పరిపాలనకు కట్టుబడి ప్రతిజ్ఞుడైనాడు. లక్ష్మణుడు సీతారాముల సన్నిధానముతో మహాభాగ్యుడైనాడు. పాపము భరతుని ప్రస్తావనతో కవి భావనాశక్తి ప్రస్ఫుటము.

వసంత ఋతు వర్ణనము రామాయణమునందు కిష్కింధాకాండమున సీతావియోగ సంజనిత మనః క్లేశముతో కుంగియున్న శ్రీరామునిచే పంపాసరస్తీరమున వర్ణింపబడినది. విప్రలంభ శృంగారమునకును, వసంత ఋతువునకును గల మైత్రీ భావమిందు వర్ణితము. శ్రీరాముని మనస్సును దహించెడి విరహాగ్ని వర్ణనలో కవి భావన ప్రగాఢమైనది.

"నిష్పుకలశోక మంజరి
చిప్పిలు నళిరవము రవము చిన్నరుల కెంపుల్
గుప్పు మను మంటలై, న
న్నిప్పుగి వసంత శిఖి దహించెడి నకటా !"

వర్షఋతువున సహజ భావాత్మక వర్ణనలు కోకొల్లలు. మేఘములు, వర్షధారలు. చాతకములు, కొక్కెరలు, ఇంద్రగోపములు, నెమళ్లు, తుమ్మెదలు, భేకధ్వనులు, పక్షులు, శ్రీరామునిచే కవి వర్ణింపజేసినాడు.

వర్షించిన పిదప ప్రకృతి జలమయమగును. గట్లు అగుపింపకుండును. ప్రొద్దు భాస్కరుని కిరణములు భూమిపై కాంతి సరిగా పడక క్రుంకినట్లుండును.

"గూళ్లఁ జేరి పోవనెల్ల విహంగముల్
ముడిగి పోవఁ దమ్మి పువ్వులెల్ల"
"విప్పి చూడను జాజి నిమిల వితానముల్
ప్రొద్దు గ్రుంకు టెఱుఁగఁ బోలు నిపుడు"

భాద్రపద మాసము బ్రహ్మ వివక్షులైన సామగానపరులు బ్రాహ్మణులు అధ్యయనము చేయుటకు అనుకూల సమయము, ఆషాఢ మాసములో అన్ని గృహ కృత్యములు తీరును.

శరదృతు వర్ణనమును శ్రీరాముడు విరహోత్కంఠతో వర్ణించినాడు. [illegible] వేళయందు ఎఱ్ఱకాంచనములు ఏడాకుల అరటులు, ప్రేంకణములు, [illegible] కనువిందొనగూర్చును. హంసలు, చక్రవాలు, క్రౌంచములు, బెగ్గురులు. [illegible] విరాజిల్ల చేయుచున్నావట.

శరత్కాలము పగవారిని గెల్చుటకై దండయాత్ర చేయుటకు తగు సమయ మనియు, సుగ్రీవుని సీతను వెదకుటకై పంపుటకనువైనదను విషయమును రాముడు లక్ష్మణునితో తెలుపును.

'ఋతు మంగళము' అర్థాలంకార భరితమై శబ్దాలంకార శోభితమై [illegible] జేసికొనినది. హేమంత వసంత ఋతువులందు ఉపమ స్వభావోక్తులు, వర్ష ఋతువు నందు ఉత్ప్రేక్షాలంకారములధికములు, అర్థాలంకారములతే మూల భావనలే అయినను కొన్ని మచ్చునకు ఇచ్చట చూపుట అవసరమని భావింతును.

హేమంతమున సూర్యుడు మంచు తుంపరలచే కప్పబడగా ఆకాశమున
"నుదుటిబొట్టు తుడుపుబడ్డ సుదతివోలె"
అగుపించినాడని ఉపమించుట కడురమ్యము.

చందమామ

"మలిన నిలయమైన దర్పణమువలెన్"
మంచుచే కప్పబడి తేజరిల్లకున్నాడట.

బారెడు ప్రొద్దెక్కినను

"దివాకరుడునున్ హిమాంశుడువోలె"

వివరించినారు. జలముల విహంగములు జలము పొరలేని విధమును,

“కలసిం ... లేని యభ్రపంక్తులు వోలెన్” అని ఉపమించినారు.

హేమంతమున “క్షేత్ర దాల్చు నీల పీతం

బును శాలువు దాల్చె గొన్నయది గతికబయల్”

వాడిపోలు వివరిగా పిలిపుష్పలు తరువులాగి,

“విరిబూచిన వనముల సొంపరియును,

వితివాన గురియు నభంబులు నిరూపించు కరణి”

అల్లపై రాలినవను ఉపమానమది సుందరము.

స్వచ్ఛమైన పంకజలములందు

“పద్మములు బాలసూర్యుని బోలి భాసించు చున్నవి”

“పద్మకోశములు సీతనేత్రకోశముల వలె” కనబడుచున్నవట.

వాయువు “బహుశాఖారసాస్వాద మోదితాత్ముడైన ప్రోషకవలె”

అంతట చరించుచున్నదట.

వర్షఋతు వర్ణనములో అధునాతనమనిపించు ఉపమానము సంజె వెలుగు సోకు వలన నడుమ నెఱ్ఱనై అంచులందు మిక్కిలి తెల్లనైయున్న మబ్బు మసకలవేళ ఆకాశము గాయమునకు కట్టుకొనిన దానివలె కనబడుచున్నదట.

“మబ్బు చెఱగులలో నింగి

వ్రణము కట్టుతోఁ బరగును బలె”

వెగ్గురుల పంక్తి ఆకాశమున

“నింగి ధరియించు పుండరీకములయు దండవోలె”

అగుపించినదట. వర్షధారలు

“జారెడు ముత్యాలసరుల సంగతిని బలెన్”

శరత్తున పయోధరములు

‘విమదంబులు గజములు వోలె” నుడిగినవట.

శ్రీరాముని వెన్నంటి వెళ్లిన సీతను గురించి,

"వెనిమిటి వెన్నంటియ వ
చ్చెను జక్కవ వెంటివోలెఁ జేడియ కష్టం
బనక విషమాటవికి నుప
వనమున కుం బోలె దాని బాసితినకటా" !

యని పద్యములో ఉపమానము కలదు.

సీతాదేవిని స్మరణకు తెచ్చు వర్ణనలన్నియు స్మరణాలంకారమున కలవు.

వర్షఋతు వర్ణనములో మేఘములు ఏనుగులవలె ఊహించుట కలదు.

"నీలాంబు ధరా శ్రిత యై
క్రాలు తటిల్లతికఁ జూచి రావణునొడిలో
వ్రాలిన తపస్వినిన్ సీ
తాలలనను బలెఁ దలంచెదను సౌమిత్రీ !"

యని దల్లవి మేఘమనెడు రావణుని ఒడిలో తటిల్లతికవంటి సీతను రాముడు [illegible] ఒక చక్కని ఉత్ప్రేక్ష.

మయూరదైన్యము, హంసల విజృంభనము, అను శరల్లక్షణముల వర్ణనలో ధ్వని ప్రకటితమై ఒప్పినది.

"తమ మేలి సొమ్ము లౌ పిం
ఛములను గోల్పోయి చేరజని స్రోతస్తీ
రము మిట్టాడెడు హంసల
కు ముడిగినవి బలె నెమళ్లు కుములుచుఁ బోవున్"

రోజులు మారినప్పుడు పింఛములను కోల్పోయిన నెమళ్లు హంసలకు భయపడుట, కాలమొక్క రీతిగా నుండదను విషయము ధ్వనింపజేసినది.

"వ్యోమము బాధాయత్తం బై" అని వాడుటలో నీలమేఘశ్యాముడు శ్రీరాముడు అను ధ్వని యిందు గర్భితము.

'ఋతు మంగళము'న ప్రకృతి వర్ణన అత్యంత సహజముగను, రమణీయము గను సాగినది. సీతా వియోగ దుఃఖమున శ్రీరాముడు విప్రలంభ శృంగారమునే ప్రదర్శించినాడు. ప్రకృతియందలి పశుపక్ష్యాదులు, తరులతలు, గిరులు, మారుతములు సెలయేళ్ళు, మొదలగునవన్నియు రాముని కళ్ళ ఎదుట శృంగారభరితముగనే కనిపించును. వసంత వర్షశరత్తులు కామోద్దీపకములు. కావున వీని వర్ణన శ్రీరాముని చేతనే చేయించుట కవి భావనాశక్తి అత్యంతోన్నతము.

'ఋతు మంగళము' కంద, ఉత్పల, చంపకమాలా వృత్తములలో ఆట వెలది, తేట గీతులతో భావసౌందర్యము ననుసరించి వర్ణింపబడినది. ఈ కావ్యమునందలి భాష ఒక సౌందర్యమును గలిగి కొంతవరకు సులభ శైలిలో సాగినది. శ్రీరాముడు, సుగ్రీవుడు పరస్పర సహాయ సహకారములను కోరువారై సంధునే వారియువురి స్నేహము నిలచినది. ఒక స్నేహితుడు లభించినప్పుడు మనస్సులోని కొంత ఆవేదన తగ్గును. ఉపకారికి ప్రత్యుపకారము చేయుట అను ధర్మమును, కాల నిరీక్షణ చేయుటవంటి సూత్రములు ఈనాటి సమాజమునకు కూడ నిత్యములు.

"ఉపకార ఘాతి యగ్ర
త్యుపకృతి సాత్వికుల మనస్సు నుడికించుఁ జుమా"

అను సామెత నిర్వివాదము.

మిత్రఘ్న అయినవారు లోకములో లెక్కకురారను విషయము గ్రాహ్యము.

"కూర్చిన మేలును మఱవని వాడు ధీరుడు"

"గతిలేని వాడు దీనుడు"

వంటి లోకోక్తులు, సామెతలు కోకొల్లలు.

[1] "కవికుల గురువు కాళిదాసు. అతని గురువు వాల్మీకి ఆయన ఎంతటి ప్రాక్తన పురాణకవియో అంతటి నవీన భావకవి. ఆత్మాశ్రయత భావకవి లక్షణము. వాల్మీకి ఆత్మాశ్రయత ఆయాపాత్రలలో ఏర్పరచుకొన్న తాదాత్మ్యమువలన ప్రచ్ఛాదితమై పోయినది. వసంత వర్ష శరద్వర్ణనలను పల్కుచున్నది శ్రీరాముడే అయినను అతనిలో అంతర్గర్భితుడై యున్నాడు. రసస్రష్టయైన కవి; రసజ్ఞుడైన పాఠకుడు. ఋతువు యొక్క అనుభూతి. అందువలన అందరి అంతస్సును హత్తుకొనుచున్నది."

---

1. 'ఋతు మంగళము' పీఠిక.

ప్రతి ఋతువునందుగల సహజప్రకృతి కళాత్మకముగ వర్ణింపబడినది. ఏ ఏ ఋతువులందే యే పుష్పములకు, ఏయే లతాలకు, ఏయే జంతువులకు, ఏయే క్రిమికీటకాదులకు వృద్ధి క్షీణాదులుండునో అవన్నియు పూర్ణముగ వర్ణింపబడినవి. ఆ సహజ ప్రకృతి ఆలంబనముగ, ఉద్దీపన విభావములు అతిపేలవములుగ వర్ణింపబడినవి".[1]

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు "ఆదికవి భావనా ప్రకృతి పరిశీలనముల వలెనే, తమ అనువాద కౌశలమును నాకానంద, ఆశ్చర్యములు కలిగించినవి. ఇప్పటి వీరి అనువాదముద్వారా ఆ మహాకవి భావములను, పదప్రయోగమును, అలంకార సౌందర్యమును, పరిశీలించినప్పుడాయన యెంత ప్రాచీన కవియో! అంత ఆధునికుడను భావము కలిగినది" అని కావ్యప్రశంసను గావించినాడు.

1. ప్రబంధాలతో ప్రకృతి వర్ణన పేజి 65.

—o—

# ఆంధ్ర ఋతు సంహారము

గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యము.

ఇది కవికుల గురువు కాళిదాసు 'ఋతుసంహారము' నకు అనువాద గ్రంథము. ఇందలి ప్రతి పద్యమున కాళిదాసభావనా వైచిత్రి కవిగారి కలమున కనుపట్టును. ఈ కావ్యమునందు 'ఆరు సర్గలు' కలవు. గ్రీష్మ. వర్ష. శరత్. హేమంత. శిశిర. వసంత ఋతుక్రమముతో వర్ణితములు. కాళిదాస 'ఋతు సంహారము' మనోహర భావకావ్యము. కావ్యమంతయు భావదృశ్యములతోను. సహజ సుందర ప్రకృతి దృశ్యముల వర్ణనలు నిండి ఆనందమును కలిగించును.

వాల్మీకి రామాయణమున ఋతువర్ణనలు కేవలము కథానుగతముగా వర్ణింపబడినవి. కాని ఋతువులకు ప్రత్యేక గౌరవమునిచ్చి కావ్యరూపమున వెలయింపజేసిన ప్రథమ కవి కాళిదాసు. వాల్మీకి కాళిదాసు గురువు. వాల్మీకి భావసంపత్తి రచనా సౌందర్యము. ప్రకృతిరామణీయకము. కాళిదాస దృష్టిని ఆకర్షించినవి. వాల్మీకి రచనములో హేమంతము సామంతము చేయగా, కాళిదాస కావ్యములో గ్రీష్మము కిరీటము ధరించినది. ఛాయా మాత్రముగా స్ఫురించు వాల్మీకి భావమునకు ఈతడు క్రొత్తరూపమిచ్చి ఆత్మీయము నొనర్చుకొనెను.

ఈ 'ఋతుసంహార' అనువాదకులు శ్రీ సుబ్రహ్మణ్యముగారు ఆంగ్ల విద్యావంతులైనను. ప్రాచ్య సంస్కారాభిప్రియులు మాతృభాషాభిమానులు. వారి సంస్కారభాషాభిమానములును సుప్రసిద్ధ. కావ్యాంధ్రానువాదములందు సార్థకములు. స్వతంత్ర రచనలయందు భావార్థానుసంధానము రచయితకు సులభము. అనువాదములందు దేశ, కాల, భావ, భాష పరివర్తనములందు కావ్యహృదయ పరిజ్ఞానము. పూర్వాపర సందర్భముల యోచనలు దుస్తరములు. అయినను. సుబ్రహ్మణ్యముగారు వాల్మీకి రామాయణము నందుగల ఋతువర్ణనలను 'ఋతు మంగళము' నందును. కాళిదాస 'ఋతు సంహారము' న గల ఋతువర్ణన "ఆంధ్ర ఋతు సంహారము" నందు వర్ణించిన మేటికవి. 'ఋతు సంహార' కావ్యమున ఆనాటి సంపన్నుల భోగములు. జీవన రుచులు, రసజ్ఞతలు, శైలములు, పొలిమేరలు, పాంథులు, ప్రవాసినులు. మొదలగు వర్ణనలు అత్యంత సహజ సుందరములు.

"ప్రస్తావన" యందు కవి.

"కాళిదాసుని కవనము బాలిఁ గొలిచి
ప్రకృతి సిద్ధ చాపల్యము పలుక గణప
నాంధ్రమునఁ దీప్తి ఋతు సంహారకృతిని
ప్రాజ్ఞుల కృపావలోకనఁ బడయుగాత"

అనియు కోరుట కావ్య సిద్ధి సాఫల్యము.

'గురుస్మృతి' లో గురుభక్తి ప్రకటితము.

పారమెఱుగని పాండితిఁ బ్రథిత బుధుని
సాటి గల్గని సరసోక్తి మేటి కవిని
మద్గురుని సంస్మరించెద మహిత భక్తి
రాజ దురు కీర్తి వెంకటరాయశాస్త్రి"

ఈ కావ్యమును

"కనుఱెప్పలు బలె నన్నుఁ గాచుచుండు
భ్రాతృ శేఖరుడు, సత్సర్త్మవర్తనుండు
సంస్కృతాంధ్రాంగ్ల వాణీ ప్రసాదజుష్టుడు
సుబ్బరాయాఖ్యుడలర నొసగ్గబమిత్రు"

నని చెప్పి భాతృప్రేమకు పాత్రుడైనాడు.

ఋతువులు వసంతముతో ఆరంభమగుట పరిపాటి. కాని కాళిదాసు గ్రీష్మముతో నారంభించినాడు. ఒకానొక ప్రియుడు తన ప్రేయసికి ఋతు వర్ణనముతో ప్రకృతి సౌందర్యమును తిలకింపజేయుచు ఒక కథానాటిక ఫక్కిలో సాగినది. సుఖాంతముతో కావ్యము పరిసమాప్తము కావలయునని కాబోలు కాళిదాసు గ్రీష్మముతో ప్రారంభించి, వసంతముతో ముగించినాడు. గ్రీష్మము కామినీ కాముకులకు, ఋతు విజయమునకును, మన్మథ పరాజయమునకును,

వసంతము ఋతుసంహారమునకు, మన్మథ విజయమునకు సాధనములు, కావున గ్రీష్మ ఋతు వర్ణనమును ఆద్యముగను, వసంతమును కావ్యాంతమునందు వర్ణించుట "ఋతు సంహార" నామౌచిత్యముతో కవి ప్రతిభ సుప్రసిద్ధము.

గ్రీష్మమున కవి శృంగార జీవితమునకు అగ్ర పీఠమువేసి, ప్రేయసీ ప్రియులు విహరించే అంతఃపురములు, హర్మ్యాగ్రతలములను కనువిందొనరించినాడు.

గ్రీష్మమునతరించుటకు బాహ్య అంతశ్చిత్రణము లందు వర్ణితములు. ప్రచండమైన సూర్యుడు స్పృహణీయమైన చంద్రుడు. స్నానయోగ్యములైన నీటి కొలనులు, రమ్య సాయంతనములు, మన్మథోపశాంతియు, బాహ్య దర్శనములు కాగా, వెన్నెల విహారవేడుకలు, వింత జలయంత్ర మందిరముల చల్ల వనముల ఆప్యాయత చంద్ర కాలంతాది మణులు, కర్పూరాది మిశ్రితచందనము" పగటి తాపోపశమన ఆనందము కలిగించును.

కామినుల వేషభాషణాదులు కాముకుల నుడికించి, సర్వజనుల కింపుగూర్చు వర్ణన శృంగార రస భరితము ప్రకృతి పరిశీలనా నైపుణ్యమును ప్రదర్శించి కవి గ్రీష్మ ప్రతాపమును వర్ణించినాడు. ఇందు అరణ్యక ప్రకృతి సుదర్శనము. ఒక వైపు జంతుకోటి పడు దురంత గీష్మ తాపము, వేరొక వైపు చెలరేగు కార్చిచ్చులు, నడుమ శుష్కవన వీథుల గ్రీష్మ రూపమున వర్ణనలు కవి భావి కీర్తికి పునాదులు వేసినవి.

ప్రవాసుల విరహాగ్ని అంతర్ముఖముగను, దుస్సహములగు వడగాడ్పులచే చెలరేగే దుమ్ము వేడెక్కిన భూమి బహిర్ముఖముగను, భరింపరానివిగ నుండుటను వర్ణన అద్భుతము. నిదాఘ తాపమునకు తాళలేని విరోధి జంతువులు నిస్పృహతో సహజవైరముడిగి తమ వైరుల చెంతకే చేరు దయనీయ స్థితి వర్ణనలో కవి భావనా కల్పన వ్యక్తము. పాము నెమలిపురి నీడనుచేరి రోజుచు పడియుండుట, సింహముల చేరువలో ఏనుగులు, పాము పడగనీడనే కప్పలు, నిలుచుట వర్ణితములు.

ఘర్మజల తప్తమైయుండు మేనులు వర్షపు జల్లులచే చల్లబడును. వర్షఋతువాగమనమును మహారాజు లక్షణములతో వచ్చినట్లు పోల్చుట కడు హృద్యము. గగన సీమ యంతట పరచబడిన మేఘములు నీలిమకాంతిని అందగించుచున్నవట.

మేఘములు పరోపకారులు. అభిసారికల ప్రియా సమాగమము కోరి మెరపుల వెలుగులు దారిచూపుచున్నవట. శఠనాయకులు చేసిన అపరాధములకు కుపితులయిన నాయికల భయంకర మేఘ గర్జనలకు భయపడి ఉత్కంఠ మతిశయింపగా మరలి ఆలింగనముల చేసికొనినారట.

మేఘములు కృతజ్ఞతాభావము ప్రకటింపనెంచి జలభారముచే నమ్రములై వచ్చి, వర్షించి, వింధ్యకు గ్రీష్మతాపోపశమనమును గావించి, సంతోషపెట్టుట ఉపకారికి ప్రత్యుపకారముచేయు వర్ణన కడు సమంజసము. కాముకదాంపత్య కోర్కెలుతీర్చుట, తరులతాదులకు బంధువులగుట, సర్వప్రాణులకు ప్రాణ పోషకమగుట వర్షఋతు లక్షణముల వర్ణన మనోహరము.

శరత్తు సర్వాలంకార భూషితురాలగు క్రొత్తకోడలు అత్తవారింటికి వచ్చునప్పటి రాకవలె నున్నదని పోల్చుట రమ్యము. తెల్లపూలచే భూమి, చంద్రునిచే రాత్రి, హంసలచే నదులు, కలువలచే సరస్సులు, అరటులచే అడవి చోట్లు, జాజులచే శృంగారవనములు, తెల్లవియై ప్రకాశించుట శరల్లక్షణములుగా వర్ణింపబడినవి. నదులగమనములు మదవతుల ప్రమదల విలాసగమనములను పోలియున్నదనుట చక్కని వర్ణన.

శరద్రాత్రుల చంద్రికలు అతిమనోహరములు, సంతోషదాయకములు, శరద్వాయువులు తరుణవయస్కుల మానసోల్లాసితములు. కాని ప్రియా వియోగులకు పరితప్తములు.

వికసించిన కలువలు, రాజహంసలు, స్వచ్ఛజల తటాకములు భూమి పైనను, నక్షత్రములు పక్షులు ఆకసముపైనను, ఋతుశోభను ఇనుమడింప జేయుచున్నవి.

'ఋతు సంహారము' న హేమంతము ప్రకృతిదృశ్య పరిశీలనమునకు బదులు శయ్యాగృహములందును, శృంగారివతులయందును, కేంద్రీకృతమై పరిమిత పరిధిలో సాగినది.

శిశిర ఋతువున బక్కావ పషాల అందమైన రాత్రులును, మరుదు దిగు రొత్తదేయు చలిమంటల ఖాగులు, స్త్రీ జనమునకు ఇష్టపడుచుండును. ఈ ఋతువు నందు గుడవికారములగు పెల్లము, కలకండచెక్కెర, పర్ది, చెఱకు చేతిక అందును. కామోద్రేకమును కలిగించి సురతకేళికి అనుకూలపరచును.

వసంతకాలము 'ఋతుసంహారము' లో సహజ వర్ణితమై ఒప్పినది. పుష్పములతో నిండిన వృక్షములు, పద్మములతో నిండిన జలములు, కామముతో నిండిన స్త్రీలు, పరిమళముతో నిండిన వాయువు, సుఖకరములయిన సాయంకాలములు, రమ్యములయిన పగళ్ళు, అన్నియును వసంతమున మనోహరములై అలరారుచుండును. వసంతము కామోద్దీపకము, విరహోత్కంఠము. సుందరీమణుల అలంకారములు శృంగారభరితములు. ప్రవాసులపట్ల ప్రేయసుల విరహమిత్యంతము.

పై ఋతువర్ణనములన్నియు మూల ఋతు పరిహార శ్లోక భావనలే అయినను క్లుప్తముగా వానినిచ్చుట పేర్కొనుట అవసరమని ఎంచి ఎత్తిచూపినాను.

కాళిదాస ఋతు సంహారమున కనువాదములగు ఋతువర్ణనలన్నియు పద జాలములు వేరైనను ఒకే భావార్థమును కలిగియున్నవి. ఇందు వర్ణింపబడు అర్థాలంకార, రస, ధ్వనులు కేవలము అనువాదగ్రథితములే. కావున అనువాద కావ్యము లన్నింటియందు ఈ వర్ణన సమానములే.

ఈ కావ్యమునందు అలంకారముల నెత్తిచూపుట, ఏటికి ఏతము వేసినట్లే యగును. ఇందు ఉపమ, ఉత్ప్రేక్ష స్వభావోక్తులు కావ్యము సందంతటను, నిండి కావ్యశోభ నినుమడింపజేసినవి. అయినను కొన్నింటిని ఎత్తిచూప యత్నించెదను.

వర్షఋతువాగమనము

"సకల జలధర మత్త కుంజరము తోడ
దశదిశల పతాక యుగము మర్దలముతోడఁ
గామి జనహారి, యుద్ధలికాంతి, వచ్చె
రాజువలె" నను ఉపమానము నవ్యభావగర్భితము

వర్ష ఋతువులో భూమి సౌందర్యవతిని పోలియున్నదట.

"భిన్న వైడూర్య నిభతృణోద్భిజ్జములును
ప్రోత్థిత శిలీంధ్రదళము లారుద్ర పుర్వె
లెల్లెడలఁ గప్ప భూమి, సితేతరముల
మణులఁ ధరియించిన శుభాంగి మాడ్కి వెలయు"

దరుల తరువుల నన్నింటిని కూల్చుటచే, నదులు చెడిన స్త్రీ జనముల
వలె పోల్చబడినవి.

శరదృతువు అగమనమును

"కాశవస్త్ర ఫుల్ల మనోజ్ఞ కంజ వక్త్రి
ప్రోన్మదన హంసనాద నూపురనినాద
పక్వ సస్య వనిత గాత్రఁ భవ్యరూప
క్రొత్త కోడలు వోలె శరత్తు వచ్చె"

నని ఉపమించుట కడు హృద్యము.

శరత్తున నదులను విలాసవతులుగ పోల్చబడినవి.

"చంచదుత్పుల్ల శఫరీ రశనలు నదులు,
నికట సంస్థిత ఖగ నికరవళులు,

వ్యాప్త పులిన నితంబ బింబములు వోవ
మెల్ల మెల్లన సమదలు మెలతలట్లు"

వర్షించిన మేఘములు పలువర్ణములలో ఉపమింపబడినవి. వెండిపలెను, శంఖమువలెన, తామర తూడులవలెను, ఛేదించియుండు తెల్లనికాంతిని కలిగి కదలుచున్నవట.

"ఉపమా కాళిదాసస్య" (కాళిదాస) లోకోక్తిని సార్థకపఱచు సాదృశము లెన్నియో ఈ కావ్యములో కలవు

"సువాగమమును దిగ్విజయ సన్నిద్ధుండగు రాజుతోడు,
కారుమబ్బులు నూరిన కాటుక ప్రోవులతోను,
తృణాంకురములు భిన్నవైడూర్యముల తోను,
పూర్ణవాహినులను దుష్టాంగనలతోను,
మల్లెలను నవ వధూ హాసితములతోను,
శారదరాత్రిని విసడిన ప్రవర్ధమాన బాలతోను పోల్చబడును.

గ్రీష్మమున రాత్రులందు చంద్రుడు సుందరాంగన ముఖముల అంద మును చూచి సిగ్గుచెందెనా! యనునట్లు. ఉదయమున తెల్లబోయినాడట.

వర్షఋతువు నందు మేఘములు పలుచోట్ల నల్లకలువలను, నూరిన కాటుక పోవులను, గర్భిణీస్తనకాంతిని కలిగియున్నవని ఉత్ప్రేక్షించినాడు.

ప్రేంకణము గాలికి కదలుచు

"విప్రయుక్త విలాసిని విధము దోప
నధిక పాండిమఁ బెందుఁ బ్రియంగులతిక"

యట్లు ఊహింపబడినది.

గ్రీష్మమున దప్పిగొనిన హరిణములు

"భిన్నాంజన నాభ పరుషవులై తేడు జలమని" మనములందు భ్రాంతిని గొనినవి. బాటసారులు శరత్తున తాము ప్రయాణ మరిగిన చోటులందు "కలువలను చూచి ప్రియురాండ్ర కాటుక కన్నులని, హంసలధ్వని అందెల చప్పుడులని, మంకెనలు అధరోష్ఠములని తలపునకు వచ్చి భ్రమచెంది కామో ద్రేకమును సైరింపజాలకున్నారట"

సుందరాంగనల గమనసౌందర్యము హంసలను, ముఖములు వికసిత పద్మములను, చూపులు నల్లకలువలను, కనుబొమల విలాసము, సూక్ష్మ నదులను మించుచున్నవట.

'ఆంధ్ర ఋతుసంహారము' తేటగీతులతో నిండి భావగర్భితములై, చక్కని పదబంధురమైన అర్థోక్తులతో సులభశైలిలో సాగినది.

శృంగార రసభరితమై కాముకుల పట్ల కవి హృదయభావము కలిగి, ప్రకృతిని సహజ సుందరముగ వర్ణించినాడు. గ్రీష్మమున వెన్నెల విహారము, శీతలద్రవ్య సేవనము, గీత నృత్యాది వివిధ భోగముల ననుభవింతురు తాపము దీర్చు చందనపంకము, శ్రోత్ర సుఖము, విలాసినుల అలంకారములు సుఖ ప్రదములు; గ్రీష్మ తాపమునకు ఓర్వజాలని ప్రాణులు తమ విరోధుల పంచ జేరుచున్నవను సమయమునందు 'ఎంతవాడైనను రాగల కష్టము వచ్చినప్పుడు లోబడి పోవుచున్నాడు' ఏనుగులు సరోవరమునచేయు దుష్టక్రియలు "మూఢ జనులు అన్యోన్యము విహారము సేయుటయు మనస్విజనులకు అపత్కారములు"

"అనేక సంకటములు పడువారికి స్వాభావిక కార్యములు సయితము తోచకుండును."

వర్షఋతువునందు కామజనితములైన స్త్రీలు మొదటి యామమున చేయు ఆచారము "అత్తమామల, గురుజనుల, సేవ" ను పేర్కొనబడినది.

"సంతోషము కలవానికి వికాసము లక్షణము కదా!" వనము తెల్లని మొగిలి రేకులచే వికసించినది" వంటి స్వభావోక్తులనేకములు.

## కాశీనాథుని నాగేశ్వరరావుగారు

"పద్యములు భావభాషా యోగమును గలిగి హృద్యములు. కొన్ని పద్యములు తేటతెనుగునను, కొన్ని సంస్కృతప్రాయములును, కొన్ని సంస్కృతాంధ్ర సమ్మిశ్రితములునయి, ఆంధ్రసాహిత్య హృదయమును, పరిస్ఫుటము చేయుచున్న విధమునకు ఉదాహృత పద్యములు నిదర్శనములు" అని కావ్య ప్రశస్తిగావించినారు.

కాళిదాసు శృంగారికవి. ప్రేమోపాసకుడు. శృంగార ప్రేమమయమైన ప్రవృత్తియందు శృంగార పిపాసకవి ప్రకృతి సౌందర్యప్రేమ దృశ్యములను సంభావించి, సందర్శించి, సంకీర్తించిన విధమును ఋతుసంహారము హృద్యముగ సువ్యక్తము చేయుచున్నది. ప్రకృతి సౌందర్య విలాసములు పురుషాధీనములయి, శృంగార రసాన దానుభవముగా గల విధమును ఋతు సంహారము నందలి భావ దృశ్యముల పరమార్థము బోధించుచున్నది. సౌందర్య విలాసములు ప్రకృతి పురుషయోగమునందు సార్థకములై ఋతు సంహారమును రసానందకముగా చేయుచున్నవి.

ఋతు సంహారమునకు విషయము మన్మథపరమైన శృంగార భావ లీలా విలాసములు ప్రకృతియందు కామ శృంగార భావ విలాసములు అన్యోన్యాశ్రయములు. శృంగార విలాసములు కామారాధన సాధనములు. కామ విలాసములు శృంగార రసానంద సాధనములు. కామ శృంగార విలాసములు కాల ప్రభావ సంభవములై కామోపశమన ప్రకోపనములకు వినియోగపడుచున్నవి.

భావ దృశ్యములందు కాళిదాస కల్పన సుప్రసిద్ధము. ఋతు ధర్మములకు అనురూపముగను. ప్రకృతి శక్తి స్వరూపములకు విచిత్ర రూప పరిణామముగను, స్త్రీల వస్త్రాలంకారములును. కేశకలాపములును. పుష్పాలంకారములును, శృంగారచేష్టలును, కామకేళి విలాసములును కాళిదాస కల్పనలందు చిత్ర సౌందర్య విలాసములను పొందుచు పరిణామసంపదను కలుగజేయును.

# శుద్ధాంధ్ర ఋతుసంహారము

## ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రి

ఇది కాళిదాస 'ఋతుసంహారము' నకు అనువాద కావ్యము. ఇందు గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర, వసంత షడృతువులు క్రమముగా ఆరాశ్వాసములలో వర్ణింపబడినవి. ఈ కావ్యమంతయు అచ్చ తెనుగు పద్యములను, కలిగియుండుటచే 'శుద్ధాంధ్ర ఋతు సంహార' మను పేరు సార్థకము.

ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రి రాజమండ్రి శిక్షణాలయమునందు సంస్కృత పండిత వరేణ్యులుగా పేరొందినారు.

ఈ కావ్యములో మొదటి గద్యమునందు "శ్రీ మహాకవి కాళిదాస ఋతు సంహారము, తత్సంఖ్యాశ్వాసోదారము" అని పేర్కొనబడుటచేత కాళిదాస ఋతు సంహారమునందున్న ప్రతి శ్లోకమునకు అచ్చ తెనుగులో పద్యములు రచింపబడినవి. మచ్చునకు కొన్ని ప్రస్తుతింప ప్రయత్నించెదను.

వసంత ఋతువాగమున వర్ణనమునందు

"తుమ్మెదం బారు విలుగొన యమ్ముఁజేసి
నెఱ విరియ మాని యలరు లన్నిత కుటమ్ము
లందిన నకారు దోడు పొందాస పఱెడి
వారి యెడఁ దల వృచ్చగ వచ్చె చెలువ" 6-1

వసంత ఋతు లక్షణములు

"పూచుఁజెట్టుల తమ్ములఁ బొలుచు నీరు
వలపుఁ జెందుదురతివలు వలచు గాలి
యించు మునిరేలు సదశులు నెలవియొసగు
నన్ని గడుసొంపె చిత్తరి యలరు తరిని. (6-2)

శిశిర ఋతువులో తరుణులు రాత్రులు రతి సమయములయందు ప్రియులు చేసిన పనులు తెల్లవార్లు చూచుకొనుచు. ఆనందించెదరట.

"గోటి గుజ్జెగ్రమ్ముల్ పాలింప్లికొనలు గనుచు
బుడుకుచును బలుగంటుల మోవి చిగురు
లించు కలయిక వేసము లెన్నుచు పిద
లంద మొనరించెదరు మోములందు వేగ" (5-15)

ఇట్టి అచ్చతెనుగు ఋతుకావ్యము సులభశైలిని గలిగి పండిత పామరుల నాకర్షించుకొనుచున్నది. ఈ కావ్యము తేటతెనుగు తేటగీతులందు వర్ణింపబడి, భావ రమ్యతనుగూడి ప్రశస్తినొందినది. కవి

నీవె నేనని పలుకుల నెలత పలుకు
కబ్బముల కూర్చు పంతల కట్టు తలపు
లచ్చ తెనుగున గూర్చితి నరసి తప్పు
సైచి దిద్దగ వేడెద జదువరులను"

అని కోరినాడు.

—0—

# అచ్చతెలుగు ఋతుసంహారము

## చింతపల్లి రామకృష్ణశాస్త్రి

ఈ కావ్యము కాళిదాస 'ఋతుసంహారము' ను మూలానుసారముగా అను వదింపబడినది. ఇందు ఒకే ఒక ఆశ్వాసమునందు 144 పద్యములతో షడృతు వర్ణనల గావింపబడినది.

"నా కెనయగు నూటనలుబది నాల్గు పద్దె
ములను సంపెగ కల్వ దండలను గూర్చి
ఒత్తి నప్పన జేసితి నత్తికొలది
వెన్నునకుఁ బెద్దలిదిచూచి వేడ్కఁగనుడి"

కవి 'విజ్ఞాపనము' న సంస్కృతమునకు భాషాంతరీకరణములో సరియగు భావములు గల తెలుగు పదములు లభించుట కష్టము. అయినను, మూలానుసారముగ సాధ్యమైనంతవరకు సాధించుకొని వచ్చితిననియె నాయూహ అని పేర్కొనినాడు.

ఈ కావ్యమును శ్రీ కృష్ణ పరమాత్మునకు సమర్పించుకొని కవి తన దైవ భక్తిని చాటుకొనినాడు.

అనువాద విధానము కొన్నిచోట్ల పరిశీలించుట అవసరము. గ్రీష్మ ఋతు వేతెంచిన విధము నవ్యము.

చెలినెటి వేడిమిన్ జెలగు చీకటి గొంగయుఁ గూర్చిఁ గోరని
మ్మలఁదగు చందురుడు సతమున్ గడు తానమొనర్పఁ జల్లనై
వెలపెడి నీరు నేపడగు వెన్నుని పాపడునున్ బగల్లు చా
ల్పల సుదహాయున్ గలిగి పొందుగ వేసవి వచ్చెఁ జూచితే !

# ఋతు సంహారము

ఐ. కిషన్‌రావు

కాళిదాస 'ఋతు సంహారము'ను తెలుగులో అనువదింపబడిన ఋతు కావ్యములలో ఐ. కిషన్‌రావు "ఋతుసంహారి" యొకటి. ఇందు కవి కాళిదాస ఋతు కృతి యందున్న క్రమమును మార్చి, వసంత ఋతువారంభమును చేసినాడు. వసంతము కళ్యాణ ప్రదమనియు, ఋతురాజు వసంతుడే అనియు, వత్సర ప్రథమములగు చైత్ర వైశాఖ మాసములు గలవి వసంతఋతువేనను భావన కవి హృదయము. కాళిదాస వర్ణనలకు యథాతదమువాదమే అయినను, ఉన్నదున్నట్లు అనువదింప లేకుండుటచే మూల విరోధములుగాని, మూలాతిక్రమములుగాని, అక్కడక్కడ కనిపించును. కావున నీతడు అనువాదమున కొంత స్వతంత్రించినాడనవచ్చును

పోతనగారి శబ్దలాలిత్యము, రామరాజభూషణుని వసుచరిత్రము, పాల్కురికి జానుతెనుగు డా॥ సి. నారాయణరెడ్డి పదప్రయోగ కుశలత, కవిని మిక్కిలి ప్రభావితుని చేసినవి. వానితో కవి భావప్రాధాన్య శ్లోక యుక్తమగు కాళిదాస ఋతు సంహారమును అనువదించుటకు ప్రేరేపింపబడినాడు.

కావ్యారంభ, అంతములందు "శ్రీమతి" యను పదము చోటుచేసికొని వర్ణింపబడు ఉద్దిష్ట శిల్పము కవి ప్రత్యేకత. కావ్య 'అవతారిక' యందు సంస్కృతాంధ్ర సుకవులకు అన్య కవులకు ప్రణమిల్లి గురుభావమొప్ప ప్రకటించుకొనినాడు"

వ్యాస వాల్మీకి కాళిదాసాద్యనేక
సంస్కృత కవుల, నాంధ్ర భాషాధికాస
కారకుల నన్నయాది సుకవుల కాది
భక్తి ప్రణమిల్లెదను గురుభావ మొప్ప"

పాల్కురికి సోమనాథుని ప్రభావముచే సంస్కృత శ్లోకములను కొన్నింటిని అచ్చతెనుగు పద్యరూపముల వెలయింప చేసినాడు.
వసంత ఋతువునందు'

"బెడిదపు టెండ వేడిమికి బిత్తరవోవుచుఁ గ్రొంజెమర్పుచే
వెడవెడ నూరుపుల్ నిగుడవేమరు విప్పుచుఁ దోకముళ్ళు, చె
న్నొడలు బయల్పడన్ వలువలూడ్చు వయారపు గుబ్బెతల్ కడుం
గడుఁ దమకంబెసంగఁ జెలికాండ్రను డగ్గరు వారు సిగ్గునన్" (1-8)

"చెందలిరాకు మొత్తములచే ........ ........ వేడ్కమై (1-15 వ)
"పగడపు 'గెంపువోలె ........ ........ సఖీ" (16వ)
"చిలుకల మోవివంటి ........ ........ తీయగా" (20 వ)
చెలి యెడబాటు మై వగపు చెందు ........ ........ పల్మెఱుల్ (26 వ)

గ్రీష్మ ఋతు వర్ణమునందు

"తమము నడంచు ........ ........ నిదాఘ శాంతికిన్" (2-2)
"చెలువగు లక్కపూత ........ ........ మరుదెవ్వ దేవియన్" (2-6)
దలమగు ముక్క చెన్నొడల ........ ........ నెఱ్ఱనన్" (2-7 వ)
వర్ష ఋతు వర్ణము నందు
'ఒక్కెడ నీలివన్నె పొలుపొందు కల్వల దాలుపోలె" (3-2 వ)
"విరిసిన మద్దులన్ ........ ........ (3-17 వ)
పొగడలఁ బొన్ననన్ గడిమిపూల మొగిళ్ళ ........ ........ (3-20 వ)

హేమంత ఋతువర్ణము నందు;

పసిడి హొరంగు నద్దెసలఁ బర్విద పంటచేలు" (4-8) వంటి అచ్చ తెనుగు పద్యములు కలవు.

పోతనగారి ఎత్తుగడల నుపయోగించి నామవాచకములతో కవిగారి పద్య రచనము సాగినది.

భ్రమరంబుల్ గుణమై, విధుండమల

శుభ్రచ్ఛత్రమై వాయుఫ్రన్

సమ ధేభంబయి, కింశుకంబు ధనువై

చంచన్మనో జ్ఞాగ్రగు

చ్ఛములన్ బాణములై పికాళినుతి కృ

త్సంఘంబునై రొప్ప, లో

కములన్ గెల్చి వసంతు మిత్రు డొసగున్

కళ్యాణ మశ్రాంతమున్" (వసంత. 28 ప)

శరదృతు వర్ణనము కడు రమ్యము

"శర పుష్పముంబులచే నిశాధి పతిచే జాతీలతా రాజిచే

వర హంసంబులచేఁ బ్రఫుల్ల కుముద వ్రాతంబుచేఁ గొంకొ

ల్కురు ధారానత సత్వ వర్ణ తతిచే ధావళ్యమే పారగా

శరదబ్జాక్షి యొసంగె సర్వ జగతీ చక్షుః ప్రమోదంబుగన్"

చక్కని పదబంధము నందు నన్నయ ప్రభావము ఈ కవిపై పడినది.

"లాలిత విభ్రమోజ్జ్వల విలాస వసంత హసనాభ మల్లికా

జాల సిత ప్రసూన విల సద్రుచిరోప వనంబు లంగనో

లాలస కామి మానసములన్ హరియించుచునె కాక రసులై

మూలములన్ భుజించు ముని ముఖ్యులు చిత్తములైన దోచెడిన్"

శబ్ద గుంఫనమున శ్రీనాథుని తలపింప జేయును

"ఘనతర శాల్మలీ విటపి షణ్ణ జాత కనత్సువ లింగమై

వనతరు కోటరుద్ధహన వర్ధిత పీత సువర్ణ వర్ణమై

యనత మహోచ్ఛ శాధి శిఖరాగ్ర లతా దహనోన్నతార్చియై

యనిల సమృద్ధమై యిదె దవాగ్ని వనమ్మున గ్రమ్మి నిమ్మగన్"

శబ్ద ప్రాముఖ్యమును సూచించు పద్యము మూలము నందలి శబ్ద చమ

త్కృతిని గమనింప జేయును.

తోటలు-బాటలు, ప్రేటులు, యాటలు, తేటలు, పాటులు, సలసలకాగు, జలజల పారు, భగభగమండు, మలమల మాడ్చు 'చురచుర మండు', కడువడి వీచు, గలగల మంచు సవ్వడుల, చూడు చూడుమిదె, శ్రీమఘమోఘుడు, అల్లనల్లనన్, నడయాడుచు, మిలమిలలాడు, కలకలకూయు. వంటి పదజాలము ఈ కావ్యమున కలదు.

ఐ. కిషన్‌రావు 'ఋతు సంహారము' నందు అర్థాలంకారములు మూలమున కాళిదాస భావనలే అనుసరించినను, శబ్దాలంకారములు ఈతని కావ్య రమ్యతను చాటు చున్నవి.

వర్ష ఋతువు నందు ఛేకానుప్రాసము కలవు. (24 ప.)

"ప్రకృతి మనోహరాకృతి విరాజిలె వర్షవయస్సు పూర్ణగా"

వసంతమున జవ్వనులైన వారికి,

"అశోకము శోకము గూర్చు చూడవే" (వ. 16 ప.)

వంటి యమకానుప్రాసమును,

"ప్రాయపుం కాంతలు తోరమైన తమకంబున కాంతులతో

యథేచ్ఛగాగంతుని క్రీడలన్ దనివి గాంచి"

"శ్రుతి పర్వ నదంబుల నీనదంబులన్"

అనుప్రాసాలంకారము కలదు.

శరల్లక్షణములను గూర్చిన వర్ణనము నందు,

"వికచ సరోజ వక్త్రి, నవ

విస్ఫుట నీల సరోజ నేత్ర స

ద్వికసిత కాశవస్త్రి శశి

దీప్త సితోత్పల భావి చిత్రయీ

సకల గణోల్ల సత్ప్రకృతి

సార పవిత్ర శరల్లతాంగి కా

ముక జన సౌఖ్య పాత్రి యయి

మోద మొసంగుత నో తలోదరీ !" అంత్యప్రాసగలదు.

తెలుగు నుడికారమునకు, భావానువాదమును చేర్చి అర్థాంతరన్యాసాలంకారమున వర్ణించుట కవి ప్రత్యేకత.

గ్రీష్మమున :—

"మసువుస జొచ్చి యేనుగులు
మంపున దాకి పెనంగుచున్న క్రొ
కుక్కను వడి చచ్చె మచ్చెములు
గొందల మందుచుఁ బాజె బెగ్గులుల్
గసుసెదరన్ గొలంకి కును
గ్రమ్మియడంగెను దమ్మి తెంపరల్
వెడగుతు వోరి యెండొరులు
వేసట తెత్తురు లాతివారికిన్"

'వినరావు', 'కనరావు' వంటి తెలుగు నుడికారములు హేమంత ఋతు వర్ణనమున గలవు.

'ఋతు సంహార' మంగళ వాక్యమునందు—

"ఋతు సంహారము కాళిదాస కృతి
మే నీ రేతి నాంధ్రీకరిం
చితి నా యోపిన కొద్ది వాణి
పదముల్ సేవింపఁ బ్రత్యూషవా
క్సతియై యొప్పిన కాళిదాస కవి
లోక గ్రామణుం డేడదు
ర్మతి నేనెడ ! మహీ ధరాణు యుగ
సామ్య మ్మెంచ మాయిర్వురన్"

కాళిదాస 'ఋతు సంహారము'నకు సాటిరాని విషయమును తెలుపుకొనినాడు.

కావ్య ప్రశస్తమున శ్రీ పాటిబండ మాధవశర్మగారు ఆశీస్సుల సందడేయుచు,

"సర్వాత్మనా యథా మూలానువాదమైన పద్యమిందు మృగ్యము. అందుకే ప్రతి పద్యమున మూల విధేయాభిలాషతోఁ బాటు, మూలాతిక్రమణము కూడ కన్పడును. కనుక నిది యనువాదమనుట కంటె స్వతంత్ర రచన మనుటయే సమంజసము, ఇందలి పద్యములన్నియు ధారాశుద్ధి శోభితములై చదువబుద్ధి పుట్టించు చున్నవి.". అని ప్రశంసించినాడు — .

—o—

# "ఋతు సంహారము"

దువ్వూరి రామిరెడ్డి

ఈ కావ్యము గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర వసంత ఋతు క్రమమును కలిగియున్నది. కాని మూలమునందలి అన్ని వర్ణనలను గైకొనక, కేవలము వర్ణనా ప్రాధాన్యముగల వాటినే స్వేచ్ఛానువాదము గావించినారు. ఇది కేవలము ఇరువది పద్యముల లఘు వర్ణనాకావ్యము.

గ్రీష్మ ఋతు వర్ణనమున మొదట వేసవి రాత్రులలో సుఖము ననుభవింప గోరువారికి అనుకూలములైన ఉపాయముల సూచించుట కలదు.

అలివేణుల ఊర్పులవలె వలించిన చిరుగాలులు, కుసుమాస్త్రిక దీపనమగు విపంచి గీతా సదుపాయముల గలిగియుండి హాయిని గూర్చుచుండగా, రమ్య హర్మ్యస్థలములందు కాముకుల సుఖజీవనముల గడుపుదురట.

విలాసవతులు స్తనములను సుగంధ చందనాభరణములతోను, నితంబినులను బంగరు మొలనూలుతోను ధరింపజేసి, అలంకారములందు సర్వజనులకు ఇంపును కల్గించెదరట.

ప్రవాసులు విరహాగ్నితోను, ప్రాణులు ఎండ వేడిమితోను భరింపలేని విషయము వర్ణితము.

జింకలు నీటికై ఎండమావుల వెంబడించుట, సింహము సహజ విరోధులయిన ఏనుగులు పంచన చేరియున్నను, జోలికి పోకయున్నదట. ఋక్షతండములు నోళ్లు తెరచుచు జలముల వెదుకుచును కొండగుహనుండి బారులు కట్టి బయటకు వచ్చుచున్నవట. కార్చిచ్చు పంటలు చెట్టు చేమలను కాల్చివేయుచున్నవట. పక్షులు, కోతులు, గువ్వపోతులు, నీటికై తపించుట గ్రీష్మమునందు వర్ణితములు.

వర్షఋతువు ఆరంభ సమయమున తృణాంకురములు, గౌర వర్ణములై వ్యాపించి వైడూర్యపు రవ్వలవలె అలరారుచుండును. ఆరుద్ర పురుగులు పద్మరాగాదుల వలె ప్రకాశించగా, భూమి సర్వాలంకార శోభితమైన సుందరివలె నొప్పుచున్నది. నృత్యమాడు నెమలి పింఛ చక్రములను భృంగములు, పత్రములులేని తామరలని భ్రమించుట వర్ణితము.

శరదృతువునందు ఆకాశమున జలశూన్యములైన మేఘములు కనిపించు తీరు యును, వాని వర్ణనములను శరద్వాయువులు కలిగించు ఉత్సాహములు, హంసల మధుర గానములు వర్ణితములు.

శిశిర రాత్రులందు విలాసినుల శృంగార చేష్టలు అభివర్ణితములు.

వసంతఋతు వర్ణనమున కామపూరితమైన మన్మథోద్రేక విషయములు కలవు. వనితల తనువులు లావణ్యవంతములయినవట. ప్రేంకణ కస్తూరి కుంకుమల చేర్చి మెదపిన గంధము పూసికొందురట. పుంస్కోకిల మామిడి చిగురులను తిని మంద ముచే ఆడకోకిలను సంతోషపెట్టునట.

దువ్వూరి రామిరెడ్డిగారి పద్యములు శబ్దాలంకార భరితములు.

"కమ్మని తేనెఁ ద్రావి తమకమ్మున జుమ్మని పాటపాడి ప
త్రమ్ములు లేని తమ్మి పరి తండము వీడి సముత్సుకమ్ములై
యిమ్మగు సల్లకల్వలని రెమ్మగ సేమ్ములు నృత్యమాడ భృం
గమ్ములు కించ చక్రములఁ గ్రమ్మెను మూర్ఛలె కామినీ మణుల్"

అందు 'మ్మ' వృత్త్యనుప్రాసాలంకారముగ చేరినది.

పోతనగారి 'బాల రసాల సాల' అను పద్యరీతిలో శబ్దసౌందర్యము చూపినారు.

"నవ రసాల సాల నవసౌరకీసాల రసా నవంబునం
బు భృతరాజ మెంతయును మత్తిల రాగ రసాంత రంగమై".

—o—

# "ఋతు సంహారము"

శ్రీ గీత

కాళిదాస 'ఋతు సంహారము'నకు అనువాద కావ్యమే ఈ శ్రీగీత "ఋతు సంహారము". ఇందు కాళిదాసు గ్రీష్మ ఋతు వర్ణనముతో ఆరంభింపగా కవయిత్రి వసంతాది క్రమమును పాటించి, ఆరు ఋతువు లనువదించినారు.

గండికోట సీతమ్మగారి కలముపేరే యీ శ్రీగీత. కాళిదాస ఋతు సంహారములో వర్ణింపబడిన ప్రకృతి సౌందర్యమునకు ఆనందానుభూతులను పొంది, అనువాదమునకు పూనుకొనినారు. కాళిదాసు మీదనున్న గౌరవము, సాహిత్యము మీదనున్న అభిమానము, ఈ కావ్యరచనమును కొనసాగించినది.

సీతమ్మ తన 'ఋతు సంహార' అనువాద కావ్యమును భగవాన్ శ్రీ సత్య సాయిబాబావారి పాదపద్మములకు అంకితమొసంగినది.

"భగవన్ శ్రీ సత్యసాయిబాబావారి గురుప్రవచన పవిత్ర సన్నిధికే, తనయంత సురుచు కాళిదాసు కవితానుసారము శృంగార రసైక పోషక ప్రకృతముల నాశ్రయ వసుము కానుకముగ గీతంబులం గూర్చి చేర్చుచుంటిని. కొనుమా భగవన్! సదయ కలమున సాగినది. భక్తి నిడితి - ముక్తి నిడుమ"ని ప్రార్థించినారు.

మరియు,

"శ్రీ వచో రచనా ధిషణు, నవ కాళి
దాసు, శృంగార భాసు, సదా సుకవి జ
నార్ద్ర రసభావ చిత్ప్రభాసు - నార్తిగొలుతు
కాల వర్ణన మీభువిన్ వెలుగునట్టుల"

నని కోరినారు.

ఈ కావ్యమునందు అవసరమనిపించిన చోట సంబోధించుట కలదు. ఒక నాయకుడు తన ప్రియురాలికి కాలగతులను వర్ణించి, చూపించి చెప్పుచున్నట్లు ఈ కావ్యము సాగినది. ఈ కావ్యము కేవలము మూలమునకు యథాతథానువాదము మాత్రమే.

ఒక్కొక్క సంస్కృత శ్లోకము ఒక్కొక గీతముగ వెలసినది. ఒక్కొక చోట భావార్థ గాంభీర్యము కొరకు 5, 6, 7 పాదముల వరకు పద్యపంక్తులను పెంచి వ్రాసినారు.

అందు మచ్చునకు ఒకటి రెండు పద్యముల నెత్తి చూపుదును.

"కాంచన రసన నంటుది గంగ జారు
మంచి హారంబు కుచసీమ నుంచి కొనుచు,
రతి పతికి చిక్కి చిక్కిన రమణి భృంగ
కోకిలా నాదముల తోడ కోర్కె గలుగ
జేయు చున్నది మధుమాస చేష్ట యేమొ !" (వసంత 24)

గ్రీష్మ ఋతు ఆగమమును అనువదించుటలో

"చండమార్తాండ దీప్తికి గుండె లదరి
చంద్రమండల స్ఫూర్తికి తొందరాయె,
జలకమాడగ జలరాశి సన్నగిల్లె
శాంత మన్మథ, రమ్య దినాంతమై, ని
దాఘు మవతరించె చెలియా ! సెగలతోడ !"

అని చక్కని పదబంధమును కూర్చినారు.

అనువాద కావ్యమైనను, శబ్దాలంకారములనేకములు కానపచ్చును.

"వరుని రాక కెదిరిచూచు వధువు మెడద
శోక తప్తము గాగ సశోకద్రుమము" (వసంత - 16)

శరదృతు వర్ణనమున,

"ప్రతి దిన ప్రవృద్ధి బాలికా ప్రమదబుద్ధి" (7 వ. గలము)

ఈ కావ్యమున గ్రీష్మకాలము నోర్వజాలని స్త్రీలు వర్ణింపబడుటలో జాతీయము కానవగును.

"మహావనంబు నైదాఘు మోర్వ వశమె"

శ్రీ అమరేశ్వరశర్మగారు కవయిత్రికి అందించిన సహకారము, ఆచార్య కులశేఖర్‌రావుగారి ప్రోత్సాహము, ఆశీస్సులు, ఈ కావ్యమునకు ఒరపడి దిద్దినవి. —

—o—

# ఋతుకావ్య రచనము సామంజస్యము

కాలము అనంతము - పృధివి విపులము కాలమునకు అంగములు ఋతువులు. అట్టి ఋతు ధర్మములకు ప్రభావితములైన ప్రాణికోటి అనుభవములు సుఖదుఃఖాదులు. కాలమునకు అందరూ అధీనులే. కాలప్రవాహమునకు ఎదురేది కష్టపడుటకన్న అను కూలముగ వ్యవహరించి అవసరాలను తీర్చుకొనుట విజ్ఞత యనిపించుకొనును. ప్రకృతి సహజ సౌందర్య విలసితము. కావుననే సృష్టిలోని ప్రతి జీవి వాని అందచందములను అనుభవింపగోరును.

ప్రకృతి సౌందర్యము కవులకారాధ్యమై కావ్య వర్ణనమునందు చోటు చేసికొని నది. కవి కలమునకు కాలమే కట్టుబడి పోయినదేమో !

వాల్మీకి, రామాయణమునందు హేమంత, గ్రీష్మ, వర్ష, శరదృతువులను కథానుగతముగ వర్ణించి ప్రకృతి నారాధించినాడు. కవికుల గురువు కాళిదాసు తన కావ్యముల యందంతట ఋతువర్ణనలు గావించినప్పటికిని తృప్తిని పొందక ప్రత్యేక ఋతువర్ణనాకావ్యమును రచించినాడు. 'ఋతు సంహారము' పలువురు కవులకు మార్గ దర్శకమైనది.

భరతుడు, భామహుడు, విశ్వనాథుడు, కేశవమిశ్రుడు వంటి సంస్కృత లాక్షణి కులు ఋతు ధర్మములను నిర్దేశించినారు. నన్నెచోడుడు, శ్రీకృష్ణదేవరాయలు వంటి కవులు తెలుగు వాఙ్మయములో ఋతు వర్ణనములకు అధిక ప్రాధాన్యము నొసంగినారు. మహాకావ్య లక్షణములలో అష్టాదశ వర్ణనములందు ఋతువులు ప్రముఖ స్థానము నాక్రమించుకొనినవి. ఋతువులు కాలసంబంధములు. కావున వర్ణనా ప్రధానములై కథానుగుణమున వర్ణింపబడినవి. కాని కేవలము పనిగట్టుకొని కవులు వానిని తమ కావ్యములందు చొప్పించలేదు. కొన్ని కావ్యములలో అట్లు చొప్పించిన సందర్భము లున్నవి. కాని అవి ఎబ్బెట్టుగనే యున్నవి.

కవి ప్రకృతిని పరిశీలించినపుడు పొందిన అనుభూతులను, ఆలోచనలను, కవితా బద్ధము చేయును. కవి చెప్పదలచుకొనిన కథ లేనప్పుడు ఋతు వర్ణనములనే కావ్య వస్తువుగా గ్రహించి ఖండకావ్య స్ఫూర్తితో రచనము చేయవలయునను ఉత్సాహము పొంగును. తెలుగులో ఋతు కావ్యములన్నియు ఈ స్ఫూర్తితో వెలువడినవే. కాని

మహాకావ్యములందు ఋతు వర్ణనము ఒన నిర్వహణమునకును, వస్తు నిర్వహణమునకును, పాత్ర పోషణమునకును, ప్రకృతి సౌందర్య వర్ణనమునకు, సముచితమైన అవకాశము కనిపించు చుండును.

ప్రకృతికిని మానవునకును అవినాభావ సంబంధమున్నది. మానవుడు ప్రకృతి కరుణించిన హర్షించును. ఆగ్రహించిన దుఃఖించును. మానవునకు అవసరమైన గాలి, వెలుతురు, వేడిమి మొదలగునవన్నియు ప్రకృతి ప్రసాదితములే కదా ! కావున ప్రకృతి యందున్న ఋతు ప్రభావములకు మానవుడు లోనగుట అనివార్యము. ఋతు వర్ణనా కావ్యములలో నేటికిని సమకాలిక జీవిత వృత్తములోని సామ్య వైషమ్యములను, మంచి చెడ్డలను, స్పృశించు అవకాశము కలుగుచున్నది. కావున ప్రత్యేకముగ వెలసిన ఋతు కావ్యములను పఠించి, వానిని తెలిసికొనుట ఎంతేని అవసరము.

శతకములోని పద్యములు దేనికదే స్వతంత్ర భావములను కలిగి మంచి చెడ్డల నెత్తిచూపును. ఆత్మాశ్రయ రీతికి ఆలంబనముండును. అట్లే ఋతు కావ్యములు కూడ ఈ రీతియే కలిగియున్నవి.

నాటి ప్రకృతి సహజసంపద నేడు తరుగుచున్నదను విషయము నిర్వివాదాంశము. ప్రకృతిలో కలుగు స్వల్పములైన మార్పులవలనను ఋతు ధర్మములు మారుచున్నవి దానిని తట్టుకొనుటకై మానవుని ఆలోచనలు ఆధునిక యాంత్రిక జీవనముపైపు మరలు చున్నవి. కాని అట్టి వాతావరణమువలన వృక్ష జీవనము, పశుపక్ష్యాదులు, వృక్షములు, నశించిపోయి, క్షామ పరిస్థితు లేర్పడుచున్నవి. ఋతు ధర్మముల మార్పు అనర్థములకు దారి తీయుచున్నది. కావున నేడు మేధావిలోకము తమ దృష్టిని మరల మొక్కల పెంపకముపైపు, పక్షులపైపు, వన్యమృగ సంరక్షణముపైపు, మొగ్గలపైపు మరలింప జేయుచున్నారు. ప్రకృతిని తిరిగి ఆరాధింపవలెనని, అది నిజముగాను 'దేవత' యని ఇప్పుడు నమ్మకము కలుగుచున్నది కనుకనే ఋతువర్ణనము ఇతివృత్తముగా సాహిత్య లోకమున ప్రత్యేక కావ్యములే అవతరించుచున్నవి. నిన్న మొన్నటి కవులు తమ కావ్యములలో ఋతువర్ణనములు చొప్పించి, ఆయా ఋతువులను పశు పక్ష్యాదులలో, వాతావరణములో వృక్ష సంపదలో, జంతు సంపదలో కలుగు మార్పులను, వింతలను, సందర్శించి, కావ్యబద్ధముచేసి, సుందరముగా వర్ణించి చెప్పి, ఆనందముతో పాటు జ్ఞానముకూడ కల్గించినారు.

నేటి కాలమునందు ఋతువులగూర్చి తెలిసికొనుటకు ప్రత్యేకముగా ప్రయత్నము చేయవలసియున్నది. నిన్నటి సమాజములో ఒక సామాన్యునికి ఉన్న ఋతు జ్ఞానము నేడు పర్యావరణ శాస్త్రజ్ఞునికి (Echologist) తప్ప ఇతరులకు తెలియదు. నేడు వెలువడుచున్న కావ్యములలో కూడ కథానుగతమైన ఋతువర్ణనము కరువైనది. రాజకీయ సాంఘిక సమస్యల తోరణాలతో కవిత్వము నిగిడిపోవుచున్నది. కనుక ఋతువులనే కావ్యవస్తువుగా తీసికొని వ్రాయవలసిన అగత్యము కవులకేర్పడియుండుటచేత ఋతువర్ణన కావ్యములను చేపట్టి తాము పొందిన ఆత్మానందమును తమకున్న జ్ఞానమును, ఇతరులకు పంచిపెట్టుచున్నారు. ఋతు కావ్యములు వెలువడుటకు ప్రబలమైన కారణమిదియే యని చెప్పవచ్చును. ఋతువర్ణన మనగానే కవులు పశువులను పక్షులను, పండుగలను పర్వాలను, పువ్వులను పంటలను, వర్ణించి ఊరుకొన్నారనియు, తమ చుట్టు ఉన్న సంఘమును మరచిపోయినారనియు లేదా వెక్కసేయలేదనియు, ఊహింపకూడదు. ఋతువర్ణనల నెపమున సంఘ దురాచారములను, సమకాలిక సమస్యలను, ఎలుగెత్తి చెప్పినవారు, ఋతుకావ్యకర్తలలో లేకపోలేదు. నారాయణరెడ్డి 'ఋతు చక్రము', విశ్వనాథవారి 'ఋతు సంహారము' శేషేంద్రశర్మ 'ఋతు ఘోష', అద్దేపల్లి 'ఋతు విలాసము' వంటి ఋతు కావ్యములు ఈ నా అభిప్రాయమునకు పుష్టిని చేకూర్చుచున్నవనుటలో నాకు సందేహము ఏ మాత్రమును లేవు

ఆధునిక కాలమున ప్రకృతి సంపదను సంరక్షించుకొనవలసిన అవసరమెంతేని యున్నదను యాథార్థ్యమునకు రానురాను ప్రాముఖ్యము కలుగుచున్నది. తరిగిపోయిన అడవులు కరువులకు దారి చూపినవి. వరదల తాకిడికి సారవంతమైన మట్టి అడవులు లేకపోవుటవలన కడలిపాలైనది.

పశుపక్ష్యాదులకు నిలయములైన అడవులు అంతరించిపోవుటచేత వన్యమృగములు మృగ్యములై పోయినవి. ఈ స్థితినుండి తేరుకొనవలసిన అవసరము ఇప్పుడు జాతికి ఉన్నది. ప్రకృత్యారాధనము, ప్రకృతి సంరక్షణము నేటి ప్రభుత్వము కర్తవ్యములై పోయినవి. కార్యక్రమములై పోయినవి. ప్రకృతిపట్ల ప్రేమను ఇనుమడింపజేయగల శక్తి కవితకే ఉన్నది. కనుక ఋతు కావ్యముల సృజనము, పోషణము, ఆధునిక కవితా లక్షణములలో ఒకటిగా ఉండదగినదనినను, సాహసముకాదు. ప్రకృతి పూజ, ప్రకృతి సంరక్షణము, జగత్కల్యాణ సంధాయకములు.........

ఋతువర్ణనము కావ్య వస్తువుగా స్వీకరించి, పలువురు తెలుగు కవులు ప్రత్యేక ఋతు కావ్యములనే వెలయించి ప్రకృతిపట్ల తమకున్న ప్రేమను చాటుకొనినారు. తెలుగుదేశమునందలి భౌగోళిక సంపదను నిరూపించినారు. తెలుగునాటిలోని పక్షులను పశువులను, కీటకములను, గాలులను, ఏరులను, పర్వతములను, పుష్పములను, బాలబాలికలను, పండుగలను పబ్బములను అభివర్ణించి చరితార్థులైనారు.

ప్రాచీన కావ్యములలో ప్రసక్తానుప్రసక్తముగా వచ్చిన ఋతువర్ణనముల మాటకేమిగాని, ఆధునిక కవుల ఋతువర్ణనములు సరిక్రొత్త పుంతలతో సాగినవి. పరిశీలించి, వానిలోని విశేషములను ఉగ్గడించుటకు ప్రయత్నము చేసినారు. అనువాద కావ్యములనుకూడ అధ్యయనముచేసి, అందలి ప్రత్యేకతలను వివరించుటకు ప్రయత్నించినారు.

ఋతు సంబంధమైన సంప్రదాయ సిద్ధమైన జ్ఞానస్వరూపమును ఆధునిక కాలమున ఋతువులను గూర్చిన పరిజ్ఞానమును నేసి వ్యాసారంభము నందు సూచించుటకు యత్నించినాను.

ఈ నా 'తెలుగు ఋతుకావ్యముల' పరిశీలనము ఆధునికాంధ్ర దేశమునందలి ప్రజాజీవనమునకు అందమైన అద్దమని నా పరిశీలనమువలన కనుగొనగలిగినాను.

మన తెలుగు కవులు ఈ ఋతు కావ్యములలో ప్రాచీన సంప్రదాయము పట్ల తమకెంత జ్ఞానమున్నదో ఆధునిక మానవుని జీవిత సమస్యలపట్ల తమకు అంతే జ్ఞానమున్నదని నిరూపించుకొనగలిగినారు. ఈ ఋతు కావ్యములలో వారి వైదుష్యము, వారి లోకజ్ఞత, వారి సౌహార్ద్రము, వారి సౌజన్యము, ప్రజాపీడకులపట్ల వారికున్న అసహ్యము ప్రస్ఫుటముగా ప్రకటించుకొనినారు.

ఈ ఋతు కావ్యములను నేనింత ప్రత్యేకశాఖగా గుర్తించుటకు యత్నించినాను. తెలుగులో వెలసిన ఋతు కావ్యముల అధ్యయనము చేయునపుడే ఆధునికాంధ్ర కవితా స్వరూపము సమగ్రముగా నా సాక్షాత్కరింపజాలమను నమ్మకము నాకు కలిగినది.

ఒక్కొక్క కావ్యమును విస్తరిగా పరిశీలనముచేసి, ఆయా కవులు ప్రయోగించిన శబ్దార్థాలంకారములను ఎత్తిచూపినాను. సమాజమును వారు చూచిన తీరును చర్చించినాను. ధ్వని కల్పితముగా వారు ఋతు వర్ణనముల మూలమున లోకమునకిచ్చిన సందేశమునుకూడ విడమర్చి వివరించుటకు ప్రయత్నము చేసినాను.

ఈ నా ప్రయత్నము సమగ్రమనియును, నిర్దుష్టమనియును, నిరాక్షేపణీయమనియును నేననుకొనుటలేదు. ఋతు కావ్యములను ప్రత్యేక దృష్టితో పరిశీలింపవలసిన అగత్యము అతిమాత్రముగా నున్నదని మాత్రము నా అభిప్రాయము. నాకున్న పరిమితమైన పరిధిలో నాకు లభించిన పుస్తకాల వెలుగులో నేను పని చేసితిని.

తెలుగులో వెలసిన ఋతు కావ్యములను గూర్చి నేను చేసిన ఈ పరిశీలనము విద్వల్లోకము ఏమాత్రము హర్షించినను నేను కృతార్థుడను — .

# కావ్యాలంకార సంగ్రహము

సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

## వర్షఋతువు :-

శ్రావణ భాద్రపదమాసములు వర్షఋతువు. ఈ ఋతువున అందుగు, వరి, పుట్టగొడుగు, అడవిమొల్లలు, తటిగొజ్జు, గిరిమల్లిక, కడిమి, మద్ది, ఏరుమద్ది, మొగిలి, మొదలగు చెట్లు పుష్పించును. ఆర్ద్ర పురుగులు, వెన్నెల పులుగులు, చాతకములు, లేళ్లు, గోదురు కప్పలు, నెమళ్లు, నీరుకాకులు, గ్రద్దలు, వీనికి క్రొవ్వు పట్టును. బలాకా పక్షులు గర్భము ధరించును. రజస్సు శమించును. రాజులు యాత్రలనుండి నివర్తిల్లుదురు. వనభూములు శ్యామలములై యుండును. జలాసారములవలన పర్వతములు కనబడినట్లు రమ్యముగా నుండును. నదులు ఒడ్డుల నరసి ప్రవహించును. ఒక్కొక చోట గట్లు తెగుట, లోకోపద్రవము కలిగించును. యతులును, చారులును దిగవత్తురు. ప్రోషితభర్తృకలు భర్తలకై దారులు చూచుచుందురు. పాంథులు గృహములకు మరలుదురు. మేఘబృందముచేత ఆకాశము చీకటు క్రమ్మును. దిఙ్ముఖములనుండి మెఱుపుతీగలు పరుగిడుచుండును, మేఘగర్జనలచే వైడూర్యభూములందు రత్నాంకురములు పొడమించును. కామినీకాముకులు ఉద్యానయాత్రను చేయుదురు. సౌధోపరి భాగముల శయ్యలను కల్పింతురు. కస్తూరి మిశ్రమగు చలువ్రస్వము విలేపనమును (చందనము, కుంకుమ కర్పూర అగురు మిశ్రితమగు మైపూత) పూసికొందురు. కృషీవల కుటుంబినీ బృందములు రాసక్రీడ లాడుదురు. కడిమిపూల వాసనగల పడమటి గాలిగాని, తూర్పు గాలి గాని వీచును.

## శరదృతువు :-

ఆశ్వయుజ కార్తికమాసములు శరదృతువు. ఈ ఋతువులో లకుముకి పిట్టలకు, తుమ్మెదలకు, కన్నెలేళ్లకు, హంసలకు, కాటుకపిట్టలకు, చక్రవాకములకు, బెగ్గురు పిట్టలకు, కొక్కెరలకు, వృషభములకు, ఏనుగులకు, తాబేళ్లకు, కొంగలకు, పెద్ద చేపలకును, క్రొవ్వుపట్టును. తామరలు, తెల్లకలువలు, నల్లకలువలు, ఎఱ్ఱకలువలు, మంకెన కుంకుమ వృక్షములు, వావిళ్లు, ఏడాకుల అరటి, జిల్లు, మాలతీలతలును పుష్పించును. మయూరముల క్రొవ్వుడుగును. హంసలు మానస సరస్సు నుండి

మరలివచ్చును. అగస్త్యోదయముచే జలములు కలకతేరును. ముత్తెపు చిప్పలు గర్భము దాల్చును. మింట తెల్లని మబ్బులుండును. మహార్నవమి యందు శస్త్రాస్త్ర పూజలు జరుగును. గుఱ్ఱములకు, ఏనుగులకును, నీరాజనములు సేయుదురు. రాజులు యుద్ధ యాత్రకు వెడలుదురు. బాటలయందు బురద ఎండును. సూర్యకిరణములు దుస్సహములుగా నుండును. శ్రీ మహావిష్ణువు నిద్రనుండి మేల్కాంచును. పొలములో వరి పండును. గోపికలు గీతములు పాడుదురు. ఈ ఋతువున నియతముగా వాయువులు ఒక దిక్కునుండి వెడలక అన్ని దిక్కులనుండి వీచును.

## హే మ ం త ఋ తు వు :-

మార్గశీర్ష పౌష మాసములు హేమంతఋతువు. ఈ ఋతువున మల్లె, ముచు కుందము, అవలి, ప్రేంకణము, లొద్దుగ, సురపొన్నలు, పుష్పించును తుమ్మెదలకు, పాములకు, మయూరములకు క్రొవ్వుడుగును. కామినులు కుంకుమ పువ్వును, గంధ తైలమును సేవింతురు. పెరుగు రుచ్యముగా నుండును. కామినీస్తనములు నులివెచ్చగా నుండును. జనులు నులివెచ్చని జలముల స్నానమాడుదురు. స్త్రీలకు గాఢాంగన సౌఖ్య మబ్బును. ఆడపశువులు ప్రసవించును. కూపజలములు గోరువెచ్చగా నుండును. రేగులు, నారింజలును, బాగుగా ఫలించును. చెఱకు రసము చిప్పిలు చుండును. మందిరగర్భము లందు శయనము, సరసులు, గుబ్బగుబ్బలుగల ప్రియురాండ్ర భుజపంజరముల శయ నింతురు. పగటి ప్రయాణము తగ్గును. ఈ ఋతువున పడమటి గాలి గాని, ఉత్తరపు గాలి గాని వీచును.

## శి శి ర ఋ తు వు :-

మాఘ ఫాల్గుణములు శిశిరఋతువు ఈ ఋతువు హేమంతమువలెనే యుండును. విశేషించి ఏనుగులకు, తేళ్లకు, పందులకు, దున్నలకు క్రొవ్వుపట్టును. కామినులు విచిత్ర సురతోపభోగ యోగ్యులుగా నుందురు. భోజనమునందు అరుచి కలుగును. జలములకు మిక్కిలి శైత్యము గలుగును. మరువకములును, కుంజములును, పుష్పిం చును. కేశాకరాశులయందు అనాదర మేర్పడును. ఎల్లరును వెచ్చవెచ్చగా కుంపటులవద్ద కూర్చుండ నభిలషింతురు. ప్రచండవాయువు వీచును. కుంకుమ పూతను పూసికొని ఆ చలిని కామినులు సహింతురు.

## సంస్కృత గ్రంథములు :


అమరకోశము ప్రథమ కాండము
అమరము.... .... .... కాంతపరము
అలంకార శేఖరము .... .... కేశవమిశ్రుడు
అంగపురాణము .... ....
ఋగ్వేదము VIII — I
కావ్యాలంకారము .... ... భామహుడు
కావ్యాదర్శ .... .... దండి
కావ్య మీమాంస .... .... రాజశేఖరుడు
చరక సంహిత .... ...
తైత్తరీయారణ్యము .... ....
తైత్తరీయ సంహిత — షష్ఠ కాండము
నాట్యశాస్త్రము ... .... భరతుడు
ప్రతాపరుద్రీయము ... .... విద్యానాథుడు
భారతము .... .... వ్యాసుడు
యజుర్వేదము .... .... (21–28 శ్లో.)
రామాయణము .... .... వాల్మీకి
వాచస్పత్యమ్ .... .... తారానాథ
వాయు పురాణము .... .... విష్ణుధర్మోత్తర పురాణములు
శ్రీలింగ పురాణము .... .... పూర్వభాగము
సరస్వతీ కంఠాభరణము .... భోజుడు
సామవేదము .... .... 6—4—2
సిద్ధాంత కౌముది .... ....


## ఆంగ్ల గ్రంథములు :


**Collins Dictionary**
**Encyclopedio of Britanica**
**Oxford Junior Encyclopedio Vol. III The Universe**
**John keats .... .... 'The Seasons'**


## తెలుగు గ్రంథములు :


అప్పకవీయము .... .... అప్పకవి
ఆంధ్ర మహాభారతము (ఆదిపర్వము) నన్నయ
ఆంధ్ర మహాభారతము .... తిక్కన
ఆముక్తమాల్యద .... .... శ్రీకృష్ణదేవరాయలు

ఋతు సంహిత – ప్రకృతి వర్ణన .... మేడవరము
ఏడవ ఋతువు .... .... బోయి భీమన్న
కాళిదాస కళామందిరం.... .... ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
కావ్యాలంకార చూడామణి .... విన్నకోట పెద్దన
కావ్యాలంకార సంగ్రహము .... భట్టుమూర్తి
కావ్య లక్షణము .... .... కిళాంబి వేంకట వేదాంతాచార్యులు
కావ్యాలోకము .... .... నాగవర్మ
కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య ... సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
కిన్నెరసాని పాటలు .... .... విశ్వనాథ సత్యనారాయణ
కుమార సంభవము .... .... నన్నె చోడుడు
గేయ సంపుటి .... .... సి. నారాయణరెడ్డి
జ్యోతిర్వేదము .... .... గొబ్బూరు వేంకటానందరాఘవరావు
తెలుగు పండుగలు .... ....
తెలుగు కావ్యాలలో ప్రకృతి వర్ణన.... చేకూరి చెన్నకృష్ణయ్య
ధాతురత్నాకరము .... ....
నగరంలో వాన .... .... కుందుర్తి ఆంజనేయులు
నవ్యసాహితి – వసంత గీతి .... ఉత్పల సత్యనారాయణాచార్య
నవ్యసాహితి – జలద సరస్వతి .... దాశరథి
నవ్యసాహితి – తామసి .... దాశరధి
నారాయణరెడ్డి – సాహితీమూర్తి .... డా॥ తిరుమల శ్రీనివాసాచార్య
నృసింహ పురాణము ... .... ఎఱ్ఱన
పండితారాధ్య చరిత్ర .... .... పాల్కురికి సోమనాధుడు
ప్రబంధాలలో ప్రకృతి వర్ణనలు .... అంతటి నరసింహం
పోతన చరిత్రము .... .... వానమామలై వరదాచార్య
పోతన చరిత్ర – సంచిక .... అంచె వెంకటరాజం
భగవద్గీత .... .... విభూతి యోగము
భాగవతము .... .... పోతన
ముత్యాల సరాలు .... .... గురజాడ అప్పారావు
విజ్ఞాన సర్వస్వము .... .... ఆరవ సంపుటము – (విశ్వసాహితి)
వేద వాఙ్మయము .... .... మల్లాది సూర్యనారాయణశాస్త్రి
శబ్ద కల్పద్రుమము .... ....
శార్ఙ్గధర సంహిత .... .... ఆయుర్వేదము
శ్రుతి స్మృతి పురాణాదులు ....
సాహిత్య దర్పణము .... .... విశ్వనాథ సత్యనారాయణ
సూక్తి సుధార్ణము .... .... మల్లికార్జున కవి
సూర్య సిద్ధాంతము —— గోళాధ్యాయము

# తప్పు - ఒప్పుల పట్టిక

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 24 | ఛుక్రశ్చ | ఛక్రచ్ఛ |
| 27 | ఆద్యంతము | ఆద్యంతములు |
| | ఉత్తరాయనము | ఉత్తరాయణము |
| 37 | ఈ పండుగ నందు | ఈ పండుగ యందు |
| 49 | పూవిలుకాని బాణములు | పూల బాణములు |
| | ప్రాకృతికముగా | ప్రాకృతికముగా |
| [illegible] | వర్ణనలు | వర్ణనల |
| | యున్నది | యున్నవి |
| 57 | ఆముక్తమాల్యదా | ఆముక్తమాల్యద |
| 58 | సంపర్కములో | సందర్భము |
| 60 | ప్రచురమైన | ప్రచురితమైన |
| 72 | ప్రాయకమున | ప్రాయికముగ |
| 74 | కాళిదాసీ | కాళిదాస; బొబ్బిలి పెండికట్ల |
| 77 | వేంచేసి | వేంచేసె |
| 78 | మంటి | వంటి |
| 79 | కావ్యముగ | కావ్యముల |
| 84 | విద్వ స్మనుల | విద్వన్మణుల |
| | పోయిన కని | పోయిన కవి |
| 86 | వర్ణింపబడినవి | వర్ణింపబడిన |
| | ఆచార్య | ఆచార |
| | కనకమర్గా | కనకదుర్గా |
| | ఉత్తము | ఉత్తము |
| | కవిసామ్రాట్ | కవిసమ్రాట్ |
| 87 | మొదలగునవి | మొదలగును |
| | వాంఛికార్థములకై | వాంఛితార్థము |
| | భక్తిని గొలుసు | భక్తిని కొలుచు |
| | మిక్కలి | మిక్కిలి |
| | ఉపదేష్టము | ఉపదేష్టయు |

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 90 | గిష్రిము | గ్రీష్మము |
| 92 | మరన | మరల |
| | కామనులు | కామినులు |
| | హృదముగ | హృద్యముగ |
| | వర్ణమున | వర్ణనమున |
| 111 | పిటకింతటి | పిట్టకింతటి |
| 113 | బరువులు | మనుజులను |
| 115 | పలుకుబడుట | పలుకుబడులు |
| 120 | వర్ణనాతీత | వర్ణనాతీతము |
| 132 | అనురోగ్యుని | అనారోగ్యుని |
| | హృదంముగ | హృద్యముగ |
| 142 | భాశా | భాష |
| 144 | లింరు | లిందు |
| 150 | భోగమ్ముగింతురట | భోగమ్మూగించుటయ |
| | కోయదూరసాని | కోయదొరసాని |
| | సహింపరక | సహింపక |
| 151 | పంటల | మంటల |
| | తొడల | తొండల |
| | ఇందభి వర్ణిభములు | ఇందభి వర్ణితములు |
| 154 | నమ్మకము | నమ్మకములు |
| 171 | కటగండ్లు | కడగండ్లు |
| | శృంగార | శృంగారమును |
| 172 | పన్నులన్ని | పనులన్ని |
| 173 | బూపిని | బూసిన |
| 174 | అనివస్థలు | అవస్థలు |
| 178 | శ్రవ్యకావ్య కావ్యములు | శ్రవ్యకావ్యములు |
| 185 | నునసులలో | మనసులలో |
| 188 | భానుమున | భావమును |
| | దేసినట్లే | వేసినట్లే |

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 235 | వర్షించిన | వర్షించిన |
| 238 | దల్లని | నల్లని |
| 241 | వైచితి | వైచిత్రి |
| 243 | చంద్రకాలంతాది | చంద్రకాంతాది |
| | కాద్చిచ్చులు | కార్చిచ్చులు |
| 245 | మరురు | మరులు |
| | విరహోత్కంఠము | విరహోత్కంఠము |
| 248 | పౌందర్యము | సౌందర్యము |
| | హింసలను | హంసలను |
| 251 | సులభషైలిని | సులభశైలిని |
| 254 | యధాతదము వాచమే | యధాతదాను వాదమే |
| | త్రణమిల్లి | ప్రణమిల్లి |
| 259 | ఎండ లేడిమి | ఎండ వేడిమి |
| 264 | ఎదురేది | ఎదురీది |
| 265 | నిర్విషాదాలశము | నిర్విషాదాంశము |
| | కావ్యముచే | కావ్యములై |